## ప్రశ్నలు

1. నిత్యజీవితంలో దృక్పథాలు ఎలా పనిచేస్తుంటాయి?
2. సామెతల్లో దృక్పథాలు ఎలా వుంటాయో మీకు తెలిసిన కొన్ని సామెతలను గురించి రాయండి.
3. సామాజిక సమస్యలకు, సామాజిక దర్శనాలకు గల సంబంధం ఏమిటి?
4. మనసుంటే మార్గం వుంటుంది అనే మాటను మీ జీవిత అనుభవాలను నుండి వివరించండి.
5. గతం-భవిష్యత్తు కూడా వర్తమానంలో ఎలా వుంటాయో వివరించండి?
6. ఒక శాస్త్రంలో సాధిస్తే ఇతర శాస్త్రాల్లోకి ఎందుకు అన్వయించాలి?
7. సామాజిక దర్శనం ప్రయోజనమేమిటి?
8. నిజమైన ఆనందం నీలో వుంటుందా? బాహ్య వస్తువులో వుంటుందా?
9. భావవాదం, భౌతికవాదం మధ్య పోలికలు ఏమిటి?
10. తర్కశాస్త్రం, తత్వశాస్త్రంలో భావజాల చర్చలో వుండే అంశాలు ఎన్ని?
11. ఐక్యరాజ్యసమితి నిర్మాణం యొక్క ప్రాధాన్యత ఏమిటి?



# ఆరెసెస్ దర్శనం

ఆరెసెస్ హిందూ వాదులు ఈ విషయంలో ఎలా ఆలోచిస్తున్నారో చూద్దాం. వారు కూడా సమాజం - వ్యక్తి - అవయవి - అవయవ సంబంధంగా అవిభాజ్యమని అంటారు.

ఆరెసెస్ వాదులు ఇలా అంటారు. "ఒక వ్యక్తి శరీరానికి అందులోని వేరు వేరు అవయవాలకి ఎటువంటి అవిభాజ్య సంబంధం ఉందో అటువంటి అవిభాజ్యమైన ఏకాత్మక సంబంధమే సమాజానికి వ్యక్తికి మధ్య ఉంది. ఈ కారణం చేత మన దేశంలో సమాజ నిర్మాణపు నమూనా 'శరీరము - అవయవాలు' అనే దృష్టాంతం తీసుకొనబడింది. దీనినే అంగాంగీభావం అన్నారు."

**శాసనాల వల్ల అన్ని సాధ్యం కావు**
**సంస్కారం, సంస్కృతి ముఖ్యం అంటారు**

"ఇక పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యం విషయానికి వస్తే, సమాజంలో రావలసిన పరివర్తనలు, నిర్మించవలసిన సామాజిక ఆర్థిక వ్యవస్థలు అన్నీ కూడా చట్టాల ద్వారా, శాసనాల ద్వారా మాత్రమే సాధ్యమవుతాయని ఇందులో భావించబడింది. "శాసనాల ద్వారా సంస్కరణ" అనేది ఈ పద్ధతికి మూలసూత్రమైంది. ఈ శాసనాలు ప్రజాస్వామ్య పద్ధతిలో చేయబడితే మరీ మంచిది. ఈ వ్యవహారంలో శాసనాలదే సర్వాధికారం అవుతుంది. మరి ఆచరణలో చూస్తే ప్రసార మాధ్యమాలను ధనబలంతో ప్రభావితం చేసే పెట్టుబడిదారుల వల్లనే ప్రజాస్వామ్య వ్యవస్థలో ఎన్నికలు అదుపు చేయబడతాయి - అనేది పశ్చిమ దేశాలన్నిటి అనుభవం, ఈ విధంగా ప్రజాస్వామ్య రీతిలో రూపొందించినట్లు చెప్పబడే శాసనాల ద్వారా పెట్టుబడిదారులే తమ అభీష్టాలు నెరవేర్చుకుంటారు.

**చట్టంపై ఆధారపడితే మనిషి స్వయం ప్రేరణ కుంటుపడుతుందంటారు**

కాని చట్టాల పైనే సమాజపు బాధ్యత నంతటినీ వదిలివేయడం వల్ల మనిషి యొక్క స్వయంపేరణ శక్తి క్షీణించి కుంటుపడుతుంది. సగటు మనిషి నిష్క్రియుడవుతాడు. అతడి క్రియాశీలతపై శాసన కేంద్రితమైన సమాజ వ్యవస్థ ప్రతికూల ప్రభావం చూపుతుంది. గతంలో బ్రిటిష్ ప్రధాని మార్గరెట్ థాచర్ తన ఎన్నికల మానిఫెస్టోలో "నేను పని చెయ్యడాన్ని ఆకర్షణీయం చేస్తాను" అని అన్న విషయం మనం గుర్తు చేసుకోదగినది. చట్టం ప్రకారం లభిస్తున్న నిరుద్యోగభృతిని పుచ్చుకొంటూ నిష్క్రియులై

తమ ఇళ్లలో కూర్చుని కాలక్షేపం చేస్తున్న యువకులలో పనిచేసే ప్రవృత్తిని కలిగించవలసిన అవసరం గురించి ఆమె ప్రస్తావించింది.

**సామ్యవాదాన్ని ఆరెసెస్ వ్యతిరేకించే కారణాలు**

సామ్యవాద సమాజ ప్రణాళికలో కూడా ఉన్నది భౌతిక వాద దృక్కోణమే. అందులో కూడా సమాజ పరివర్తన రాజకీయ శాసనబలం వల్ల మాత్రమే సాధ్యమవుతుందని భావించబడింది. అందుచేత ఒక్కసారి రాజకీయాధికారాన్ని చేతుల్లోకి తెచ్చుకున్నామంటే అన్ని వ్యవస్థలను సరిచేసేయగలమని సామ్యవాదుల భావన. ఇందుకొరకు ఒక ఉత్తేజకరమైన పదం వాడుకలోకి తేబడి సుప్రసిద్ధమైంది. ఆ పదం "విప్లవం". విప్లవం వస్తే లోకం సుఖమయమైపోతుందని చెప్పబడింది. పాశ్చాత్య సామ్యవాదుల మానస పుత్రులు మనదేశంలో కూడా ఈ సామ్యవాద చింతనను ప్రవేశపెట్టారు. ఒకరు విప్లవం కావాలంటారు. మరొకరు సమగ్ర విప్లవం కావాలంటారు. ఈ సామ్యవాద విధానంలో కూడా చట్టమే సర్వాధికారయుతం కాగా, వ్యక్తి అప్రధానమైపోయాడు. వ్యక్తియొక్క స్వాతంత్ర్యం, స్వయం ప్రేరణ అణగదొక్కబడినాయి. ఒక మహాయంత్రంలో ఒక మరమేకుకు ఎటువంటి స్థానముంటుందో సామ్యవాద సమాజరచనలో వ్యక్తికి అటువంటి స్థానం మాత్రమే లభించింది.

**మనిషి ముందు మారాలి**

**అతడే పరిస్థితులను మార్చుతాడు అంటారు ఆరెసెస్ వాదులు**

కనుక ముందుగా పరిస్థితిలో, స్థితిగతులలో మార్పు వస్తే, తరువాత మనిషి మనస్సులో పరివర్తన అదే వస్తుందనేది పాశ్చాత్య సమాజ శాస్త్రవేత్తల అభిప్రాయం. ఈ సమాజ పరివర్తన బాధ్యతను పాశ్చాత్యులు పూర్తిగా చట్టానికి అప్పగించేశారు. మరి బాధ్యతకు తగినట్లుగా అధికారం ఉండాలనేది ప్రకృతి నియమం, కనుక చట్టానిదే సర్వాధికారం కూడా అవుతుంది. అటువంటి స్థితిలో చట్టాలు నిరంకుశంగా ఉన్నాయని అనడానికి సమాజంలో ఎవరికీ అధికారం ఉండదు. "అధికారం వ్యక్తులను అవినీతిపరులుగా చేస్తుంది. సంపూర్ణమైన అధికారం వారిని సంపూర్ణంగా అవినీతిపరులుగా మార్చేస్తుంది" అని చెబుతారు. నిరంకుశాధికారం అంతులేని భ్రష్టత్వానికే దారి తీస్తుంది." (ఆరెసెస్ కార్యకర్త - దత్తోపంత్ ఠేంగ్డీ - పేజీ 34 - 35)

"సమాజంలోని భౌతిక స్థితిగతులు మనస్సును ప్రభావితం చేస్తాయన్నది నిజమే. కాని, మనిషి యొక్క మనస్సు కూడా సమాజంపై ప్రభావాన్ని కలిగి ఉంటుందనేది మన సంస్కృతి చెప్పిన మాట." (ఆరెసెస్ కార్యకర్త - దత్తోపంత్ ఠేంగ్డీ - పేజీ 35)

**ఆరెసెస్, బిజెపి సిద్ధాంతాలు - ప్రధాన లోపం**

ఆరెసెస్, బి.జె.పిల భావాలు, సిద్ధాంతాలు విచిత్రమైనవి. అవి రిజర్వేషన్లను వ్యతిరేకిస్తాయి. ముస్లిం వ్యతిరేకతను ప్రచారం చేస్తాయి. ప్రజల ఆర్థిక, సాంఘిక, సమస్యలను పట్టించుకుని చర్చించవు. వారి జీవనప్రమాణాల పెరుగుదలకోసం అంటూ సిద్ధాంతాలేమీ లేనివాళ్లు. ఇప్పటికే వున్న బూర్జువాల, అగ్రకులాల ప్రయోజనాలకోసం పనిచేస్తూ మనుష్యుల మధ్య వాస్తవాల స్థానంలో, చరిత్ర స్థానంలో అగ్రకులాలకు అనువైన విశ్వాసాలను, మతతత్వాన్ని ప్రధానం చేసి, ప్రచారం చేస్తాయి. రాజకీయ,



సామాజిక, ఆర్థిక సమస్యలను అప్రధానం చేస్తాయి. వీరు చెప్పే రామరాజ్యం బీసీ, ఎస్సీ, ఎస్టీలకు వ్యతిరేకమైంది. అగ్రవర్ణాల అధికారాన్ని స్థిరపర్చడానికి సంబంధించినది.

కులం లేదంటూనే కులాతీత సంస్కృతి బదులుగా అగ్రవర్ణ సంస్కృతిని అందరి మీద రుద్దుతుంది. బీసీ, ఎస్సీ, ఎస్టీల సంస్కృతిని, చిల్లర కులాల సంస్కృతి అని నిరసిస్తుంది. శ్రమ సంస్కృతిని అవమానిస్తుంది. శ్రమే చేయని వారి సంస్కృతిని గొప్పదని గౌరవిస్తుంది.

**హిందువులంరు ఒక్కటైతే కులాతీత వివాహాలను**

**కర్తవ్యాలుగా, కార్యక్రమాలుగా తీసుకోవాలి**

హిందువులందరు గంగా బిందు సింధువులే అంటూనే కులాల మధ్య వివాహాలను ఏ మాత్రం ప్రచారం చేయరు. అంతర్లీనంగా అగ్రవర్ణ సంస్కృతిని భారతీయ సంస్కృతి అని ప్రచారం చేస్తారు. మెజార్టీ ప్రజలైన బీసీ, ఎస్సీ, ఎస్టీల సంస్కృతే భారతీయుల నిజమైన సంస్కృతి. దీన్ని వారు ఆదర్శీకరించరు. బీసీ, ఎస్సీ, ఎస్టీల చరిత్రను వెలికి తీసుకురారు. దాన్ని మరుగుపరచి బ్రాహ్మణుల, రాజుల, గుళ్ళ గోపురాల చరిత్రను మనముందు పెడ్తారు. గుళ్ళు గోపురాలు బ్యాంకుల్లాగా వ్యాపారులు, బ్రాహ్మణులు సంపద దాచుకోవడానికి, ప్రజల నుండి దోపిడి చేయడానికి కేంద్రాలుగా పనిచేశాయని అంగీకరించరు. ఇప్పటికి గుళ్ళు, దేవుళ్ళ పేరిట ప్రభుత్వాదాయంతో పోల్చితే 20 శాతం దాకా పూజార్లు దేవాలయాలు, సంస్థలు పొందుతున్నాయి. కాని ఆ ఆదాయం ప్రభుత్వం లాగా ప్రజల కోసం కెటాయించకుండా పూజారులు మఠాలు తమ సుఖాలకు, సౌకర్యాలకే వాడుకుంటారు.

**ప్రజల అవసరాలను, చైతన్యాన్ని పక్కదారి పట్టించే కార్యక్రమాలు**

వాళ్ళు ప్రజలను వారి సమస్యలను పట్టించుకోకుండా హిందూ సంస్కృతి అంటూ మతం అంటూ, దేవుళ్ళు అంటూ, విగ్రహారాధన ప్రోత్సహిస్తూ పూజార్లను, బ్రాహ్మణులను, మార్వాడి, గుజరాతి వ్యాపారులను, పారిశ్రామికవేత్తలను బలిపిస్తూ మతం పేరిట హిందూ సంస్కృతి పేరిట తమ పబ్బం గడుపుకుంటారు. ముస్లిం మతద్వేషాన్ని రెచ్చకొడుతూ నిరంతరం హిందూవులను, ముస్లింలను అనుమానాలతో, అభద్రతా భావనతో పరస్పరం ద్వేషించుకునేటట్లు చేస్తారు.

**రిజర్వేషన్ల వ్యతిరేకతే రామజన్మభూమి ఉద్యమం**

బీసీ రిజర్వేషన్లు వ్యతిరేకిస్తూ, వాటిని మరిపిస్తూ, బాబ్రి మసీదు, రామజన్మభూమి సమస్యను అదేదో అర్జెంట్ వ్యవహారం అన్నట్టు ప్రజల ముందుకు తెచ్చారు. ఇలా అరెసెస్, బి.జె.పి వాళ్ళు నిరంతరం ఒక జైలు వంటి భావాల మధ్యకు ప్రజల్ని నెట్టివేసి ఉక్కిరిబిక్కిరి చేసి శ్వాస ఆడకుండా చేస్తారు. కొత్త భావాలను వ్యతిరేకిస్తారు.

వేదాల్లో, ఉపనిషత్తుల్లో, పురాణాల్లో, చరిత్రల్లో, బీసీ, ఎస్సీ, ఎస్టీలకు వ్యతిరేకంగా ఉన్న భావాలను తొలగించాలని అనేవారిని వ్యతిరేకిస్తారు. రాజుల చరిత్రను, వాళ్ల హిందువులా, ముస్లింలా అనే చర్చను ముందుకు తెస్తారు. కాని బీసీ, ఎస్సీ, ఎస్టీలు ఈ సమస్త సంపదలను సృష్టించారని హిందు సంస్కృతి జీవన విధానం అంతా వీరి శ్రమశక్తి మీదే ఆధారపడి నడిచిందని చెప్పరు. ఆరెసెస్, బిజెపి పరివారం ప్రధాన లోపం ఏమంటే

ఎదిగిన ఇతరకులాలకు బీసీలకు మధ్య వైరుధ్యం వచ్చినప్పుడు అగ్రకులాల వైపు నిలబడి మెజారిటీ ప్రజలైన బీసీ, ఎస్సీ, ఎస్టీలను వ్యతిరేకిస్తారు.

**ప్రజలపట్ల నిజమైన ప్రేమ**

ప్రజలపట్ల నిజమైన ప్రేమ కరుణ స్నేహం ఉన్నవాళ్ళు ఇలా చేయరు. బీసీ, ఎస్సీ, ఎస్టీ ప్రజలను ప్రేమిస్తారు. వారి సంస్కృతిని గౌరవిస్తారు. వారికి అన్ని రంగాల్లో రిజర్వేషన్లను కల్పిస్తారు. అన్ని రంగాల్లో వాళ్ళు జనాభా నిష్పత్తి ప్రకారం అన్ని స్థాయిల్లో ఎదగడానికి ప్రణాళికలు వేస్తారు. జనాభా నిష్పత్తి ప్రకారం బడ్జెట్లు కెటాయిస్తారు. బీసీ, ఎస్సీ, ఎస్టీల నుండి నాయకత్వాన్ని అభివృద్ధి పరుస్తారు. వారి నాయకత్వంలోనే అగ్రవర్ణాలవారు ఎంతో గురుభావనతో పనిచేస్తారు. అది నిజమైన ప్రేమ కరుణ స్నేహం. బౌద్ధం దీన్ని వెయ్యేళ్లు ఆచరించి ప్రపంచానికి భారత ఉపఖండం పట్ల గొప్ప గౌరవాన్ని సాధించింది. పరోపకారం చేయడం ఉత్తమ లక్ష్యం. తన భావాలను అంగీకరించే వారికే కాకుండా తమతో విభేదించే వారికి పరోపకారం చేయడం నిజమైన పరోపకారం. అందువల్ల మనుష్యులను భావాలకు అతీతంగా ప్రేమించేవారే నిజమైన ప్రజ్ఞ, శీలం, ప్రేమ, కరుణ, స్నేహం గల మహనీయులు.

ఇటీవల ఆరెస్సెస్-బిజెపి వర్గాలు కొన్ని కొత్త ఆలోచనలు చేస్తున్నట్లు కన్పిస్తున్నది. దళిత పూజారులు వుండాలని వాదం తెచ్చింది. దళిత నాయకులను ప్రమోట్ చేయాలని అనుకుంటున్నది. గిరిజన ప్రాంతాల్లో గిరిజన నాయకులతో ప్రసంగాలు చేయించారు. బిసి నాయకులతో ఆరెస్సెస్ ముఖ్యుల సమక్షంలో బహిరంగ సభల్లో ప్రసంగాలు చేయించారు. జనవరి 2006లో హైదరాబాద్‌లో జరిగిన కాంగ్రెస్ ప్లీనరీ సమావేశాల సందర్భంగా సోనియాగాంధిని ఆరెస్సెస్ అభినందించింది. ఒక మంచి దిశా-నిర్దేశం చేసిందని ఆరెస్సెస్ చెప్పడం ఆసక్తిని కలిగిస్తుంది. బంగారు లక్ష్మణ్, ఉమాభారతి వంటి దళిత, బిసి నాయకుల పట్ల కోపాన్ని బాగా తగ్గించుకుంటున్నాయి. అయితే మరోపక్క ప్రధానిగా నరేంద్ర మోడీని ప్రచారంలోకి తేవడం ద్వారా హిందూ మతతత్వ భావాలను కూడా భయానకంగా ముందుకు తెస్తున్నది. వీటివల్ల కాంగ్రెస్‌లో నక్సలైట్లలో వున్నట్లుగానే ఆరెస్సెస్-బిజెపిల్లో కూడా భిన్న శక్తులు కలిసి పని చేస్తున్నాయని తెలుస్తున్నది.

### ప్రశ్నలు

1. ఆరెసెస్ ఈ సమాజం గురించి ఎలా ఆలోచిస్తుంది?
2. చట్టం గురించి, సామ్యవాదం గురించి ఆరెసెస్ ఏమనుకుంటుంది?
3. ఆరెసెస్ సిద్ధాంతంలోని ప్రధాన లోపాలేమిటి?
4. ఆరెసెన్-బిజెపి వర్గాల్లో ఇటీవల కన్పిస్తున్న మార్పులు ఏమిటి?



# తత్వవేత్తల పరిమితి

**తత్వవేత్తల చారిత్రక పరిమితులు**

తత్వవేత్తలు తమకాలంనాటి విషయాలే చర్చించగలరు. చరిత్ర, స్థల, కాలాలు, భాష, సంస్కృతి, సాధించిన జ్ఞానం, వారికున్న స్వేచ్ఛ పరిస్థితుల ప్రభావాలు, పరిమితుల ననుసరించే లోకాన్ని గురించి చెప్పగలరు. ఆ పరిమితుల్లో కార్యక్రమాల్ని యివ్వగలరు. మిగతాదంతా ఊహలు, ఆదర్శాలు, అంతర్‌దృష్టి, స్వేచ్ఛ సంకల్పబలం, సృజన, వివేచన పరికల్పనకు సంబంధించినవి. అందువల్ల తత్వవేత్తలు కాలాన్ని అనుసరించి చారిత్రక అవసరాన్ని అనుసరించి సంకల్పబలం, స్వేచ్ఛ సృజన, వివేచన పరికల్పన స్థాయిననుసరించి ఎదిగారు.

**సామాజిక దర్శనం యొక్క పునాది :**

సామాజిక ఉద్యమాలు, ప్రజలు, ప్రభుత్వాలు, రాజకీయ నిర్మాణాలు, ఓటుహక్కు తెచ్చిన పరిణామాలు, ప్రణాళికాసంఘం, బడ్జెట్లు, పార్టీల ఎన్నికల ప్రణాళికలు, ప్రజాస్వామిక హక్కులు, న్యాయవ్యవస్థ, సమాచార వ్యవస్థ, సైన్సు టెక్నాలజీ, నూతన ఆవిష్కరణలు, స్త్రీవాదం తెచ్చిన కొత్త అధ్యయనాలు, వెలుగు సమాజాన్ని ఎంతో ప్రభావితం చేశాయి.

వీటన్నిటిని ఒక చోటచేర్చి చర్చించి సమన్వయించే వేదిక ఏది?

వీరిలో చాలామందిని తత్వవేత్తలుగా తత్వశాస్త్ర పరిధిలోకి తీసుకోలేక పోయారు.

ఇలాంటివారందరి కృషినికూడా తత్వశాస్త్రంలో భాగం చేయడం అవసరం. వారిదికూడా "ఆలోచన"కు చేర్పే. వాటి విస్తరణవల్ల తత్వశాస్త్రంపరిధి పెరిగి "పికిలి"పోతున్నది. పగిలిపోతున్నది. విచ్చుకపోతున్నది.

అందువల్ల వాటన్నిటి ఆలోచన సమాజపరమైనందువల్ల "సామాజిక తత్వశాస్త్రం"లో చేర్చి చర్చించడం అవసరమౌతున్నది.

**సామాజిక దర్శనం కొత్త పరిధి :**

ఇలా "సామాజిక తత్వశాస్త్రం" లేదా సామాజిక దర్శనం అనే కొత్తశాస్త్రం రూపుదిద్దుకోవడం అవసరమవుతున్నది. తద్వారా మరో ప్రయోజనం కలుగుతుంది.

సామాజిక దర్శనంలో భావవాదమూ, భౌతికవాదమూ, వ్యక్తివాదమూ,

సామాజికవాదమా, నాస్తికవాదమా, ఆస్తికవాదమా అది వర్గవాదమా, అనే చర్చలు, విభజించడాలు అప్రధానమై సామాజిక శ్రేయస్సు, సామాజిక కార్యక్రమాలు, బడ్జెట్లు, ప్రణాళికసంఘం, ప్రభుత్వశాఖలు, వివిధ ఉద్యమాలు, రాజకీయ పార్టీలు, వాటి కార్యక్రమాలు, ఎన్నికల ప్రణాళికలు, సాంఘిక సంక్షేమం, సంక్షేమరాజ్యం, మానవతా విలువలు మొదలైనవాటికి వాటి రూపకల్పన, ఆచరణ ప్రధానమౌతాయి. ఏ భావజాలమైనా అందరికోసం ఆలోచించే ఆచరించే భావాలు, కార్యక్రమాలు ప్రాధాన్యతలోకి వస్తాయి.

బెట్రాండ్ రసెల్, జీన్‌పాల్‌సార్తే మొదలైనవాళ్ళు ఈ పనిచేయాల్సి ఉండేది. వాళ్ళు తత్వశాస్త్రాలకే పరిమితమయ్యారు. వివేకానందుడు సామాజిక కార్యక్రమాలేమీ యివ్వలేకపోయాడు.

జిడ్డుకృష్ణమూర్తి వంటివాళ్ళు సంఘం అనేది లేదని వున్నవల్లా మానవసంబంధాలే అని సమాజాన్ని పట్టించుకోక పలాయనం చిత్తగించాడు. 2500 ఏళ్ళక్రితం బుద్ధుడు సంఘం శరణం గచ్ఛామి అని చెప్తే దాన్నే వదిలేశాడు జిడ్డుకృష్ణమూర్తి.

ఓషో రజనీష్ సంఘాన్ని గుర్తించినా సామాజిక కార్యక్రమాలు కాకుండా ఆత్మానందానికి వ్యక్తిగత పరివర్తనకే పరిమితమయ్యాడు.

**భారతీయ సామాజిక దర్శనం విశిష్టత :**

యూరోపియన్ పరిణామాల ఆధారంగా నిర్మించబడిన పరిమితికి లోనైన సిద్ధాంతాలను, కార్యక్రమాలను, వాటి పరిమితులను, పరికల్పనలను గుర్తించి సమగ్రం చేస్తుంది సామాజిక దర్శనం.

సామాజికశాస్త్రంకన్నా సమగ్రమైన రూపకల్పనే సామాజిక దర్శనం.

మహాత్మా జ్యోతిబాపులే సామాజిక కార్యక్రమాల్నిచ్చాడు వాటిని గాంధీ, అంబేడ్కర్‌లు తలో పద్ధతిన ముందుకు తీసుకువెళ్ళారు.

**గాంధీ దర్శనం :**

గాంధీ అదివరకేవున్న భారతీయ భావవాద తత్వశాస్త్రాలపై పురాణాలపై ఆధారపడ్డాడు తప్పితే తనదైన తత్వశాస్త్రాన్ని రూపొందించుకోలేకపోయాడు.

గాంధీ సత్యం, అహింస, శాంతియుత పరివర్తన, సత్యాగ్రహం, ధర్మకర్తృత్వం మొదలైనవన్నీ బౌద్ధుల నుండి స్వీకరించి హిందూమతానికి, రాజకీయాలకు అన్వయించాడు.

**ధర్మకర్తృత్వ సిద్ధాంతం మహోన్నతమైనది**

గాంధీ సిద్ధాంతం ధర్మకర్తృత్వ సిద్ధాంతంపై ఆధారపడింది. తనకున్న ఆస్తి, అధికారం పట్ల వ్యక్తిగత ఆస్తి భావన ఉండకూడదని తాను దానికి ఒక ధర్మకర్తలా వుండాలని ధర్మకర్తృత్వ సిద్ధాంతం చెపుతుంది. ప్రజాస్వామిక పరిపాలనా వ్యవస్థలు అన్ని దేశాల్లో మౌలికంగా ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని లక్ష్యంగా, కర్తవ్యంగా ప్రకటించుకుంటాయి. ధర్మకర్తృత్వ సిద్ధాంతం మహోన్నతమైనది.

రాజరికాలు కూడా ధర్మకర్తృత్వ సిద్ధాంతాలను ఆచరించినట్లుగా కనిపిస్తుంది.



జనకమహారాజు రాజ్యాన్ని ఒక ధర్మకర్తగా నిర్వర్తించాడని సాహిత్యంలో చెపుతుంటారు. బలిచక్రవర్తి ధర్మరాజు కన్నా గొప్పగా రాజ్యాన్ని, రాజ్యాధికారాన్ని అనుభవించడం కాకుండా ఒక ధర్మకర్తగా కర్తవ్యాలు నిర్వహించాడని సాహిత్యం చెపుతున్నది. అధికారాన్ని అందుకున్న వారెవరైనా సమాజం పట్ల, పరిపాలన పట్ల ఒక ధర్మకర్తల మండలిలాగే పరిపాలించవలసి వుంటుంది. అందువల్ల ధర్మకర్తృత్వ సిద్ధాంతం మౌలికమైనది. వేల ఏళ్ళ చరిత్ర కలిగి వున్నది. బుద్ధుడు కూడా ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని బోధించాడు. కుటుంబంలో, తెగలో, జనపదాల్లో సభ్యుల పట్ల తల్లిదండ్రులు, పెద్దలు నిర్వహించే కర్తవ్యాలు అన్ని ధర్మకర్తలలాగే నిర్వహిస్తుంటారు.

**అంబేద్కర్ దర్శనం :**

అయితే గాంధీ చెప్పిన శాంతి, అహింసలు ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రభుత్వాలు ఆచరించలేకపోతున్నాయి. పోలీసు కాల్పులు, పౌర సమాజంలో ప్రభుత్వాల జోక్యం, నిర్బంధాలు, హింస పెరిగిపోతున్నాయి. అహింస అనేది హింస ద్వారా బలవంతంగా నెలకొల్పుతున్నారు. శాంతిని కూడా హింస ద్వారా బ[illegible]వంతంగా నెలకొల్పుతున్నారు. ఇది బుద్ధుడు, గాంధీ చెప్పిన అహింస సిద్ధాంతాలకు భిన్నమైనది. అంబేద్కర్ కూడా బహుజన సమ్మతి ద్వారా మార్పులు తీసుకురావాలి అన్నాడు. శాంతియుత పరివర్తనకు భావజాల సంఘర్షణ అవసరం కాని సాయుధ హింస అవసరం లేదని అది అనేక విష పరిణామాలకు దారితీస్తుందని చెప్పాడు.

అంబేద్కర్ హిందూమతాన్ని, పురాణాల్ని వింగడించి, వ్యతిరేకించి పాశ్చాత్య పారిశ్రామిక, పౌర, నాగరిక సమాజాన్ని, మితిమీరని స్వేచ్ఛాయుత ప్రజాస్వామ్యాన్ని అభిలషించాడు.

**బ్రహ్మసమాజం - ఆర్యసమాజం :**

బ్రహ్మసమాజాన్ని స్థాపించినవారుగానీ, ఆర్యసమాజాన్ని స్థాపించినవారుగాని హిందూ శాస్త్రాల గొప్పదనాన్ని ప్రచారం చేసిన వివేకానందుడుగానీ, యం.యన్. రాయ్‌గానీ, గాంధీగానీ, అంబేడ్కర్‌గానీ, లోహియా గానీ, పెరియార్‌గానీ తమదైన తత్వశాస్త్రాల్ని రూపొందించలేక పోయారు.

అయినా వీళ్లు సామాజిక ఆచరణకు, రాజకీయాలకు పరిపాలనా నిర్వహణకు, కులం, మతం, విలువలశాస్త్రాలకు, అర్ధశాస్త్రాలకు తమదైన చేర్పును అందించారు.

అలాగే సామాజిక దర్శనాల్లో ఫ్రాయిడ్, ఎరిక్‌ఫామ్ వంటి మనస్తత్వ శాస్త్రవేత్తలు అన్వేషించిన ఆలోచనలోని చేర్పు, ఐన్‌స్టీన్ సాపేక్షిక సిద్ధాంతం ఇచ్చిన వెలుగు ఎన్నదగినవి.

**జెకెయిజం - భౌతిక అవసరాలు**

నాస్తికవాదం హేతువాదం, జెకెయిజం, ఓషోయిజం భావాల గురించి, వ్యక్తి స[illegible]స్కారం గురించి, పోరాడినట్టుగా భౌతిక అవసరాల గురించి పోరాడ్డం కనపడదు. సైన్సు, ద్వారా జరిగిన అభివృద్ధి యొక్క భౌతిక ఫలితాలు అందాల్సిన వారికి అందించే "అవసరాల" పట్ల కృషి వీరు చేసినట్టు కనపడదు. భావం శక్తి అయితే అవసరాలు

పదార్థం అనుకోవచ్చు. వీరు భావజాలశక్తిని పట్టించుకొని అది కనపడే రూపమైన అవసరాలు పదార్థంలను వాటిని అందుబాటులోకి తేవల్సిన కర్తవ్యాన్ని స్వీకరించడంగానీ ప్రజలకు గుర్తింపజేయడం గానీ తక్కువ.

**అంతర్గత ఆత్మ సౌందర్యం**

అంతర్గత ఆత్మ సౌందర్యం ఆత్మ విశ్వాసం, వివేచనకు పూర్తిగా ఆధారపడాలనే వాదం ఆకర్షణీయమే. అసమచైతన్యం, అసమ అభివృద్ధి ఏకకాలంలో వున్నచోట యీ ఆత్మవిశ్వాసం, వివేచన ఎదుటి వారికి అహంకారంగా, ఆధిక్యతా ప్రదర్శనగా కనపడ్తుంది. స్వయంనిర్దేశక మనిషి, అహంకారిగా మారడానికీ, వినయంగా వుండడానికి మధ్య 'మూడ్' అనే సన్నని పొరమాత్రమే అడ్డుగా వుంటుంది. ఫాసిజం, కమ్యూనిజం, మతం, నాయకత్వాన్ని ఆధిక్యతావాదులుగా మార్చితే యిది అందర్ని మార్చుతుండవచ్చు, సమాజానికన్నా అధికులం, సామాజిక సమస్యలకు అతీతులం, కులసమస్య, స్త్రీ సమస్యలా! ఆకలిదారిద్ర్యమా, నిరుద్యోగమా! అవి చిన్న సమస్యలు మేం చర్చిస్తున్నది అంతకన్నా ఉన్నతమైన సమాజం స్వేచ్ఛ గురించి, రేపటి గురించి, మతం గురించి అనే అహంభావం వీరిలో చోటుచేసుకోవచ్చు.

జిడ్డు కృష్ణమూర్తి చెప్పినవాటిల్లో ప్రదానమైనవి మూడు అని అంటాడు జె.ఎన్.రఘుపతిరావు. అవి.

1. పోటీ లేకుండా బ్రతకడం
2. పోలిక లేకుండా బోధించడం
3. నిబద్ధత లేకుండా జాగృతి వహించడం

ఇంట్లో పిల్లల మధ్య, స్కూలులో, క్లాసులో విద్యార్థులమధ్య, ఆటల్లో జట్లమధ్య, రాజకీయాల్లో ఎన్నికల్లో పార్టీల మధ్య పోటీ, పోలిక ఉండడం అనివార్యం. స్పర్ధయా వర్ధతే విద్య అన్నారు. అంటే, పోటీలోనే, పరస్పర సహకారంలోనే విద్య వర్ధిల్లుతుంది. సమాజంలో మనుషుల మధ్య పలు విషయాల్లో పోలిక, పోటీ ఉంటుంది. అందంలో కావచ్చు, ఒక ఉద్యోగం లేదా కూలీ సంపాదించుకోవడంలో కావచ్చు దేంట్లోనైనా పోటీ, పోలిక అనివార్యం అవుతుంది. ఒక వస్తువును కొనుగోలు చేయడంలో పోటీ లేకుండా ఇతరాలతో పోల్చి చూడకుండా ఎన్ని చేయడం సాధ్యం. పోటీ, పోలిక అనేవి ఇతర వస్తువులతో గల సంబంధాలను తులనాత్మకంగా తెలుసుకోవడం సంబంధించినది. ఏ కుండ బాగుందో నాలుగు కుండలు కొట్టి చూసి, పట్టి చూసి బేరం చేసి కొనుక్కుంటారు. ఆటల్లో, ఎన్నికల్లో ఓట్లు కూడా పోటీ, పోలిక అనుసరించసాగుతాయి. దీన్నే సాపేక్షికత అంటారు.

**ప్రతిదీ సాపేక్షిక సత్యమే**

ప్రతిదీ సాపేక్షికమే. ఒకటి, మరొకటితో సంబంధంలో ఉంటుంది. భూమి, చంద్రుడు, సూర్యుడు, గ్రహాలు నక్షత్రమండలం ఒక సంబంధంలో తిరుగుతున్నాయి. మనుషులు సంఘంలో అన్ని పనులు, అన్ని అవసరాలు, అన్ని సరుకులు ఎవరికి వారు చేసుకోలేక పరస్పరం ఆధారపడతారు. అందువల్ల రేట్లల్లో, జీవనప్రమాణాల్లో, నైపుణ్యంలో, అందంలో, జ్ఞానంలో, హృదయసంస్కారంలో, సంస్కృతిలో, సాహిత్యంలో,



తత్వశాస్త్రంలో, తర్కశాస్త్రంలో, పోటీ, పోలిక అనివార్యం. దాన్ని రాగద్వేషాలు పెరగకుండా ప్రేమ, స్నేహం, సహృదయత, క్షమ ద్వారా ఆరోగ్యప్రదంగా మార్చుకోవాలి.

నిబద్ధత లేకుండా జాగృతి వహించడం అంటే సమాజానికి ప్రేక్షకుడిగా గమనిస్తూ వుండడం. ఇది మనశ్శాంతిని ఇవ్వవచ్చునుగానీ సామాజిక పరిణామానికి తోడ్పడదు. అందువల్ల నిబద్ధతతోపాటు నిమగ్నత జాగరూకతతో ఆచరణ ఏకకాలంలో అవసరం. జిడ్డు కృష్ణమూర్తి మౌనం యొక్క శక్తిని గొప్పగా చెప్పాడు.. అయితే తాను మౌనంగా ఉండకుండా శబ్దాన్ని ఆశ్రయించడం అతని సిద్ధాంతాన్ని అతడు వదిలివేయడమే...

**ఓషోయిజం**

ఓషో రజనీష్ ఇలా అంటాడు – "...డబ్బుకు ప్రాధాన్యత లేదు. డబ్బుకు ఉపయోగం ఉంది. డబ్బే ప్రధానం కాదు. హోదా, కీర్తి, అధికారం... వీటన్నింటినీ మృత్యువు ఒక్క వేటుతో తుడిచివేస్తుంది... మీ శరీరాన్ని వదిలివెళ్ళేప్పుడు దేన్నయితే మీతోపాటు తీసుకెళ్లగలరో అదే ప్రధానమైనది."

జీవితం చిన్నది.

"...దేవుడనే పదం కేవలం పురాణ ఇతిహాసాలలోనే ఉంటుంది. అదొక పదం. కేవలం పదం, అంతే. జీవితం నీలో ఉంది, నీకు వెలుపల ఉంది. చెట్లలో, మేఘాల్లో, నక్షత్రాల్లో, ఈ ప్రపంచమంతా నాట్యంచేస్తున్న జీవమే."

"...జీవానికి జీవించడం తప్ప మరో లక్ష్యం లేదు. ఈ క్షణం మాత్రమే వాస్తవం. ఈ క్షణాన్ని ఎలాంటి మొహమాటం లేకుండా జీవించడమే. ఎలాంటి అణచివేత లేకుండా, ఏ భయం లేకుండా, భవిష్యత్తుమీద ఎలాంటి వ్యామోహం లేకుండా జరిగిపోయినదాని గురించి పునరాలోచన లేకుండా, స్వచ్ఛంగా, అనుక్షణం కడిగిన ముత్యంలా, పసివాడిలా, నీ జ్ఞాపకాల కందిరీగలు చుట్టుముట్టకుండా, ఊహలతో ఆగిపోకుండా ఉంటే మీరు ఎంతో స్వచ్ఛంగా, అమాయకంగా ఉంటారు. ఆ అమాయకత్వాన్నే నేను దైవత్వం అంటాను. నా దృష్టిలో దేవుడు ఈ ప్రపంచాన్ని సృష్టించినవాడు కాదు. దేవుడిని మీరు సృష్టిస్తారు."

"...నిరంతరం మీ ఉచ్ఛ్వాస నిశ్వాసాల ద్వారా మీరు విశ్వంతో సంబంధం కలిగి వున్నారు. అది సంబంధం కాదు, అది పరస్పర సహకారం. నేను ఆధారపడడం అని చెప్పడంలేదు. ఎందుకంటే ఆధారపడడం అనే ఆలోచనే మనం స్వతంత్రులమన్న అభిప్రాయాన్ని కలుగజేస్తుంది... అలలు సముద్రం నుండి స్వతంత్రంగా ఉంటాయా, లేక అలలు సముద్రంమీద ఆధారపడి వున్నాయా? రెండూ నిజం కాదు. అలలే సముద్రం. అవి ఆధారపడిలేవు. స్వతంత్రంగానూ లేవు. అల లేకుండా సముద్రం లేదు. సముద్రం లేకుండా అలలు లేవు."

ఇలా ఓషో రజనీష్ బుద్ధుని తత్వాన్ని, ధ్యానాన్ని కలుపుకొని తనదైన ఆధునిక పద్ధతుల్లో చెప్తాడు. హృదయం, మనస్సు, ప్రేమ, నిరంతరం జాగరూకత జె.కె. లాగే చెప్తాడు. అయితే ఓషో రజనీష్ ఆచరణవాది. కొన్ని ఆదర్శ సమాజ నిర్మాణాలను ఆశ్రమ నిర్మాణ రూపంలో ప్రయత్నించాడు. అమెరికా ఆధిపత్యం తన కమ్యూన్‌లో చెల్లదు అని

ప్రకటించినందుకు అమెరికా నుండి తరిమివేశారు. పూనాలో స్థిరపడ్డాడు.

**తత్వశాస్త్రం-సామాజిక తత్వశాస్త్రాల మధ్య పని విభజన :**

సామాజిక తత్వశాస్త్రం అనేది తత్వశాస్త్రం యొక్క పని విభజన.

సమాజ సంబంధమైన, సైన్సు సంబంధమైన 'ఆలోచన' సామాజిక తత్వశాస్త్రపరిధి.

తత్వపరిభాషలోని కేటగిరీలు, జ్ఞానశాస్త్రం, అలంకారశాస్త్రం, ఆలోచనాశాస్త్రం గురించి చర్చించకపోయినా సామాజిక రంగాల్లోని కొత్త ఆలోచనలు, కార్యక్రమాలు చేసినవారంతా సామాజిక తత్వవేత్తలుగా సామాజిక తత్వశాస్త్రం పరిధిలోకి వస్తారు.

తత్వశాస్త్రం వీరిని తత్వవేత్తలుగా స్వీకరించడం కుదరలేదు.

ఉదాహరణకు జ్యోతిబా ఫూలే, అంబేద్కర్, పెరియార్ రామస్వామి, నారాయణగురు, సాహు మహరాజ్, ఎం.ఎస్.గోల్వాల్కర్, దీనదయాళ్ ఉపాధ్యాయ, రాంమనోహర్ లోహియా, కాన్షీరాం మొదలైనవారిని సామాజిక తత్వవేత్తలుగా స్వీకరించడంలేదు.

**తత్వశాస్త్రం పరిమితి :**

సామాజికరంగంలో ఏమీ పనిచేయని కేవలం ఆలోచనను చర్చించిన వారిని తత్వవేత్తలుగా గుర్తించారు. భావజాలంతోపాటు సామాజికరంగంలో కృషిచేసిన వారిని సామాజిక దర్శనం తన పరిధిలోకి తీసుకుంటుంది.

**సామాజిక దర్శనం ఆవశ్యకత :**

పెరిగిన సంఘజీవితం, సామాజిక సంబంధాలు, మానవ సంబంధాలు, మానవీయ విలువలు, సంస్కృతి వల్ల, పెరిగిన "మానవ ఆలోచన సామాజికశాస్త్రాల"వల్ల సామాజిక తత్వశాస్త్రం ప్రత్యేకంగా రూపుదిద్దుకోవడం అవసరమవుతున్నది.

**సామాజిక దర్శనం - ప్రయోజనం :**

తత్వశాస్త్రం సామాజిక రంగాల్లో చురుకుగా వెంటదివెంట జర్నలిజంలాగా చేయలేని పనిని సామాజికతత్వశాస్త్రం చేస్తుంది.

తద్వారా వాటి వ్యాప్తి, ఆచరణ, సామాజిక మార్పులు, పరస్పర సంబంధం, ప్రభావం, వేగవంతమవుతాయి.

తత్వశాస్త్రం పుస్తకంవంటిదైతే, సామాజిక దర్శనం దినపత్రికవంటిది. అందులో ఎన్నో విభిన్నాంశాలు అన్నిటిద్వారా ఒక పరిణామం ద్యోతకమవుతూ వుంటుంది.

**స్థలకాలాతీత వివేచన, స్వేచ్ఛ :**

సామాజిక దార్శనికులు వివేచనలో స్వేచ్ఛను, మానవాళి ప్రతినిధిగా ఎదగాల్సిన అవసరాన్ని సామాజిక దర్శనం తెలుపుతుంది.

అందువల్ల దార్శనికులు తమ స్థలకాల కులభాషా ప్రాంత పరిస్థితుల్లో జీవించినప్పటికీ వాటన్నిటి బంధనాల నుండి బయటపడి స్వేచ్ఛగా, ఆలోచించడం,



వివేచించడం అవసరం.

**తెద్దు, వివేచన, స్వేచ్ఛ :**

వివేచన అన్నిటిలో ప్రాధాన్యతవహిస్తుంది. వెనకటికొకాయన "ఏం మాట్లాడుతున్నావు? నా సర్వీసంత లేదు నీ ఏజ్" అని అంటే "ఔను సార్. మా యింట్లో ముప్పయ్యేళ్ళనాటి తెడ్డుంది. దానికి యిప్పటికీ ఉప్పు ఎక్కువైందో తక్కువైందో తెలువది" అని అన్నాడట.

వివేచనాశక్తి పెంచుకోకపోతే ఎన్ని చదివినా, ఎన్ని తెడ్డులా కలియదిప్పినా తెడ్డుకు రుచి తెలియనివిధంగానే జీవితం, జీవిత పరమార్థం తెల్లవారిపోతుంది. అందువల్ల ప్రతి మనిషికి స్వేచ్ఛగా ఆలోచనాయుతంగా, సృజనాత్మకంగా, వివేచనాత్మకంగా జీవించే స్వేచ్ఛగా ఉండాలి. అలాంటి సమాజాన్ని నిర్మించుకోవాలి. సామాజిక తత్వశాస్త్ర లక్ష్యం, గమ్యం, మార్గం అంతా యిదే.

**సామాజిక దర్శనం పరిచయం**

చరిత్ర గతాన్ని చెప్తుంది.

తత్వశాస్త్రం గతంలోని మానవ ఆలోచనా పరిణామాల్ని తెలుపుతూ కొత్త ఊహలు చేస్తుంది. వర్తమానాన్ని, భవిష్యత్తును నిర్మిస్తుంది.

తర్కశాస్త్రం ప్రతీది తర్కిస్తుంది.

అర్థశాస్త్రం ఉత్పత్తిని, సంపదను, సంబంధాలను తెలుపుతుంది. సైన్సు టెక్నాలజీ మానవ అభివృద్ధి పరిణామాల్ని తెలుపుతాయి.

సాహిత్యం, కళలు, సంస్కృతి మానవ స్వభావాలను, సంబంధాలను జీవిత విధానాలు తెలుపుతాయి.

ప్రభుత్వ పరిపాలన, నిర్వహణ, పౌరనీతి, రాజనీతి శాస్త్రాలు సామాజిక సంబంధాలను, నీతి నియమాలను నిర్వహిస్తాయి.

**గతంతో యుద్ధం**

చాలామంది గతంతో యుద్ధం చేస్తుంటారు. గతాన్ని విమర్శిస్తూ, తద్వారా గతాన్ని వర్తమానం చేస్తుంటారు. అలా గతంతో యుద్ధం చేస్తూ గతానికి వర్తమానంలో ప్రాణం పోస్తుంటారు. గతాన్ని ఆచరించేవాళ్లు కూడా అదే పని చేస్తుంటారు.

సిద్ధాంతాలన్నీ గతంతో యుద్ధం.

రాజకీయ విమర్శలు - గతంతో యుద్ధం

ఎదుటివారిని విమర్శించడం - గతంతో యుద్ధం

తనను తాను విమర్శించుకోవడం - గతంతో యుద్ధం

వ్యక్తిత్వ వికాసం అంటే తన గతంతో, సమాజం తనపై ఆపాదించిన గతంతో యుద్ధం చేయడం. వర్తమానంలో ఎదగడం. వర్తమానంలో నూతన వ్యక్తిత్వ వికాస నిర్మాణం చేసుకోవడం. వ్యక్తిత్వాన్ని పునర్నిర్మించుకోవడం.

## ప్రశ్నలు

1. సామాజిక తత్వవేత్తలు వారు జీవించిన స్థల కాలాల పరిమితికి ఎలా లోనౌతుంటారు? వివరించండి.
2. గాంధీ దర్శనం గురించి, అంబేడ్కర్ దర్శనం గురించి మీరేమనుకుంటున్నారో రాయండి.
3. ధర్మకర్తృత్వ సిద్ధాంతం యొక్క ప్రాధాన్యత ఏమిటి?
4. జిడ్డు కృష్ణమూర్తి చెప్పేవి జీవితంలో ఆచరణకు ఏ మేరకు సాధ్యమవుతాయో వివరంచిండి?
5. ఓషో రజనీష్ సిద్ధాంతాలు ఆచరణ గురించి వివరించండి?
6. సామాజిక దర్శనం ప్రతి దశలో ఆయా కాలాల్లో వెలువడిన సిద్ధాంతాలన్నిటిని సమన్వయించి ఏక సూత్రతలోకి తేవడం ఎందుకు అవసరం? వివరించండి.
7. గతంతో యుద్ధం అంటే ఏమిటి?
8. వ్యక్తిత్వ వికానికి గతంతో యుద్ధానికి మధ్య సంబంధం ఏమిటి?



# సామాజిక దర్శనాల పరిణామం

**ఆలోచనలు సిద్ధాంతాలు మారడానికి జీవితమే పునాది**

జీవితంలాగే ఆలోచనలు, సిద్ధాంతాలు, ఆచరణ మారుతాయి. ఒక్కరుగా ఉన్నప్పుడు తనలో తాను ఒక రకంగా, పదిమందిలో ఉన్నప్పుడు ఒక రకంగా ఆలోచిస్తారు. అడవిలో ఉన్నప్పుడు ఒక రకంగా, పల్లెలో ఉన్నప్పుడు ఒకరకంగా, పట్నంలో ఉన్నప్పుడు ఒక రకంగా ఆలోచిస్తారు. చలికాలంలో వేడి వేడి ఆహార పదార్థాలు కావాలనే ఆలోచన వస్తుంది. ఎండల్లో చల్లని నీరు కావాలని ఆలోచన వస్తుంది.

**సిద్ధాంతాల పుట్టుక, భూమిక తెల్సుకోవాలి**

చరిత్ర, స్థలకాలాల్లో భాగంగా తత్వశాస్త్రాలను, భావాలను, వాటి పరిణామాలను అవి పుట్టి పెరిగిన తీరుతెన్నులను అధ్యయనం చేసినపుడే వాటి మూలాలు అర్థమవుతాయి. చరిత్రను, సమాజాన్ని పరిశీలించకుండా చరిత్రలో, ఆ సమాజంలో భాగంగా పుట్టిన భావాలను చర్చించడం, పరిశీలించడం సరియైనది కాదు. అది నేలవిడిచి సాముచేయటమే. చరిత్ర స్థలకాలాల్లో భావజాల కర్తల, తత్వవేత్తల వ్యక్తిత్వం, వారి వర్గకుల ప్రయోజనాలనుకూడా ఒక భాగంగా పరిశీలించాలి. సామాజిక, చారిత్రక పరిణామాలను, ఆనాటి ప్రజల జీవితాల తీరుతెన్నులను స్పర్శించకుండా దర్శనాల పరిణామాలని పరిశీలించడం సరియైంది కాదు.

**తానున్న స్థల కాలాలను అనుసరించి ఆలోచనలు పుడతాయి**

తాను పుట్టిపెరిగిన సమాజాన్ని అనుసరించి, చారిత్రక కాలాన్ని అనుసరించి స్థల కాలాల ననుసరించి, పుట్టి పెరిగిన కులాలు, వర్గాల, జాతుల ననుసరించి, ఆశలు, ఆరాటాలు, అవకాశాలననుసరించి ఆలోచనలు కలుగుతాయి. ఆసక్తిని, సంకల్పబలాన్ని అనుసరించి ఆలోచనలు పెరుగుతాయి. అవసరం అన్వేషణకు, జ్ఞానానికి తల్లి అని అంటారు.

"ప్రతి సామాజిక ఉద్యమానికి, ప్రతి భావజాల ఉద్యమానికి సార్వజనీన, విశ్వజనీన తత్వంతో పాటు ప్రాంతీయ స్పృహ, ప్రాంతీయ తత్వం, ప్రాంతీయ సంస్కృతి కూడ వుంటుంది. ఒకటి - నిర్దిష్టత. మరొకటి - సార్వజనీనత అని పిలుస్తారు.

**జీవితం అంటే ఏమిటి?**

### ప్రతి విశ్వజనీన భావజాలానికి ప్రాంతీయతే పునాది

ఫెమినిజం అంటే ఏమిటి? అధ్యాయంలో చెప్పిన అంశాన్ని మరోసారి ఇక్కడ పేర్కొంటాను. "విశ్వజనీన భావజాలం విస్తరించడంలో వారి ప్రాంతీయ భావజాల ఆధిపత్యం కూడా ఉంటుంది. ఉదాత్త ఆశయాలతో ప్రారంభమయ్యే సార్వజనీన, సామాజిక భావజాల ఉద్యమాలకు అవి పుట్టిన ప్రాంతంలోని, భాషలోని, సంస్కృతిలోని, సమాజంలోని సామాజిక పరిణామాలు, సంస్కృతి భావజాలాలు పునాదిగా వుంటాయి. వాటి నుంచే అవి ఆవిర్భవించి ఉదాత్తతను, సార్వజనీనతను, విశ్వజనీనతను సాధించుకుంటాయి. అందువల్ల వాటి పుట్టుక, పెరుగుదల, వ్యాప్తి విస్తరణలో వాటి తాలూకు స్థల కాలాల దృష్టి, ఆధిపత్యం కూడా కలిసే వుంటుంది. దీన్నే మరోమాటలో చెప్పాలంటే వాటిలోని విశ్వజనీనతలో అవి పుట్టి పెరిగిన ప్రాంతాల, సమాజాల, భాషల ప్రాంతీయ స్పృహ, ప్రాంతీయ తత్త్వం, ప్రాంతీయ నాయకత్వం, ఆధిపత్యం కూడా అంతర్లీనంగా కొనసాగుతుంది."

### ప్రపంచానికి ఇండియా ఒక దిక్సూచి

పూర్వం ప్రపంచంలోని ఎన్నో దేశాలవాళ్లు జీవితంలో ఒకసారైనా ఇండియా చూడాలని కలలు కనేవాళ్లు. ఆర్యులు, ద్రావిడులు, సంచార తెగలు మొదలుకొని అలెగ్జాండర్ దాకా ఇండియా గురించి కలలుగన్నవాళ్లే. అరబ్ దేశాలవాళ్లు ఆఫ్ఘనిస్తాన్ మీదుగా ఈ దేశానికి రావాలని కలలుగన్నవాళ్లే. కొలంబస్, వాస్కోడిగామా ఇండియాకు రావాలని, ఇండియాకు కొత్తదారులు కనుక్కోవాలని కలలుగన్నవాళ్లే. ఫ్రాన్స్, ఇంగ్లాండ్, డచ్, జర్మనీ, జపాన్, చైనా దేశాలవాళ్లు ఇండియాకు రావాలని కలలుగన్నవాళ్లే. ఇప్పుడు ఆలోచనలు మారాయి.

### దిక్సూచి మారి పాశ్చాత్య దేశాలను చూపిస్తోంది

ఇప్పుడు ఇండియావాళ్లు అమెరికాకు వెళ్లాలని, ఇంగ్లాండుకు వెళ్లాలని కలలు గంటున్నారు. కొలంబస్ లాగా కొత్తదారులు కనుక్కొని అమెరికా, ఇంగ్లాండు, కెనడా దేశాల్లో స్థిరపడాలని కలలుగంటున్నారు. అందుకు కంప్యూటర్ రంగం ఒక కొత్తదారి చూపింది. ఇలా శతాబ్దాల ఆలోచనలు మారిపోతున్నాయి. జీవితాలు మారిపోతున్నాయి. ఆలోచనలు మారిపోతున్నాయి. సిద్ధాంతాలు మారిపోతున్నాయి.

### లక్ష్యం, సైన్సు, అవసరాలు, అభిరుచులతో 'ఆలోచన' మారుతుంది

జీవితంలో సైన్సు, అవసరాలు, అభిరుచులు, లక్ష్యాలు పెరుగుతున్నకొద్దీ ఆలోచనలు మారుతుంటాయి. వయస్సు అనుసరించి కూడా ఆలోచనలు మారుతుంటాయి. స్త్రీ పురుషుల మధ్య ఆలోచనల్లో అంతరాలు ఉంటాయి. తాను ఉన్న స్థల కాల, కుల, లింగ, జాతి, ప్రాంత, భాష స్థితిగతులననుసరించి, తన స్థితి అనుసరించి ఆలోచనలు పుట్టి పెరుగుతుంటాయి, మారుతుంటాయి. ఆకలై తిండి దొరకనప్పుడు ఈ లోకమంతా అన్యాయాలతో దరిద్రంతో నిండివుందని విమర్శిస్తారని, కడుపు చల్లబడగానే దేశం సుభిక్షంగా వుందని అంటారని ఒక సామెత ఉంది.

### ఎట్లుంటే అట్లాంటి ఆలోచనలు

ఎడ్లబండి ఉన్నప్పుడు ఆలోచనలు ఎడ్లబండిని అనుసరించి సాగుతాయి. గుర్రం



ఉన్నప్పుడు గుర్రంను అనుసరించి ఆలోచనలు సాగుతాయి. సైకిల్ ఉన్నప్పుడు సైకిల్‌ను అనుసరించి, సైకిల్ మోటర్ ఉన్నప్పుడు సైకిల్ మోటర్‌ను అనుసరించి, కారు ఉన్నప్పుడు కారును అనుసరించి, బస్సు పోయే తోవ వున్నప్పుడు బస్సును అనుసరించి ఆలోచనలు సాగుతాయి. ఇంట్లో కరెంటు వున్నప్పుడు కరెంటును అనుసరించి ఆలోచనలు సాగుతాయి. ఫోను ఉన్నప్పుడు ఫోనును అనుసరించి ఆలోచనలు సాగుతాయి. సెల్‌ఫోన్ ఉన్నప్పుడు సెల్‌ఫోన్‌ను అనుసరించి ఆలోచనలు సాగుతాయి. ఇలా జీవితాన్ని అనుసరించి ఆలోచనలు సాగుతాయి.

### సైన్సు సమాజాన్ని మార్చేస్తుంది

జీవితం మారుతున్నట్టుగానే ఆలోచనలు, సిద్ధాంతాలు మారుతుంటాయి. సైన్సు, టెక్నాలజీ మనిషి జీవితంలో ప్రవేశించాక ఆలోచనల్లో మార్పులు వచ్చాయి. రాజులు, గుర్రాలు, కోటలు, కత్తుల యుద్ధాలు ఇప్పుడు లేవు. విమానాలతో బాంబులు వేసే అవకాశం రావడంతో కోటలు అవసరంలేనివైపోయాయి.

### కాలం తీరిపోయిన వెనుకటి ఆలోచనలు

అలాగే ప్రజాస్వామిక జీవితం, హక్కులు, ఆధునిక అభివృద్ధి క్రమంలో మనిషి ఆలోచనలు, సిద్ధాంతాలు కూడా మారుతూ వస్తున్నాయి. కోటల అవసరం ఇప్పుడు తీరిపోయినట్టుగానే వెనకటి జీవితం తాలూకు ఆలోచనలు, సిద్ధాంతాల అవసరం తీరిపోయింది. అయినప్పటికీ పాతవాటిని ప్రేమించి, గౌరవించే గుణం వల్ల అవి ఇంకా సంప్రదాయంగా, సంప్రదాయ ఆలోచనా విధానంగా కొనసాగుతున్నాయి. మనిషి మెదడు ఈ పాత సామానుతో నిండిపోతున్నది.

### చరిత్ర పుటల్లో కొన్ని పేజీలు

నోమ్ చామ్‌స్కీ అన్నట్టు "చరిత్ర పుటలన్నీ అన్యాయాలు, అక్రమాలు, దోపిడీలు, బలవంతుడు బలహీనుడి మీద సవారీ చెయ్యటం లాంటి సంఘటనలతోనే నిండివున్నాయి. ఇవన్నీ నిరాకరించాలంటే మళ్ళీ ఆటవిక దశకు పోవటమే. ఇజ్రయేలు అలాంటి చారిత్రక వాస్తవం. ఇజ్రాయేలు చేతుల్లో పాలస్తీనీయులు ఎన్ని యిక్కట్లు పడుతున్నారో అందరికీ తెలుసు. కాని మన అమెరికన్ వలసవాదులు ఇక్కడి ఆదిమ జాతుల్ని నాశనం చేసిన క్రమంతో పోల్చితే పాలస్తీనియులకది స్వర్గమే అనవచ్చు. ఇక్కడేం చేశాం మనం? మారణహోమం, లక్షలాదిమందిని శతాబ్దాలుగా ఊచకోత కోశాం. కొలంబస్ అడుగుమోపిన నాటికిక్కడ 15 మిలియన్ల రెడ్‌యిండియన్ తెగలవాళ్లున్నారని అంచనా. పందొమ్మిదవ శతాబ్ది వుత్తరార్థంలో ఆ జనాభా రెండు లక్షలకు పడిపోయింది. ఇక్కడి ఆదిమ వాసులతో చేసుకున్న ఏ ఒక్క సంధినీ మనం పాటించలేదు. హిట్లరు యూదులను నిర్మూలించాలనుకొన్నప్పుడు అమెరికన్ చరిత్రనే ఉదహరించాడు. అక్కడ రెడ్ యిండియన్లకు పట్టినగతే ఇక్కడ యూదులకు పడుతుంది అన్నాడు. కాని మనం ఇక్కడ ఈ మారణహోమాన్ని చాల సహజ పరిణామంగా అంగీకరించాం."

### కొన్ని ప్రభుత్వాలు ఆధిపత్యం కోసం ఏం చేస్తాయంటే...

అమెరికా ప్రపంచ ఆధిపత్యం కోసం ఎలా ప్రయత్నిస్తుందో ఆహారాన్ని కూడా

ఎలా యుద్ధ సాధనంగా మలుస్తుందో నోమ్ చామ్‌స్కీ ఇలా చెప్తాడు.

"1950లో ఇండియాలో కరువు వచ్చినప్పుడు (ఇంగ్లీషు వాళ్లున్నప్పుడు ఆ దేశంలో ఎప్పుడూ కరువే) సుమారు కోటి యాభై లక్షల మంది మరణించారని అంచనా. మన దగ్గర ధాన్యం నిలువలు పేరుకుపోతున్నప్పుడు కూడా మనం ఆ దేశానికి సహాయం చెయ్యలేదు. కారణం మనకు నెహ్రూ అన్నా, అతని తటస్థ విధానమన్నా ఇష్టం లేకపోవటమే. చివరికి ఆహార సహాయాన్ని ఓ ఆయుధంగా వాడాం."

ప్రభుత్వాలు ఎప్పుడూ ప్రజలకు లేనిసమస్యల్ని సృష్టించాలని కౌటిల్యుని అర్థశాస్త్రం, రామరాజ్యం స్పష్టం చేసింది. ప్రజాస్వామిక ప్రభుత్వాలు దీన్ని ఆచరిస్తున్నాయి అనడానికి నోమ్ చామ్‌స్కీ పరిశీలన సాక్ష్యం ఇస్తుంది.

### ప్రభుత్వాల అధికారం కోసం ప్రజలపై ఉచ్చు

"ప్రభుత్వాలన్నింటికీ ప్రజల్ని తమ గుప్పిట్లో పెట్టుకోవలసిన అవసరం వుంటుంది. అందుకోసం ప్రభుత్వ చర్యల చుట్టూ ఒక మిస్టరీ సృష్టించాలి. గ్రీకుల కాలం నించీ వస్తున్న రాజకీయ వ్యూహం ఇదే. ప్రజలు మంచివాళ్లే. కానీ వాళ్ల మధ్య కొందరు రహస్య వ్యక్తులు, దేశద్రోహులున్నారు. వాళ్ల వల్ల శాంతి భద్రతలకూ, దేశ రక్షణకూ సమస్యలు వస్తున్నాయి. వీళ్లను ఏరెయ్యవలసిన అవసరం వున్నది. రహస్య చర్యలు – వాళ్లెవరన్నా కావచ్చు. ప్రజలకు వాళ్లెవరో తెలుసుకొనే అవకాశమైనా వుండదు. తరతరాలుగా ప్రభుత్వాలు అధికారంలో కొనసాగటానికి ఉపయోగిస్తున్న ఎత్తుగడలివే. ఈ భయంతోనే ప్రజలు తమపై సర్వాధికారాల్నీ, రాజులకు, దేవుళ్ళకు, దేశాధ్యక్షులకు సమర్పించుకున్నారు. ప్రభుత్వాలు, ప్రభుత్వ వ్యవస్థ కొనసాగటం వెనకవున్న రహస్యం ఇదే."

"ప్రజల్ని భయపెట్టాలంటే, దేశద్రోహ నేరాన్ని మించింది లేదు. మన మధ్యనే ద్రోహులున్నారని అనుమానం రేకెత్తిస్తే ప్రభుత్వం ఆడమన్నట్టల్లా ఆడమా?" అని అంటాడు నోమ్ చామ్‌స్కీ.

### కౌటిల్యుడు, మనుధర్మం, భగవద్గీత

అయితే ఇలాంటి విషయాలను కౌటిల్యుని అర్థశాస్త్రం, మనుధర్మశాస్త్రం ఇంతకన్నా చక్కగా పకడ్బందీగా వివరించాయి. అయితే వారిది మొరటు పద్ధతి. అవి మొరటుగా అనాగరిక భాషలో పరిభాషలో ఉన్నాయి. వాటిని అంతకన్నా ఎక్కువ ప్రయోజనకరంగా, సున్నితంగా, ప్రభావకరంగా చెప్పింది భగవద్గీత. ఈ విషయంలో ప్రపంచం భగవద్గీతనుండి నేర్చుకోవాల్సింది ఎంతో ఉంది.

### ఐకమత్యమే మహాబలం

ఐకమత్యమే మహాబలం, కలిసిఉంటే కలదు సుఖం, విడిపోతే పడిపోతాం ఇవి చెప్పడానికి కూడా పెద్దపెద్ద చర్చలు అవసరంలేదు. మనుషుల మధ్య, ప్రకృతి సమాజాల మధ్య ఐక్యత సంబంధం ప్రాథమికం. వీటి సాహిత్య అలంకార శాస్త్రాలు మానవ హృదయాలమధ్య ఐక్యతను, సంబంధాన్ని ప్రాథమికం చేస్తాయి. ఐక్యత ప్రాథమికం, సంబంధం ప్రాథమికం అనే ఆలోచన కూడా ఎన్నో శాస్త్రాల్లో మార్పు చేర్పులు చేస్తుంది.



అది ప్రకృతితో ఐక్యం కమ్మంటుంది. సమాజంలో కలిసిపొమ్మంటుంది. సమాజంగా కలిసి జీవించుమంటుంది. తోటివారికి తోడ్పడుమంటుంది. మనిషిని మనిషిగా గౌరవించుమంటుంది. వారి ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, భాషా, దేశాలు ఏవైనా మనిషిని మనిషిగా గౌరవించాలంటుంది. ప్రతి మనిషిని ఒకే తీరుగా చూడుమంటుంది. వైద్యం, విద్య, సైన్సు రంగాల్లో పరస్పరం సహకరించుకో వాలంటుంది. అలా సహకరించుకున్న చరిత్రక్రమాల్ని ముందుంచుతుంది. గార్డన్ చైల్డ్ రాసిన "చరిత్రలో ఏం జరిగింది" అనే చారిత్రక పరిశీలన మనుషులను చీల్చేదికాదు – కలిపేది.

ఐకమత్యమే మహాబలం అంటూ మార్క్సిజం ప్రపంచ కార్మికులారా ఏకంకండు అని నినాదమిచ్చింది. అయితే అదే సమయంలో ఐకమత్యం కన్నా వర్గపోరాటానికి ప్రాధాన్యతనిచ్చి ఐక్యత అనే అంశాన్ని వదిలేసింది. అయినప్పటికీ మార్క్సిజం సిద్ధాంతాలు రూపొందించే క్రమంలో మార్క్స్, ఏంగెల్స్‌లు తమ కాలం నాటి అన్ని సిద్ధాంతాలను ఏకసూత్రతలోకి ఎలా తెచ్చారో తర్వాతి అధ్యాయంలో పరిశీలిద్దాం.

### ప్రశ్నలు

1. ఆలోచనలు స్థల కాలాలననుసరించి ఎలా పుడుతుంటాయి?

   జీవితానుభవం నుండి 20 ఉదాహరణలను పేర్కొనండి.
2. ప్రభుత్వాలు ప్రజలను గుప్పిట్లో పెట్టుకోవడానికి ఏం చేస్తుంటాయి?
3. ఐకమత్యమే మహాబలం అని వివరించండి.

# ప్రపంచాన్ని మార్చిన మార్క్సిజం

## మార్క్సిజం పుట్టుక-పరిణామం

అనేక దృక్పథాల, సిద్ధాంతాల కలయిక మార్క్సిజం. వాటన్నిటినీ ఏకసూత్రతలోకి తెచ్చి సమన్వయించి మార్క్సిజం అని పేరు పెట్టారు. అలా మార్క్సిజంలో అది రూపుదిద్దుకున్న కాలం నాటి అనేక సిద్ధాంతాలు చోటు చేసుకున్నాయి. పిల్లల్లో, తల్లిదండ్రుల, మేనమామల, నాన్నమ్మ, అమ్మమ్మ, తాతల పోలికలు ఎన్ని ఉన్నప్పటికీ పిల్లలు స్వయంగా స్వంత రూపం, స్వంత వ్యక్తిత్వంతో ఎదుగుతారు. మార్క్సిజం కూడా ఇలా స్వంత రూపంతో, స్వంత వ్యక్తిత్వంతో ఎదిగింది.

**నినాదాలు ముందు పుట్టాయి**
**సిద్ధాంత భూమిక తరువాత తయారు చేశారు**

కార్మికోద్యమాల్లో భాగంగా మార్క్స్, ఏంగిల్స్‌లు, ఇతర కార్మిక నాయకులు ముందు నినాదాలు ఇచ్చారు. ఆ తరువాత సిద్ధాంతాలు రూపొందించారు. వాటికి బలమైన ప్రతిపత్తులు, పునాదులు వేశారు. అలా నినాదాలకు, దృక్పథానికి, ఉద్యమాలకు, కార్యక్రమాలకు శాస్త్రీయత ప్రాతిపదికను సమకూర్చారు.

కార్మికుల బాధలు వర్ణనాతీతం. పారిశ్రామిక విప్లవం వల్ల లక్షలాది మంది పాత కుటీర పరిశ్రమలను, వృత్తులను కోల్పోయారు. వారు పెట్టుబడి లేక పెట్టుబడిదారుల వద్ద కార్మికులుగా రెక్కల కష్టంతో బతికేవాళ్ళుగా మారిపోయారు. ఉత్పత్తి శక్తులైన కార్మికులే నూతన సమాజాన్ని నిర్మించుకోవాలి అనే సందేశంతో మార్క్స్, ఏంగెల్స్‌లు కార్మిక ఉద్యమంగా దశ దిశానిర్దేశం కోసం కమ్యూనిస్టు మ్యానిఫెస్టోను క్రీ.శ.1848లో రాశారు. అందులో వర్గపోరాటం ద్వారానే దాన్ని సాధించుకోవాలని చెప్పారు. వాటిని సోషలిజం, కమ్యూనిజం దశలు అని పేరు పెట్టారు.

అటు తర్వాత ఈ పోరాటాలకు అవసరమైన సిద్ధాంతాలను అదివరకే అనేక రంగాల్లో కృషి చేసిన వారి నుంచి స్వీకరించి ఆయా రంగాల్లో తమ దృక్పథంగా మలిచారు. ఇలా మార్క్సిజం పుట్టింది.

మార్క్సిజంలో ఆ కాలం నాటి సిద్ధాంతాలు ఏవేవి చేర్చారో సంక్షిప్తంగా చూద్దాం.

1. హెగెల్ ప్రతిపాదించిన చలన సూత్రాలు
2. ఫ్యూర్‌బా భౌతిక వాద ప్రతిపాదనలు
3. పెట్టుబడిదారీ అర్థశాస్త్ర సూత్రాలు
4. మోర్గాన్ అమెరికాలోని రెడ్ ఇండియన్స్ జీవితాలను పరిశీలించి రాసిన పురాతన సమాజం-పరిణామాలు, ప్రతిపాదనలు
5. డార్విన్ పరిణామవాద సూత్రాలు
6. ప్లేటో, అరిస్టాటిల్‌ల సిద్ధాంతాలు-కేటగిరీలు
7. 15వ శతాబ్దం నుండి మొదలైన యూరప్ సోషలిస్టు సిద్ధాంతాలు-ప్రయోగాలు
8. ప్రకృతి చలన సూత్రాలు
9. రాజరిక, ప్రజాస్వామ్య సమాజాలు-పరిపాలన-చలన సూత్రాలు
10. ఉత్పత్తి విధానాలు-ఉత్పత్తి సంబంధాలు, సృష్టించే క్రమాలు
11. ఫ్రెంచి విప్లవ పరిణామాలు-గుణపాఠాలు
12. పారిస్ కమ్యూన్ విప్లవం పరిణామాలు-గుణపాఠాలు
13. ప్రౌధన్ రాసిన ఫిలాసఫీ ఆఫ్ ప్రావర్టీ నుండి నేర్చుకున్న సూత్రాలు
14. డ్యూరింగ్ సిద్ధాంతాల నుండి నేర్చుకుంటూ డ్యూరింగ్‌లో వ్యతిరేకించే అంశాలను చర్చిస్తూ 'ఆంటీడ్యూరింగ్' పేరిట ఏంగెల్స్ గ్రంథాన్ని రాశారు.
15. కార్మికుల ఉద్యమాలు

**మధ్య తరగతి మేధావుల కృషి**

మధ్య తరగతి మేధావుల సైద్ధాంతిక నాయకత్వంలో కార్మికవర్గ సిద్ధాంతాలు, ఉద్యమాలు, విప్లవాలు కొనసాగాయి. పెటీ బూర్జువా అంటే మధ్య తరగతి. కార్మికుల సిద్ధాంతాలు, కార్మిక నాయకత్వం వెనక్కి నెట్టివేయబడింది. దీన్ని సరిచేయడానికి సబాల్టరన్ థీరిస్ వచ్చాయి. ఇవి అట్టడగు వర్గాల సిద్ధాంతాలను, వారు ఎదగాల్సిన ప్రాధాన్యతను ముందుకు తెచ్చాయి.

మార్క్స్, ఏంగెల్స్ మొదలుకొని ప్లెఖనోవ్, లెనిన్, మావో దాకా ఆయా దేశాల్లో కార్మిక వర్గానికి నాయకత్వం మధ్యతరగతి మేధావులే అందించారు. కార్మికవర్గం తన అనుభవాల నుండి తయారు చేసిన సిద్ధాంతాలను, కార్యక్రమాలను గమనించి వాటి నుంచి వాటి కన్నా ముందుచూపు కనిపించే విధంగా మార్క్స్, ఏంగెల్స్, లెనిన్, మావో మొదలైన మధ్యతరగతి మేధావులు ఈ సిద్ధాంతాలు రూపొందించారు. కార్యక్రమాలు చేపట్టారు. దాంతో వారే కార్మికవర్గ నాయకులుగా చలామణి అయ్యారు.

ఇలా రూపొందిన మార్క్సిజం ప్రపంచాన్ని మార్చివేసింది. బౌద్ధం, క్రైస్తవం, ఇస్లాం తర్వాత ప్రపంచాన్ని ఇంతగా ప్రభావితం చేసి మార్చింది ఆధునిక కాలంలో మార్క్సిజమే.

అటు తరువాత ప్రజాస్వామ్య సిద్ధాంతాలు, సైన్స్ ఆవిష్కరణలు ఎన్నో ఆవిష్కృతమయ్యాయి. వాటన్నిటిని భగవద్గీతలా ఒకే గొడుగు కిందకు తీసుకురాలేదు. మార్క్స్ తన కాలం నాటి వాటన్నిటిని ఒకే గొడుగు కిందకు తీసుకువచ్చి అనేక సిద్ధాంతాలను, ఆవిష్కరణలను కలుపుకొన్నాడు. తద్వారా ఒకే పేరుతో 'మార్క్సిజం' అని చలామణి అయ్యింది. 'మార్క్సిజం', 'కామ్రేడ్' అనే పదాలు ఒక చిహ్నంగా టోటెన్‌గా

మారిపోయాయి.

**మార్క్స్, ఏంగెల్స్ మానవతా దృష్టి**

మార్క్స్, ఏంగెల్స్‌లు పారిశ్రామిక కార్మికుల కష్టాలు, కన్నీళ్ళు చూసి చలించిపోయారు. కష్టపడేవారికి పేదరికం, పెట్టుబడిదారులకు లాభాలు, సంపద పోగుపడడం వారిని కలచివేసింది. ఈ అన్యాయాన్ని సంపద పంపిణీ వెనుక వున్న సిద్ధాంతాలను పరిశీలించారు. లాభాల పేరిట హక్కుభుక్తం చేసుకుంటున్నది కార్మికుల శ్రమ శక్తి నుండి పుడుతున్న అదనపు సంపదే అని సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. నిర్ధారించారు. 'సంపద సృష్టికర్తలు కార్మికులే తప్ప పెట్టుబడిదారులు కాదు' అని నిరూపించారు. దాంతో ప్రపంచం తలక్రిందులైంది. పెట్టుబడిదారులు, పారిశ్రామికవేత్తలు భూతాన్ని చూసినట్లుగా వణికిపోయారు.

**ఆదర్శాలను వాస్తవంగా మార్చుకున్న తీరు**

కార్మికులే సంపద సృష్టికర్తలు గనుక రెక్కలు తప్ప ఆస్తులు లేని వర్గం కనుక ప్రభుత్వ నాయకులుగా కార్మికులే ఉండాలని కార్మికవర్గ విప్లవం ద్వారా నూతన సోషలిస్టు సమాజాన్ని సమానత్వం పునాదులపై నిర్మించాలని పిలుపునిచ్చారు. సిద్ధాంతాలు చేశారు. కార్యక్రమాలు రూపొందించారు. రష్యాలో లెనిన్ నాయకత్వంలో విప్లవం విజయవంతం అయ్యింది. చైనాలో మావో విప్లవానికి నాయకత్వం వహించారు. ఇలా అనేక దేశాల్లో మార్క్సిజం ప్రయోగ దశ నుండి ఆదర్శాల దశ నుండి వాస్తవ ప్రపంచంగా పరిణామం చెందింది. వాస్తవంగా మారిన తరువాత ప్రపంచం ఆ సిద్ధాంతాలను మరింత ఆసక్తితో, భయంతో పట్టించుకోవడం జరిగింది. వ్యాప్తి పెరిగింది.

**కార్మికవర్గవాదం సాధించిన విజయాలు**

పెట్టుబడిదారీ సమాజం మార్క్సిజం వచ్చాక తనను తాను అనేక విధాలుగా సంస్కరించుకొనే ప్రయత్నాలు చేసింది. కార్మికులకు సెలవు దినాలను, పనిగంటలను, బోనస్‌ను, గృహవసతిని కేటాయించింది. కార్మికుల పిల్లలకు స్కూళ్లు, కాలేజీలు తెరిచింది. కార్మికుల కోసం ప్రత్యేక ఆసుపత్రులను ఏర్పరచింది. వారి జీవన ప్రమాణాలు, వృత్తి నైపుణ్యాలు పెరగడానికి అనేక చర్యలను తీసుకుంది. దాంతో యూరప్, అమెరికాల్లో కార్మికవర్గం చక్కని వసతులతో సౌఖ్యంగా జీవించే క్రమం మొదలైంది.

పర్యవసానంగా యూరప్, అమెరికా కార్మికవర్గం కార్మికవర్గ విప్లవాన్ని, సోషలిజాన్ని తెస్తాయనుకున్న ఆశలు, అంచనాలు ఓడిపోయాయి. కరప్ట్ అయ్యాయి. స్వార్థానికి పరిమితమయ్యాయి. కాని అవే సిద్ధాంతాలను తీసుకొని లెనిన్ రష్యాలో జార్ చక్రవర్తులకు వ్యతిరేకంగా సాగుతున్న ప్రజాస్వామ్య, జాతీయ విప్లవాన్ని కార్మికవర్గ సోషలిస్టు విప్లవంగా ప్రకటించి విజయం సాధించారు. సోషలిస్టు దేశంగా ప్రకటించారు. ప్రపంచమంతా ఒకేసారి సోషలిజం వస్తుందని మార్క్స్, ఏంగెల్స్‌లు అన్న మాటను సవరించి ఒకదేశంలో విడిగా కూడా సోషలిజం సాధించవచ్చు అని లెనిన్ ప్రకటించాడు. అలాగే మావో కూడా అనేక కొత్త భావనలతో చైనా విప్లవాన్ని ముందుకు నడిపి విజయం సాధించాడు.



ఒక దేశంలో విడిగా సోషలిజం సాధించడం సాధ్యమైనట్టే ఒక పల్లెలో, ఒక ఫ్యాక్టరీలో విడిగా సోషలిస్టు సంబంధాలు, పరిణామాలు సాధ్యమే అని అటు తర్వాత అనేక దేశాలు, ప్రభుత్వ ఆధ్వర్యంలోని పరిశ్రమలు నిరూపించాయి. అలా సంఘటితరంగం సమాజం మొత్తం మారకపోయినా సోషలిస్టు సమాజంలో లభించే సౌకర్యాలను అన్నిటినీ పొందగల్గుతున్నాయి. రాజకీయ అధికారం ఒకటే ఇంకా అందుకోలేదు. అది ఓట్ల ద్వారా సాధించుకునే కృషి కూడా అనేక దేశాల్లో మొదలైంది.

ఇలా మార్క్సిజం సిద్ధాంతాలు, కార్యక్రమాలు ఎన్ని మార్పులకు లోనైనప్పటికీ మార్క్సిజం పేరిటే కొనసాగాయి. మార్క్సిజం అలా ప్రపంచ వ్యాప్తంగా ప్రభావితం చేసింది. ప్రజాస్వామ్య దేశాలు మిశ్రమ, ఆర్థిక వ్యవస్థ ద్వారా, సార్వత్రిక, వయోజన ఓటు హక్కు ద్వారా సోషలిజం, సమానత్వం, సమాన అవకాశాలు ఆదర్శంగా అనేక సౌకర్యాలను, సంక్షేమపథకాలను అమలులోకి తెచ్చాయి. ప్రజలందరినీ రాజకీయ వ్యవస్థలో భాగస్వామ్యం చేశాయి. కార్మికవర్గమే ప్రభుత్వాన్ని నడపాలి అనే భావన నుండి ప్రజలందరూ కలిసి ప్రభుత్వాన్ని ఎన్నుకోవాలి అనే సిద్ధాంతం, దృక్పథం ప్రపంచ వ్యాప్తంగా అనేక దేశాల్లో ఆచరణలోకి వచ్చింది.

ఈ దశలో మార్క్సిజం పుట్టిన తరువాత జరిగిన పరిణామాలను, అనుభవాలను, సిద్ధాంతాలను అన్నిటినీ కలుపుకొని తిరిగి మరొక బలమైన ఏకసూత్రతతో సమన్వయించ వలసి ఉన్నది. అది మొదలు కావలసి ఉన్నది. రష్యాలో సోషలిస్టు ప్రభుత్వం పోయి 13 దేశాలుగా విడిపోయి ప్రజాస్వామ్య ప్రభుత్వాలు 1985 నుండి ఏర్పడ్డాయి. అప్పటి నుండి అనేక సిద్ధాంతాలు, పరిశీలనలు, సంశ్లేషణలు వేగం పుంజుకున్నాయి. అయితే ఏవీ మార్క్సిజం అంత సమగ్రంగా అన్నింటినీ సమన్వయించే ప్రత్యామ్నాయంగా అప్‌డేట్‌గా రూపొందలేకపోయాయి.

**భ్రమలు - వాస్తవాలు - కొత్త సూత్రాలు**

ఒకే ఆలోచన ఆయా నిర్దిష్ట అంశాలను బట్టి ఒక్కో శాస్త్రం పేరు ధరిస్తూ ఉంటుంది. శాస్త్రాల పేర్లు సౌలభ్యం కోసం పెట్టుకున్నవే. ప్రతి మనిషికీ ఓ పేరు పెట్టుకోవడం పర్టికులర్‌గా గుర్తుంచుకోవడానికే. 'ఆలోచన' అన్ని శాస్త్రాల్లోకి విస్తరిస్తుంది. ఉదా॥కు...

18వ శతాబ్దంలో యూరపులో పుట్టిన "వర్గపోరాటం" అనే ఆలోచన పలు శాస్త్రాల్లోకి విస్తరించింది. చరిత్రకు విస్తరించినపుడు దాన్ని చారిత్రక భౌతికవాదం అన్నారు. రాజకీయార్థిక శాస్త్రాల్లోకి విస్తరించినపుడు కమ్యూనిస్టు మ్యానిఫెస్టో, క్యాపిటల్, మార్క్సిస్టు రాజకీయ అర్థశాస్త్రం అని అన్నారు. ఆంత్రోపాలజీకి విస్తరించి ఎంగెల్స్ "కుటుంబం వ్యక్తిగత ఆస్తిరాజ్యం పుట్టుక"ను చర్చించాడు. వాళ్లు వర్గాల సృష్టికి ఆస్తిహక్కు మూలం అని చెప్పారు. ఆస్తిహక్కు భావనకు మూలం ఆశ, రేపటి గురించిన అభద్రతా భావన, తోటివారితో ఆధిక్యతా ప్రదర్శన, స్వార్థం కారణాలని ప్రాచ్యతత్వశాస్త్రాలు చర్చించాయి. ఈ లోతుల్లోకి మార్క్సిస్టులు వెళ్లలేకపోయారు.

**వర్గపోరాటం అనే సిద్ధాంతం ఎన్ని శాస్త్రాలకు విస్తరించిందో...**

వర్గపోరాటం అనే ఆలోచన విస్తరించి అలంకారశాస్త్రాల్లో పీడిత వర్గ అలంకారశాస్త్రాల్ని, శ్రామికవర్గ సాహిత్యాన్ని కళలను సృష్టించింది. తత్వశాస్త్రాల్లోకి

విస్తరించి గతితార్కిక భౌతికవాదంగా ప్రాచుర్యం పొందింది. ఆచరణలో భౌతికవాద ప్రాపంచిక దృక్పథమైంది. రాజకీయాల్లో సమాజానికి అగ్రనేత పార్టీ అనే ఆధిపత్యానికి మూలమైంది. తన భావాలపట్ల ఎనలేని ఆస్తిహక్కు భావనకు లోనైంది. మానవీయ భావాలను తాను మాత్రమే గుత్తకు తీసుకున్న ఆధిక్యత ప్రబలజేసింది. చివరకు తోటివారితో కల్సి పనిచేయడంలో వచ్చే భిన్నాభిప్రాయాల్ని ఐక్య కృషి కోసం సర్దుబాటు చేసికోవడాన్ని నిరాకరించి పార్టీలోనూ ఘర్షణే ప్రాథమికం అని తనకుతానే వందలవేల పార్టీలుగా విచ్ఛిన్నమైంది. ప్రపంచకార్మికులారా ఏకం కండి అని చెప్తూ తామే విడిపోయారు! ఘర్షణ - వర్గ పోరాటం అనే ఒక ఆలోచన నుండి ఇలా ఎన్నో శాస్త్రాల్లో మార్పులు చేర్పులు జరిగాయి.

### తనకొరకు తాను కొనసాగే సోషలిజం

ఆటవిక గణతెగల జీవితం "తనకొరకు తాను" ఐక్యతతో ఉంటూ యితరులతో తటస్థంగా ఉంది. ఘర్షణనూ చేపట్టింది. బౌద్ధం "తనకొరకు తాను" గాకుండా "యితరులకొరకు తాను" పనిచేయడం కోసం ఐక్యత, సంబంధం ప్రాథమికం అంది. ప్రజలతో సంబంధం కోల్పోయినకొద్దీ బౌద్ధం అదృశ్యమైంది. ప్రజల జీవితాల మూలమూలల్లోకి చొచ్చుకుపోతూ బ్రాహ్మణవాదం విస్తరించింది.

ప్రాచీన భారతదేశంలో అలంకార శాస్త్రాలు, ఆయుర్వేద వైద్య శాస్త్రాలు, భావవాదంపై గెలుపుజెండాను ఎగరేశాయి. అలంకార శాస్త్రాలు మనిషిని, హృదయాన్ని ప్రాథమికం చేయకపోతే సాహిత్యం కళల అవసరమే ఉండదు. అంతా కర్మపాకం వల్ల జరుగుతుందంటే వైద్యం అవసరవే రాదు. అందువల్ల ఈ రెండు రంగాలు తాత్వికరంగంలోని భావవాదాన్ని కాదని ముందుకుసాగాయి. జర్మనీలో సైతం హెగెల్ మార్క్సుల కన్నాముందే డాక్టర్ హానిమాన్ వైద్యశాస్త్రంలో గతితార్కిక సూత్రాలను కొనుగొన్నాడు. ఆచరించి చూపాడు. కానీ హెగెల్ గానీ, మార్క్సు, ఎంగెల్స్‌లు గానీ ఎంతో నైపుణ్యంతో అభివృద్ధి పరిచిన హోమియో వైద్య పితామహుడు డా॥ హానిమాన్ "ఆలోచనల" గురించి ప్రాధాన్యతతో చర్చించినట్టు కనపడదు. అతడు జీవితంలో భాగంగా గతితర్క ఆలోచనకు చేరాడు. హెగెల్, మార్క్సు, ఎంగెల్స్‌లు పుస్తకాలు చదివి ఆ భావనకు చేరుకున్నారు. గతితర్కాన్ని జర్మని వైద్యుడు డా॥ హానిమాన్ నుండి స్వీకరించి ఉంటే జీవితమంత వాస్తవికంగా ఉండేది.

హోమియోపతి వైద్యవిధానం ద్వారా శరీర ధర్మాలను గురించి కనుక్కొన్న ఒక కొత్త విషయం ఆసక్తి కలిగిస్తుంది. ఒక మందు రోగం లేని వారికి ఇస్తే రోగ లక్షణాలు కనపడతాయని, రోగ లక్షణాలు వున్న వారికి ఇస్తే ఆ రోగం తగ్గుతుందని హానిమాన్ గమనించాడు. ఇది సామాజిక శాస్త్రాలకు వర్తింప చేస్తే అనేక ఆశ్చర్యకరమైన విషయాలు వెలికి వస్తాయి. ఉదాహరణకు యూరప్‌లో పెట్టుబడిదారీ విధానం అనే వ్యవస్థ సృష్టించిన రోగాలకు కార్మికవర్గ నియంతృత్వం మార్క్సిజం మందుగా పని చేస్తుంది. ఆ రోగ లక్షణాలు లేని సమాజాల్లో రోగ లక్షణాలను సృష్టిస్తుంది. అనగా లేని అవలక్షణాలను సృష్టిస్తుంది. తిరిగి దానికి పరిష్కారం లేదు. మందు లేదు. బహుశా అందుకేనేమో రష్యాలో దశాబ్దాల అనుభవం తర్వాత మార్క్సిజాన్ని, కార్మికవర్గ నియంతృత్వాన్ని



మందుగా పని చేయడం లేదని ప్రజాస్వామ్య వ్యవస్థను, బహుళ పార్టీ వ్యవస్థను ఏర్పర్చుకున్నారు. గిరిజన ప్రాంతాల్లో భూస్వామ్య సమాజాల్లో మార్క్సిజం ఇలా రోగాలను, రోగలక్షణాలను సృష్టిస్తుందని హానిమాన్ కనుక్కొన్న సూత్రం ద్వారా అర్థం చేసుకోవచ్చు.

### తర్కం ద్వారా సాధించిన సోషలిజం

మార్క్సిజం మొదటినుండి వాస్తవ సత్యాల కన్నా తార్కిక సత్యాలకే ప్రాధాన్యత యిచ్చింది. అది ఎంతగా తార్కిక సత్యాలపైనే ఆధారపడిందంటే - అసలు యింకాపుట్టనే పుట్టని ఊహల్లోని కమ్యూనిజాన్ని తార్కికంగా నిరూపించింది. ప్రయోగాల ద్వారా నిర్ధారణ కాకుండానే తర్కం ద్వారా సాధించిన 'తార్కిక సోషలిజం' (లాజికల్ సోషలిజం)ను 'శాస్త్రీయ సోషలిజం' అని తమకు తాము ప్రకటించుకున్నారు. అంతకుముందు ఇదే పని చేసిన వారిని ఊహాసోషలిస్టులు అని పేరు పెట్టారు. తాము సైంటిఫిక్ సోషలిస్టులని ప్రకటించుకున్నారు. తార్కిక సత్యాల్తో కమ్యూనిస్టు మ్యానిఫెస్టో రాసి, ప్రచారం చేసి పుట్టకముందే పెట్టిన ఆదర్శమైన "కమ్యూనిజం" పేరును శాస్త్రీయమంటూ నిజమని భ్రమింపచేసారు.

సత్యాలు వేరు. తార్కిక సత్యాలు వేరు. తర్కంతో, సాక్ష్యాలతో తిమ్మిని బమ్మి చేయవచ్చు. బమ్మిని తిమ్మి చేయవచ్చు. కోర్టుల్లో, పంచాయతీల్లో, రాజకీయ పార్టీల పరస్పర విమర్శలో కూడా తిమ్మిని బమ్మి చేయడాన్ని, బమ్మిని తిమ్మి చేయడాన్ని చూస్తూనే ఉన్నాం. తద్వారా సత్యం మారదు. సత్యం విలువలు మార్చబడుతాయి. జాన్సన్ అనే అతని పేరును మార్చి విల్సన్ అని పిలిచినా అతడు అతడే. నిర్మలను పేర్లు కుదరలేదని అత్తగారింట్లో శ్రావ్య అని మార్చినా ఆమె ఆమెనే.

### తార్కిక సత్యాలు చేసే పని

తార్కిక సత్యాలు సత్యాన్ని అణచివేస్తాయి. సత్యంపై తార్కిక సత్యాలు ఆధిపత్యం చలాయిస్తూ సత్యాల్ని పాలితులుగా మార్చుతాయి. రాజకీయాధికారం కోసం, సమాజ పరిణామం కోసం చేసే తార్కిక సిద్ధాంతాలు, సూత్రీకరణలు సమాజాన్ని, సత్యాల్ని పాలితులుగా మార్చుతాయి. తార్కిక సత్యాలు పాలకవర్గంగా మారుతాయి. రాజకీయ, సామాజిక సిద్ధాంతాలు, సూత్రీకరణలు, భవిష్యత్తు ఊహలు, సమాజంపై ఆధిపత్యం చెలాయించాలని చూస్తాయి. అనుచరులను, ఆచరణను పెంచుకుంటూ విస్తరించడంద్వారా ప్రచారంలోకి రావడంద్వారా ఇవి ఆ పని చేస్తాయి.

### భ్రమలు, ఊహలు అందంగా ఉంటాయి

భ్రమల్లో, ఊహల్లో, కలల్లో బతక్కపోతే జీవితంగానీ పార్టీల ఎన్నికల ప్రణాళికలుగానీ ఆకర్షించడం సాధ్యంకాదు, ఎందువల్ల? వాస్తవాల కన్నా ఊహలు ఎపుడూ అందంగా ఉంటాయి. ఊహలు మనకిష్టమైన రీతిలో ఉంటాయి. వాస్తవాలు అలా ఉండవు. అందువల్ల రేపటి గురించిన కలలు, సోషలిజాలు. ఎన్నికల ప్రణాళికలు, ప్రభుత్వ హామీలు, స్వర్గం, ఊహాపూరితవ్యవస్థలు అందంగానే ఉంటాయి.

ఊహాప్రేమలో జీవించినప్పుడు గొప్ప ఉత్తేజంతో సాహిత్యం రాసినవారిని నేనెరుగుదును. వారిలో పెళ్ళయ్యాక వారి సాహిత్య సృజన అంతరించింది.

ఉత్తేజపూరిత ఊహాస్థానే జీవితం వారిని వాస్తవంలోకి తెచ్చింది.

**మార్క్సిజం కనుక్కున్న కొత్త ప్రకృతిసూత్రాలు ఏమిటి?**

మార్క్సిజం క్రోడీకరించిన ప్రకృతి సమాజ చలన సూత్రాలను అనుసరించి సైన్సులో కనుక్కొన్న కొత్తసూత్రాలుగానీ, అభివృద్ధిగానీ ఏదైనా ఉందాఅనే ప్రశ్న పుట్టింది. సైంటిస్టులు తమ సైంటిఫిక్ పరిశోధనల ద్వారా వీటిని తిరిగి కనుగొనగలరా అనే ప్రశ్నకు కూడా జవాబు కోరారు. వీటికి జవాబులు దొరకని స్థితి. ప్రకృతి పరమైనదని, సమాజ పరమైనదని చెప్పే 'నెగేషన్ ఆఫ్ నెగేషన్' అనే సూత్రీకరణను ప్రపంచంలోని ఏ సైంటిస్టూ ఒక సూత్రంగా సిద్ధాంతంగా డార్విసిజమ్ లాగానైనా చెప్పలేదు. అవి సోషల్ థీరిస్ తప్ప అనగా సామాజిక సిద్ధాంతాలు తప్ప ప్రకృతి సూత్రాలు కావు. సైన్స్ సూత్రాలు కావు. అన్ని సిద్ధాంతాల్లాగే మార్క్సిజం కూడా ఒక సామాజిక, రాజకీయ సిద్ధాంతం.

**హెగెల్‌ను సగం తీసుకున్న మార్క్సిస్టు గతితర్కం**

హెగెల్ తన గతితర్కంలో ఐక్యత ఘర్షణల ద్వారా పాతదిపోయి కొత్తది వస్తుందని ఒక మాటన్నాడు. దాన్నే మార్క్సిజం తన మూలసిద్ధాంతం చేసుకొంది. "వర్గపోరాటం" అనే భావనకూడా దాన్ని ఉద్దేశించిందే. దీనివల్ల జరిగిపోయిన నష్టం అపారం. ఏటుకూరి బలరామమూర్తి ఒక విషయం సెలవిచ్చారు. ఐక్యత ఘర్షణలద్వారా పాతదిపోయి కొత్తదిరావడం ఒక్కటేకాదు - పాతదీ కొత్తదీ రెండూ ఉంటాయి. కల్సి జీవిస్తాయి అని హెగెల్ చెప్పిన మరో సూత్రాన్ని పట్టించుకొని ఉంటే మార్క్సిజం యింత కరుడుగట్టి కొడిగట్టి ఉండేదికాదని వాపోయారు.

కోడి గుడ్లను పొదుగుతుంది. పిల్లలయ్యాక తన రెక్కల కింద గద్దలకు ఎరకాకుండా కాపాడుతుంది. ఇలా కోడిగుడ్డు పిల్ల అయ్యాకకూడా తల్లికోడి నిక్షేపంగా ఉంటూ తన పిల్లల్ని సాదడం చూస్తున్నాం. కాని మార్క్సిస్టులు కోడిగుడ్డు అభావం చెంది కోడిపిల్ల పుట్టింది అని అంటారు. కోడిగుడ్డే పిల్లగా మారింది. తల్లికోడే దాన్ని పొదిగి రెక్కల కింద పొదుగుకొని కాపాడుకుంది. ఈ మొత్తం పరిణామాన్ని లెక్కలోకి తీసుకోకుండా కోడిగుడ్డు ఒక్కటే విడిగా ఉన్నట్లు చర్చించి అది అభావం చెందినట్లు నెగేషన్ ఆఫ్ నెగేషన్ సూత్రాన్ని తయారు చేశారు.

**బౌద్ధ గతితర్కం**

బౌద్ధ గతితర్కం గురించిన రెండు సంపుటాలను 1935లో స్టాలిన్ హయాంలో స్టేర్‌బాట్‌స్కీ సంపాదకత్వంలో బుద్ధిస్టు లాజిక్ పేరుతో వెలువరించారు. చెట్టు నుండి పుట్టిన విత్తనం మొక్కై చెట్టవుతుంది. తల్లి చెట్టు వుంటుంది. తల్లిదండ్రులు పిల్లల్ని కంటారు. వాళ్లే పెంచి పోషిస్తారు. మనిషి తన సంతానంకోసం చేయని త్యాగం లేదు. ఇలా పాతదే కొత్తదాన్ని పెంచి పోషిస్తుంది. ఇది ప్రకృతిసూత్రం. సామాజిక సూత్రం కూడా. దీన్నే మార్క్సిజం వదిలేసింది.

బౌద్ధ గతితర్కం ప్రతీత్య సముత్పాదం (పరస్పర ఆధార ఉత్పన్నత). పరస్పర సంబంధాల్లో పలుకోణాలలో పరిణామం జరుగుతుంది. ఏకైక కారణ వాదాన్ని అనగా ప్రధాన వైరుధ్య వాదాన్ని కాకుండా సమస్త కోణాల్ని లెక్కలోకి తీసుకొంటుంది. కర్ణుడి చావుకు కారణాలు ఎన్నో అనే సామెత బౌద్ధగతి తర్కానికి ఉదాహరణగా చెప్పవచ్చు.



ఇలా సమస్త సంబంధాలను పరిణామాలను బౌద్ధగతితర్కం పరిశీలిస్తుంది.

మార్క్సిజం మూడు అంశాల ప్రాతిపదికతో కూడుకొని ఉంది. (1) గతితార్కిక భౌతికవాదం, చారిత్రక భౌతికవాదం (2) శాస్త్రీయ సోషలిజం (3) మార్క్సిస్ట్ అర్థశాస్త్రం. వీటిని పరిశీలిద్దాం.

రాజకీయ అర్థశాస్త్రంలో మార్క్సిజం రెండు అంశాల్ని వదిలేసింది. హెగెల్ గతితర్కాన్ని ఆసరా చేసికొని మార్క్సు శ్రమశక్తి, పెట్టుబడి, అదనపు విలువలను క్యాపిటల్‌లో చర్చించాడు. పెట్టుబడి అనేది థీసిస్, శ్రమశక్తి ఆంటీథీసిస్, అదనపు విలువ అనేది సింథసిస్, ఇదీ క్యాపిటల్‌లో అనుసరించిన పద్ధతి.

అదనపు విలువ పెరుగుదలకు శ్రమశక్తితో పాటు సైన్సు, నిర్వహణ సామర్థ్యం, ఇంటిలోని ఇల్లాలి శ్రమశక్తి పునాది. శ్రమశక్తి అనేది ఒక్కటే అదనపు విలువను సృష్టించే ఇంజన్ డ్రైవర్ కాదు. అదనపు విలువను సృష్టించే యింజన్ డ్రైవర్ సైన్సు, ఇల్లాలి శ్రమశక్తి, నిర్వహణసామర్థ్యమే. శ్రమశక్తి ఒక్కటే అదనపు విలువకు మూలమైతే పరిశ్రమల నష్టాలకు తద్వారా జరుగుతున్న నేటి ప్రయివేటీకరణకు కార్మికులే కారణం అని చెప్పవలసి ఉంటుంది. ఇంటిలోని ఇల్లాలి శ్రమశక్తి వంటపిల్లల పెంపకం లైంగిక అవసరాలు మొదలైనవన్నీ అదనపు ఉత్పత్తికి దోహదపడుతున్నవే అని ఫెమినిజం నిర్ధారించింది. అందువల్ల మార్క్సిజం చెప్పిన అదనపు విలువ సూత్రం అనేక సవరణలకు లోనవుతుంది. కార్మికవర్గ నాయకత్వంలో ప్రభుత్వం ఉండాలనే మాట కూడా దీని ద్వారా ప్రశ్నార్థకమవుతుంది. కాలం తీరిపోయింది. స్త్రీలు కూడా ఇంట్లో చేసే శ్రమ వక్తి పెట్టుబడిదారీ ఉత్పత్తి పెంపకంలో అదనపు విలువలో భాగం కనుక సమస్త స్త్రీలు కూడా తమ నాయకత్వంలో ప్రభుత్వాన్ని ఏర్పర్చవలసి వుంటుంది. అదే వయోజన ఓటు హక్కు అని చెప్పవచ్చు. ఇలా ఫెమినిజం తెచ్చిన అనేక సిద్ధాంత ఆవిష్కరణలు ప్రజాస్వామ్యాన్ని అనేక సిద్ధాంతాలను పరిపుష్టం చేశాయి. మార్చాయి.

వర్గపోరాటం అనే దృక్పథం కూడా పురుషాధిపత్య భావజాలంలో భాగమే అని పురుషాధిపత్యాన్ని ప్రధానం చేసేదే అని ఫెమినిస్టులు పేర్కొన్నారు. కుటుంబ జీవనానికి, పిల్లల పెంపకానికి, వృత్తుల సంరక్షణకు స్త్రీలు పాల్గొనడానికి ఇంటిపని, వంటపని చేసుకోడానికి అణువుగా వుండే ఉద్యమాలు, స్త్రీలే నాయకత్వంలోకి రాగలిగే ఉద్యమాలు అవసరం తప్ప నేటి వర్గపోరాటాలు పేరిట చేస్తున్నవి పురుషాధిపత్య పోరాటాలే అని ఫెమినిస్టులు నిర్ధారించారు. తద్వారా శాంతియుత పోరాటాలే అవసరం అని చెప్పినట్టయింది.

నడకతో గంటకు నాలుగు కిలోమీటర్లు నడిస్తే నలభయి కిలోమీటర్లకు పదిగంటలుపడుతుంది. బస్సులో వెళ్తే గంట. సైన్సు శ్రమకాలాన్ని తగ్గించడం వల్ల అదనపు విలువ పెరగడం చూడవచ్చు. పోడు వ్యవసాయానికి, ఆధునిక వ్యవసాయానికి మధ్య తేడా సైన్సు అభివృద్ధే, కాని ఇద్దరి శ్రమకాలం ఒక్కటే, రెంటి మధ్య అదనపు విలువలో తేడాకు సైన్సు, నిర్వహణ సామర్థ్యమే పునాది.

**అదనపు విలువలో సైన్సు పాత్ర - స్త్రీల పాత్ర**

అందువల్ల అదనపు విలువ సైన్సును అభివృద్ధి పరుస్తున్న మొత్తం సమాజానికి

చెందినది. రాజకీయ అర్థశాస్త్రంలోని మార్క్సిజం శ్రమశక్తి, పెట్టుబడి, అదనపు విలువ అనే మూడింటిని చక్కగా చర్చించింది. అయితే మరికొన్ని సిద్ధాంతాలు, ఫెమినిజం ఇతర అర్థశాస్త్రాలు, మేనేజ్‌మెంటును, నిర్వహణ సామర్థ్యాన్ని సైన్సును నిరంతరం అభివృద్ధి పరుచుకుంటూ ముందుకు సాగాయి.

నేటి పారిశ్రామిక అర్థశాస్త్రాల్లో ఆరు అంశాలు ప్రాథమికం 1, సైన్సు 2. పెట్టుబడి 3. శ్రమశక్తి 4. నిర్వహణ సామర్థ్యం 5. ప్రజల అభిరుచులు, అవసరాలు 6. ఇంటిలోని వంటపని, పిల్లల పెంపకం, ఇల్లాలి శ్రమశక్తి, 7. అదనపు విలువ.

**శ్రమశక్తి ముడిసరుకైపోయిన తీరు**

మొదటి అయిదింటిననుసరించే ఆరోదైన అదనపు విలువ ఉత్పన్నమవుతుంది. మిగతావాటి ప్రాధాన్యత పెరిగి పెరిగి శ్రమశక్తి అనేది కొందరి ప్రకారం "ఒక ముడిసరుకు" స్థాయికి లేబర్ అడ్డలని కూలీల స్థాయికి కుదించుకుపోయింది. ముడిసరుకే సరుకు ఉత్పత్తికి మూలమైనప్పటికీ అది దానికదే స్వతంత్రంగా ఏమీ చేయలేదు. నిర్వహణ సామర్థ్యం, నాయకత్వ సామర్థ్యం ప్రాధాన్యతను గుర్తించకపోతే లెనిన్, మావో, గాంధీ, అంబేద్కర్ తదితరులను గొప్పవాళ్ళుగా గుర్తించే పునాదే అదృశ్యమవుతుంది. నిర్వహణ సామర్థ్యమే నాయకుల గొప్పదనానికి గీటురాయి. అలాగే ఎన్నో సంస్థలు, పరిశ్రమలు శిథిలమైపోయాయి. టాటా, బిర్లా, రిలయన్స్ అంబానీలు ఎదుగుతూ వస్తున్నారు.

**తార్కిక సత్యాలు - విశ్వాసాలు**

మార్క్సిజం చెప్పే గతితర్కం సత్యం కాదు. అవి తార్కికసత్యాలు మాత్రమే. వాటిని విశ్వసిస్తే విశ్వాసాలవుతాయి - ప్రాపంచిక దృక్పథం అవుతుంది. సోషలిజం, కమ్యూనిజం అనే ఊహలు, కలలు, సూత్రాలు, ఆధునిక పంచాంగం, ఆధునిక జ్యోతిషం, హస్తసాముద్రికం వంటివి. పంచాంగం, వాస్తుజ్యోతిష్యం కూడా తర్కంతో తమను విశ్వసించాలంటాయి. విశ్వసిస్తే ప్రాపంచిక దృక్పథం అవుతుంది. తార్కికసత్యాలన్నీ విశ్వాసాలుగా మార్చి ఆచరించడం కోసమే. అవి వాస్తవసత్యాలు మాత్రం కావు.

మనకు సమాజం ప్రాథమికం. మనిషి ప్రాథమికం. వాస్తవసత్యాల ఆధారంగా తార్కికసత్యాలను మార్చుకోవాల్సి ఉంటుంది.

కానీ తార్కికసత్యాల సాక్ష్యాలు వాదనాపటిమద్వారా నిర్ధారింపబడిఉంటాయి గనక ఆ హంగులేవీ సమకూర్చుకోనవసరం లేని వాస్తవసత్యాలు వాటిముందు వెలవెల పోతుంటాయి. తద్వారా తార్కిక సత్యాలకనువుగా వాస్తవసత్యాలు ఓడింపబడుతూ అసత్యాలుగా ప్రచారం చేయబడే ప్రమాదం ఉంటుంది.

**ఎవల్యూషన్ - రెవల్యూషన్**

మార్క్సిజంలో రెవల్యూషన్, విప్లవం, నెగేషన్, నెగేషన్ ఆఫ్ నెగేషన్ అనే పదాలకు అత్యంత ప్రాధాన్యత ఉంది. ఘర్షణ, వర్గ పోరాటం అనే పదాలకు కూడా అంతే ప్రాధాన్యత వుంది. లెనిన్ వస్తువులోని రెండు విరుద్ధ అంశాలను చర్చిస్తూ ఇలా అంటాడు.

1. ఐక్యత - ఘర్షణ



2. ప్లస్ - మైనస్
3. ఋణ విద్యుత్తు - ధన విద్యుత్తు
4. రసాయన సంయోగం - విచ్ఛిత్తి
5. సామాజిక రంగంలో వర్గపోరాటం

ప్రతి అంశంలో రెండు విరుద్ధ అంశాలను పేర్కొని సామాజిక రంగంలో ఒకే అంశాన్ని పేర్కొనడం పైన చూడవచ్చు. రెండవ అంశం ఏమిటి? సామాజిక రంగంలో వర్గాల మధ్య పోరాటం ఒకటైతే, రెండవది వర్గాల మధ్య ఐక్యత. ఐక్యత-ఘర్షణ చెప్పిన తరువాత సామాజిక రంగంలో ఉండే ఐక్యతను వదిలేయడం తమ ఉద్యమ అవసరాల కోసం చేసి వుంటారు. కాని సిద్ధాంత చర్చల్లో అది ఎంత పెద్ద పొరపాటు? ఐక్యత - ఘర్షణల్లో ఘర్షణ పోరాటం గాను, ఫలితాలు రెవల్యూషన్‌గాను కనపడతాయనుకుంటే ఐక్యతలో ఐక్యత సామాజిక వర్గాల పొందికగాను, సహజ వనరులను, ఫలితాలు ఎవల్యూషన్‌గాను, పరిణామాత్మకంగాను ఉంటాయని చెప్పవచ్చు. పరిణామాత్మక ఎవల్యూషన్‌ను పాలవిప్లవం, గ్రీన్‌రెవల్యూషన్, సంక్షేమ పథకాలు మొదలైన వాటి ఉదాహరణలతో చెప్పవచ్చు.

**సమాజంలో ఎవల్యూషన్ ఉంటుంది**

సమాజం నిరంతరం పరిణామం చెందుతుంది. కొత్త సిద్ధాంతాలు, కొత్త ఆవిష్కరణలు సమాజాన్ని నిరంతరం మార్చుతుంటాయి. కొత్త పరిపాలన, సంస్కరణలు కూడా సమాజాన్ని పరిణామ దశలో ముందుకు నడిపిస్తుంటాయి. మనిషి జీవిత దశలో కూడా పరిణామమే కనబడుతుంది. ఎప్పుడు బాల్యం నుండి యవ్వనంలోకి యవ్వనం నుండి వృద్ధాప్యంలోకి మలుపు తిరిగిందో రెవల్యూషన్‌లాగా చెప్పడం కుదరదు. అది పరిమాణాత్మకంగా సాగుతుంది.

నిరంతరం చైతన్యంగా ఉంటే ఎవల్యూషన్. అప్పుడప్పుడు నిద్రలేచి జూలు విదిలిస్తే రెవల్యూషన్. ప్రేమ కరుణ స్నేహం సహృదయత ఉంటే మనుషుల మధ్య వైరుధ్యం అవసరం రాదు. ఐక్యతే పరమావధి అవుతుంది. అదే సామాజిక జీవితం. అదే మానవీయ సంస్కృతి.

**విత్తు మొలకై, చెట్టుకావడం ఎవల్యూషనే తప్ప నెగేషన్ కాదు, రెవల్యూషన్ కాదు**

చెట్టు నుండి పుట్టిన విత్తు మొలకై, మొక్క చెట్టయినట్టు అందరికీ తెలుసు. ఈ ప్రకృతి సూత్రంలో ఎవల్యూషన్ తప్ప రెవల్యూషన్ లేదు. రుతువులు కూడా క్రమాన్ని అనుసరించి వస్తుంటాయి. ఇలా చెట్టు నుండి విత్తు పుట్టి, పెరిగి తిరిగి చెట్టు కావడం, శిశువు బాలుడై, యువకుడై, వృద్ధుడు కావడం పరిణామ శీలమే తప్ప రెవల్యూషన్ కాదు. విప్లవం కాదు. మొక్క చెట్టయ్యే క్రమం ఆకస్మిక పరిణామం కాదు. బాలుడు యువకుడయ్యే క్రమం గెంతుల అభివృద్ధి కాదు. ఆగిపోయిన వాళ్ళు వేగంగా గెంతినపుడు అవి గెంతులుగా కనపడవచ్చు. ఒక ఊరికి చాలాకాలం తర్వాత వెళితే అక్కడి పరిణామాలు గెంతులా కనబడవచ్చు.

**మార్క్సిజం తాను చెప్పిన ఎవల్యూషన్ ఐక్యత సూత్రాలనే వదిలేసింది**

మార్క్సిజం ఎవల్యూషన్‌ను, పరిణామాన్ని, ఐక్యతను విరుద్ధాంశాల్లో

వదిలివేసింది. నెగేషన్, నెగేషన్ ఆఫ్ నెగేషన్, ఘర్షణ అనే వాటిని మాత్రమే తీసుకుంది. తాను చెప్పిన రెండు అంశాల్లో ఒక అంశాన్ని తానే వదిలేసింది. వాటి కార్యక్రమాల్లో ఈ లోపం కనపడుతుంది.

### పాతది వుంటుంది, కొత్తది వుంటుంది

పిల్లలు పుట్టిన తరువాత తల్లిదండ్రులు కూడా వుంటారు. వాళ్ళే పెంచుతారు. అనగా పాతది వుంటుంది, కొత్తది వుంటుంది. చెట్టు వుంటుంది. చెట్టు నుండి విత్తనమే చెట్టయిన చెట్టుకూడా వుంటుంది. ఇందులో నెగేషన్ ఆఫ్ నెగేషన్ ఏమీలేదు.

పెట్టుబడిదారీ వ్యవస్థ పోయి సోషలిస్టు వ్యవస్థ వస్తుంది అని నెగేషన్ థియరీలో చెబుతుంటారు. పెట్టుబడిదారీ వ్యవస్థనే సోషలిజాన్ని కన్నతల్లి. పెట్టుబడిదారీ వ్యవస్థ తల్లిలా అలాగే వుంది. సోషలిస్టు వ్యవస్థ పుట్టి పెరిగింది. సోషలిస్టు వ్యవస్థలో పెట్టుబడి దారీ వ్యవస్థ మారలేదు. మారిందల్లా పెట్టుబడిదారీ వ్యవస్థ మీద అధికారం మాత్రమే. పెట్టుబడిదారీ వ్యవస్థలో లిమిటెడ్ సభ్యుల, డైరెక్టర్ల నిర్వహణలో పరిశ్రమలు నడుస్తుంటాయి. ప్రభుత్వ అజమాయిషీ కూడా వుంటుంది. సోషలిస్టు వ్యవస్థలో వారి స్థానంలో మొత్తం ప్రభుత్వ అధికారమే వుంటుంది. డైరెక్టర్ల స్థానంలో పార్టీ నాయకులు వుంటారు. ఇదే నిర్వహణని భారీ పరిశ్రమల్లో, ప్రభుత్వ కార్పొరేట్ రంగంలో భారతదేశం అనుసరిస్తున్నది. ఐఏఎస్ అధికారుల స్థానంలో సోషలిస్టు ప్రభుత్వంలో పార్టీ నాయకులు వుంటారు. రష్యాలోని సోషలిస్టు వ్యవస్థ తిరిగి పెట్టుబడిదారీ, ప్రజాస్వామ్య వ్యవస్థగా మారిపోయిందని అంటున్నారు. ఇలా నెగేషన్ అనేది కాకుండా పరిణామమే సాగుతున్నది.

### ఎవల్యూషన్‌లో పాల్గొనకపోతేనే అది రెవల్యూషన్‌లా, గెంతులా కనబడతుంది

ఎవల్యూషన్‌లో పాల్గొనకపోతేనే అది రెవల్యూషన్‌లా, గెంతులా కనబడుతుంది. ఒక బట్టలుతికే పేద బాలిక చదివి తన జీవితకాలంలో వైస్ ఛాన్సలర్ కావడం, ప్రధానమంత్రి కావడం ఆమె కృషిని నిరంతరం గమనించనివాళ్లకు గెంతులా కనబడుతుంది. ఆమె ఎదుగుదలలో సహకరించే వారికి, పాల్గొన్న వారికి రోజురోజుకూ పెరుగుతున్న క్రమం పరిణామంగానే కనపడుతుంది. తల్లిదండ్రులకు, పిల్లల ఎదుగుదల పరిణామంగానే కనపడుతుంది. పదేళ్ళకొకసారి చూడవచ్చే బంధుమిత్రులకు మాత్రం అరే అప్పుడు నిక్కరేసుకుంటుండె. చీమిడి కారుతుండె. సాఫ్ట్‌వేర్ ఇంజినీర్ అయిండా? నెలకు 50వేలు సంపాదిస్తుండా? అని ఆశ్చర్యపోతుంటారు. అలాంటి వాళ్ళకు ఆ పిల్లల ఎదుగుదల రెవల్యూషన్‌గా సడన్ మార్పుగా కనపడుతుంది. కాని తల్లిదండ్రులకు అదంతా రోజువారి పరిణామంగా కనపడుతుంది.

అలాగే అరె వాడు నా దగ్గర ఛాయ్, టిఫిన్‌లకు పైసలు అడక్కపోతుండె. అంత పెద్దకాంట్రాక్టర్ అయిండా? అంతపెద్ద రచయిత అయిండా? అంత పెద్ద మంత్రి అయిండా? అని ఆశ్చర్యపోవడంలో అతనికి తెలియని పరిణామాలు వున్నాయి తప్ప అది రెవల్యూషన్ కాదు. అందువల్ల ఎవరైనా విప్లవం, రెవల్యూషన్ అంటున్నారంటే అవి వారికి తెలియని పరిణామాలు జరిగిన తరువాత వచ్చి ఆశ్చర్యపోయే బాటసారుల వంటివారు అని చెప్పవచ్చు.



### నిరంతరం చైతన్యంతో ఉద్యమిస్తే విప్లవం అవసరం వుంటుందా?

నిరంతరం చైతన్యంతో ఉంటే విప్లవం అవసరం రాదు. ఎప్పుడూ నిద్రపోయి అప్పుడప్పుడు ఎవరో లేపితే లేవడం విప్లవం. విప్లవం వెనకబాటు చైతన్యానికి నిదర్శనం. ఎపుడూ తెలివితో ఉంటే అన్యాయాలు ఒక కుప్పగా ఎందుకు పేరుకుపోతాయి? ఎప్పటికపుడు వాటిని పరిష్కరించుకుంటూ సాగుతారు.

### నెగేషన్ ఆఫ్ నెగేషన్ ఒక పరిణామమే

భావవాదానికి, భౌతిక వాదానికి మధ్య విభజన రేఖ గీయడం అంత సులభం కాదు. అలాంటి విభజన రేఖ పునర్జన్మ – ఆత్మ సిద్ధాంతం, నెగేషన్ ఆఫ్ నెగేషన్ సూత్రానికి మధ్య కొంత ఉంది. మరో మాటలో చెప్పాలంటే భావ వాదాన్నించి భౌతికవాదాన్ని ఎదిగించే మౌలికసూత్రం నెగేషన్ ఆఫ్ నెగేషన్ / సబ్లేషన్. అయితే నెగేషన్ పరిమాణాత్మకంగా ఉంటుంది. నెగేషన్ ఆఫ్ నెగేషన్ ఒక పరిణామమే.

### నెగేషన్ ఆఫ్ నెగేషన్ అర్ధసత్యమే

నెగేషన్ ఆఫ్ నెగేషన్ అనే సూత్రం అర్థ సత్యమే. పాతది వుంటుంది. కొత్తదీ కొనసాగుతుంది అనేది మరో సత్యం. దీన్ని హెగెల్ వివరంగానే చెప్పాడు. కాని మార్క్స్ హెగెల్ చెప్పిన సబ్‌లేషన్‌ను నెగేషన్‌గా చెప్పి రెండో సూత్రాన్ని ఎందుకో వదిలేశారు. దాని పర్యవసానాలు ప్రపంచ ఉద్యమాల్లో అనేక లోపాలకు దారి తీశాయి. ఏటుకూరి బలరామమూర్తి జీవితచరమాంకంలో గుర్తించినట్టు పాతది, కొత్తది రెండు కొనసాగవచ్చు. పాతది పూర్తిగా అదృశ్యం కాకపోవచ్చు. పైనే చెప్పినట్టు ఉదాహరణకు చెట్టునుండి పుట్టిన విత్తనం తిరిగి మొక్కై చెట్టవుతుంది. తల్లితండ్రులుండగానే పిల్లలు పెరుగుతుంటారు. తల్లితండ్రుల సంరక్షణలోనే పిల్లలు పెరుగుతుంటారు. అందువల్ల కొందరు నెగేషన్ ఆఫ్ నెగేషన్ సూత్రంపేరిట పాతదిపోయి కొత్తదివస్తుంది అనడం అర్థ సత్యమే. అసలు విషయం ఏమంటే విత్తనమే మొక్కగా మారుతుంది. మొక్కే వృక్షంగా మారుతుంది. శిశువులే పిల్లలుగా, పిల్లలు యువకులుగా, యువకులు వృద్ధులుగా మారుతారు. ఇందులో నెగేషన్ ఆఫ్ నెగేషన్ అంటూ ఏమీలేదు. పరిణామమే వీటిమధ్య కొనసాగుతున్నది. అయితే కొందరు మార్క్సిస్టులు వీటిని అంగీకరించక పదాల మధ్య దాక్కుంటారు. సత్యాలను గుర్తించడానికి భయపడుతుంటారు. మొత్తం మార్క్సిజం ఫిలాసఫీపై పట్టులేకపోవడం, అవి పుట్టిన ప్రాతిపదికలను తెలుసుకోకపోవడం వల్ల ఈ భయం ఏర్పడుతుంది. ఏదైనా దాని పుట్టుపూర్వోత్తరాలను తెలుసుకొన్నప్పుడే దాని సమగ్ర స్వరూపం, పరిణామం తెలుస్తుంది.

### మార్క్సిజం పరిణామాలు

మార్క్స్, ఎంగెల్స్‌లు మహోన్నత స్వేచ్ఛాయుత సమాజాన్ని, వ్యక్తి స్వేచ్ఛను అభిలషించారు. వారి స్వేచ్ఛా భావనలు, సమసమాజ ఊహలు ప్రపంచాన్ని ఆకర్షించాయి. 1862లో కార్మికులు నడిపిన ఫ్రెంచి విప్లవం రెండు నెలలు విజయవంతంగా కొనసాగి, ప్రభుత్వాన్ని నడిపి సైనిక తిరుగుబాటుతో కూలిపోయింది. ఆ విప్లవాన్ని మొదట తొందరపాటు అని వ్యతిరేకించిన మార్క్స్, ఎంగెల్స్‌లు అది కూలిపోగానే ఆ విప్లవం చేసిన వారికన్నా ఎక్కువగా సొంతం చేసుకుని అది

కూలిపోవడానికి గల కారణాలను “18వ బ్రూమైరి గుణపాఠాలు” గ్రంథంలో విశ్లేషిస్తూ కార్మికులకు ఒక సొంతపార్టీతోపాటు, సొంత సైనిక విభాగం ఉండాలని ప్రతిపాదించారు. లెనిన్, మావో తదితరులు సొంత సైనిక విభాగాలు ఉండాలని ఆచరించారు. ఇప్పటికీ పలుదేశాల్లో మార్క్సిస్టులు, కమ్యూనిస్టులు, నక్సలైట్లు దీన్నే ఆచరిస్తున్నారు.

**మార్క్స్, ఏంగెల్స్‌లకు సొంత సైన్యం వుండాలనే ఆలోచన ఎలా వచ్చింది?**

మార్క్స్, ఏంగెల్స్‌లకు పారిస్ కమ్యూన్ విప్లవం పతనమయ్యాక కార్మిక వర్గానికి సొంత సైన్యం వుండాలనే ఆలోచన ఎలా వచ్చింది? దీన్ని తెలుసుకోవడం అవసరం. యూరప్‌లో ఇప్పుడు మన వద్ద టెంట్‌హౌస్‌లు కిరాయికిస్తున్నట్టుగా వెనకట సైన్యాన్ని కిరాయికిచ్చేవారు. సైన్యాలను పెంచే వాళ్ళను యుద్ధ ప్రభువులు, వార్‌లార్డ్స్ అని పిలిచేవారు. 10వ శతాబ్దంలో యూరప్ అంతటా ఏళ్ళ తరబడి మంచు కురిసి పంటలు పండలేదు. లక్షలాది మంది చనిపోయారు. పశువులు చనిపోయాయి. జనం చచ్చిపోవడంతో వ్యవసాయం చేసేవారు కరువయ్యారు. పశుపెంపకానికి తక్కువ మంది అవసరం. పశువులను పెంచిన వాళ్ళు తిండికోసం అల్లాడే ప్రజలను సైన్యంలో చేరితే తిండి పెడతామని అన్నారు. అలా సైన్యాన్ని తయారు చేసుకున్నారు. ఇండియాలో డచ్చి, ఫ్రెంచి, ఇంగ్లాండు మొదలైన దేశాల ఈస్టిండియా కంపెనీలు సైన్యాలను పెంచిపోషించుకోవడం ఆ యూరప్ పరిణామాల్లో భాగంగా జరిగింది. ఇండియాలో రాజులు కాని వాళ్ళు, తిరుగుబాటుదారులు కాని వాళ్ళు సైన్యాలను పెంచుకోలేదు. అలాంటి అవసరం ఇండియాలో ఏర్పడలేదు.

**మనకు కూడా సైన్యం వుంటే ఎంతమంచిగుండు?**

మనకు కూడా సైన్యం వుంటే ఎంత మంచిగుండు అని రాయలసీమ ఫ్యాక్షనిస్టులు, బీహార్ భూస్వాములు సేనలు అవసరం అనుకొని పెంచి పోషిస్తున్నాయి. అవి చేస్తున్న అరాచకాలు, ఆటవిక చర్యలు, గూండాయిజం అందరికీ తెలుసు. మార్క్స్, ఏంగెల్స్‌లు యూరప్‌లోని సొంత సైన్యాల యుద్ధ ప్రభువుల వ్యవస్థను చూసి అరె, మనకు కూడా అట్లాగే సైన్యం వుంటే మంచిగుండు అనుకున్నారు. అలా ప్రభుత్వానికి సమాంతరంగా సైన్యం పెంచుకోవచ్చు. పెంచుకోవాలి అనే ఆలోచన వారికి కలిగింది. ఇండియాలో ఇలాంటి ఆలోచన వచ్చే అవకాశమే లేదు.

**మార్క్స్, ఏంగెల్స్‌లు ఈ విషయాలు ఎందుకు ఊహించలేదో...**

మార్క్స్, ఏంగెల్స్‌లు సొంత సైన్యాన్ని కార్మికవర్గ పార్టీ ఏర్పాటు చేసుకోవాలని చెప్పిన తరువాత దానికి కూడా యుద్ధ ప్రభువుల స్వభావం వస్తుందని ఊహించకపోవడం ఆశ్చర్యం కల్గిస్తుంది. కార్మికవర్గ నాయకత్వం సైన్యాన్ని అదుపులో పెడుతుంది అనుకున్నారు. అనగా కార్మికవర్గ నాయకత్వం తనకు తెలియకుండానే సైనిక నాయకత్వంగా మారుతుందని కూడా గుర్తించకపోవడం విచిత్రం.

ఉదాహరణకు ఇండియాలో విప్లవ దళాల వ్యవస్థ సైనికీకరణ చూడవచ్చు. దళ కమాండర్ ఏకకాలంలో సైనిక అధికారి, రాజకీయ నాయకుడు, సిద్ధాంతవేత్త, న్యాయమూర్తి, పోలీసు అధికారి, ఇంకా మరెన్నో... అవతారాలు, అధికారాలు ఒక్కరిలో కేంద్రీకృత మయ్యాయి. ప్రజాస్వామ్య వ్యవస్థలో ఈ అధికారాలు అన్ని వికేంద్రీకృత



మయ్యాయి. ఒక చోట పొరపాటు జరిగితే, అన్యాయం జరిగితే ఇతర వ్యవస్థల ద్వారా వాటిని సరిచేసుకొనే అవకాశం వుంది. పత్రికా స్వేచ్ఛ మరో పెద్ద అవకాశం ఇస్తుంది. పార్టీ నాయకులు సైనిక వ్యవస్థకు అధికారులైనప్పుడు ప్రజలకు ఈ అవకాశాలు దూరమవుతాయి.

**సొంతసైన్యం ఏర్పాటు రాజరిక విధానం**
**కార్మికవర్గ చైతన్యం రాజరిక విధానంతో కలిసిపోయింది**

కార్మికవర్గం సొంతపార్టీతోపాటు సొంత సైన్యాన్ని తయారు చేసుకోవాలి అనడం ద్వారా, సమాజాన్ని మార్చే శక్తి కార్మిక వర్గానికిమాత్రమే ఉందనడం ద్వారా, కార్మిక వర్గం అంటే కార్మికవర్గపార్టీయే అనడం ద్వారా, కార్మికవర్గ పార్టీకి సొంత సైన్యం ఉండాలనడం ద్వారా మార్క్స్, ఎంగెల్స్‌లు తొలుత ప్రతిపాదించిన స్వేచ్ఛా సమానత్వం, వ్యక్తి స్వేచ్ఛ, సిద్ధాంతాలన్నీ, ఊహలన్నీ ఆచరణలో తలకిందులయ్యాయి. పార్టీ నాయకత్వమే అన్నిస్వేచ్ఛలను, అందరి స్వేచ్ఛలను హరించేదిగా మారిపోయింది. దైవం మంత్రాధీనం, మంత్రం బ్రాహ్మణాధీనం, బ్రాహ్మణ మమదేవత అన్నట్లుగా మార్క్సిజం చెప్పే సిద్ధాంతాలన్ని మారిపోయాయి. దేవుడు మంత్రానికి అధీనుడు, మంత్రం బ్రాహ్మణుల అధీనం, కనుక బ్రాహ్మణులు దేవతలతో సమానం అని ఈ శ్లోకం తాత్పర్యం. అలాగే సామాజిక మార్పు కార్మికవర్గ అధీనం, కార్మిక వర్గం కార్మికవర్గ పార్టీ అధీనం, కార్మికవర్గపార్టీ సామాజిక మార్పుకు సంకేతం. కనుక బ్రాహ్మణులు దైవంతో సమానమైనట్లు, కమ్యూనిస్ట్ పార్టీలు దైవంతో సమానం అయిపోయాయి.

**ఏకపార్టీ వ్యవస్థ వల్ల అవస్థలు**

మార్క్సిజం పుట్టుక సామాజిక పరిణామాల వల్ల ప్రపంచంలో చాలా దేశాలు తమ రాజ్యాంగ లక్ష్యాలను సోషలిస్టు సమాజ నిర్మాణంగా పేర్కొన్నాయి. ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా సోషలిస్టు సమాజ లక్ష్యాలకు అనువుగా పని చేయడం వాటి కర్తవ్యం. ఈ దశలో బహుళ పార్టీ వ్యవస్థలో కూడా ప్రజాస్వామ్యంతో పాటు సోషలిజం పరిణామాలు సమాజంలో సాధించడం మొదలైంది. సంక్షేమ పథకాలు మొదలైనవి అన్నీ ఇందులో భాగమే. అందువల్ల ఏక పార్టీ వ్యవస్థ భావనకు కాలం తీరిపోయింది. బహుశా అందువల్లే రష్యాలో 1985 నుండి బహుళ పార్టీ వ్యవస్థ ఏర్పడిందేమో.

మార్క్సిజం ఏకపార్టీ వ్యవస్థను ప్రతిపాదించడంవల్ల మొత్తం అన్ని వర్గాల, అన్ని కులాల, అన్ని ప్రాంతాల, అన్ని పార్టీల, అన్ని ఉద్యమాల, అన్ని రాజకీయ సామాజిక సిద్ధాంతాల, భావజాలాల యొక్క స్వేచ్ఛ హరించబడింది. అణచివేయబడింది. ఇతరులకు ఈ వ్యవస్థల్లో ఎలాంటి స్వేచ్ఛలేని సమాజంగా మార్చబడింది.

**పంచపాండవులంటే నాకు తెలవదా? మంచం కోళ్ళ తీరు ముగ్గురు కదా!**

మార్క్స్, ఎంగెల్స్‌లు చెప్పిన స్వేచ్ఛ, సమానత్వం, సోషలిజం, కమ్యూనిజం ఊహలు, ఆశలు పంచపాండవులంటే నాకు తెలువదా మంచం కోళ్ళవలె ముగ్గురుకదా అంటూ రెండు వేళ్ళు చూపించినట్టుగా మారిపోయింది. నిజానికి మార్క్సిజం ఐక్యత ఘర్షణఅని, వైరుధ్యం అని రెండువేళ్ళ సిద్ధాంతాన్ని చెప్పినప్పటికి ప్రతిపక్షం అనే రెండోవేలుకు అవకాశమేలేని ఒకటేవేలును రష్యా, చైనా తదితర దేశాలు వాటి

విప్లవానంతర వ్యవస్థలు చూపించాయి. ఇలా సమస్త స్వేచ్ఛలకోసం చెప్పిన మార్క్స్, ఎంగెల్స్‌ల సిద్ధాంతాలు మొత్తం స్వేచ్ఛలని హరించే సిద్ధాంతాలుగా అనుభవం మీద తేలింది.

సోషలిస్ట్ రష్యాలో 1985లో పెరిస్త్రోయికా, గ్లాస్‌నాస్త్ ఉద్యమాలు సాగాయి. 13 దేశాలుగా సోషలిస్టు రష్యా విడిపోయింది. అంతదాకా కొన్ని మార్క్సిస్ట్, లెనినిస్ట్ పార్టీలు అమెరికావలె రష్యా ఒక సోషల్ సామ్రాజ్యవాద దేశంగా ఎదిగిందని ఊదరగొట్టారు. అది విచ్చిన్న దశలో ఉందని చెప్పలేకపోయారు. విడిపోయిన తరువాత తమ అంచనాలు తప్పే అని చెప్పలేకపోయారు. 1985 నుండి రష్యా తదితర 13 దేశాలలో ఏకపార్టీ సోషలిజం స్థానే బహుళపార్టీ ప్రజాస్వామ్యయుత సోషలిజంలోకి పరివర్తన చెందుతున్నది. భారతదేశంలోవలె ఇప్పుడు అక్కడ మిశ్రమ ఆర్థికవ్యవస్థ నడుస్తున్నది. చైనాలో రాజకీయంగా ఏకపార్టీ విధానం ఉన్నప్పటికీ ఆర్థిక పారిశ్రామిక రంగాల్లో మావో చనిపోయాక 1978 నుంచి మిశ్రమ ఆర్థికవ్యవస్థ నడుస్తున్నది. భారతదేశం 1950 నుండి మిశ్రమ ఆర్థికవ్యవస్థను ఆచరిస్తున్నది.

**హిట్లరిజాన్ని కన్న తల్లి మార్క్సిజమే**

పెట్టుబడిదారీ వ్యవస్థ మార్క్సిజాన్ని కన్నది. సోషలిజాన్ని కన్నది. మార్క్సిజం దేన్ని కన్నది? ఏక పార్టీ వ్యవస్థ, సైనికీకరణ అనే మార్క్సిస్టు సిద్ధాంతాలు సోషలిజానికి కాకుండా నేషనలిజానికి అన్వయించడం నుంచి హిట్లరిజం రూపొందింది. మనువు లాంటి నీషే సూపర్‌మెన్ థియరీ హిట్లరిజానికి కన్నతండ్రి.

ఇలా జర్మనీ సమాజం - జర్మన్ ఆలోచన జర్మన్ సామాజిక పరిణామాలు అనే ఒకే కుదురునుండి మార్క్సిజం, హిట్లరిజం పుట్టాయి. మార్క్స్ చెప్పిన వర్గవాదాన్ని సొంత సైనికవిభాగం పార్టీకి ఉండాలనే వాదాన్ని జాతీయవాదంలోకి అన్వయించి ఆచరిస్తే హిట్లరిజం. హిట్లర్ ఆచరణను స్పష్టంగా ఫాసిజం అంటున్నారు.

**ఆరెసెస్ హిట్లరిజాన్ని ఆదర్శంగా తీసుకోడానికి కారణమేమిటి?**

ఆరెసెస్ వాదులు హిట్లర్‌ని ఆదర్శంగా చెప్పడానికి కారణం అందులోని జాతీయవాదమే. హిట్లరిజం ఒక జాతి వాదం. అదే దృక్పథంతో జర్మన్ మార్క్సిజం ఒక వర్గవాదం. హిట్లర్ ప్రపంచయుద్ధం చేయడానికి ఎన్ని కారణాలు ఉన్నాయో కార్మికవర్గ పార్టీలుగా తమను తాము ప్రకటించుకునే పార్టీలకు కూడా విప్లవాలు చేయడానికి అన్ని కారణాలు ఉండొచ్చు. ప్యారిస్ గుణపాఠాలు, 18వ బ్రొమైరి గుణపాఠాలు ఇలా మార్క్సిజం తొలుతచెప్పిన మానవీయ స్వేచ్ఛా సిద్ధాంతాలను తలకిందులు చేసాయి. అందుకు వ్యతిరేకంగా కొనసాగుతున్నాయి.

ఇలా సమానత్వం, స్వేచ్ఛా సమాజం కోసం అని 'కొండనాలుకకు మందు వేస్తే ఉన్న నాలుక ఊడిపోయిందన్నట్టుగా' అయిపోయింది. మార్క్సిజం అంతా మౌలికంగా యూదువాదమే తప్ప మరొకటి కాదు. లెనిన్‌ది కూడా యూదువాదమే అనేవాళ్లు కూడా ఉన్నారు... దీవించుమని పోతే నాతీరు నూరేళ్లు బతుకు అని విధవావిడ అన్నట్టు యూదులకు మాతృభూమి లేదు కనుక కార్మికులకు మాతృభూమి లేదని యూదులైన మార్క్స్, లెనిన్ చెప్పారని వాళ్లు అంటారు.



**సొంత సైన్యం ఉన్నవాళ్ళు ఇతరుల మాట వింటారా?**

సొంత సైన్యం ఉన్నవాళ్లు సమాజాన్ని అంగీకరించరు. సమాజాన్ని లొంగదీసుకుంటారు. థగ్గులు, పిండారీలు, మహ్మద్ ఘోరీ, ముస్లింల దండయాత్రలు, మొఘలులు మొదలుకుని బీహారులోని రణబీర్ సేన వంటి భూస్వామ్య సైన్యాలదాకా ఇందుకు సాక్ష్యం. ఆఫ్ఘనిస్తాన్‌లో తాలిబన్లు సొంత సైన్యంతో సమాజాన్ని వెనక్కి నడిపించాలని చూసిన సంఘటన మన కళ్లెదుటే ఉంది. సొంత సైన్యం వల్ల మార్క్స్, ఎంగెల్స్‌లు ప్రయోజనాలే చూసారు. దాని కష్టనష్టాలను చూడలేదు.

పైన చెప్పినట్టు మధ్య యుగాల్లో బ్రిటీష్ సామ్రాజ్యం విస్తరించిన తరువాతకూడా సొంత సైన్యాలుగల లార్డ్స్, భూస్వాములు, యుద్ధప్రభువులను చూసి మార్క్స్, ఎంగెల్స్‌లు ప్యారిస్ కమ్యూన్ పడిపోయిన తరువాత మనక్కూడా సొంత సైన్యాలు ఉండాలి అని కోరుకోవడం ద్వారా ఏం జరిగిందో పైన చూశాం.

**ఆధునిక సమాజాలు సొంత సైన్యాన్ని అంగీకరించవు**

సొంత సైన్యాలవల్ల చరిత్ర అనుభవించిన కష్టనష్టాలు కల్లోలాలు, అభద్రత, అరాచకాలు చూసిన ప్రపంచం ప్రభుత్వం దగ్గర తప్ప ప్రైవేట్ సైన్యాలు, సొంత ఆయుధాలు ఎవరివద్దా ఉండవద్దని భావించింది.

ప్రజాస్వామ్య దేశాలతోసహా రాజరిక దేశాలు ప్రైవేటు సైన్యాలు ఉండవద్దని నిర్ణయించుకున్నారు. మార్క్సిస్ట్ స్వామ్య దేశాల్లోకూడా తనపార్టీకి ప్రభుత్వానికి తప్ప ఇతరులకు సొంతసైన్యాలు ఉండకూడదని నిర్ణయించుకున్నాయి.

**అధికారం కోసం సొంత సైన్యాలా?**

తద్వారా తేలిందేమిటి? తన అధికారంకోసం సొంత ప్రైవేట్ సైన్యం కావాలంటు ఇతరులకు సొంత ప్రైవేట్ సైన్యాలు వద్దనడం - ప్రజాస్వామిక స్వేచ్ఛలను, అవకాశాలను అనుభవిస్తూ తానుమాత్రం మధ్య యుగాల యుద్ధ ధర్మాలను ఆచరించాలను కోవడం మార్క్సిజం ప్రత్యేకత. మార్క్సిస్ట్, లెనినిస్ట్, మావోయిస్ట్ పార్టీల సొంతసైన్యాల ఏర్పాటును అడ్డుకోవడం ప్రజాస్వామిక స్వభావంలో సాధ్యంకాదు. అయినా ప్రజాస్వామిక స్వభావాన్ని కాపాడుకోవాలి. అందుకని ప్రభుత్వాలు పలుదేశాల్లో రకరకాల ప్రయత్నాలు చేస్తున్నాయి. పోలీసులు, సైన్యం, అభివృద్ధి ప్రణాళికలు, భావజాల యుద్ధాలు, ఉద్యమాల్లో ఏజెంట్లను ప్రవేశపెట్టడం సమాంతర ప్రైవేట్ సైన్యాలను ప్రోత్సహించడం చేస్తున్నారు. రెండు చేతులు కలిస్తేనే చప్పట్లు అని సామెత. తద్వారా నిర్బంధాలకు వారి చర్యలే ప్రతిచర్యలు సృష్టించడం ద్వారా కారకులవుతున్నారని చెప్పినట్లయింది.

**నిర్బంధాలు-వ్యూహం ఎత్తుగడల పర్యవసానాలే...**

సొంత సైన్యాలు ఏర్పాటుచేసుకొనే పార్టీల హక్కులను సమర్థించే ప్రజాస్వామిక, పౌరహక్కుల భావజాల కర్తలు, ఉద్యమాలు దీన్ని గుర్తించడం అవసరం. నిర్బంధాన్ని ఖండించాలంటారు. నిర్బంధం వారి వ్యూహం ఎత్తుగడలు, ప్రైవేటు సైన్యాల నిర్మాణం, కార్యక్రమాల నుండి పుడుతుంది. నిర్బంధం అందరిమీద లేదు. ఎందుకని? వారి వ్యూహం ఎత్తుగడల్ని మార్చే చర్చలో పాల్గొనే అవకాశం లేనివాళ్ళు నిర్బంధాన్ని ఖండించి వారిని సమర్థించడం అనేది వారి వ్యూహం ఎత్తుగడల్ని సమర్థించడంలో భాగం

అవుతుంది. అందువల్ల వాటిని విభేదిస్తున్న విషయాన్ని కూడా స్పష్టం చేస్తూ వారి హక్కుల్ని కాపాడే ప్రయత్నం చేయాలి. సొంత సైన్యాల వ్యవస్థ సొంత రహస్య సమాచార సేకరణ వ్యవస్థ సమాజాన్ని, ప్రభుత్వాన్ని అల్లకల్లోలం చేయడం మొదలైనవన్నీ రాజరికాల నాటి కౌటిల్యుని అర్థశాస్త్రం ఆచరించడమే.

'భగవద్గీత' హింసావాదాన్ని, కర్మవాదాన్ని నొక్కి చెప్తుంది. బౌద్ధం అహింసా వాదం. బౌద్ధాన్ని ఓడించడానికి క్రీ.శ.2-4 శతాబ్దంలో భగవద్గీతను సృష్టించారని కోశాంబి, రాహుల్ సాంకృత్యాయన్, అంబేద్కర్ మైదలైన వాళ్ళు అన్నారు. మార్క్సిజం పేరిట భగవద్గీతలోని హింసావాదాన్ని, త్యాగాలపేరిట కర్మవాదాన్ని ఆచరించడం సొంత సైన్యం ఏర్పర్చుకున్నవారికి అనివార్యం అవుతుంది.

**ఇటలీ గ్రామ్సీ ఐక్యత ప్రాధాన్యతను గుర్తించిన తీరు**

ఇటలీలో గ్రామ్సీ మార్క్సిజాన్ని తనదైన పద్ధతిలో అన్వయించుకున్నాడు. చారిత్రక రాజీ అని దానికి పేరు. ఇతర వర్గాలతో ఐక్యసంఘటన కట్టి పోరాడటం దీని లక్ష్యం. రష్యాలో రోజా లక్సెంబర్గ్ మొదలైనవాళ్లు ప్రజాస్వామిక భావస్వేచ్ఛను ప్రతిపాదించారు. సొంత సైన్యం ఉన్నవాళ్లు తమ ఆధిపత్యాన్ని తప్ప మరేమీ పట్టించుకోరు.

**మధ్య యుగాలకు ఆధునిక సమాజాలకు తేడా తెలుసుకోవడం అవసరం**

మధ్యయుగాల్లో శిరచ్ఛేదం అమల్లో ఉండేది. శిక్షలుకూడా రాజుల ఇష్టాయిష్టాలతో వెంటనే అమలు జరిగేవి. ప్రజాస్వామ్యంలో కోర్టులు విచారణజరిపి శిక్షలు వేస్తాయి. ఉరిశిక్ష పడితే ఎంతో చర్చ జరుగుతుంది. ప్రజాస్వామ్యంలో చర్యకు ప్రతిచర్య ఉంటుంది. కాని దానికో ప్రజాస్వామ్య విధానం ఉంటుంది. ప్రైవేట్ సైన్యాల వ్యవస్థలో రాజరికాల్లో అలాంటి ప్రజాస్వామిక విధానం సాధ్యంకాదు. ప్రైవేటు సైన్య అధిపతుల ఇష్టాయిష్టాలు ప్రయోజనాలే వీటిని నిర్ణయిస్తాయి.

**బలమున్నవాడిదే రాజ్యమనేదే సైనిక వ్యవస్థ అంతిమ సారాంశం**

సొంత సైన్యాలు ఎవరు ఏర్పాటుచేసుకున్నా అవి సమాజాన్ని యెనిమల్ ఇనిస్టింక్ట్‌లోకి, మధ్యయుగాల యుద్ధాల్లోకి నడిపిస్తాయి. బలమున్నవారిదే రాజ్యం అనేది మధ్యయుగాల యుద్ధనీతి. దాన్ని దాటి ప్రజాస్వామ్యంలోకి ప్రపంచం ముందుకు సాగింది. ప్రతి మనిషికి ఒకే విలువ, ఒకే ఓటు, ప్రజలందరికీ రాజకీయాధికారంలో నిర్ణయాత్మక పాత్ర అనే అంశాలు ఆచరణలోకి వచ్చాయి. ఈ భావాలకు, వ్యవస్థలకు వెనుకబడిపోయిన చారిత్రక సందర్భాలలో పుట్టిన మార్క్సిజం రాజకీయ సిద్ధాంతంలో వెనుకబడిపోయింది. ఇతరుల స్వేచ్ఛ దానికి విలువలేనిదైపోయింది. ఆర్థిక సంబంధాలు, ఆర్థిక సంబంధాలుగానే కొనసాగుతున్నాయి. మార్క్సిజం ఆశించినట్టు ఆర్థిక సంబంధాలే మానవ సంబంధాలుగా, మానవీయ సంబంధాలుగా పరిణతి చెందలేకపోతున్నాయి.

**మార్క్సిజం బరువు**

మార్క్సిజం ఒక స్మశానవాటిక. అదొక శవపేటిక అంటారు కొందరు. అది పలు సిద్ధాంతాలకు స్మశానవాటిక శవపేటిక. శవపేటిక బరువుగా ఉంటుంది. అది విక్రమార్కుడి భుజంమీద భేతాళుడి శవంలా ప్రతి మార్క్సిస్టు భుజంమీద వేలాడుతూ



ఉంటుంది అని అంటుంటారు. వారి ఉద్దేశ్యం ఏమంటే మార్క్సిస్టులు సామాజిక పరిణామాల్లో చరిత్రక్రమంలో పుట్టే ప్రతి కొత్త సిద్ధాంతాన్ని అది ప్రాచుర్యంలోకి వస్తే ఆ పసిగొంతును కూడా నులిమేస్తారు. వారి స్మశానవాటికలో పాతిపెడతారు. కొత్తవి స్వీకరించలేరు, భరించలేరు అని కొందరి భావన.

యం.ఎన్. రాయ్‌కు ఈ విషయాలు మార్క్సిజంలో భాగంగా అర్థం కాలేదు. విప్లవ సోషలిస్టు రష్యాలో ఆయన్ను చంపుతారనుకున్న విషయం తెలిసాక స్వేచ్ఛ గురించిన ఆలోచన, అనుభవంలోకి వచ్చి గుర్తొచ్చింది.

**భారతీయ ప్రత్యేకత-బుద్ధుని సిద్ధాంత ఆచరణ**

ఇలా కాకుండా భారతదేశంలో లేదా ప్రపంచంలో బుద్ధుడు మొదటిసారిగా సంఘ జీవితంలోను, వ్యక్తిజీవితంలోను స్వేచ్ఛను సమానత్వాన్ని, సౌభ్రాతృత్వాన్ని, ప్రేమ, కరుణ, పరోపకారాన్ని, వ్యక్తిత్వ వికాసాన్ని ఏకకాలంలో ఆచరించేవిధంగా ప్రతిపాదించాడు. జ్ఞానం యొక్క ప్రాధాన్యతను గుర్తించాడు. బుద్ధం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి అనే సూత్రాలు అపూర్వమైనవి. ధర్మం అంటే సామాజిక కర్తవ్యాలు, నీతి నియమాలు, సంస్కృతి, మానవీయ విలువలు.

తొమ్మిదవ శతాబ్దంలోని అక్కమాంబ, 16వ శతాబ్దంలోని వేమన, 18వ శతాబ్దంలోని పోతులూరి వీరబ్రహ్మం, 19వ శతాబ్దంలోని ఫూలే, నారాయణగురు, 20వ శతాబ్దంలోని పెరియార్ రామస్వామి, అంబేద్కర్ చేసిన పోరాటమంతా స్వేచ్ఛ గురించే.

"స్వేచ్ఛ - సమానత్వం సౌభాతృత్వం" అనేది బుద్ధుడి నుండి తీసుకున్నానని స్పష్టం చేసిన వాడు అంబేద్కర్. బుద్ధుడి కన్నా మార్క్సు అదనంగా చెప్పిందేమి లేదు అని స్పష్టం చేసినవాడు అంబేద్కర్.

**తత్వశాస్త్రంలో తగ్గిపోయిన మార్క్సిజం స్థానం**

ముందొచ్చిన చెవులకన్నా వెనుకొచ్చిన కొమ్ములు వాడిగా ఉంటాయి. నానమ్మ, తాతకన్నా మనవలు తెలివిలో ముందుంటారు. ముందు పుట్టినవి ముందు నశిస్తాయి. మొదట పుట్టిన చెట్టు మొదట నశిస్తుంది. దాని విత్తనాల నుండి పుట్టిన చెట్లు తరువాత ఎదుగుతాయి. అలాగే సామాజిక సిద్ధాంతాలు పాతబడిపోతుంటాయి. కొత్తవి వస్తుంటాయి. పల్లం కుమారస్వామి అనే యువ దార్శనికుడు ఇలా అంటాడు.

"నా తత్వశాస్త్రం ఎంత తొందరగా అవసరం తీరిపోతే అంతగా సంతోషిస్తాను అని ప్రతి తత్వవేత్త కోరుకోవాలి.

జ్ఞాన పరాయీకరణ ద్వారా ఆవిర్భవించిన రాజ్యం, జ్ఞానసాధన ద్వారా సంస్కృతి ద్వారా నియంత్రించబడుతూ అరాజ్యంగా మారుతుంది.

తత్వ శాస్త్రంలో మార్క్సిజం యొక్క ఆదిపత్యాన్ని కూలగొట్టడం నేడు ప్రపంచ ప్రజల కర్తవ్యం. ఏమంటే అది తత్వశాస్త్ర అభివృద్ధిని, నూతన చలనాలను, చలన సూత్రాలను స్వీకరించేబదలు నిరోధించేదిగా మారి చాలా కాలమైంది. అందువల్ల తత్వశాస్త్రంలో అది తెచ్చిన అభివృద్ధిని సొంతం చేసికొంటూ దాని ఆధిపత్యాన్ని కూలదోయాల్సి వుంది.

పెట్టుబడిదారి యుగపు వైరుధ్యాల పరిష్కారం సూచించిన తత్వవేత్తలు మార్క్సు, ఎంగెల్స్‌లు. సామ్రాజ్యవాద యుగపు సంబంధాల్ని విశ్లేషించిన తత్వవేత్త లెనిన్. రివిజనిస్టు యుగపు సంబంధాల్ని విశ్లేషించి సంశ్లేషించిన తత్వవేత్త అంబేద్కర్. ఎలాగంటే రివిజనిజం, బ్రాహ్మనిజం ఒకే అంతస్సారం కలిగిన వేరు వేరు రూపాలు.

అందుకే మహారాష్ట్ర మహర్ కులంలో పుట్టిన అంబేద్కర్ వెనకబడిన చరిత్రలో వెనకబడిన జీవితం అనుభవించిన మార్క్సుకన్నా వెనకటి తత్వవేత్త కాదు. లండన్‌లో చదువుకున్న భారత రాజ్యాంగ నిర్మాత. రిజర్వేషన్ సిద్ధాంతకర్త. రివిజనిస్టు నిర్మూలనకర్త. మార్క్సు లెనిన్‌ల తర్వాతి కాలంలో వారికన్నా ముందుకు సాగి అభివృద్ధి చెందిన తత్వవేత్త.

మార్క్సు, ఎంగెల్స్, లెనిన్‌లు "గతి తార్కిక భౌతిక వాద ప్రాపంచిక దృక్పథంతో" రాజకీయ అర్థశాస్త్రాన్ని అభివృద్ధి చెందించిన తత్వవేత్తలైతే, అంబేద్కర్ అదే దృక్పథంతో సోషియాలజీని అభివృద్ధి చెందించిన తత్వవేత్త.

రాజకీయార్థిక శాస్త్రాలకన్నా సామాజిక శాస్త్రం విశాలమైంది. రాజకీయార్థిక సంబంధాలకన్నా సామాజిక సంబంధాలు సంక్లిష్టమైనవి. ఇలా మార్క్సిజంకన్నా అంబేద్కరిజం అభివృద్ధి చెందిన ప్రాపంచిక దృక్పథం" అని అంటాడు పల్లం కుమార స్వామి దీన్ని వివరించవల్సి ఉన్నది.

## మార్క్సిజంలో మార్పులు చేర్పులు

ఒక ప్రాపంచిక దృక్పథంతో, ఒక పని విధానంతో ఒక నిర్దిష్ట చారిత్రక సమయంలో కొన్ని అంశాలను విశ్లేషించిన రచనలు మార్క్సు ఎంగెల్సు రచనలు.

ఆ రచనల్లో ఉండే దృక్పథం మార్క్సిజం లేదా గతితార్కిక భౌతికవాదం.

గతి తార్కిక భౌతికవాదం గానీ, మార్క్సిస్టు దృక్పథంగానీ వారి రచనల్లో పూర్తి స్థాయిలో ప్రతిఫలించకపోవచ్చు.

కొన్ని రంగాల్లో చేయాల్సినంత కృషి చేసి ఉండకపోవచ్చు.

చివరి రోజుల్లో ఎంగెల్సు యీ విషయమై బాధపడినాడు కూడా. ముఖ్యంగా మార్క్సిజాన్ని ఆర్థికవాదంగా కుదించి చూస్తున్న వారిని చూసి ఆవేదన చెందాడు.

సాహిత్య రంగంలో మార్క్సు ఎంగెల్సులు ఒక సమగ్ర దృక్పథాన్ని అందించే రచనలు చేయలేకపోయారు. ఏవో కొన్ని అభిప్రాయాలు వెలిబుచ్చారు. అయినా మార్క్సిజం యిచ్చిన వెలుగులో సాహిత్యంతోపాటు యితర రంగాలను కూడా విశ్లేషించడం సాధ్యపడింది. అలా విశ్లేషించే క్రమంలో నూతన చారిత్రక పరిస్థితులేర్పడ్డప్పుడు కొత్త సత్యాలు వెలికి వచ్చినప్పుడు నూతన అన్వయాలను సాధించడం జరిగింది.

ఉదాహరణకు జర్మనీ, ఫ్రాన్సు, ఇంగ్లాండుల్లో తొలుత విప్లవాలు వస్తాయన్నాడు మార్క్సు. రాలేదు. వచ్చిన ప్యారిస్ కమ్యూన్‌ను తొందరపాటు చర్య అని తొలుత అన్నాడు. కాగా రష్యాలో విప్లవం వచ్చింది.

దీనికనువుగా మార్క్సిస్టు దృక్పథంతో చరిత్రను, అంచనాలను, కార్యక్రమాలను నూతనంగా నిర్మించుకోవడం జరిగింది.



ఈ పనిని ప్లెఖనోవ్, లెనిన్‌లు చేశారు. వారు మార్క్సిజం సాధారణ సూత్రాలను నూతన అవసరాలకు అన్వయించడం వల్ల మార్క్సు అంచనాలను కూడా పూర్వపక్షం చేశారు.

## రష్యా దేశస్థుడైన లెనిన్ తన జాతీయ అవసరాలకనువుగా సిద్ధాంతాల్ని మార్చుకున్న తీరు

ఉదా॥కు ప్రపంచమంతటా ఒకేసారి సోషలిజం వస్తుందని మార్క్స్, ఎంగెల్స్‌లు ఊహలు చేసి ఊహల్ని, కలల్ని సూత్రీకరించారు, సిద్ధాంతీకరించారు. అలా జరుగలేదు. జాతీయ ఉద్యమాన్ని రష్యాలో లెనిన్, బోల్షెవిక్ పార్టీ మార్క్సిజంతో జోడించి తమ దేశంలో అధికారంలోకి వచ్చింది. దాన్నే సోషలిజం అన్నారు. దీన్ని ఇలా ఒక దేశంలో కూడా సోషలిజం తేవచ్చు అన్నాడు. అలా మార్క్సిజం మౌలిక ఊహా సోషలిజాన్ని మార్చాడు. బలమైన పారిశ్రామిక కార్మికవర్గం ఉన్న జర్మన్, ఇంగ్లాండు, ఫ్రాన్స్ దేశాల్లో విప్లవం వస్తుందన్న మార్క్సును, ఎంగెల్స్‌ల ఊహలను లెనిన్ మార్చాడు. వెనుకబడిన దేశంలో విప్లవం తెచ్చాడు. దానికి సామ్రాజవాద బలహీన లింకు వద్ద విప్లవాలు సాధ్యం అవుతాయి అని సిద్ధాంతం చేసాడు. ఇటీవల లెనిన్‌ను, లెనినిజాన్ని యూదు జాతీయవాదంలో భాగంగా పరిగణిస్తున్నారు.

రష్యా దేశంలోనిది సోషలిస్టు విప్లవం కాదని పెటీబూర్జువ మేధావులు భావజాలంతో ఇతర వర్గాలను ముఖ్యంగా కార్మికవర్గాలను, రైతులని కలుపుకొని ఉద్యోగవర్గానికి మీ ఉద్యోగాలు అలాగే ఉంటాయని హామీ ఇచ్చి అధికారాన్ని సాధించుకున్న పెటీబూర్జువ ప్రయోజనాలకోసం పెటీబూర్జువ వర్గ నాయకత్వంలో సాగిన జాతీయ ఉద్యమం అని అంటారు. చైనా దేశంలోని మావో మొదలయినవారి నాయకత్వంకూడా ఇదే వర్గానికి చెందింది అని అంటారు.

## రష్యాలో గ్లాస్‌నాస్త్, పెరిస్త్రాయికా-ప్రజాస్వామ్యం

గోర్బచెవ్, ఎల్సిన్‌లు గ్లాస్‌నాస్త్, పెరిస్త్రాయికా కార్యక్రమాలను ముందుకు తెచ్చారు. ప్రజాస్వామ్య యుతంగా అనేక చర్చలు జరిగాయి. దశాబ్దాలుగా పేరుకు పోయిన అసంతృప్తి ఒక్కసారిగా పెల్లుబుకింది. బలవంతంగా ఒకే దేశంగా కలిసి వుండడం గురించి చర్చించారు. శాంతియుతంగా సోవియట్ యూనియన్ 13 దేశాలుగా 1985లో విడిపోయింది. ప్రతి దేశంలో అనేక పార్టీలు ఏర్పడ్డాయి. తమదైన రాజ్యాంగాలను ఏర్పర్చుకున్నాయి. వయోజన ఓటు హక్కు ద్వారా శాసన, చట్ట సభల ప్రతినిధులను ఎన్నుకుంటున్నారు. ఏకపార్టీ కార్మిక నాయకత్వం, వాటి నియంతృత్వం నశించింది. బహుళ పార్టీ ప్రజాస్వామ్య వ్యవస్థ ఏర్పర్చుకున్నారు. ఇలా 1947-1950లో చర్చించి ఇండియాలో ఏర్పర్చుకున్న ప్రజాస్వామిక వ్యవస్థకు రష్యా మొదలైన 13 దేశాలు 1985లో చేరుకున్నాయి. ఇది ఎంతో హర్షించాల్సిన విషయం.

1985 తర్వాత రష్యా, తూర్పు యూరప్ దేశాల్లో జరుగుతున్న పరిణామాలలోని అనుకూలాంశాలను బయటి ప్రపంచం ఎక్కువగా చర్చించడం లేదు. అక్కడ ఆయా పార్టీ నాయకులను కూలదోసినప్పుడు వారి ఇళ్ళల్లో, దొరల ఇళ్ళల్లో, రాజుల ఇళ్ళల్లో దొరికినట్టుగానే అనేక ఆడంబరాలు, సౌఖ్యాలు, నగలు ఒక్కరికే వందలాది చెప్పుల

జోళ్ళు మొదలైనవి దొరికాయి. అనగా కార్మికవర్గ నాయకత్వం పేరిట కూడా రాజుల్లాగే వారి జీవితాలను గడిపారని ప్రపంచానికి తెలిసింది.

అమెరికా వ్యవస్థ గురించి, ప్రజాస్వామ్యం గురించి ప్రపంచానికి ఎప్పటికప్పుడు తెలుస్తున్నట్లుగా రష్యా, తూర్పు యూరప్ దేశాల గురించి ఎందుకు తెలియడం లేదో అర్థం కాదు. రష్యాలోని "కార్మికవర్గ నాయకత్వ దొరలు" మారిపోయారు. తెలంగాణలో దొరలు మారారు. పాల్లేర్లే తమ పాలేరు స్వభావాన్ని మార్చుకోలేక వెనకబడి పోతున్నారు అని ఒక చర్చ వుంది. కుల ఆపాదించిన ఇన్‌ఫిరియార్టీ ఇందుకు ప్రధాన కారణం కావచ్చు. అలాగే ఇండియాలోని వామపక్షాలు వాటి సిద్ధాంత ప్రచారకులు దశాబ్దాలుగా స్ఫూర్తి పొందిన రష్యా తూర్పు యూరప్ పరిణామాలను ఒక వాస్తవంగా, ఒక చరిత్రగా స్వీకరించలేక పోతున్నారు. వాటిని విమర్శిస్తున్నారు. ఇలాంటి వారిని దొరలు మారినా, పాలేర్లు మారని స్వభావంలో వారు కొనసాగుతున్నారని కొందరు వ్యాఖ్యానిస్తుంటారు. ఇండియాలోని ప్రజాస్వామ్య విధానానికి రష్యా, తూర్పు యూరప్ దేశాలు 35 సంవత్సరాలు ఆలస్యంగానైనా చేరుకోవడాన్ని ఆహ్వానించలేకపోతున్నారు. తద్వారా మార్క్సిజం ఆచరణలో పొందిన పరిణామాలను గుర్తించి స్వీకరించడానికి సిద్ధం లేని ఒక మానసిక స్థితిలో కొనసాగుతున్నారు.

### చైనా దేశస్థుడైన మావో తన జాతీయ అవసరాలకనువుగా సిద్ధాంతాల్ని మార్చుకొన్న తీరు

చైనా దేశస్థుడైన మావో తన దేశంలోని జాతీయోద్యమాన్ని మార్క్సిజంతో జోడించి మరికొన్ని సిద్ధాంతాలు చేసాడు. వ్యవసాయ దేశంలో రైతులతో, రైతు కూలీలతో కూడగట్టి సోషలిస్టు విప్లవం తేవచ్చు అని జాతీయ బూర్జువాలతో ఐక్యసంఘటన కట్టి పోరాడవచ్చని చెప్పాడు. అట్లా వచ్చే విప్లవాన్ని నూతన ప్రజాస్వామిక విప్లవం అని పేరు పెట్టాడు. జాతీయ బూర్జువాలతో కలిసి ఏర్పాటుచేసే నూతన ప్రజాస్వామిక వ్యవస్థ మెల్లిమెల్లిగా మరో విప్లవం లేకుండానే సోషలిజంలోకి దేశం పరివర్తన చెందుతుందని అని సిద్ధాంతం చేసాడు. మావో చనిపోయిన తర్వాత చైనాలో కొద్దిమందిని ముందుగా సంపన్నులను కానీయండి అనే సిద్ధాంతం తెచ్చారు. తద్వారా జాతీయ బూర్జువా వర్గం ఎదగడాన్ని మార్క్సిస్టు సిద్ధాంతం చేసారు.

### కొద్దిమంది సంపన్నులు కానీయండి - చైనా నినాదం

ఆ మధ్య చైనా కొద్దిమంది సంపన్నులు కానీయండి అని నినాదాలను ఇచ్చింది. ఇది పెట్టుబడిదారులను, పారిశ్రామికవేత్తలను తయారు చేసుకొనే నినాదం. అనగా 35 ఏళ్ళ సోషలిజం తరువాత పార్టీ నాయకత్వం కన్నా ఆయా పరిశ్రమలకు పారిశ్రామిక వేత్తల నాయకత్వమే మంచిది, ఉత్పత్తి పెంచుతుంది, నైపుణ్యం పెంచుతుంది అని భావించారని అర్థం. అందువల్లే ఇప్పుడు అమెరికాతో అన్ని ఉత్పత్తుల్లో పోటీ పడుతున్నది. అమెరికాలో దొరికే చాలా వస్తువులు చైనాలో తయారయినవే.

ఈ దేశంలో కొద్దిమంది సంపన్నులు కావాలనే సిద్ధాంతాన్ని ఆరెసెస్, బిజెపి, కాంగ్రెస్, తెలుగుదేశం, కమ్యూనిస్టు, మార్క్సిస్టు పార్టీలు మొదటినుండి ఆచరిస్తూ వస్తున్నాయి. అవి ఆర్థిక పారిశ్రామిక, వ్యాపార రంగాల్ని అగ్రకుల బూర్జువాలకు



రిజర్వేషన్ చేసిపెట్టాయి. కార్మికులు, బీసీ, ఎస్సీ, ఎస్టీలు, పెటీబూర్జువాలు, ఉద్యోగులు, సైంటిస్టులు, పారిశ్రామికవేత్తలుగా, వ్యాపారవేత్తలుగా కొద్దిమంది ముందుగా సంపన్నులు కావాలి అనే సిద్ధాంతాన్ని ముందుకు తీసుకురాకపోవడంవల్ల, వాటిల్లో వీరికి రిజర్వేషన్లను, భాగస్వామ్యాన్ని కోరకపోవడంద్వారా వాళ్లు అగ్రకుల పెటీబూర్జువాలకు, బూర్జువాలకు, వ్యవసాయ భూస్వాములకు వాటిని రిజర్వు చేశారు.

### సమాజం ప్రాథమికం - వ్యక్తి సెకండరీ అంటే ఏం జరుగుతుంది?

మార్క్స్, ఎంగెల్స్‌లు సమాజం ప్రాథమికం అన్నారు. వ్యక్తి ద్వితీయం అన్నారు. లెనిన్ దీన్ని సమర్థించాడు. మార్క్సిజం, సోషలిజం, కార్మికవర్గ నియంతృత్వం, కార్మిక వర్గ పార్టీ సహజంగానే సమాజాన్ని ప్రాథమికం అంటూ ఆ సమాజాన్ని మార్చే శక్తులు తామే అని ప్రకటించుకుని సమాజంపై తమ ఆధిక్యతను తార్కికంగా నిలబెడతాయి.

### మావో 'నేను' ప్రాథమికం అన్నాడు - సమాజం పరిస్థితులు అన్నాడు

అయితే, మావో జ్ఞానసిద్ధాంతంలో 'అది' - 'నేను'ల్లో నేను ప్రాథమికం అన్నాడు. మార్క్స్ 'అది' ప్రాథమికం అన్నాడు. తద్వారా మార్క్స్ భావాలను మావో పూర్వపక్షం చేసినట్టయింది. రష్యా తత్వవేత్తలు మావోను ఈ విషయంలో తీవ్రంగా ఖండించారు. 'అది' 'నేను'ల్లో నేను ప్రాథమికం అనడంద్వారా సమాజం ద్వితీయం అయింది.

### ఆరెసెస్ కత్తి-పిడి వాదం, మార్క్సిజం కత్తి-పిడి వాదం

ఆరెసెస్ సిద్ధాంతకర్త ఎమ్.ఎస్.గోల్వాల్కర్ 'కత్తి-పిడి' సిద్ధాంతం ఒకటి చెప్పాడు. ఒకాయన మంగలిషాప్‌లో గడ్డం తీయించుకుంటూ ఈ కత్తి బాగుంది అని మెచ్చుకున్నాడట. ఆ మంగలి ఇది అరవై ఏళ్ళనాటి కత్తి. అందుకే ఇంత బాగుంది అన్నాడట. పిడిచూస్తే కొత్తగా ఉంది ఏంది అని అడిగితే ఆర్నెల్ల కింద కొత్త పిడి వేయించిన అన్నడట. కత్తివేపు చూసి ఇది కూడా బాగా అరిగినట్టు లేదే అని అంటే రెండేండ్ల కింద కొత్త తునుక వేయించిన అన్నడట. ఇలా కత్తి కొత్తదే, పిడి కొత్తదే. కానీ, అది అరవై ఏళ్ళనాటి కత్తి అని పేరు పోయింది. మన హిందూ సంస్కృతి వారసత్వం అనేది ఈ కత్తిపిడి వారసత్వం వంటిదే అని అంటాడు.

అయినా అదంతా మార్క్సిజం, లెనినిజం, గతితార్కిక భౌతికవాదంగానే గుర్తించబడింది. మార్క్సిజానికి ప్రపంచంలో యింత వ్యాప్తి కలిగింది. తమ జాతీయ ప్రయోజనాలకు అనుగుణంగా మార్క్సిజాన్ని మలచుకున్నారు. కుల వ్యవస్థలోఉన్న వైరుధ్యాలను కొన్ని దశాబ్దాలపాటు మరుగు పరచి తమ పరిపాలను సుస్థిరపరచుకున్నారు. మార్క్సిజం భారతదేశంలో బ్రాహ్మణ ఆధిపత్యాన్ని కొనసాగించడానికి ఉపయోగపడింది.

### నోమ్ చామ్‌స్కీయిజం

ప్రజాస్వామిక సామాజిక దార్శనికుడైన నోమ్ చామ్‌స్కీ యిజాలను అంగీకరించడు. అయితే ఆయన చెప్పినదార్శనికత ఒక యిజంగా పరిణామం చెందింది. ఆయన ఇలా అంటాడు. "సమాజ సంస్కరణ అనేది వెలుపలివాళ్లు చెప్పవలసిన విషయం

కాదు. ఆ సమస్యల్ని, యిబ్బందుల్ని అనుభవిస్తున్న వ్యక్తులు సంస్కరణవైపు మొగ్గుచూపాలి నెమ్మదిగా. సమాజ నిర్వహణకు ఏదో ఒక అధికారం కావాలి. కొందరు కాపిటలిస్టు యాజమాన్యం అంటారు. కొందరు శ్రామిక వర్గనియంతృత్వం అంటారు. నా ప్రశ్న ఒక్కటే. ఇవన్నీ అధికారాన్ని కాంక్షిస్తున్నవాళ్లు. ఎదుటి మనిషిని శాసించాలనుకుంటున్న వాళ్లు చెప్పే మాటలు. ఒకరి అధికారంలో బతకటం నీకిష్టమా? నీపైన ఎలాంటి అధికారులుండాలి? అని మీరు సవారీ చెయ్యాలనుకొంటున్న ప్రజల్నడగండి. నీకు ఫలానా అధికారి కావాలి. ఫలానివాడు కొరడా ఝుళిపిస్తే పరిగెత్తే గుర్రాన్ని నేను అని ఎవరైనా చెబుతారేమో చూడండి."

"నా చేతిలో కొరడా వుంది. నీ వీపు నాముందరుంది. అధికార పక్షాలన్నింటికీ వుండే స్వభావమే ఇది. ఈ విషయం సుమారు అర్థశతాబ్దం క్రితమే బకూనిన్ (19వ శతాబ్ది రష్యన్ అనార్కిస్టు. మార్క్సు సమకాలీనుడు. మొదటి ఇంటర్నేషనల్ నాయకుల్లో ఒకడు) చెప్పాడు. అప్పటికింకా లెనిన్ పుట్టలేదు. మార్క్స్ చుట్టూ చేరుతున్న మేధావుల్ని చూసి వీళ్లు మార్పు తెస్తారు. మార్పు పొందే అమాయకులు వేరే వున్నారు అన్నాడు. ఈ మేధావుల దగ్గర కాపిటల్ లేదు. తుపాకుల్లేవు. కాని సమాజాన్ని ప్రభావితం చెయ్యగలిగిన జ్ఞానం వుంది. తెలివితేటలున్నాయి. అన్ని నిర్ణయాల్లో కీలకపాత్ర వీళ్లదే. వీళ్లు రెండు రకాలు. ఒక తెగ వామపక్ష మేధావులు - వీళ్లు ప్రజావుద్యమాలకు నాయకత్వం వహిస్తారు. వాళ్లను తమ అధీనంలో పెట్టుకోగలరు. ఒకవేళ అధికారంలోకి రాలేకపోతే స్టేట్ కాపిటలిజం (అప్పటికి బకూనిన్ ఈ మాట వాడలేదు)కు తుంచుతారు. మొత్తం మీద ఈ రెండు రకాల మేధావులూ ప్రజాతీర్పు అనే దుడ్డుకర్రను ప్రజల్ని లొంగదీసుకోవటానికే వాడుకుంటారు. ప్రజాప్రతినిధులమనీ, ప్రజలసేవలో పనిచేస్తున్నామనీ చెప్పుకుంటారు. కాని ప్రజలమీద సవారీ చేస్తారు."

"ఇందులో తమాషా ఏమిటంటే మేధావులుగా మన పొజిషన్ ఎక్కడా మారలేదు."

"ప్రజాభిప్రాయాన్ని నేల రాయగలిగినవాళ్ళే. అధికార పగ్గాలు హస్తగతం చేసుకుంటారనేది చరిత్ర నిరూపించిన సత్యం. 'మార్క్సిస్టు సిద్ధాంతం' అనే మాటతో నాకు పేచీవుంది. ఫిజిక్సులో అయిన్స్టీనియజం' ప్లాంకియనిజం' అంటూ ఏమీ లేవు. శాస్త్రజ్ఞులు దేవుళ్లు కారు, మనుషులే. కొన్ని కొత్త విషయాలు, ఆవిష్కరించేవుంటారు. కొన్ని రైటూ, కొన్ని తప్పూ. 'న్యూటనియజం' డార్వినిజం లాంటి మాటలు లేకపోలేదు. కాని సిద్ధాంతాలు కావు. అవి న్యూటన్, డార్విన్‌ల భావాలు మాత్రమే తెలుపుతాయి. ఒక అభిప్రాయాన్ని సిద్ధాంత్‌గా అంగీకరించటం మాత్రం, నా ఉద్దేశంలో హేతుబద్ధతకు వ్యతిరేకం."

**మార్క్స్, కాపిటలిస్ట్ సిద్ధాంత ఆవిష్కర్త అని చెప్పిన నోమ్ చామ్‌స్కీ**

నోమ్ చామ్‌స్కీ ఇంకా ఇలా అంటాడు. "'మార్క్సిజం', 'ఫ్రాయిడియనిజం' లాంటివి హేతువిరుద్ధం. ఒక దైవికబోధగా వాటిని అంగీకరించకూడదు. వీళ్లు గొప్పవాళ్లు కాదనటంలేదు. 'మార్క్సిజం' అంటే ఏమిటి అని కాకుండా మార్క్సు చేసిన కృషి, పరిశోధన ఏమిటి? ఆయన కొత్త విషయాలు ఏమి ఆవిష్కరించాడు? అతడి ఆలోచనలో ముందుకు తీసుకుపోవలసినదేమిటి? విసర్జించవలసినదేమిటి? అని ప్రశ్నిస్తే మంచిది.



పందొమ్మిది శతాబ్ది చరిత్ర గురించి మార్క్సు చాలా రాశాడు. ముఖ్యంగా బ్రిటీష్ వాళ్ల ఇండియా ఆక్రమణ. పారిస్ కమ్యూన్, కాపిటల్‌లో పారిశ్రామిక లండన్ గురించి రాసిన భాగాలు చాలా మంచి కృషికి నిదర్శనం. వాటిని చదివి తరువాత తరాలవాళ్లు నేర్చుకోవలసింది ఎంతో వుంది."

"మార్క్స్ కాపిటలిజం ఒక రకంగా వుంటుందని ఊహించాడు. అన్నీ కాకపోయినా కొన్ని ముఖ్య లక్షణాలు సరిగ్గానే పట్టుకోగలిగాడు. అయితే యిందులో మనం అడగాల్సిన ప్రశ్న, పందొమ్మిదవ శతాబ్ది పెట్టుబడిదారీ సమాజ స్వరూపం పూర్తిగా ఆయనకు అవగతమైందా? లేదా, ఈనాటి ఇరవయ్యవ శతాబ్ది చివరి దశాబ్దాలలోని పెట్టుబడిదారీ విధానం ఆయన రచనల ద్వారా అర్థం చేసుకోగలమా?

ప్రతిదానికీ కొన్ని సూత్రాలు వున్నాయంటారు. ఆర్థికశాస్త్రంలో చరిత్రలో - నాకు సూత్రాలేమిటో... చచ్చినా అర్థం కావు.

**మార్క్స్ సోషలిస్ట్ తత్వవేత్త కాదని నోమ్‌చామ్‌స్కీ వాదన**

నోమ్‌చామ్‌స్కీ ఇలా అంటాడు. "మార్క్సు సోషలిస్టు తత్వవేత్త కాదు. మార్క్సు రచనలన్నీ కలిసి చదివినా, సోషలిజం గురించి రాసినవి అయిదు వాక్యాలకన్నా ఎక్కువ దొరకవు. అతడు, క్యాపటలిస్టు సిద్ధాంత ఆవిష్కర్త. ముఖ్యంగా వర్గం ఉత్పత్తి సంబంధాలు లాంటి మాటలు పరిశోధకులకు ఎంతో ఉపయుక్తంగా వుంటాయి. కాపిటలిజం గురించి రాసిన రచనల్లో ఇవి నిస్సందేహంగా కొత్త అభిప్రాయాలు. కొందరు గతితార్కికత గురించి మాట్లాడతారు. నాకు అది కూడా అర్థం కాదు. పైగా ఆ మాట వాడింది మార్క్సు కాదు - ఎంగెల్స్."

మనిషికి, మనిషికీ ఉండే సంబంధాలలో భాగంగా ఈ సమాజ శాస్త్రాలు పుడుతున్నాయని, ఉత్పత్తి సంబంధాలేర్పడుతున్నాయని, పంపిణీ వ్యవస్థ నిర్దేశితమవుతున్నదని తేల్చి చెప్పినవాడు అంబేద్కర్.

వర్గవాదులు ఉత్పత్తి సంబంధాలననుసరించి మానవ సంబంధా లేర్పడతాయని అంటారు. మార్క్సు, ఎంగెల్సులు దీన్ని నొక్కి చెప్పారు.

**మార్క్సిజం, బుద్ధిజం, ఫూలేయిజం,**
**అంబేద్కరిజం, ఫెమినిజం సమన్వయం ఒక తులనాత్మక పరిశీలన**

ఈ దేశంలోని కుల వ్యవస్థ ఎవరు ఏపని చేయాలి? ఎంత గౌరవం పొందాలి? సామాజిక సంపదలో ఎవరెంత పొందాలి? అనేవి నిర్ణయిస్తున్నది. ఇలా మనిషికీ, మనిషికీ మధ్య ఉండే సంబంధాన్ని, ఉత్పత్తి సంబంధాన్ని రెంటినీ కులం నిర్ణయిస్తుంది.

మార్క్సిజం తలక్రిందులు చేసిన సిద్ధాంతాన్ని అంబేద్కర్ సరిగా నిలబెట్టాడు.

ఈ విషయంలో అంబేద్కరిజం మార్క్సిజాన్ని మార్చి సరిగ్గా నిలబెట్టిన సిద్ధాంతంగా ముందుకు తీసుకురావాల్సిన అవసరం ఉంది.

ఉత్పత్తి సంబంధాలలో భాగంగానే మానవ సంబంధాలు ఏర్పడతాయనే మార్క్సు వాదాన్ని ఎం.ఎన్. రాయ్ ఎద్దేవా చేసాడు.

మనిషి ఉత్పత్తి పరికరాలని ఉదా: నాగలిని కడుపులో వేసుకుని పుట్టుకు వస్తాడా?

మనిషి పుట్టిన తర్వాత నాగరికత నేర్చుకున్న క్రమంలో ఉత్పత్తి, పరికరాలని తయారుచేసుకున్నాం అని స్పష్టం చేసాడు ఎం.ఎన్. రాయ్.

మార్క్సిజం ప్రధానంగా పెట్టుబడిని, శ్రమశక్తిని, సాధనాలను, ఉత్పత్తి సంబంధాలను నిర్ణాయక అంశంగా తీసుకొంది. మనిషి ఉత్పత్తి సంబంధాలు రెండు.

1. ప్రకృతిలో ఉత్పత్తి సంబంధం.

2. మనిషికీ మనిషికీ మధ్య పునరుత్పత్తి సంబంధం.

మార్క్సు మొదటిది రెండోదాన్ని నిర్ణయిస్తుందన్నాడు.

అంబేద్కర్, ఎం.ఎన్. రాయ్, స్త్రీ వాదులు రెండోది మొదటిదాన్ని నిర్ణయిస్తుందని నిరూపించారు.

మార్క్సిజంలో మానవ రక్త సంబంధాల శాస్త్రం, అభివృద్ధి చెందకపోవడం వలన వెనుకబడిపోయింది. మానవ రక్త సంబంధాల శాస్త్రం, ఆంథ్రోపాలజీని (నరవర్గ మానవ శాస్త్రం) కుటుంబ సంబంధాలను, విభిన్న తెగల, గణాల వ్యవస్థలో మధ్య గల సంబంధాలను కుల రక్త సంబంధాలను మత రక్త సంబంధాలను, ప్రాంత రక్త సంబంధాలను అధ్యయనం చేస్తుంది.

ఉత్పత్తి సాధనాలే ఉత్పత్తి సంబంధాలను నిర్దేశిస్తాయి అని మార్క్సిజం చెప్పడంలో ఒక రకమైన కర్మ సిద్ధాంతం ఉంది. ఈ రెండు రకాల ఉత్పత్తి సంబంధాలను నిర్దిష్టంగా చర్చించింది కులశాస్త్రం. ఈ విషయంలో కులవ్యవస్థ మార్క్సిజంకన్నా లోతైన శాస్త్రం.

ప్రపంచంలో పారిశ్రామిక వ్యవస్థ పుట్టక పూర్వం ఆవిర్భవించి నిర్దిష్టంగా సామాజిక సంబంధాలను, అంతస్తులను చర్చించి నిర్ధారించిన ప్రాపంచిక దృక్పథం కులం.

**ఏ వృత్తి చేస్తే ఆ గౌరవం అనేది కుల ప్రాపంచిక దృక్పథమే**

నేటి వ్యవస్థలో రెవెన్యూ డిపార్టుమెంట్ అంటే ఒక గౌరవం, వైద్యశాల అంటే ఒక గౌరవం, అమ్మకంపన్ను శాఖంటే ఒక గౌరవం, కలెక్టర్ అంటే ఒక గౌరవం, సూపరిండెంట్ అంటే ఒక గౌరవం, పోలీసు శాఖంటే ఒక గౌరవం, సైనికుడంటే ఒక గౌరవం ఇలా విభిన్న స్థాయిల్లో కొనసాగుతున్నాయి.

ఉదా॥కు... అదిలాబాద్ జిల్లా నుండి ఒక ఉపాధ్యాయుడు కరీంనగర్ జిల్లాకు బదిలీ చేసుకుంటే అతని మొత్తం సీనియారిటీ కోల్పోతాడు.

జీతం, ఇంక్రిమెంట్లు సజావుగానే సాగినా ప్రమోషన్ విషయంలో ఆరోజే ఈ జిల్లాలో ఉద్యోగం చేరిన వ్యక్తికన్నా జూనియర్ అవుతాడు. కరీంనగర్ జిల్లాలో అతడు కొత్తగా కులంలో చేరుకున్నవాడి హోదాను పొందుతాడు.

ఒక డిపార్ట్‌మెంట్ నుండి మరో డిపార్ట్‌మెంటుకు బదిలీ పెట్టుకుంటే సైతం ఇలాగే జరుగుతుంది. ఉద్యోగ భద్రత పేరిట ఇది మొదలయ్యింది. ఇది కులవ్యవస్థ యొక్క ఆచరణే!

జిల్లాలవారి ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజీలు ఏ జిల్లా వారిని ఆ జిల్లాలోనే నమోదు చేసుకుంటున్నాయి. ఇలా ఒక జిల్లా నుండి మరో జిల్లాకు పోకుండా, ఒక వృత్తి నుండి మరో వృత్తికి పోకుండా అమలు జరుగుతున్నవి కుల వ్యవస్థ పోకడలే.



అంబేద్కర్‌కు పూర్వం జ్యోతిబాపూలే మానవతావాద సిద్ధాంతాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చారు. ప్రపంచ పౌరహక్కుల ఉద్యమాల నిర్మాతల్లో జ్యోతిబాపూలే ఒకరు.

బౌద్ధం ప్రాధాన్యతను గుర్తించే విధంగా ప్రపంచ సామాజిక శాస్త్రాలను తిరగరాస్తూ అంబేద్కరిస్టు ప్రాపంచిక దృక్పథంతో కృషి చేయాల్సిన అవసరం ఉంది.

బహుజనుల సామాజిక, రాజకీయార్థిక, సాంస్కృతిక భావజాల ఆధిక్యత ఎదిగే మేరకు ఇది సాధ్యమౌతుంది. కనుక మనం అన్ని రంగాలలో బాగా ఎదగాలి. సామాజిక శాస్త్రాలలో, అంబేద్కరిజం తెచ్చిన మార్పును చరిత్ర అధ్యయానికి అన్వయించినపుడు ఎంత విప్లవాత్మకంగా మారుతుందో కంచె అయిలయ్య పి.హెచ్.డీ సిద్ధాంతంలోనూ ప్రసంగాల్లోనూ చూడవచ్చు.

ఉదా॥ మార్క్సిస్టులు చరిత్రను ఆదిమ కమ్యూన్ వ్యవస్థ, బానిస వ్యవస్థ, ఫ్యూడల్ వ్యవస్థ, పెట్టుబడిదారీ వ్యవస్థ, సోషలిస్టు వ్యవస్థ అంటూ ఉత్పత్తి సాధనాలను, సంబంధాలను అనుసరించి అధ్యయనం చేస్తున్నారు.

మన దేశంలో స్త్రీలు, బహుజనులు, గణం, తెగ, కుటుంబ వ్యవస్థ మాతృస్వామ్య వ్యవస్థ, పితృస్వామ్య వ్యవస్థ, స్త్రీ స్వామ్య వ్యవస్థ, వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ, కులాన్ని పురుషాధిపత్యాన్ని నిర్మూలించాల్సిన నూతన వ్యవస్థ అంటూ అధ్యయనం చేస్తున్నారు.

ఇది మానవ సంబంధాలు, మానవ పునరుత్పత్తి సంబంధాలు ప్రాతిపదికగా ఏర్పడిన వ్యవస్థలు. ఇది మానవ సంబంధాలలో భాగంగా ఉత్పత్తి సాధనాలను, సంబంధాలను, చరిత్రనూ అధ్యయనం చేయడంతో దీనివల్ల స్త్రీలను అణచివేసిన చరిత్రతోబాటు బహుజనులను అణచివేసిన చరిత్ర కూడా తెలిసివస్తుంది.

తద్వారా భూస్వామ్య సమాజం, పారిశ్రామిక సమాజం, బానిస సమాజం వంటి యాజమానులు చర్చ ప్రాధాన్యత తగ్గి మనిషిని మనిషే అణిచేసిన చరిత్ర మరింత తేటతెల్లం అవుతుంది.

బ్రాహ్మణిజం, బుద్ధిజం, పోచమ్మ, మైసమ్మల చరిత్ర శూద్రుల విప్లవాలు మొ॥వి ప్రాముఖ్యతలోకి వస్తాయి.

మార్క్సిస్టుల చరిత్ర అధ్యయనానికి బహుజనుల చరిత్ర అధ్యయనానికి మధ్య ఎంతో వైరుధ్యం ఉంది. ఉత్పత్తి సాధనాల సిద్ధాంతం వలన మార్క్సిస్టులు చార్వాకులకు, బౌద్ధానికి, భక్తి ఉద్యమాలకు గురునానక్, కబీర్, వేమన, పోతులూరి వీరబ్రహ్మం, నారాయణగురు, పెరియార్ రామస్వామి, జ్యోతిబా పూలేల చరిత్రకు అన్యాయం చేస్తున్నారు.

**భారతీయ మార్క్సిస్టుల కర్తవ్యాలు**

భారతీయ మార్క్సిస్టులు భారతదేశంలోని పెట్టుబడిదారీ పూర్వ ఉత్పత్తి శక్తులను, ఉత్పత్తి సాధనాలను, ఉత్పత్తి సంబంధాలను విశ్లేషించాలి. ఇతరులు విశ్లేషించింది స్వీకరించాలి. భారతదేశంలో కులవ్యవస్థ ఉత్పత్తి సంబంధాలను, ఉత్పత్తి పంపిణీని, ఉత్పత్తి శక్తులను నిర్దేశించింది. ఎవరు ఏ వర్గాలుగా ఎదగాలో కులవ్యవస్థ శాసించింది. వర్గాలను సృష్టించే విత్తనం కులవ్యవస్థ. భారతదేశంలో వర్గాలను కనిపెంచే వ్యవస్థ కులవ్యవస్థ. మార్క్సిస్టులు కొందరు ఈ అవగాహనకు చేరుకొన్నారు.

## ఫెమినిజం మార్క్సిస్టు చారిత్రక భౌతిక వాదాన్ని, కార్యక్రమాలను సమూలంగా మార్చింది

ఫెమినిజం మార్క్సిజంలోని చారిత్రక భౌతిక వాదాన్ని అదనపు విలువ శ్రమశక్తి, కార్మిక వర్గ ఉద్యమాలు మొదలైన అన్ని అంశాలను చర్చించింది. అవి సగం జనాభా అయిన స్త్రీల కోణాన్ని వదిలేసిన తీరును నిర్ధారించింది. మార్క్సిజంలోని అన్ని అంశాలు, కార్యక్రమాలు, పితృస్వామిక పురుషాధిపత్యానికి అనువుగా వున్నాయని స్పష్టం చేసింది.

## వర్గం అనే పదంతో కాకుండా ఉత్పత్తి సంబంధాలు అనే పదాలతో విశ్లేషించాలి

భారతీయ మార్క్సిజం భారతీయ ఉత్పత్తి సంబంధాలను పరిశీలించడం లేదు. యూరోపులోని పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలలో భాగంగా సూత్రీకరణలను అందులో భాగంగా ప్రాచుర్యంలోకి వచ్చిన 'వర్గం' అనే పదాన్ని చర్చిస్తుంది. వర్గం అనేది ఉత్పత్తి సంబంధాల, ఉత్పత్తి సాధనాల విశ్లేషణ ద్వారా యూరోపు మేధావులు చేసిన తీర్పు. అక్కడి తీర్పును ఇక్కడి ఉత్పత్తి సంబంధాల పరిశీలనతో సంబంధం లేకుండా వర్గం అనే పదం ద్వారా భారతదేశ ఉత్పత్తి సంబంధాలపై వాడుతున్నారు. అది సరికాదు. ఇక్కడ వర్గాలు ఎలా ఏర్పడుతున్నాయో ఇక్కడి పెట్టుబడిదారీ పూర్వ ఉత్పత్తి సంబంధాల పరిశీలన నుండి వర్గాలను కనుగొని చెప్పాలి. ఆ పని మార్క్సిస్టులు చేయలేదు.

## కులం ప్రాధాన్యత

కులం ఈ దేశంలో ఉత్పత్తి సంబంధాలు, మానవ సంబంధాల నిర్ణాయక అంశం అని ప్రజలందరికీ తెలుసు. మార్క్సిస్టులకు తెలియదనుకోలేం. 'కులమెంతో గుణం అంత' అనే మాట కులం ద్వారా వచ్చే గౌరవాలు, అవమానాలు ఎలాంటివో స్పష్టం చేస్తుంది. 'కులంచెడ్డా సుఖం దక్కాలె' అనే మాట కులానికి సౌఖ్యాలు అందుకోడానికి మధ్య గల అంతరాన్ని పరిష్కరించుకునే పద్ధతిని తెలుపుతుంది.

ఫెమినిస్టులు మానవ సంబంధాల పునాదిగా చరిత్రను అధ్యయనం చేస్తారు.

అందువల్ల అంబేద్క రిజం, ఫెమినిజం ఒకే ప్రాపంచిక దృక్పథానికి చెందినవి.

## వామపక్ష శక్తులు, బీసీ, ఎస్సీ, ఎస్టీ శక్తులు కలిసి పనిచేయాలి

మార్క్సిస్టులకు, ఫెమినిస్టులకు, బీసీలకు, ఎస్సీలకు, ఎస్టీలకు ఉమ్మడి ప్రయోజనాలున్నాయి. చేరాల్సిన ప్రజలు ఒకరే. వీరు కలిసి పనిచేస్తే ప్రజలకు మేలు చేయడం, రాజకీయ అధికారం అందుకోవడం ఎంతో సులువు. సిద్ధాంత విభేదాలు కల్సి పనిచేయడానికి అడ్డంకి కాకూడదు. ఇదెలా సాధ్యం అని కొందరికి అనిపించవచ్చు.

ఎలా సాధ్యమంటే సిద్ధాంతాలు అలా ఉండనిద్దాం. ఆదర్శాలను, లక్ష్యాలను వర్తమానం సాధించడానికి - వాటిని చేరుకోవడానికి ఉమ్మడి కృషి అవసరం.

## మార్క్సిస్టులకు బహుజనులకు, ఫెమినిస్టులకు మధ్య వున్నది అగ్రకుల సమస్యే తప్ప మరొకటి కాదు

మార్క్సిస్టులకు, ఫెమినిస్టులకు, బీసీ, ఎస్సీ, ఎస్టీలకు మధ్య "అగ్రకుల సమస్య" తప్ప పెద్దగా అడ్డంకులేమీలేవు. బీసీ, ఎస్సీ, ఎస్టీలు పేద వర్గాలతోపాటు బీసీ, ఎస్సీ,



ఎస్టీలు జాతీయ బూర్జువాలుగా ఎదిగే కార్యక్రమాల కోసం, ప్రయోజనాల కోసం కూడా ఆలోచిస్తున్నారు. మార్క్సిస్టులు ఈ విషయం పట్టించుకోకపోవడంవల్ల ఒక వైపు పేదవర్గాల ప్రయోజనాల కోసం, మరోవైపు అగ్రకుల బూర్జువాల ప్రయోజనాల కోసం ఆచరిస్తున్నారు. అధికారం, అభివృద్ధి అందుకున్నవారికి, అందుకోవాల్సిన వారికి సిద్ధాంత విభేదాలు, వైరుధ్యం పరిష్కారానికి - కలిసి పని చేయడమే మార్గం.

## సిద్ధాంత విభేదాలు ఎప్పుడు ప్రాధాన్యత వహిస్తాయి?

1. ప్రచారానికి పెద్దపీటవేసి ఆచరణ తక్కువ ఉన్నపుడు
2. కలిసి పనిచేసే కార్యక్రమాలకు ప్రాధాన్యల లేనపుడు
3. వర్గ ప్రయోజనాలు, కుల ప్రయోజనాలు, ప్రాంత ప్రయోజనాలు వేరైనప్పుడు
4. తమ నాయకత్వం, తమ కీర్తి, తమ సంస్థ, తమ పార్టీ ఆధిక్యతలో ఉండాలనుకున్నప్పుడు
5. పాలక వర్గాల, దోపిడి కులాల, ఏజెంట్లు, ప్రజల వైపున ఉన్నట్టు నటించినప్పుడు
6. చిత్తశుద్ధ, త్యాగశీలత లేనప్పుడు

## సమిష్టి కార్యక్రమాలు తీసుకోవడమే పరిష్కారం

అందరు కలిసి సమాజ హితం కోసం పాజిటివ్ కార్యక్రమాలు తీసుకోవాలి. ఉదాహరణకు టీచర్లు, ప్రభుత్వ ఉద్యోగులు, ఆర్టీసీ కార్మికుల జీతాలు, సౌకర్యాలు మెరుగుదల కోసం అన్ని పార్టీలు మద్దతు ఇస్తున్నాయి. అలాగే పేద రైతులు, కూలీలు, కులవృత్తుల వాళ్లు మొదలైన వారందరికి అన్ని పార్టీల మద్దతు ఇవ్వాలి. అలాగే బీసీలు, ఎస్సీలు, ఎస్టీల జీవితం మెరుగుపడే కృషి చేయాలి.

ఒకాయన ఉన్నాడు - బీసీలలో ఒక కులాన్ని కలుపుకోవాలని అంటుంటాడు. వాళ్లను కలుపుకోలేదు కాబట్టి నేను బీసీలతో కలిసి పని చేయను అన్నాడు. చివరికి అతని ఆచరణ ఏమైంది? ఆ కులం కోసం బీసీలనే వదిలేశాడు. అంతకూ అతను బీసి కులస్తుడే. అలాగే మార్క్సిస్టులు వారి పార్టీలు నాలుగైదు శాతం లేని అగ్రకుల పేదల కోసం వారి పేరిట అగ్రకులాల్లో పేదలు లేరా అంటూ కుల సమస్య చర్చ అవసరం లేదని కుల సమస్య చర్చించే బీసీ, ఎస్సీ, ఎస్టీలతో కల్సి పనిచేయడం మానుకున్నారు. ఇది దేన్ని తెలుపుతున్నది? తద్వారా ఏం జరిగింది? ఏం జరుగుతున్నది? నాలుగైదు శాతం అగ్రకుల పేదల కోసం మొత్తం 70 శాతం బీసీ, ఎస్సీ, ఎస్టీలను వదిలేశారు.

వారి ఉద్దేశం ఏమంటే బీసీ, ఎస్సీ, ఎస్టీల కోసం మనమంతా కల్సి పని చేద్దాం. అగ్రకుల పేదల కోసం మీరు చేసే ప్రత్యేక ప్యాకేజిని, ప్రోగ్రాంని తీసుకోవాలి. దానికి మేం కూడా కలిసి వస్తాం. మా సమస్య ఏమిటంటే అగ్రకుల పేదల పేరిట - అన్ని రంగాలలో అగ్రకుల బూర్జువాలు, పెటీబూర్జువాలు నాయకత్వంలోకి వస్తున్నారు. బీసీ, ఎస్సీ, ఎస్టీల నాయకత్వాన్ని రాకుండా చేస్తున్నారు. ఇలా మేం ఫీలవుతున్నాం. చరిత్ర ఇదే నిర్ధారించింది.

### గాంధీ, అంబేద్కర్‌ల దృష్టికోణం

గాంధీ, నేను హిందువులందరికీ ప్రతినిధిని అన్నాడు. సైమన్ కమిషన్ చర్చలకు అంబేద్కర్‌ను దళిత ప్రతినిధిగా పిలవవద్దన్నాడు. దళితుల గురించి ఊకడా నేనే ప్రతినిధిని అన్నాడు. ఇలానే అగ్రకుల నాయకత్వం - మేం అందిరికీ నాయకులం అంటున్నారు - బీసీ, ఎస్సీ, ఎస్టీలకు కూడా మేము ప్రతినిధులం అంటున్నారు. బీసీ, ఎస్సీ, ఎస్టీలనేమో ప్రతినిధులు కారు, వాళ్లు వాళ్ల కులాలకు ప్రతినిధులంటున్నారు. ఇది గాంధీ వాదనే. సివిల్ సొసైటీలో బీసీ, ఎస్సీ, ఎస్టీలు ఎదగాలి. దీనికి అన్ని వైపుల కృషి జరగాలి. ప్రభుత్వపరంగా కృషి జరగాలి. ఉద్యమాలు సాగాలి. ఇందుకు అందరూ కలిసి కృషి చేయాలి.

### ఉద్యమం అనేది వెనకబాటు చైతన్యానికి నిదర్శనమా?

నిజానికి ఉద్యమం అనేది వెనకబాటు చైతన్యానికి నిదర్శనం. అభివృద్ధిని వెంట వెంట అందుకునే కృషి జరిగితే సమాజం శాంతియుతంగా పరిణామం చెందుతుంది. మేం శాంతియుత పరిణామాన్ని కోరుతున్నాం. నిత్య చైతన్యమే దానికి పరిష్కారం. ఇందుకు ప్రచారం కన్నా ఆచరణ ముఖ్యం అవుతున్నది.

### సిద్ధాంతాలు వాటికవే స్వయం సంపూర్ణం కాదు

సిద్ధాంతాలు వాటికవి శక్తివంతమైనవి కావు. మనిషి స్వీకరించినపుడే అవి శక్తివంతం అవుతాయి. మనిషికి సిద్ధాంతాలు డ్రెస్సుల వంటివి. మనిషి తన భావాలు మార్చుకుంటాడు. అందుబాటులో ఉన్న వాటిని తన అవసరాలకు సాధనంగా స్వీకరిస్తాడు. సంస్థలు, తత్వవేత్తలు సిద్ధాంతాలు ప్రాణంగా భావించవచ్చు. వాటికి సిద్ధాంతాలు లక్ష్యాలు. ఆదరాచ్చలు - గమ్యాలు - వాటిని ఆచరించడానికి సమాజం ఒక సాధనంగా భావిస్తారు. ప్రజలకు సిద్ధాంతాలు పార్టీలు సాధనాలు మాత్రమే. వారి ప్రయోజనాలే వారి లక్ష్యం.

### ఎక్కువ ఆశలు కల్పిస్తే ఎక్కువ ఆశిస్తారు

ఎక్కువ ఆశలు కల్పించడం నుండే ఎక్కువ ఆశించడం సహజం. ఆశ పెట్టింది అందకపోతే ఎక్కువ విమర్శ కూడా రావచ్చు. కరణం మల్లీశ్వరి, ఎలింపిక్స్‌లో ఓడిందంటే అది ఓటమి ఒక్కటే తెలపదు. జాతీయ స్థాయి నించి ఒలింపిక్స్ దాకా ఎదిగిన తారు కఊఉడా అందులో ఉందని అర్థం. అలాగే పలాని వాళ్లు ఫలానావి సాధించలేదు అనే విమర్శను - ఈ అర్థంలో స్వీకరించాలి. మార్క్సిస్టులు, మావోయిస్టులు చెప్పే విప్లవాలు, సాయుధ పోరాటాలు ఈ దేశానికి అవసరంలేదు. అయినా వారి ప్రచారం వారు చేసుకోవచ్చు. వామపక్షాలు తెలుగుదేశం, కాంగ్రెస్‌తో కలిసి పని చేస్తున్నప్పుడు బీసీ, ఎస్సీ, ఎస్టీ శక్తులు, మడి కట్టుకొని కూర్చోకూడదు.

అయినా అలాంటి విమర్శల్ని ప్రధానం చేయకూడదు. కల్సి పనిచేయడం ముఖ్యం. వామపక్షాలు బీసీ, ఎస్సీ, ఎస్టీలు ఒక ఐక్య సంఘటన కట్టాలి. వామపక్షాలు దళారి బూర్జువా శక్తుల ప్రతినిధులైన కాంగ్రెస్, ప్రాంతీయ కమ్మ బూర్జువా ప్రతినిధులైన తెలుగుదేశంతో కలిసి పనిచేయడం కన్నా జాతీయ, ప్రాంతీయ బీసీ, ఎస్సీ, ఎస్టీ బూర్జువాలతో, పెటీబూర్జువాలతో, కార్మికవర్గంతో, చేతివృత్తులవారితో, వ్యవసాయ



దారులతో, రైతుకూలీలతో కలిసి పనిచేయడమే సరైనది. అలాగే పేదలకు మేలు చేయడానికి బీసీ, ఎస్సీ, ఎస్టీ జాతీయ బూర్జువాలను అభివృద్ధి పరచడానికి, అధికారపక్షంగా మారడానికి దగ్గరి దారి. ఇలా ఐక్య సంఘటన కట్టకపోతే వామపక్షాలు అగ్ర కుల బూర్జువాలకు, వారి పార్టీలకే మద్దతు ఇవ్వడానికి సిద్ధపడుతున్నదని అర్థం.

### కమ్యూనిస్టు, మార్క్సిస్టు పార్టీల చూపు విశాలం కావాలి

వామపక్ష శక్తులు ఈ దేశంలో 52 శాతం జనాభా గల బీసీలను లేకుండాచేసి అధికారంలోకి రాదల్చుకున్నాయని అనుకునేట్టు చేస్తున్నాయి. ఏమంటే వారి కార్యకలాపాలు, ప్రణాళికల్లో బీసీలు అనే పదాన్నే నిషేధించారు. భారత రాజ్యాంగం 1950 నుండి బ్యాక్‌వర్డ్ క్లాసెస్ అంటూ సామాజిక వర్గాలను గుర్తించి కొన్ని ప్రత్యేక పథకాలను రూపొందించాలని భావించింది. వామపక్షాలు భారత రాజ్యాంగం గుర్తించిన మేరకైనా బిసిలు అనే సామాజిక వర్గాలను తమ ప్రణాళికల్లో పేర్కొనడం లేదు. అనగా బిసిలను తమ పార్టీల్లో చేర్చుకోడానికి సిద్ధంగా లేరు. వారినొక సామాజిక వర్గంగా, శక్తిగా గుర్తించడానికి నిరాకరిస్తున్నారు. తద్వారా మార్క్సిజం రూపంలో దోపిడీ కులాల నాయకత్వాన్ని వామపక్ష నాయకత్వంగా సిద్ధాంత భూమికతో కొత్త ముఖాన్ని చూపిస్తున్నారు. మాయావతికి బిజెపి మద్దతు ఇవ్వడం ద్వారా రాజీ, పోరాటాలకు, బీసీ, ఎస్సీ, ఎస్టీలకు ఆరెసెస్, బిజెపి, సందర్భానుసారంగా మద్దతు ఇస్తుందని స్పష్టం చేసుకుంది. వామపక్షాలు ఈ చొరవ కోల్పోయాయి.

ఈ అధ్యాయంలో మార్క్సిజం తన సిద్ధాంతాల్లో వదిలేసిన అనేక అంశాలను చర్చించడం జరిగింది. వాటిని ఇక్కడ మరోసారి క్రోడీకరిస్తాను.

1. విరుద్ధాంశాల ఐక్యతలో మూడు అంశాలు ఉంటాయి.
2. ఐక్యత-ఘర్షణల్లో ఐక్యతను వదిలేశారు. అయితే ఐక్యత-ఘర్షణల్లో సంబంధం అనే అంశం కూడా ఉంటుంది.
3. నెగేషన్ చర్చతో ఎవల్యూషన్‌ను, స్థిరంగా కొనసాగే క్రమాలను వదిలేశారు. సంశ్లేషణ, సహజీవనం పరస్పరం ఆధారపడడం కూడా ప్రధానమైనవి.
4. ఎలక్ట్రాన్, ప్రోటాన్‌లతో పాటు మూడో అంశం న్యూట్రాన్ కూడా వుంటుంది.
5. ఆసక్తి, అనివార్యత రెండూ ముఖ్యమే. వీటితో పాటు అవసరం కూడా ముఖ్యం. ఆసక్తి, అనివార్యత, అవసరం, యాదృచ్ఛికత సమాన ప్రాధాన్యత కలవి.
6. పాతదీ వుంటుంది. కొత్తదీ వుంటుంది.
7. చలన సూత్రాలు స్థిరమైనవి కావు. ఏమంటే చలనాలు చలనం లేకుండా అలానే ఉండిపోవు. సమాజాలు మారకుండా అలానే ఉండిపోవు.
8. చలనాలను అనుసరించి కొత్త సూత్రాలను తయారు చేసుకుంటూ పోవడమే సమాజం చేయాల్సిన పని.
9. చలన సూత్రాలను వాస్తవాల మీద వర్తమాన చలనాల మీద రుద్ది చలనాలను పరిశీలించడం అనేక పొరపాట్లకు దారితీస్తుంది. అది వర్తమానం నుండి భవిష్యత్తులోకి నడిపే బదులుగా గతంలోకి నడిపిస్తుంది.
10. బహుళ పార్టీ వ్యవస్థ లోనూ అధికారంలోకి ప్రజాస్వామికంగా రావడాన్ని

వేగవంతం చేస్తుంది. ఏక పార్టీ వ్యవస్థ కొందరు నాయకుల నియంతృత్వానికి దారితీస్తుంది.

11. ఫెమినిజం, మార్క్సిజంలోని సమస్త అంశాలను వాటి అసమగ్రతను, పురుషాధిపత్య వాదాన్ని వెలికి తీసింది. వాటన్నిటిని సమూలంగా మార్చుకోడం అవసరమని నిర్ధారించింది.

వీటి విశ్లేషణను మరింత వివరంగా నేను రాసిన 'గతితర్క తత్వదర్శనం భూమిక'ను చూడవచ్చు.

ఇవన్నీ ఆధునిక అవసరాలకనువుగా ఉద్యమ కర్తవ్యాలను, కార్యక్రమాలను ఎన్నో రెట్లు పెంచుతాయి. అందర్నీ కలుపుకుపోతూ సామాజిక శక్తిగా ఎదిగే ప్రజాస్వామిక స్వభావాన్ని ఎదిగిస్తాయి. అన్నిటికన్నా ముఖ్యంగా ఇతరుల పట్ల, ఇతర సిద్ధాంతాల పట్ల ఉండే నెగెటివ్ థింకింగ్‌ను తొలగించి పాజిటివ్‌గా ఆలోచించే స్వభావాన్ని పెంచి సమాజంలో వారి వ్యాప్తిని, ప్రభావాన్ని ఎన్నో రెట్లు పెంచుతుంది.

1. మార్క్సిస్టు సిద్ధాంతాలకు ఏవేవి ప్రాతిపదికగా పనిచేశాయో వివరించండి.
2. వర్గపోరాటం అనే సిద్ధాంతం ఎన్ని శాస్త్రాలకు విస్తరించిందో వివరించండి.
3. తార్కిక సత్యాలు ఏం పనిచేస్తాయి?
4. ఎవల్యూషన్-రెవల్యూషన్ అంటే ఏమిటో వివరించండి.
5. ఏకపార్టీ వ్యవస్థ వల్ల ఎలాంటి అవస్థలు వుంటాయో చర్చించండి.
6. రష్యా విప్లవం, మధ్యతరగతి జాతీయ విప్లవమా? కార్మికుల విప్లవమా? వివరించండి.
7. చైనా విప్లవం జాతీయ విప్లవమా? రైతాంగ కార్మిక విప్లవమా? వివరించండి.
8. నోమ్ చామ్‌స్కీ మార్క్సును పెట్టుబడిదారీ వ్యవస్థ సిద్ధాంతవేత్త అని అనడానికి గల కారణాలేమిటి?
9. సిద్ధాంత విభేదాలు ఎప్పుడు ప్రాధాన్యత వహిస్తాయో మీ అనుభవాలు వివరించండి.
10. మార్క్సిజం ఏ యే అంశాలను వదిలేసిందో, వాటి ప్రాధాన్యత ఏమిటో తద్వారా కర్తవ్యాల్లో, ప్రాధాన్యతల్లో వచ్చే మార్పులేమిటో వివరించండి.
11. వామపక్షాలు బిసిలు అనే సామాజిక వర్గాలను గుర్తించకపోవడం ద్వారా వామపక్షాల వర్గ స్వభావం అగ్రకుల స్వభావంగా ఎలా మారిందో వివరించండి.



## భగవద్గీతలో ఎన్ని వైరుధ్యాలున్నాయో
# మార్క్సిజంలో అన్ని వైరుధ్యాలున్నాయి

భగవద్గీత ఆధ్యాత్మికవాదాల్ని, నాస్తిక, సాంఖ్య హేతువాదాల్ని, జైన, బౌద్ధ సామాజిక దర్శనాల్ని, కర్మ, భక్తి, జ్ఞాన, ఆత్మ, రాజవిద్య, గుణత్రయ, మోక్షసన్యాస శాస్త్రాల్ని అన్నిటినీ కలగలిపేసి రాజ్యాధికార వాదంలో సామాజిక దర్శనంలో కలిపింది. అవి వ్యాసుడి నుండి హర్షవర్ధనుని కాలం దాకా మార్పులు చేర్పులు చేస్తూ తీర్చిదిద్దిన రచయితల గొప్పతనం. ఇలా వాటన్నిటిని సామాజిక దర్శనానికి సామాజిక దర్శనంగా చూపిస్తూ రాజ్యాధికార వాదానికి అనువుగా ఎలా వాడుకోవాలో కృష్ణుడు లేదా వ్యాస మహర్షి ఎంతో చక్కగా వివరించారు. ఆ తర్వాత వచ్చిన రాజ్యాధికార వాదాలన్నీ కౌటిల్యుడు, మనుధర్మశాస్త్రం మొదలుకొని మార్క్సిజం, నక్సలిజం దాకా చాలా మొరటుగా వున్నాయి తప్ప ఇంత సున్నితంగా "జీర్ణం, జీర్ణం, వాతాపి జీర్ణం" చేసుకొని తమ సాధికారికతను ప్రకటించుకొనే సామర్థ్యాన్ని సాధించుకోలేకపోయాయి.

### రాజ్యాధికారం కోసం ఏం చేసినా తప్పులేదన్న భగవద్గీత

భగవద్గీత యుద్ధాన్ని పురికొల్పుతూ రాజ్యాధికారం సాధించడం ముందు అన్ని మార్గాలు, అన్ని రకాల యుద్ధాలు సరైనవే. బంధుమిత్రులు, గురుశిష్యులు అనే బంధనాల గురించి బాధపడనవసరంలేదు అని కృష్ణుడు అర్జునునికి హితబోధ చేశాడు. అదంతా సరే. నైపుణ్యం ఎక్కడ వుందంటే యుద్ధానికి సన్నద్ధం చేస్తూ సైన్యాన్ని పెంచుకొంటూ అహింసా, శాంతి సందేశాలను ఇవ్వడం సాధ్యం చేయగలిగింది భగవద్గీత. రాజకీయ, సామాజిక అధికారం కోసం తన కాలం నాటికి ప్రాచుర్యంలోవున్న అన్ని దర్శనాలను, దృక్పథాలను ఇవన్నీ నావే, నాలో భాగమే, నేనే అన్నీ రూపాలనై ఉన్నాను. అన్నిట్లో ఉన్నది ఒక్కటే ఆత్మ. నేనే అన్ని రూపాల్లో ఆత్మనై ఉన్నాను. ఇదిగో చూడు నా విశ్వరూపం అంటూ అర్జునునికి విశ్వరూపాన్ని చూపించడం 18 అధ్యాయాల భగవద్గీతను బోధించడం గొప్ప నైపుణ్యం గల దార్శనికులు మాత్రమే చేయగలిగిన పని.

### భగవాన్ బుద్ధ - భగవాన్ శ్రీకృష్ణ

భగవాన్ బుద్ధుడు తెచ్చిన సామాజిక విప్లవాన్ని భగవద్గీతలో సంక్షిప్తీకరించి కొత్త లక్ష్యాలకు అనువుగా మలిచారు. భగవద్గీత కాలం నాటికి వెలువడ్డ దర్శనాలన్నిటిని స్వీకరించి తనలో సంలీనం చేసుకొని కొత్త అర్థాలతో అధ్యాయాలుగా మార్చింది. లక్ష్మణ్

అనే ఒక యువ పరిశోధకుడు "భగవద్గీత - ఆధునిక మేనేజ్‌మెంట్, అడ్మినిస్ట్రేషన్ సూత్రాల తులనాత్మక పరిశీలన" చేశాడు. అందులో పలు ఆసక్తికరమైన విషయాలు వెల్లడించాడు. యండమూరి వీరేంద్రనాథ్ మరో అడుగు ముందుకు వేసి భగవద్గీతకు విజయాన్ని సాధించడం గురించిన వ్యాఖ్యానం రాశాడు.

**మహాభారతం-భగవద్గీత**

భగవాన్ బుద్ధ, భగవాన్ శ్రీకృష్ణుల సామాజిక రాజకీయ దార్శనాల తులనాత్మక అధ్యయనం ఈనాటి చారిత్రక అవసరం. భగవాన్ బుద్ధ సామాజిక దర్శనాన్ని బోధించాడు. భగవాన్ శ్రీకృష్ణ రాజకీయ దర్శనాన్ని, సామాజిక దర్శనాన్ని కలిపేసి ఆధ్యాత్మిక భౌతికవాద దర్శనాలన్నిటినీ తనదైన పద్ధతిలో అర్థాలు చెప్పి తన దర్శనాన్ని పరిపుష్టం చేశాడు. మహాభారతం ఒక గొప్ప సామాజిక దర్శన శాస్త్రంగా ఇప్పటికీ కొనసాగుతున్నది. భగవద్గీత భారతానికి మించి అన్నింటినీ కలుపుకున్నట్టే కలుపుకొని తనదైన రాజకీయాలను సామాజిక దర్శనంగా, ఆధ్యాత్మికతగా ప్రదర్శించగలిగింది.

**భగవద్గీతలోని అన్నీ నేనే అనే ఆత్మవాదం పరిమితి**

ఒక కవి ఇందిరాగాంధీ చనిపోయినప్పుడు అందరిలో ఉన్నది ఒకటే ఆత్మ ఏడుపు ఎందుకు జీవా! మరో ఆకృతిలోకి ఆత్మ చేరుతుంది జీవా! అన్నీ నేనే. చేస్తున్నవి, చేయిస్తున్నవి అన్నీ నేనే అని ఆత్మవాదాన్ని వైరాగ్యగీతంగా రచించాడు. భగవద్గీతను నమ్మేవాళ్లు కూడా ఆ పాట రాయాల్సింది కాదు అని అన్నారు. అనగా ప్రాణం మీద అందరికీ తీపే.

ఇలా ఆత్మ ఒకటే అని చెప్పినప్పటికీ, ఎంత ఆధ్యాత్మికత చెప్పినప్పటికీ ఈ జీవితమే ప్రామాణికం అని కాంగ్రెస్‌వాళ్ళు, ఆరెసెస్ వాళ్ళు, హిందువులు, భగవద్గీతను నమ్మేవాళ్లు గుర్తిస్తున్నారు. కనుక ఎవరి ఆధ్యాత్మికవాదమైనా చివరకు సామాజిక దర్శనంగా ఆచరణలో భౌతికంగానే ఉంటున్నది.

**మార్క్సులాగా, భగవద్గీతలాగా మళ్ళీ అన్ని సిద్ధాంతాలను ఏకసూత్రతలోకి తేవాలి**

మార్క్స్ కాలంలో అన్ని సిద్ధాంతాలను ఏక సూత్రతలోకి తెచ్చారు. భగవద్గీత కూడా అదే పని చేసింది. గత కొన్నేళ్ళుగా సామాజిక దర్శనంలో భాగంగా యితర శాస్త్రాలకు, బుద్ధిజానికి, గాంధీయిజానికి, సోషలిజానికి, మార్క్సిజానికి, ఫ్రాయిడిజానికి, అంబేద్కరిజానికి ఫెమినిజానికి, ప్రజాస్వామిక సోషలిజానికి, నోమ్ చామ్‌స్కీ వాదానికి, మానవతా వాదానికి గల సంబంధాల్ని, పోలికల్ని, తేడాల్ని చర్చిస్తున్నారు. వీటన్నిటి తులనాత్మక అధ్యయనం కోసం, సమగ్రత కోసం మనం కొంత అదనంగా కృషి చేయాల్సిన అవసరం ఉంది. గ్లోబలైజేషన్ ఎరాలో (శకంలో) సమస్త యిజాలు వెనుకబడిపోయాయి. నూతన చలనసూత్రాల ఆవిష్కరణ జరుగుతోంది. ప్రపంచమంతటా పలు దేశాల్లో, పలు భాషల్లో ఎక్కడికక్కడ ఇది కొనసాగుతున్నది. వీటన్నిటినీ ఒకచోటికి తీసుకువచ్చే ప్రయత్నం ఇంకా మొదలుకాలేదు.

**మార్క్స్ దర్శనం :**

మార్క్సిజం పేరిట ప్రాచుర్యంలోకివచ్చిన గతి తార్కిక భౌతికవాదం, చారిత్రకభౌతికవాదం, వ్యక్తిగతాస్తి, కుటుంబం, రాజ్యం పుట్టుక మొదలైన శాస్త్రాలు



కొత్త వెలుగు ప్రసరింప చేశాయి. 1848లో కమ్యూనిస్టు మ్యానిఫెస్టో అనే కార్యక్రమాన్ని, పరికల్పనను ముందురాసి తర్వాత అందుకనువైన వాస్తవాలను ఒక్కచోట చేర్చి సమన్వయించారు. మిగతావి వదిలివేశారు. వాటిని ప్రత్యేకంగా తరువాతి అధ్యాయంలో పరిశీలిద్దాం. సామాజిక దర్శనం మార్క్సిజంలోని కార్యక్రమాలు, పరికల్పనలతో నిమిత్తం లేకుండా దాని వెలుగును గుర్తిస్తుంది.

**సాంఘికవాదాలు - సామాజిక తత్వవేత్తలు :**

మార్క్స్ దర్శనం తర్వాత పుట్టిన సాంఘికవాదాలు, సామాజిక పరిణామాలు, సూత్రీకరణలు, నూతన ఆవిష్కరణలు, నూతన ఆలోచనలు, ఆచరణలు మార్క్స్ దర్శనం వెలుపలే ఉండిపోయాయి. వదిలేసిన పాతవాస్తవాలు, కొత్త ఆలోచనలు ఆసియావంటి ఇతర దేశాల చరిత్ర పరిణామాలు వారి కార్యక్రమాలను, పరికల్పనలను మార్చుతాయి అని భయపడి వాటిని నిరాకరిస్తూ, వ్యతిరేకిస్తూవచ్చారు.

మార్క్సిజంపేరిట చెలామణిలోకి వచ్చిన రాజకీయపార్టీలు తమ పాత రాజకీయ కార్యక్రమాలను, అంతిమ లక్ష్యాలను మార్చుకోలేక మార్క్సిజం పేరిట చెలామణిలోగల సామాజిక, ఆర్థిక, తాత్విక, రాజకీయశాస్త్రాలను కొత్త ఆలోచనకు, కొత్త సత్యాలకు, కొత్త కార్యక్రమాలకు అనువుగా మార్చకుండా అడ్డగిస్తున్నారు.

అందువల్ల వాటిని వాటిలోపలి నుండి మార్చడం అసాధ్యమైంది. తద్వారా అంతర్గత వైరుధ్యమే మౌలికం అని చెప్పే మార్క్సిజం తనలోనే దాన్ని నిలుపుకోలేక పోయింది. ఆచరించలేకపోయింది. స్వీకరించలేకపోయింది.

అయితే భగవద్గీతలో అది రాయబడిన కాలం నాటికి వున్న సిద్ధాంతాలన్నిటినీ తనలో చేర్చుకొని చర్చించింది. అలాగే మార్క్సిజం కూడా తన కాలం నాటికి వెలువడిన సిద్ధాంతాలను తనలో చేర్చుకొన్నది. భగవద్గీతలో ఎన్ని వైరుధ్యాలున్నాయో మార్క్సిజం లోనూ అన్ని వైరుధ్యాలు కొనసాగుతున్నాయి.

**మార్క్సిజం ఒక లడ్డయిట్స్ సిద్ధాంతంగా మారిన తీరు**

మార్క్సిజం ఒక సిద్ధాంతంగా ఇతర సిద్ధాంతాలతో చర్చించేటప్పుడు యంత్రవిధ్వంసకుల్లా ప్రవర్తిస్తుంది. యంత్రవిధ్వంసకులను లడ్డయిట్స్ అని అంటారు. యూరప్‌లో పారిశ్రామిక విప్లవం మొదలయ్యాక కార్మికులకు కష్టాలు మొదలయ్యాయి. నిద్రతప్ప మిగతా సమయమంతా యంత్రాలతో పని చేయించే వారు. తమ పాత వృత్తులు కోల్పోయారు. కొత్త కష్టాలు పెరిగిపోయాయి. వీటన్నిటికీ కారణం ఈ యంత్ర ఉత్పత్తి విధానమే అని వారు అర్థం చేసుకున్నారు. ఈ యంత్రాలను విధ్వంసం చేయాలి. అప్పుడే తమ కష్టాలకు కన్నీళ్ళకు విముక్తి అనుకున్నారు. అలా కార్మికులు యంత్రాలను ధ్వంసం చేశారు. మార్క్స్, ఏంగెల్స్ అలా చేయడం మంచిది కాదని అన్నారు.

**నూతన సిద్ధాంతాలను విధ్వంసం చేస్తే మార్క్సిజం ఎక్కడ మిగిలేది?**

నూతన సిద్ధాంతాలను మార్క్సిజం లాగే విధ్వంసం చేస్తే మార్క్సిజం మాత్రం ఎక్కడ మిగిలేది? యంత్రాల వల్ల ఉత్పత్తి పెరుగుతున్నది. నూతన ఆవిష్కరణలు మానవ సమాజాన్ని మరింత సుఖవంతంగా మారుస్తాయి. యంత్రాలను విధ్వంసం

చేయకూడదు. పెట్టుబడిదారులను తొలగించి కార్మికులే వాటికి యజమానులు కావాలి. అందుకు కార్మికులే ప్రభుత్వ నేతలుగా వ్యవస్థను ఏర్పాటు చేసుకోవాలి అని మార్క్స్, ఏంగిల్స్‌లు బోధించారు. అలా యంత్ర విధ్వంసకులను లడ్డయిట్స్ అని పిలుస్తూనే వారిని ఆ దశ నుంచి మరో దశకు ఎదిగించాలని కార్మికవర్గ పోరాటాలను, కార్మికవర్గ నియంతృత్వంలో సోషలిస్టు వ్యవస్థ ఏర్పడాలని, కార్యక్రమాలను ఇచ్చారు.

### మాడు పగులగొట్టి మెదడు తీసుకొంటారట?

అయితే మార్క్సిజం తన పుట్టుక నుండి ఇతర సిద్ధాంతాల పట్ల యంత్ర విధ్వంసక పాత్ర నిర్వహిస్తున్నది. ఆయా సిద్ధాంతాలను, యంత్రాలను వాడుకొని, కొత్త సమాజాన్ని నిర్మించాలన్నట్లుగా, కొత్త కార్యక్రమాలకు అనువుగా స్వీకరించడం లేదు. ఇందుకు భిన్నంగా ఒక మాట అంటుంటారు – కొత్త సిద్ధాంతాల గింజను పగలగొట్టి అందులోని గుజ్జును స్వీకరించాలి అని! అంటే ఆయా సిద్ధాంతాల రూపాన్ని వదిలించి దాని అంతస్సారాన్ని పిండుకోవాలి అంటారు. అంటే వాళ్ళ మాడు పగులగొట్టి మెదడు స్వీకరించాలి. తయారు చేసిన వారి మాడుపగులగొట్టి మెదడు తీసుకోవడం అంటే ఏమిటి?

### మార్క్సిజం మాడు పగులగొట్టి మెదుడు స్వీకరించాలా?

దీన్ని మార్క్సిజానికి అన్వయిస్తే ఇలా వుంటుంది. మార్క్సిజం మాడు పగలగొట్టి మెదడును స్వీకరించాలి. మార్క్సిజం ఇతర సిద్ధాంతాల పట్ల క్యారక్టర్ అసాసినేషన్ చేస్తుంది. అది లడ్డయిట్స్ చేసే చర్యలు. సుప్రసిద్ధ విప్లవ సాహిత్య విమర్శకుడు త్రిపురనేని మధుసూదనరావు తన జీవితమంతా సాహిత్య తాత్విక రంగాల్లో క్యారక్టర్ అసాసినేషన్ చేస్తూ కత్తి తిప్పడమే. రంగనాయకమ్మ బౌద్ధం, అంబేద్కరిజం విషయంలోనూ లడ్డయిట్స్‌లాగా యంత్రవిధ్వంసక పాత్ర నిర్వహిస్తూ క్యారక్టర్ అసాసినేషన్ ప్రచారం చేసింది.

ఫ్రాయిడ్ సైకాలజీ సిద్ధాంతాలు, ఫెమినిజం, ఐక్యరాజ్యసమితి, ప్రజాస్వామిక వ్యవస్థలు మొదలైన అన్నిటిపట్ల మార్క్సిజం యంత్రవిధ్వంసక పాత్ర నిర్వహించింది. ఇది తన ఐడెండిటీలో భాగంగా ఆధిపత్యాన్ని ప్రదర్శిస్తూ తన దృక్పథాన్ని అణచివేత సాధనంగా మార్చింది.

ఇది వారి సైద్ధాంతిక బాల్య అవస్థను, లడ్డయిట్స్ దశను తెలుపుతుంది. లడ్డయిట్స్ బాల్య దశలో వున్న రంగనాయకమ్మల వంటి అమాయకులకు, ఆవేశపరులకు ఇది అర్థం అవడం కష్టమే. మార్క్సిజంలో ఇలాంటి వారు సిద్ధాంత చర్చల్లో కొత్త సిద్ధాంతాల పట్ల యంత్ర విధ్వంసకులుగానే ఇప్పటికీ కొనసాగుతున్నారు.

సుప్రసిద్ధ నక్సలైట్ ఉద్యమ నిర్మాత చార్‌మజుందార్ బెంగాల్ రాష్ట్రంలో 1967లో విగ్రహ విధ్వంసం అనే నినాదాన్ని ఇచ్చాడు. విగ్రహ విధ్వంసం అనేది లడ్డయిట్స్ యంత్ర విధ్వంసక దశనే తెలుపుతుంది.

సోవియట్ రష్యాలో 1985లో పెరిస్త్రోయికా ప్రభంజనంతో స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను కోరి నియంతృత్వాన్ని వదిలించుకుంటూ ప్రజాస్వామిక వ్యవస్థ ఏర్పాటు చేసుకునే క్రమంలో జరిగిన ఉద్యమంలో మార్క్స్, ఏంగిల్స్, లెనిన్, స్టాలిన్ విగ్రహాలను



పడగొట్టారు. మార్క్సిస్టు సిద్ధాంతాలను వాటి ప్రతీకలను ధ్వంసం చేయడం ద్వారా వాటిని వదిలించుకున్న తీరును ఇవి తెలుపుతాయి. ఇవి విగ్రహ విధ్వంసం అని మార్క్సిజం 'నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష' అన్నట్టుగా జరిగిపోయింది.

### ఇండియాలో వామపక్షాలు కుల సమస్యను ఎప్పుడు సీరియస్‌గా తీసుకున్నాయి?

ఇండియాలో వామపక్షాలు కుల సమస్యను ఎప్పుడు సీరియస్‌గా తీసుకొన్నాయి? సోవియట్ రష్యాలో వామపక్షాల ప్రభుత్వాలు కూలిపోయి ప్రజాస్వామ్యం ఏర్పడ్డాక అటు వైపు చూడడానికి ఏమీ మిగలక తమలోకి తాము తొంగి చూసుకున్నట్టుగా ఇండియాలోకి తొంగి చూశారు. వారు తట్టుకోలేనంత విస్తృతంగా మండల్ కమిషన్ ఉద్యమం, బహుజన సమాజ్ పార్టీ భావజాలం బాగా విస్తరించడంతో కుల సమస్యను విధిలేక పట్టించుకున్నారు. ఫెమినిజంను అలాగే కొంతమేరకు పట్టించుకున్నారు. ఎదుటి పక్షం ఎంత శక్తిని సమకూర్చుకుంటుందో ఆ మేరకే వామపక్షాలు ఆయా సమస్యలను పట్టించుకున్నాయి. 1992 నుండి వామపక్షాలు కుల సమస్యను ఇలా పట్టించుకోవడం కొన్ని కార్యక్రమాలు తీసుకోవడం మొదలైంది.

కుల సమస్యపై చర్చలో నేను మా పాత మిత్రుడు, సహధ్యాయి గణపతి (ముప్పాల లక్ష్మణరావు – నేటి మావోయిస్టు పార్టీ కేంద్ర కమిటి కార్యదర్శి) కలిసి పని చేసే క్రమంలో నేను అంబేద్కర్ కుల సమస్యపై చేసిన సిద్ధాంత అధ్యయనాన్ని, సూచించిన పరిష్కారాలను స్వీకరించడం అవసరం అని 1987లో చెప్పాను. అతడు అంబేద్కరిజం పట్ల యంత్రవిధ్వంసకుడిగానే మాట్లాడాడు. నేను ఏమన్నానంటే అంబేద్కర్‌ను కనీసం మావో కన్నా ముందు ప్రజాస్వామ్య విప్లవం వైపు మావో అభిమానపాత్రుడైన చైనాలోని సన్‌యెట్‌సేన్‌ను గౌరవించినట్టుగానైనా గౌరవించి స్వీకరించాలి అని అన్నాను. ఆయన శ్రీపాద అమృత డాంగే అనే పాత కమ్యూనిస్టు నాయకుడు అన్న మాటల్ని తన మాటలుగా చెప్పాడు. అయిదేళ్ళ తర్వాత నావైపు నీవు వస్తావో, నీ వైపు నేను వస్తానో చూద్దాం అని చెప్పాను. నీవు ఒక మార్క్సిస్టు పార్టీకి కార్యదర్శివి అయినంత మాత్రాన మార్క్సిజానికి కార్యదర్శివి కాదు అని స్పష్టం చేశాను.

### విగ్రహ విధ్వంసం తిరిగి అదే ప్రతిచర్యను సృష్టిస్తుందా?

అటు తర్వాత 1993లో పీపుల్స్‌వార్ పార్టీ కుల సమస్యను గుర్తించింది. దాని పరిష్కారానికి ప్రత్యేక కార్యక్రమాలను చేపట్టింది. అయిదేళ్ళలో మాడు పగులగొట్టి నా మెదడును స్వీకరించారు.

మాడు పగులగొట్టి మెదడు స్వీకరించాలనుకుంటే ఇతరులు కూడా అదే పని చేస్తారు. లడ్డయిట్స్‌ను వ్యతిరేకించినప్పటికీ మార్క్సిజం క్యారక్టర్ అసాసినేషన్, విగ్రహ విధ్వంసం అనే లడ్డయిట్స్ కార్యక్రమాలను ఇంకా అన్ని రంగాల్లో కొనసాగిస్తూనే వున్నది. దాని పట్ల కూడా అదే ప్రతిచర్యలను సృష్టించుకుంటున్నది. మార్క్సిజం మాడు పగులగొట్టి మెదడును స్వీకరించడం నూతన సామాజిక చలనాలకు అవసరం. ఆ పని చేయకపోతే సమాజాన్ని తన పాత సూత్రాలకనువుగా వెనక్కి లాగుతుంది. కొత్తను నిరాకరిస్తుంది, అడ్డగిస్తుంది వ్యతిరేకిస్తుంది. క్యారెక్టర్ అసాసినేషన్ చేస్తుంది, యంత్రవిధ్వంసక పాత్ర నిర్వహిస్తుంది. మార్క్సిజం లడ్డయిట్స్‌గా ఉండకుండా కొత్త చలనాలకనువుగా నూతన

కర్తవ్యాలను కార్యక్రమాలను మార్క్స్ ఇచ్చినట్లుగా తిరిగి కొత్తగా రూపొందించుకోవాలి.

ప్రకాశ్ కారత్, సీతారామ్ ఏచూరి, గణపతి, తెలకపల్లి రవి, బి.వి.రాఘవులు, ఈడ్పుగంటి నాగేశ్వరరావు మొదలైన వాళ్ళు పాత ఇంజన్లను మార్చుకోవాలి. పాత రైలు పట్టాల మీద ప్రయాణం చేస్తే పాత గమ్యాలకే చేరుతారు. కొత్త రైలు పట్టాలు వెయ్యాలి. కొత్త ఇంజన్లను తయారు చేసుకోవాలి. పాత రైలు పట్టాలు పాత పద్ధతిలోనే ముందుకు నడుపుతాయి. "సోషలిస్టు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి వామపక్షాలు పూనుకోవాలి. ఆంధ్ర ప్రాంత పాలక వర్గ పార్టీలతో ఎట్టి పరిస్థితుల్లోనూ ఐక్య సంఘటన, సీట్ల సర్దుబాటు లేకుండా పోరాట పంథాను ఎన్నుకున్నప్పుడే వారిపట్ల ప్రజలకు విశ్వాసం కలుగుతుంది. ఈ పని చేయకుండా ఐక్య సంఘటన కట్టడం వారి ప్రాంతీయ తత్వాన్ని, కులతత్వాన్ని తెలుపుతుంది. ఈ తెలంగాణ రాష్ట్ర ఉద్యమం ఆంధ్ర ప్రాంత పరిపాలకుల, మేధావుల ముందు, వామపక్ష, నక్సలైటు, దళిత బహుజన మేధావుల ముందు, నాయకుల ముందు, సూటిగా పరీక్ష పెట్టింది. ఈ పరీక్షలో వర్గ దృక్పథమే గెలుస్తుందో, ప్రాంతీయ, కులతత్వ దృక్పథమే ఆంధ్ర ప్రాంత అన్ని పార్టీల నాయకులు, విద్యావంతులు కొనసాగిస్తారో తేలిపోతుంది. (తెలంగాణ రాష్ట్రం నడుస్తున్న చరిత్ర పేజి 20)

### నూతన సత్యాలను చాలా ఆలస్యంగా గుర్తించే వామపక్షాలు

ఇండియాలోని వామపక్ష వాదులు అర్థం చేసుకోని విషయాలు కొన్ని వున్నాయి. చైనా కన్నా ముందే ఇండియా స్వాతంత్ర్యం పొందింది. నిజానికి హోమ్‌రూల్ పేరిట 1935 మధ్యలోనే ఇండియా స్వాతంత్ర్య పొందే అవకాశం ఉండింది. పాత పత్రికలను తిరగేస్తే తెలుస్తుంది. చట్ట సభల్లో ఇండియన్‌లు 1917 నుండే పాల్గొంటున్నారు. శాసనసభలకు ఎన్నికవుతున్నారు. ఇప్పుడు రష్యా, తూర్పు యూరప్ దేశాలు ప్రజాస్వామ్య వ్యవస్థలోకి పరివర్తన చెంది ఇండియా ఎప్పుడో చేరుకున్న లక్ష్యాన్ని ఆలస్యంగా 1985లో చేరుకున్నాయి.

అలాగే నేపాల్ మావోయిస్టు నాయకుడు ప్రచండ తిరిగి పాత సత్యాన్ని చేరుకోవడానికి ప్రజాస్వామ్యాన్ని గుర్తించడానికి 35 ఏళ్ళు పట్టాయి. ఇండియాలోని వామపక్షాలు, మావోయిస్టు పార్టీలు ఈ అవగాహనకు రావడానికి మరో 35 ఏళ్ళు పట్టాలా? ప్రజాస్వామ్యం ఇచ్చే అవకాశాలు ప్రజలకు మేలు చేయడానికి ఉపయోగించుకోలేని వారు ఏ అవగాహనలో వున్నట్లు?

### ఓటు హక్కు ప్రాధాన్యత

రాజ్యాధికారం ద్వారానే సమస్యలు పరిష్కారం అవుతాయి అనడం అంటే ఏమిటి? రాజ్యాధికారం లేకపోతే ఏమి చేయలేం అని చెప్పడమే ఇది. రాజ్యాధికారం లేకపోతే ఏమి చేయలేం అని కాంగ్రెస్ మొదలుకొని అన్ని పార్టీల నాయకులు చెపుతున్న మాటే. వారికి మార్క్సిస్టులకు తేడా ఏమి లేనట్టే. అయితే గాంధీ, మార్క్స్, ఏంగిల్స్, అంబేడ్కర్, అన్నాహజారే, రాజేందర్‌సింగ్ మొదలైనవాళ్ళు రాజ్యాధికారం లేకుండానే ఎన్నో సాధించారు. వారనుకున్న రంగాల్లో ఎన్నో మార్పులు తెచ్చారు. రాజ్యాధికారం లేకపోతే ఏమి చేయలేం అనే మాట వర్తమాన కర్తవ్యాలను, కార్యక్రమాలను వదిలివేయడమే.

రాజ్యాధికారం కావాలనుకున్నప్పుడు ఆలోచించాల్సిన తీరేమిటి? తుమ్మితే



పడిపోయే ప్రభుత్వాల కోసం సాయుధ పోరాటాలు అవసరం లేదు. సాయుధ పోరాటాలు సాధనమే తప్ప లక్ష్యం కాకూడదు. సాయుధ పోరాటం లక్ష్యంగా సాగడం మార్క్స్, ఏంగెల్స్‌లు పారిస్ కమ్యూన్ గుణపాఠాల నుండి చేసిన సూత్రీకరణ పర్యవసానమే. సొంత సైన్యం ఉండాలనే మార్క్స్, ఏంగెల్స్‌ల అభిప్రాయం యూరప్‌లోని సైన్యాన్ని పెంచి కిరాయికిచ్చే యుద్ధ ప్రభువుల ఆలోచనే.

సాయుధ సైన్యాన్ని తయారు చేసుకోవడం ద్వారానే రాజ్యాధికారం సంపాదించాలి అనుకోవడంతో మరో మలుపు తిరిగింది. అప్పుడు అలెగ్జాండర్‌కు మార్క్సిస్టు సాయుధ పోరాటాలకు మధ్య తేడా ఏమీ లేదు. ఈ రెండు సైన్యం ద్వారానే విజయాలను సాధించే లక్ష్యాలను కలిగి వున్నాయి. అందువల్ల మార్క్సిజం సిద్ధాంతాలతో ఇక పనేమిటి? ఎలాంటి సిద్ధాంతాలు లేకుండా కూడా ఎందరో రాజులయ్యారు, చక్రవర్తులయ్యారు. సామ్రాజ్యాలు స్థాపించారు. ఈ కాస్త దానికి బండెడు సిద్ధాంతాలు దేనికి? చక్కగా సాయుధ సైనికుల నిర్మాణమే చాలు. సిద్ధాంత గందరగోళాలు మనుషులను, మేధావులను మభ్య పెట్టడానికే.

ఇలా సాయుధ పోరాటం ఒక సాధనంగా కాకుండా లక్ష్యంగా మారితే రాజరిక మధ్య యుగాల రాజ్యాల స్థాపనకు నేటి యుద్ధాలకు తేడా లేకుండా పోతుంది. సాయుధపోరాటం సాధనంగా తీసుకున్నా జరిగేది కూడా అదే.

### మార్క్సిజం తల్లి కావాలి

మార్క్సిజం తల్లి కావాలి. అది పెట్టుబడిదారీ వ్యవస్థ కని పెంచిన ముద్దుబిడ్డ. మార్క్సిజం తనను కన్న పెట్టుబడిదారీ తల్లిలాగే కొత్త సిద్ధాంతాలకు, కొత్త ఆచరణలకు జన్మనిచ్చి తాను కూడా ఒక తల్లి కావాలి. మార్క్సిజం రష్యా, చైనా, క్యూబా సోషలిస్టు వ్యవస్థలు అనే తల్లి కడుపున మార్క్సిజాన్ని తలదన్నే మరో కొత్త సిద్ధాంత శిశువు ఉద్భవించవలసి వుంది. పెట్టుబడిదారీ వ్యవస్థను, హెగెలిజాన్ని, ఫ్యూర్‌బాను, రాజరికాన్ని తలదన్ని మార్క్సిజం పుట్టింది. అలాగే సోషలిస్ట్ వ్యవస్థలో మార్క్సిస్టు సిద్ధాంతాన్ని సోషలిస్టు వ్యవస్థను తలదన్నే నూతన సిద్ధాంతాలకు మార్క్సిజం కన్నతల్లి కావాలి.

ఈ ప్రకృతి సూత్రాన్ని మార్క్సిజంలోని రాజకీయ అర్థశాస్త్రవాదం, అధ్యయనం పద్ధతి (చారిత్రక భౌతికవాదం) నిరాకరిస్తున్నది. అందువల్ల అది గొడ్రాలైపోతున్నది. తద్వారా అది కొత్త శిశువుల్ని కనకుండానే రష్యా, చైనా తదితర దేశాల్లో గొడ్రాలుగానే రాలిపోయింది. పెట్టుబడిదారీ కన్నతల్లి యింటికి తిరిగి చేరుకుంది. రష్యాలో 1985 నుండి పూర్తిస్థాయిలో ప్రజాస్వామిక వ్యవస్థ పెట్టుబడిదారీ విధానం తిరిగి అమల్లోకి వచ్చింది.

రాజకీయ నాయకుల చేతుల్లో, పిడివాదుల చేతుల్లో మార్క్సిజం దిగజారి పోయింది. కొత్త శిశువులకు జన్మనిచ్చి తాను అమ్మమ్మను, నానమ్మను కావాలని అనుకోలేకపోతున్నది. నయాబూర్జువాలకు నానమ్మ అయ్యిందని నోమ్‌చామ్‌స్కీ లాంటి వాళ్ళ అభిప్రాయం. కొందరు స్త్రీ వాదులు మాతృత్వాన్ని వాయిదా వేసుకోవడం కూడా యిందులో భాగమే. పూర్వం దేవతలు నిత్యయవ్వనులు అనే నుడికారం వుండేది. వారు అమృతం తాగడంవల్ల ఎప్పుడూ 33 ఏళ్ళ వయసు వారిలాగే కనపడేవారట! ఇలా

మార్క్సిజం కూడా నిత్యయవ్వనంగా ఉండాలని కోరుకుంటున్నది. అందుకు కొత్త వాస్తవాలతో నిరంతరం సంబంధం పెట్టుకుని ఆచరిస్తే సరిపోతుందట! కాగా అది ముసలివాళ్లు బాలికల్తో సంపర్కం జరపడం వంటిది కూడా.

### మార్క్సిజం స్వయంగా ఒక సామ్రాజ్యవాదం

మార్క్సిజం నిత్య యవ్వనంగా ఉండాలనుకోవడం ఒక సామ్రాజ్యవాదం. అది మార్క్సిస్టు సామ్రాజ్యవాదం. లోకమంతా తాను చెప్పిన పద్ధతిలో మారుతుందనడమే మార్క్సిస్టు సామ్రాజ్యవాదం. తాను మాత్రమే సర్వ సమగ్రం అనడం స్వయంగా ఒక సామ్రాజ్యవాదం. ఇదంతా తానే అంతిమ సత్యం అని ప్రకటించుకున్న హెగెలిజం, ఇస్లాంవాదం, క్రైస్తవవాదాల సారమే మార్క్సిజమనే కొత్తరూపంలో కొనసాగడమే.

### మార్క్సిజం మోనిజమ్‌గా ఎందుకు ఆవిష్కరించబడింది? దానికి గల చారిత్రక పునాదులేమిటి?

మార్క్సిజం మోనిజమ్‌గా ఎందుకు ఆవిష్కరించబడిందో, దానికి గల చారిత్రక పునాదులేమిటో పరిశీలించడం అవసరం. ఆ మోనిజం అది పుట్టిన ప్రాంతాల సామాజిక పరిణామాలకు సంబంధించినదే. అందువల్ల ఆ మోనిజంను మార్చి ప్లూరలిజంగా ఎదగడానికి ఆ సిద్ధాంతం పుట్టిన చరిత్రను పునరుధ్యయనం చేయడం అవసరం.

జర్మనీ, ఫ్రాన్స్, ఇంగ్లాండు దేశాల ఒక నిర్దిష్ట చారిత్రక భౌతిక పరిస్థితుల నుండి మార్క్సిజం పుట్టింది. అందువల్ల అది గొౖడాలు కావడం అనేది అది పుట్టిన యూరోపు చారిత్రక భౌతిక పరిస్థితులకు సంబంధించినదే. ఆ చారిత్రక భౌతిక పరిస్థితులేమిటి? వాటి పరిమితులేమిటి?

ఏక జాతి, ఏక భాష, ఏక మత, రాజ్యాలు స్వతంత్ర దేశాలుగా స్వంత అస్తిత్వం పొందిన పెట్టుబడిదారీ భౌతిక ప్రాతిపదిక నుండి మార్క్సిజంలోని అద్వైతం (ఏకైకవాదం) తానే సర్వసమగ్రం అనే వాదం పుట్టింది. ఇలా మార్క్సిజానికి మతాల విస్తరణ, రాజ్యాల విస్తరణ, జ్ఞాన విస్తరణ, పెట్టుబడిదారీ విస్తరణలు ఆయా రంగాల్లో సామ్రాజ్యవాదాలుగా, ఆసియా, ఆస్ట్రేలియా, అమెరికా, ఆఫ్రికా ఖండాలకు సాగిన యూరప్ వలసలు వలసవాదాలు భౌతిక, బౌద్ధిక ప్రాతిపదికల్ని వేశాయి. రాజ్య, జ్ఞాన, మత, పెట్టుబడిదారీ సామ్రాజ్యవాదాల్లాగే వలసల్లాగే, అందులో భాగంగానే "సకల దేశ కార్మికులారా ఏకం కండి" అనేది ఒక రూపం తీసుకుంది.

ఏక జాతి, ఏక భాష, ఏక మత, పెట్టుబడిదారీ, దృక్పథాలు, రాజ్యాలు, దేశాలు, మార్క్సిజాన్ని తనదైన ఇస్లాం, క్రైస్తవం, హెగెలిజం వంటి ఒక అద్వైత వాదంలోకి కుదించింది. వీటి పరిమితులేమీ మార్క్సిజానికి లేవు అనేవారు ఆయా నిర్దిష్ట స్థల, కాల పరిస్థితులను లెక్కలోకి తీసుకోనివారవుతారు. గనక వారు భావవాదులో, మరొకరో అవుతారు గాని గతితార్కికులు కారు. ఏక జాతి, ఏక మత, ఏక భాష, పెట్టుబడిదారీ వలసవాదాల్ని తాత్వీకరించడం నుంచే "సకల దేశ కార్మికులారా ఏకం కండి" అనే దృక్పథం పుట్టింది.

ఇలా మార్క్సిజం భావజాలంలో వలసవాదంగా సామ్రాజ్యవాదంగా తన ఉనికిని ఉత్పన్నం చేసికొంటున్నది. అందువల్లే మార్క్సిజం కూడా వలస వాదాల్లాగే ఇతర



దేశాలకు ఒకే ప్రదేశం నుండి లేదా ఒకే కేంద్రం నుండి విస్తరిస్తూ, దిగుమతి అవుతూ జ్ఞాన సిద్ధాంతరంగాల్లో భావజాల వలసల్ని, భావజాల సామ్రాజ్యవాదాల్ని స్థాపించుకొంది. మార్క్సిజం యితర దేశాల్లో జ్ఞాన సిద్ధాంతాన్ని, మానవాచరణని, అభివృద్ధి పరచడం అనేది బ్రిటీష్‌వాళ్లు మన దేశంలో రైళ్ళు వేయడం వంటిదే, సి.పి.బ్రౌన్ మన తెలుగు భాషను అభివృద్ధి చేయడం వంటిదే.

### ప్రతిజాతి సర్వసత్తాకం అనుకున్న దృష్టి నుంచి మార్క్సిజం మోనిజం అయింది

ప్రతి జాతి తనకు తాను సర్వసమగ్రం, సర్వసత్తాకం అనుకున్న ఏకజాతి, ఏక మత, ఏక దేశ వాదం నుండి నాదే సమస్త పర్టిక్యులర్‌లను కలుపుకున్న సమగ్ర వర్గ సిద్ధాంతం అనే వాదం పుట్టింది. మార్క్సిజంలోని ఏకైక వాదానికి ఏక జాతి, ఏక దేశ, ఏక మత సర్వసత్తాక సిద్ధాంతం, వలసవాదం ప్రాతిపదికలు, అంతేతప్ప అది 'సకల దేశ కార్మికులారా ఏకం కండి' అనే ఏకైక అద్వైత వాదానికి సంబంధించినది కాదు.

కార్మికవర్గం, కార్మికవర్గ పార్టీలు వర్గ, జాతి, కుల, మత, దేశ, ప్రాంత ప్రాతిపదికలపై తద్వారా విడివిడి దృక్పథం ఆచరణల ప్రాతిపదికపై విడిపోయి దేనికదే సర్వస్వం అనుకుంటూ అస్తిత్వంలో కొనసాగడం అందుకొక ప్రత్యక్ష సాక్ష్యం. చివరకు యివన్నీ మార్క్సిజం అనే యూనివర్సల్ యొక్క పర్టిక్యులర్స్‌ని, విభిన్న వ్యక్తీకరణలే అని చెప్పడానికి అవకాశం లేని స్థాయికి మార్క్సిజం కుదించుకుపోయింది. అది ఏక జాతి, ఏక మత, ఏక దేశ, వలసవాద సిద్ధాంతాన్నే ఏకైక అద్వైతవాదంగా స్వీకరించిన పరిమితే తన ప్రతి పర్టిక్యులర్‌ను తనది కాదని దూరం చేసికొనే దృక్పథాన్ని ఉత్పన్నం చేసింది. ఇందుకు సైద్ధాంతిక ప్రాతిపదికగా పరస్పర విరుద్ధాంశాల-వైరుధ్య సూత్రం అత్యంత దుర్వినియోగపరచబడింది. పర్టికులర్, యూనివర్సల్ చర్చతో సమన్వయిం చాల్సినచోట వైరుధ్యం, రెండు విరుద్ధాంశాల సూత్రాన్ని తెచ్చి మార్క్సిజాన్ని కూడా వేలముక్కలు చేశారు.

### మార్క్సిజం దృక్పథంలో చలనాలు భిన్నత్వంగా ఎందుకు కొనసాగుతున్నాయి?

అంతర్గత వైరుధ్యాల్లోంచే ప్రతి దాని పరిష్కారం అభివృద్ధి సాగుతుందనేది గతితార్కిక మౌలిక సూత్రాల్లో ఒకటి. దీన్ని మార్క్సిజం కొంతమేరకు స్వీకరించినా పూర్తి స్థాయిలో ఆచరించలేకపోయింది. అందుకు కారణం అది ఏ దృక్పథమైనా సరే దృక్పథం అనేదే స్వయంగా ఒక రాజ్య వ్యవస్థగా విస్తరణవాదంగా, సామ్రాజ్యవాదంగా కొనసాగడమే.

అంతర్గత వైరుధ్యాల్లోంచే ప్రతిదాని పరిష్కారం అభివృద్ధి సాగుతుందనే సత్యం ఒక అర్థంలో "దృక్పథం" అనే దాని అవసరాన్ని అదృశ్యం చేసింది. ఒక వస్తువు యొక్క అంతర్గత వైరుధ్యాల్ని, సంబంధాల్ని అంశాల్ని కోణాల్ని వెలికితీయడమే అసలు కర్తవ్యం. ఇంక దానికి దృక్పథాలతో ఏం పని?

### దృక్పథం ఎందుకు అదృశ్యం కావాలి?

అయితే మార్క్సిస్టు దృక్పథం దీన్ని ఆచరించలేకపోయింది. అది సహజం. ఎందుకంటే అది జరిగినపుడు మార్క్సిజం ఒక దృక్పథంగా కూడా అదృశ్యమవుతుంది. అయితే అది తాత్విక, భావజాల భౌతిక తదితర రంగాల్లో ఒక శాస్త్రంగా వెలుగునిస్తుంది.

అదొక రాజకీయ మార్క్సిస్టు పార్టీగా ఒకే ఒక పార్టీగా రూపొందే దృక్పథం అదృశ్యమవుతుంది. పార్టీ కాన్సెప్టుతోపాటు, కార్మికవర్గ రాజ్యాధికార భావన కూడా అదృశ్యమవుతుంది. అందువల్లే మార్క్సిస్టు దృక్పథం 'అంతర్గత వైరుధ్యాలే ప్రాథమిక సూత్రం' అనే సత్యాన్ని ఆచరించలేకపోయింది. అందులో భాగంగానే మార్క్సిజం లేకపోయినా సామాజిక వాస్తవాలు సామాజిక ఆచరణ విప్లవాన్ని విజయవంతం చేస్తాయి అని చెప్పలేకపోయింది.

### అంతర్గత వైరుధ్యాలే ప్రాథమికం అని నిజంగా ఆచరించడానికి మార్క్సిజం సిద్ధంగా వుందా?

అంతర్గత వైరుధ్యాలే ప్రాథమికం అనే సూత్రం ఆచరణలోకి రావడాన్ని స్థూలంగా చెప్తే ప్రధానంగా మార్క్సిజం చదవని వారినుండి ఆయా దేశాల్లో, వర్గాల్లో, కులాల్లో, జాతుల్లో, రంగాల్లో, ప్రాంతాల్లో మార్క్సిస్టు ఆచరణ, విప్లవం ఉత్పన్నం కావలసి వుంటుంది. అనగా మార్క్సిజం చదవనివారు తమ తమ పరిష్కారాల రూపంలో అభివృద్ధిపరిచిందంతా కూడా కలిపి సమన్వయించినపుడే అది విప్లవం మార్క్సిజం అవుతుంది. అపుడే ఆయా అంతర్గత వైరుధ్యాల్లోనే దాని పరిష్కారం వుంటుందనే వాస్తవాన్ని మార్క్సిజం పూర్తిస్థాయిలో ఆచరించినట్టవుతుంది. అంతదాకా బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీల ఒకనాటి సామ్రాజ్యవాదం, మార్క్సిజం రూపంలో కొనసాగుతుంది. ఈ స్థితి అంతమయ్యేదాకా "సకలదేశ కార్మికులారా ఏకం కండి" అని మార్క్సిస్టు రాజకీయ అర్థశాస్త్రానికి, తాత్విక స్థాయిలో కొనసాగుతున్న ఏక జాతి, ఏక దేశ, ఏక మత, ఏకైక అద్వైత సిద్ధాంతానికి మధ్య ప్రచ్ఛన్న యుద్ధమే కొనసాగుతుంది. ఈ ప్రచ్ఛన్న యుద్ధం నుండే మార్క్సిజం గొర్రెలుగా మిగిలిపోతున్నది. దాని ఆచరణ, దృక్పథం ఐక్యత నుంచి విచ్ఛిన్నతకు, అనైక్యతకు పయనిస్తున్నది.

### ఆరెసెస్, మార్క్సిజం మధ్య వున్న ఏకసూత్రత ఏమిటి?

ఇదే కోవలో ఆరెసెస్ ఏకమత ఏకహిందూ జాతి, ఏక దేశ వాదంను ప్రాచుర్యంలోకి తెస్తున్నది. ఏ జాతికాజాతి (తెలుగు, తమిళ వగైరా) స్వంత దేశాలుగా విడిపోయే ఏకజాతి ఏక దేశ వాదాన్ని కొందరు ప్రాచుర్యంలోకి తెస్తున్నారు. అయితే యిప్పటికి అలా జరగలేదు. చైనా అమెరికాల్లోని 56 రాష్ట్రాలు దేశాలుగానో, అంతకు ఎక్కువగానో విడిపోయే ముందు గానీ, తర్వాత గానీ మన దేశంలోనూ అలా జరగవచ్చు. ప్రస్తుతానికి అది వాస్తవం కాదు. వేల ఏళ్ళుగా భిన్నత్వంలో ఏకత్వం, ఏకత్వంలో అనేకత్వం మన వాస్తవికతగా, మన ఆచరణగా, మన తాత్విక దృక్పథంగా కొనసాగుతున్నది. సమస్త ఆచరణలను, దృక్పథాలను, పరిష్కారాలను పరిష్కరించిన రూపమే యిది. భిన్నత్వంలో ఏకత్వానికి, ఏకత్వంలో అనేకత్వానికి కుల వ్యవస్థ, అది నిర్మించిన గ్రామీణ స్వయం పోషక ఆర్థికవ్యవస్థ ఒక పరాకాష్ఠ.

ఆర్.యస్.యస్. భిన్నత్వంలో ఏకత్వాన్ని, ఏకత్వంలో అనేకత్వాన్ని మాట వరసకు అంగీకరించినా, దాని దృక్పథం ఆచరణ రెండూ, మార్క్సిస్టుల్లాగే ఏకైక అద్వైత వాదమే. మార్క్సిజం కార్మికవర్గ నియంతృత్వాన్ని ప్రతిపాదిస్తే ఆరెసెస్ హిందువుల నియంతృత్వాన్ని ప్రతిపాదిస్తున్నది. తాత్వికంగా ఉన్న తేడా అల్లా యిదే. ఆరెసెస్ చెప్పే హిందువుల



నియంతృత్వం అంటే అగ్రవర్ణాలు, అగ్రకులాలు మైనారిటీల మీద, పీడిత కులాలమీద అధికారం చెలాయించడమే. కమ్యూనిస్టులు చెప్పే కార్మికవర్గ నియంతృత్వం కార్మికవర్గ రాజకీయ పార్టీ అగ్రనేతలయొక్క నియంతృత్వంగా ఎలా వాస్తవాచరణ సాగిందో, సాగుతున్నదో, అలాగే హిందువుల పేరుమీద ఆరెసెస్ పాలకవర్గ అగ్రవర్ణ, అగ్రకుల ఆధిపత్యవాదమే చెలాయిస్తుంది. వారి ప్రయోజనాలనే ప్రాథమికం చేస్తుంది.

### మతాల్లోని మోనిజమే మార్క్సిజంలో వచ్చి చేరింది

క్రైస్తవం, ఇస్లాం, మార్క్సిజం, మతాల్లో గల పైన చెప్పిన ఏకైక అద్వైత సర్వస్వవాదం అనేది వాస్తవం కాదని మార్క్స్, ఏంగిల్స్‌లు యూదు మత దృక్పథాన్ని మార్క్సిజంలో కొనసాగించారని ఇటీవల అనేక గ్రంథాలు వెలువడ్డాయి.

సమన్వయంతో ఆలోచించినప్పుడు ఈ సమాజానికి మార్క్సు, ఎంగెల్సు ముద్దుబిడ్డలు. అలాగే చార్వాకులు, బుద్ధుడు, గురునానక్, కబీరు, వేమన, పెరియార్, నారాయణగురు, జ్యోతిబాపులే, అంబేద్కర్‌లు కూడా ఈ సమాజానికి ముద్దుబిడ్డలు. వీరు సమాజానికి తండ్రులు కాదు. సమాజానికే వీరు ముద్దుబిడ్డలు. సమాజానికే వీరిని తండ్రులంటే అంతకుముందటి సమాజ చరిత్రను వీరికనువుగా వక్రీకరించడం జరుగుతుంది. మార్క్సిజానికి మార్క్సు, ఎంగెల్సులు ప్రాతిపదిక కాదు. కొన్ని ప్రకృతి, సమాజ చలన సూత్రాలు మార్క్సిజానికి ప్రాతిపదిక. అదనంగా కొన్ని కలిపి చెప్పకపోతే అంతకుముందున్నది కొత్తగా మార్క్సిజంగా ఎలా అవుతుంది? వారు కొన్ని అదనంగా చెప్పిన మాట వాస్తవం.

మార్క్సిజాన్ని, అంబేద్కరిజాన్ని అభివృద్ధిపరచడం అంటే ఆయా దృక్పథాలు ఏ ప్రాతిపదికలపై ఆవిర్భవించాయో, ఆ ప్రాతిపదికలను అనగా ఆయా ప్రకృతి సమాజాలను అభివృద్ధిపరచడం, తద్వారా పాత ప్రాతిపదికలైన ప్రకృతి సమాజాలు, వాటి చలన సూత్రాలు అభివృద్ధి అవుతాయి. అవి కొత్త ప్రాతిపదికలుగా కొత్త దృక్పథాలు, కొత్త ఆచరణలు ఆవిర్భవిస్తాయి. అందులో సమస్త దృక్పథాలతోపాటుగా మార్క్సిజం, నీళ్ళల్లో మంచులా కరిగి సొంత అస్తిత్వం కోల్పోతాయి. చివరకు అవి చరిత్రగా మిగిలి వాస్తవాలు అంతకన్నా అభివృద్ధి అవుతాయి. అందువల్ల మార్క్సిజాన్ని అభివృద్ధి పరచడం అనేవి ఈ తాత్వికార్థంలో అర్థంలేని విషయాలవుతాయి. అది వారి కాలంనాటికి వెనక్కి మళ్ళించడం అవుతుంది.

### మార్క్సిజాన్ని అభివృద్ధి పరచడం అనవసరం

అసలు మార్క్సిజాన్ని అభివృద్ధి పరచడం దేనికి? మార్క్సిజాన్ని అభివృద్ధి పరచడం అనవసరం. మార్క్సిజాన్నో, మరోయిజాన్నో అభివృద్ధి పరచాలని కోరేవారు వాస్తవాలకన్నా, ఆ వాస్తవాల గురించి ఏర్పడ్డ దృక్పథం ప్రాతిపదిక అని భావిస్తున్నారు. అందువల్ల మార్క్సిజాన్ని అభివృద్ధి పరచాలి అనే వాదనలు పుట్టాయి.

వాస్తవాలకన్నా దృక్పథాలు ప్రాథమికం అని ఆచరించడం నుంచే వాటిని అభివృద్ధి పరచాలనే వాదాలు పుట్టుకొస్తాయి. ఇవి ఒక దశ దాటాక ఆయా సిద్ధాంతాలు మనుషులను సొంతకాళ్ళు, సొంత అస్తిత్వం, సొంత బుర్ర లేనితనాన్ని, భక్తితత్వాన్ని తాత్వీకరించి ఆదర్శీకరిస్తాయి.

అలా యివి భౌతిక వాస్తవాలను కాకుండా, వాటి ప్రాతిపదిక నుండి పుట్టిన దృక్పథాలను ప్రాథమికం చేస్తుంటాయి. కనక యివి భావవాదంగా మారిపోవడం వెంట్రుకవాసిలో పని. ఏమంటే ఆయా నిర్దిష్ట దృక్పథాలు ప్రాథమిక ప్రాతిపదిక కావడం వున్నది. మార్క్సిజం వీరభక్తులు మార్క్సిజాన్ని పూజిస్తారు. వీరపూజ చేస్తారు. మార్క్స్, ఏంగిల్స్, లెనిన్, మావో, గ్రామ్‌సీ, చారుమజుందార్ మొదలైన వారిని దశావతారాలని ప్రకటిస్తూ పోతారు.

అప్పుడవి విశ్వాసాలుగా కొనసాగుతాయి. అవిశ్వాసం నశించిన దశే మూఢ విశ్వాసం అని పైన చూశాం. సోషలిజంపట్ల కమ్యూనిజం పట్ల ఏమాత్రం అవిశ్వాసం లేనివాళ్ళంతా మూఢ విశ్వాసులే. వాస్తవాలు ప్రాతిపదిక కాకుండా దృక్పథాన్ని ప్రాతిపదిక చేసికోవడంవల్ల మార్క్సిస్టులు, మార్క్సిస్టులని పిలువబడేవాళ్లు సోషలిజం, కమ్యూనిజంపట్ల మూఢ విశ్వాసపరులయ్యారు. నూతన తరాలు, నూతన సిద్ధాంతాలను, నూతన చలనాలను కనుక్కొంటాయి. ముందుకు సాగుతుంటాయి. అందువల్ల మార్క్సిజాన్ని అభివృద్ధి పరచడం అనవసరం. అన్ని సిద్ధాంతాల్లాగే అది కూడా ఒక సిద్ధాంతంగా పాత పద్ధతిలోనే ఉంచడం మంచిది. తద్వారా కొత్త సిద్ధాంతాలు వాటిని చర్చించడం ద్వారా వారి వారి కొత్త కోణాలను, కొత్త చారిత్రక అవసరాల్లో ముందుకు తెచ్చిన చరిత్ర రికార్డు అవుతుంది. మార్క్సిజం అభివృద్ధి పరచుకోవడం పేరిట ఆయా సిద్ధాంతాల, సిద్ధాంత కర్తల చరిత్రను మాయం చేస్తున్నారు. వక్రీకరిస్తున్నారు. తద్వారా సిద్ధాంత ఆవిష్కర్తలను మాడుపగులగొట్టి చంపుతారు. వాటిని కొంత స్వీకరించి ఎక్కువ విమర్శించి, అనుచరులే గురువును చంపి తామే గురువులుగా నాయకులుగా, సిద్ధాంత ఆవిష్కర్తలుగా తమకు తాము ప్రకటించుకుంటున్నారు. ఇది చారిత్రక పరిణామాలకు, చరిత్ర రచనకు విరుద్ధమైన పని విధానం. అందువల్ల మార్క్సిజాన్ని అభివృద్ధి పరచడం అనవసరం. మార్క్సిజాన్ని అభివృద్ధి పరచుకుంటూ వెళితే అది లేని ఆధిక్యతని, లేని గొప్పతనాన్ని, లేని గాఢతను ఉన్నట్టుగా నటిస్తుంది.

### ఏది ఏకైక వైరుధ్యం కాదు - ప్రధాన వైరుధ్యం కాదు ప్రధాన వైరుధ్య చర్చ సైనికీకరణకు సంబంధించిందే

ఈ తాత్విక విశ్లేషణా నేపథ్యంలో కులం అనేది ఏకైక వైరుధ్యం కాదు అని విడిగా స్పష్టం జేయనవసరం లేదనుకుంటాను. ప్రతి మనిషికి ఒకే ఓటు, ఒకే విలువ. ఓట్ల రాజకీయాలవల్ల కులసమస్యకు రాజకీయాల్లో ప్రాధాన్యత ఏర్పడింది. కులాన్ని ప్రధాన వైరుధ్యం అనే వాళ్ళు యూరోపియన్ వలసవాద మార్క్సిజాన్ని మనువు అద్వైత వాదాన్ని అత్యంత బలహీనంగా కులవ్యవస్థకు అన్వయిస్తూ, వర్గవాదంలాగే కులవాదాన్ని ఘనీభవింపజేసే ప్రయత్నం చేస్తారని స్పష్టం అవుతున్నది. ఇది వారి ఐడెంటిటీ (గుర్తింపు) సమస్యలో భాగంగా నాయకత్వ స్వార్థ కాలక్రమంలో భాగంగా, అనుభవ వాదంలో, పైన చెప్పిన ఏక జాతి, ఏక దేశ, ఏక మత సిద్ధాంత అద్వైతవాదం కుల రూపం పొందడంలో భాగంగా ఉత్పన్నమవుతున్నది.

ప్రపంచంలో ఏకైక ప్రధాన వైరుధ్యం అంటూ ఏదీ వుండదు. అది విభిన్న పర్టిక్యులర్ నిర్దిష్ట వ్యక్తీకరణల్లో పలు వాస్తవాల రూపంలో అస్థిత్వంలో కొనసాగడమే



అందుకు కారణం. అందువల్ల ఒక వాస్తవానికి ఎన్నో వ్యక్తీకరణలుంటాయి. ఏక కాలంలో ఎన్నో ప్రధాన వైరుధ్యాలుంటాయి. అందువల్ల వర్గం అనేది ఏకైక ప్రధాన వైరుధ్యం కాదు. అనేక ప్రధాన వైరుధ్యాల్లో వర్గం అనేది కూడా ఒకటి. సరిగ్గా చెప్పాల్సివస్తే వాస్తవం అనే యూనివర్సల్ యొక్క ఒకానొక పర్టిక్యులర్ వ్యక్తీకరణ వర్గం. వర్గ దృక్పథానికి అంతకుమించిన ప్రాధాన్యతేమీ లేదు.

జిడ్డు కృష్ణమూర్తి ఇలా అంటాడు "గతించిపోయిన సంస్కృతుల గురించి మాట్లాడే మనుష్యులకు ఆలోచించే శక్తి తక్కువ. వాళ్లు జరిగిపోయిన వాటిని, గ్రంథాల్లో వున్న విషయాలను మళ్లీ మళ్లీ వల్లె వేస్తూ వుంటారు. ఇది ప్రజలను జోకొట్టే మత్తుమందుగా చక్కగా పనిచేస్తుంది. కాబట్టి వాటన్నింటినీ మనం తిరస్కరించాలి. వాటన్నింటినీ శుభ్రంగా వూడ్చి అవతల పారేయవచ్చు. పారవేసి తీరాలి.

విప్లవాలను, ఫ్రెంచి విప్లవం, రష్యన్ విప్లవం, కమ్యూనిస్టు విప్లవాలను 'ఉండవలసినది' ఏమిటి అన్న సిద్ధాంతం మీద నిర్మించారు. లక్షలాది ప్రజలను హతమార్చాక, సిద్ధాంతాలంటే ప్రజలకి విసుగుపుట్టిందని వాళ్లు కనిపెడుతున్నారు. కాబట్టి యికపై మీకు సిద్ధాంతవాదులు వుండరు, యికపై మీకు నాయకులు వుండరు. ఇకమీదట మీరు ఏమి చేయాలో చెప్పడానికి ఎవరూ వుండరు. ఇప్పుడు ప్రపంచాన్ని మీకు మీరుగా ఎదుర్కోవాలి. ఒంటరిగా, నిష్క్రియగా కూర్చోడానికి వీల్లేదు." గ్లోబలైజేషన్ పరిణామాల్లో జిడ్డు కృష్ణమూర్తి మాటలకు కొత్త విలువ జత పడింది. ఆ విలువ ఏమిటో గ్లోబలైజేషన్ అధ్యాయంలో పరిశీలిద్దాం.

### కులం ఒక వ్యవస్థ, కులం ఒక ఉత్పత్తి సంబంధం

కులం అనేది యిప్పటికీ ఒక ఉత్పత్తి సంబంధం, ఒక వాస్తవం, ఒక దృక్పథం ఒక ఆచరణ, ఒక సంస్కృతి, ఒక పెట్టుబడి, ఒక సంపద, ఒక విలువ. అది ఒక మారకపు విలువ, ఉపయోగపు విలువ కూడా. అయితే యీ సమాజంలో మరెన్నో అంశాలున్నాయని కూడా పైన చూశాం. దాన్నే మనం వర్గ, కుల, లింగ, ప్రాంత, భాష, జాతి, మత తదితర అసమానతలకు వ్యతిరేకంగా, వ్యక్తి-సమాజం, మనిషి-మానవత మానవ సంబంధాలు ప్రాథమికంగా ఉద్యమించవలసి వున్నదని స్థూలంగా చెప్పడం జరుగుతున్నది. వ్యక్తికీ సమాజానికీ మధ్య గల వైరుధ్యాల్లో యివి పొందే కొత్త రూపాల్ని, బలాల్ని వ్యక్తికీ సమాజానికీ మధ్య గల వైరుధ్యంలో భాగంగా సంబంధంలో భాగంగా ఒక సమన్వయంలో పరిష్కరించే కృషి చేసినపుడు ఆయా దృక్పథాల ఘనీభవనం, పరిమితులు, అభివృద్ధి నిరోధకత్వం మంచులా కరిగిపోతాయి. అపుడు దృక్పథం సమస్త వాస్తవాల్ని ఒక సమన్వయంలో పరిశీలించే స్థాయికి ఎదుగుతూ తనలో గల యితర వాస్తవాలను గుర్తించని మాయావాదాన్ని, యితర వాస్తవాలపై, యితర దృక్పథాలపై, ఆచరణలపై గల అణిచివేత, అస్పృశ్యత స్వభావాల్ని, వైషమ్యాల్ని అదృశ్యం చేసికొంటూ ముందుకు సాగడం సాధ్యమవుతుంది.

### ఈ వ్యవస్థను మార్చుకోవడం ఈ వ్యవస్థ ద్వారానే సాధ్యం

ఈ వ్యవస్థను మార్చుకోవడం ఈ వ్యవస్థ ద్వారానే సాధ్యం. ఈ రాజ్యాంగాన్ని మార్చుకోవడం ఈ రాజ్యాంగం ద్వారానే సాధ్యం. విమానాలు వచ్చాక కోటగోడలు

కాలం తీరిపోయాయి. ప్రపంచంలో ఎక్కడున్నా సరే పసిగట్టే సాఫ్ట్‌వేర్ టెక్నాలజీ వచ్చాక, ఫెమినిజం వామపక్షాల ఉద్యమాలని, అవగాహనను, పురుషాధిపత్య భావజాలం అని నిర్ధారించాక రహస్య అటవీ ఉద్యమాలు కాలం తీరిపోయాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ ద్వారానే కార్మికవర్గ వ్యవస్థను ఏర్పర్చుకోవచ్చని మార్క్స్, ఏంగిల్స్‌లు అందుకు కార్యక్రమాలను చెప్పారు. అలానే ప్రజాస్వామిక వ్యవస్థ ద్వారానే మరింత ఉన్నతమైన మానవ సంబంధాలు ఏర్పర్చుకోడానికి కార్యక్రమాలను రూపొందించుకోవాలి.

### ప్రశ్నలు

1. భగవద్గీతలో ఎన్ని వైరుధ్యాలున్నాయో మీకు తెలిసినవి పేర్కొనండి.
2. మార్క్సిజంలో ఎన్ని విరుద్ధాంశాలున్నాయో చర్చించండి.
3. మార్క్సిజం ఎప్పుడు తల్లి అవుతుంది?
4. మార్క్సిజం స్వయంగా ఒక సామ్రాజ్యవాదం ఎలా అవుతుంది?
5. రష్యా, తూర్పు యూరప్ దేశాల ప్రజాస్వామ్య వ్యవస్థలు ఎలా ఇండియాలోని ప్రజాస్వామ్యాన్ని చేరుకున్నాయో వివరించండి.
6. విగ్రహ విధ్వంసం, లడ్డయిట్స్ లాగా సిద్ధాంత విధ్వంసం ఎన్ని పరిణామాలకు దారి తీస్తుందో మార్క్సిజానికి కూడా అన్వయించి వివరించండి.
7. మార్క్సిజంలోని ఏకతావాదానికి చారిత్రక పునాదులు ఏమిటి? జాతీయ రాజ్యాలు, హెగెలిజం మతాలు ఇందుకు ఎంతమేరకు కారణం?
8. అంతర్గత వైరుధ్యాలే ప్రాథమికం అనే మార్క్సిజం దాన్ని ఆచరించడానికి సిద్ధంగా వుందా? చర్చించండి.
9. ఆరెసెస్ మార్క్సిజానికి మధ్య ఉన్న ఏకసూత్రత ఏమిటి? దాన్ని వివరించండి.
10. యూరప్, సామ్రాజ్యవాద పరిణామాల్లో పుట్టిన సిద్ధాంతాల లోపాలేమిటి? వాటి పరిష్కారమేమిటి?
11. మార్క్సిజాన్ని అభివృద్ధి పరచడం అనవసరం. ఎందువల్ల? వివరించండి.



# వాస్తవిక సత్యాలు-తార్కిక సత్యాలు

**సత్యాలకు తర్కంతో పనిలేదు**

సత్యాలకు తర్కంతో పనిలేదు. తార్కికసత్యాల్ని సాధించడానికి తర్కం అవసరం. సూర్యుడు తూర్పున ఉదయించును. సూర్యుడు అస్తమించగానే చీకటి పడును. చంద్రుడు వెన్నెల కాయును మొదలైన సత్యాలకు తర్కాలతో పనిలేదు. దీన్ని గత అధ్యాయాల్లో వివరంగా చర్చించాం.

అయితే నిప్పులేకుండా పొగ ఉండదు. కొండమీద పొగ ఉంది కనక కొండమీద నిప్పుంది అని నిరూపించడం తార్కికసత్యం. ఇది నిప్పు అనడానికి తర్కం అవసరం రాదు. తార్కికసత్యాలను వాస్తవసత్యాలుగా నమ్మించడం కోసమే తర్క ప్రయత్నమంతా. తార్కికంగా నిరూపించాక వాటిని విశ్వసించాలని కోరుతారు. అలా అవి విశ్వాసాలుగా రూపొందుతాయి. దేవుడున్నాడు అనేవారూ. లేడనేవారూ తార్కికంగా నిరూపించి ఉన్నాడు లేదా లేడని విశ్వసించాలని కోరుతారు.

బౌద్ధం వాస్తవిక సత్యాలపై ఆధారపడింది. అది ప్రజలపట్ల "సేవాదృక్పథం"తో ముందుకు సాగింది. మార్క్సిజంలో సేవ అదృశ్యమై "అధికార దృక్పథం" ముందుకుసాగింది. తద్వారా అధికారం ద్వారా తప్ప ప్రజలకు సేవచేయలేం, ప్రజల్లో మార్పులు తేలేం అనే పాలకవర్గ దృక్పథాన్నే సమర్థించింది. అధికారాపేక్ష వదులుకుని సేవాదృక్పథంతో ముందుకుసాగితే బౌద్ధంలా, ఆరెసెస్‌లా అహింసాయుతంగా ఎన్నో అద్భుతాలు సృష్టించవచ్చు.

తార్కిక సత్యాల ఆధారంగా ఏర్పడే దృక్పథం వాస్తవాలను గుర్తించ నిరాకరించి వాస్తవాలనే అణిచేసే ప్రయత్నం చేయవచ్చు లేదా దృక్పథమే ఒక అహంకారంగా రాజ్యంగా పరివర్తన చెంది ఎరుకక్రమం ఆగిపోతుంది.

**మనిషి కోసమే సిద్ధాంతాలు**

మనిషికోసం భావాలు, మనిషి అధీనంలో భావాలుండాలి. మనిషికీ భావాలకూ మధ్య వైరుధ్యం ఏర్పడినపుడు మనిషి ప్రాథమికంగా ముందుకుసాగాలి.

తర్కశాస్త్రాలు, తత్వశాస్త్రాలు, దృక్పథం ఎంత మేలు చేస్తాయో అంతగా చెత్తపాత్ర కూడా నిర్వహిస్తాయి. సినిమాలు చూసి చెడిపోయినట్లు ఇవి చదివి చెడిపోయేవాళ్లు కూడా ఉంటారు. ఆరెసెస్, హిట్లరిజం, తాలిబానిజం మొదలుకొని ఎన్నో సిద్ధాంతాలు మనుషుల్లోని ప్రేమకు బదులు ఇతరులపట్ల ద్వేషాన్ని ప్రచారంచేసి చెడగొడుతుంటాయి.

వాటి ఫలితాలను నరేంద్ర మోడీ గుజరాత్‌లో నిర్వహించిన నరమేథంలో చూడవచ్చు. రెండవ ప్రపంచయుద్ధంలో హిట్లరిజాన్ని చూడవచ్చు.

ఈ విషయం అర్థం అయితే సమాజం ప్రేమ కరుణ స్నేహం, ప్రాథమికంగా ముందుకు సాగుతుంది. అన్నిటా ప్రేమతో, కరుణతో, స్నేహపూరితంగా ఆచరణసాగితే సమస్త వైరుధ్యాలూ, సమస్యలూ స్నేహపూరితంగా, ప్రేమతో, కరుణతో పరిష్కారం అవుతాయి.

భావాలు పరకాయ ప్రవేశం చేసి మనిషి రూపంలోకి ప్రవేశించాక మనిషి ప్రవర్తన ద్వారా వ్యక్తం అవుతుంది. ఏ భావాలైనా నీవు స్వీకరించడం ద్వారానే నీలో ప్రవేశిస్తాయి. అప్పుడవి నీ తాలూకు రంగు, రుచి, వాసన, స్పందన, రూపం, హోదా, స్వభావం, త్యాగం, అభిరుచి, ఆసక్తి ద్వారా వ్యక్తం అవుతాయి. శక్తివంతం అవుతాయి. భౌతికరూపం ధరిస్తాయి. భావాలే ఆత్మలు అంటే ఆత్మలున్నాయని దీని అర్థం కాదు.

భావాలు మనం వేసుకునే డ్రెస్సుల వంటివి. ఏ డ్రెస్సు వేసుకుంటే ఆ డ్రెస్సులో కనబడతాం. సామాజిక భావాలు ఆచరణ ప్రధానమైనవి.

### సామాజిక దర్శనాల్లో ఆచరణ పాత్ర

సామాజిక దర్శనాల్లో, వాటి పరిణామాల్లో ఆచరణ పాత్ర ప్రధానమైనవి. ఎంత గొప్ప సిద్ధాంతం, ఎంత గొప్ప ఆదర్శాలైనా ప్రజల్లోకి విస్తరించినపుడే వాటికి విలువ. అందువల్ల సామాజిక దర్శనాలకు, దార్శనికులకు దార్శనికతతో పాటు ఈ కింది అంశాలు ఉండడం అవసరం.

1. కార్యక్రమాలు, 2. నాయకత్వం, 3. కార్యకర్తలు, 4. అనుచరులు, 5.నిర్మాణం, 6. నినాదాలు, 7. సిద్ధాంత గ్రంథాలు, 8. శిక్షణా తరగతులు, 9.పాఠ్య గ్రంథాలు, 10. కథా కవిత పాట సాహిత్యం, 11. కళారూపాలు, 12. ప్రసార, ప్రచార సాధనాలు, మాధ్యమాలు, 13. సామాజిక అంగీకారం, 14. రాజకీయ అంగీకారం, 15. నైతిక అంగీకారం.

### నాయకత్వ కర్తవ్యాలు - కార్యక్రమాలు

కార్యక్రమాల ద్వారా సమాజంలో, ప్రజల్లో నిరంతరం కనపడుతుండాలి. ప్రజల్ని కదిలిస్తుండాలి. నడిపిస్తుండాలి. అవి ఆరెసెస్ లాగా రోజువారీ శాఖల నిర్వహణ కావచ్చు. రామజన్మభూమి ఇటుకల మోత, రథయాత్రలు కావచ్చు, పండుగలను నిర్వహించడం కావచ్చు, అవి ఆర్థిక పోరాటాలు కావచ్చు, ట్రేడ్ యూనియన్ కార్యక్రమాలు కావచ్చు, ధర్నాలు కావచ్చు, ప్రదర్శనలు కావచ్చు, బహిరంగ సభలు కావచ్చు, ఊరేగింపులు కావచ్చు, సామాజిక సేవా కార్యక్రమాలు కావచ్చు, శిక్షణా తరగతులు కావచ్చు. ఇలా ఎన్ని రూపాల్లోనైనా, ఏ కార్యక్రమాలతోనైనా ప్రజలతో సంబంధంలో వుంటూ ప్రజల్ని కదిలిస్తూ, నడిపిస్తూ ఉండే సామాజిక దర్శనాలకే సమాజంలో ప్రాధాన్యత వుంటుంది. పుస్తకాల్లో, జె.కె., ఓషో చెప్పినట్టు మస్తిష్కాల్లో మిగిలిపోయే, వ్యక్తిగత పనివిధానానికి పరిమితమయ్యే సామాజిక దర్శనాల్లో ఎంత గొప్పవైనా అవి చేయగలిగిందేమీలేదు. ఎంత చెత్త దర్శనమైనా, లోతులేనిదైనా ప్రజల్లో కార్యక్రమాలు ఇస్తూ కదిలించినపుడు దాని ప్రాధాన్యత పెరుగుతూ ఉంటుంది. అందువల్ల సామాజిక కార్యక్రమాలు,



సామాజిక కార్యకలాపాలు చేపట్టే సామాజిక దర్శనాలు ప్రాధాన్యత వహిస్తాయి.

ఆచరణలోనే సిద్ధాంతాల మంచి చెడ్డలు, పరిణామాలు, కష్ట నష్టాలు తెలిసివస్తాయి. తద్వారా సిద్ధాంతాలను, ఆచరణను సవరించుకుంటారు. కొత్త కార్యకలాపాలను నిర్ణయించుకుంటారు. అలా సామాజిక ఆచరణలోనే సామాజిక దర్శనాలు నిగ్గుతేలుతాయి సామాజిక దర్శనాలు కేవలం చర్చలద్వారా, తర్కం ద్వారా పరిష్కరింపబడేవి కావు. అలా అనుకుంటే మార్క్సిజం మీద, ఆరెసెస్ వాదం మీద, కాంగ్రెస్ మీద, అంబేద్కరిజం మీద ఎన్నో విమర్శలు వచ్చాయి. అయినా అవి ప్రజల సహకారం, అంగీకారం పొందుతున్నంతకాలం కొనసాగుతూనే ఉంటాయి. ప్రజల్ని లక్షలాదిగా ఊరేగింపుల్లో, ప్రదర్శనల్లో, సభల్లో సమీకరించినంతమాత్రాన కూడా సిద్ధాంత పునాది లేకపోతే వేసే ప్రభావం తక్కువ.

### దార్శనికులు నాయకత్వ లక్షణాలు పెంచుకోవాలి, గురువులుగా ఎదగాలి

ఎన్నికల్లో గెల్చినవాళ్లే ప్రభుత్వాన్ని ఏర్పాటుచేస్తారు. అలాగే ప్రజల్లో పనిచేసే సామాజిక దార్శనికులే సమాజంలో పరిణామాలు తెస్తారు. అందువల్ల సామాజిక దార్శనికులకు నాయకత్వ లక్షణాలు కూడా ఉండడం అవసరం. లేదా నాయకత్వాన్ని తయారుచేసే గురువుగా కార్యకలాపాల్లో ఉండడం అవసరం.

### నాయకత్వ లక్షణాలు

నాయకత్వం, నాయకత్వ లక్షణాలను కలిగివుండాలి. నాయకులు కార్యకర్తల్ని అనుచరులను తయారుచేయగలిగిన శక్తిసామర్థ్యాలను కలిగివుండాలి. ఉపన్యాసాలతో, శిక్షణా తరగతులతో ప్రజలను, కార్యకర్తలను ఆకట్టుకోగలగాలి. వ్యక్తిగత జీవితం ఆదర్శంగా ఉండాలి. సంస్థ, పార్టీ నిర్మాణాన్ని నిర్మించగలగాలి. కార్యకర్తల, అనుచరుల కష్ట నష్టాలను వినగలగాలి. వారి సూచనలను తీసుకోగలగాలి. అందరిలో ఆత్మస్థైర్యాన్ని, నమ్మకాన్ని పెంచగలగాలి. ప్రజల హృదయాలను గెలుచుకోగలగాలి. ప్రజల్లో కలిసిపోగలగాలి. కార్యకర్తల్ని ఎదిగించి నాయకులుగా ప్రమోట్ చేయగలగాలి. నిరంతరం తాను అధ్యయనం చేస్తూ సామాజిక దర్శనంలో అవసరమైన మార్పులు చేర్పులు చేసుకోగలగాలి. వాటన్నిటిని సమాజంచేత ఒప్పించుకోగలగాలి. కార్యకర్తలు వాటిని అనుసరించగలగాలి. సిద్ధాంత గ్రంథాలను సులభశైలిలో కార్యకర్తలకు అందించగలగాలి. ప్రసార, ప్రచార మాధ్యమాల్లో ప్రచారం చేయగలగాలి. కళాకారులను, సాహిత్యకారులను తయారుచేయగలగాలి. ప్రోత్సహించగలగాలి. గౌరవించగలగాలి. ఎప్పటికప్పుడు శిక్షణా తరగతులు నిర్వహించగలగాలి.

### ఆచరణ - కార్యక్రమాల ప్రాధాన్యత

నాయకత్వం ప్రజలకు, కార్యకర్తలకు, అనుచరులకు, సానుభూతిపరులకు ఎప్పుడూ ఏదో ఒక కార్యక్రమం ఇస్తూ ఉండాలి. తద్వారా ప్రజల్ని కలుస్తూ కదిలిస్తుండాలి. ఫలితాలను బేరీజు వేస్తూ మరింత ముందుకు సాగే కొత్త ప్రణాళికలను రూపొందిస్తూ ఉండాలి. ఇవి సాధించలేని నాయకత్వం సామాజిక దర్శనాలకు మెడలో గుదిబండలా తయారౌతుంది. ఇది సాధించే నాయకత్వం సామాజిక దర్శనాలకు ఎనలేని విలువను, గౌరవాన్ని, ప్రాచుర్యాన్ని సాధించిపెడుతుంది.

### తత్త్వవేత్తలు రెండు రకాలు

ఒకరు భావాలను ప్రచారం చేస్తారు. మరొకరు భావాలను సృష్టిస్తారు. ఒకరు భావాలను చర్చిస్తారు. మరొకరు భావాలను ఆచరిస్తారు. మనుషులురెండు రకాలు: ఒకరు భావాలకు అధీనులు మరొకరు భావాలను తమ అధీనంలో ఉంచుకుంటారు. ఉదాహరణకు ఉపాధ్యాయులు పిల్లలపై చూపే కోపం నిజ కోపంకాదు. పిల్లల అభివృద్ధి కోసం తన ఆధీనంలో ఉంచుకొని అవసరమైనపుడు ప్రదర్శిస్తారు. గురువుల భావాలు వారి ఆధీనంలో ఉంటాయి. నాయకులు భావాల ఆధీనంలో ఉంటారు లేదా అనుచరుల్ని తమ భావాల ఆధీనంలో ఉంచుకుంటారు. అందుకు తమ భావాలను ప్రజలకు అలవాటు చేస్తారు. అలవాట్లు అనేవి భావాలకు, రుచులకు, కోరికలకు, అభిరుచులకు అలవాటు కావడం వల్ల అలవాటు అవుతాయి. అవి నీ ఆధీనంలో ఉంటే ఏ అలవాట్లూ నీదరిజేరవు.

### అవసరాలను గుర్తించడం అవసరం

మనిషి - అవసరాలు అవసరంగా భావించకపోతే కొన్ని అవసరంగా మారవు. ఉదా॥కు సన్యాసి, బ్రహ్మచారి, పెళ్లి అవసరం అనుకోకపోతే అవసరంగా మారవు. అలాగే గిరిజనులు తమ జీవనస్థాయి పెంచుకోవడం అవసరంగా భావించకపోతే సైకిల్, మోటార్‌సైకిల్, రోడ్లు, విద్యుత్తు, ట్రాక్టర్, హైబ్రీడ్ విత్తనాలు, కొత్త వ్యవసాయ పద్ధతులు, ఆధునిక చదువులు, ఆధునిక వృత్తులు, ఆధునిక వైద్యం, ఆధునిక జీవనవిధానం వాళ్లు అవసరంగా భావించకపోతే వారి జీవితంలో భాగం కాలేవు. గోండులు, అండమాన్ నికోబార్ దీవుల్లోని గిరిజనులు మొదలైనవాళ్లు వీటిని అవసరంగా భావించకపోతే వారి జీవితంలో భాగం కాలేవు. ఆసక్తి లేకుండా సినిమాకు వెళ్లడం, సిగరెట్లు, మద్యం తాగడం, అనేవి సాధ్యం కావు. నీ మనస్సు నీ ఆధీనంలో ఉంటే ఇవి అలవాటు కావు.

అలవాటు, వ్యసనం అనేది ఒక చక్రభ్రమణము. అలవాటు ప్రకారం ఆలోచించడం ఒక చక్రభ్రమణం. సిద్ధాంతం ఒక అలవాటుగా మారితే ఆ చక్రభ్రమణం నుండి బయటపడడం అసాధ్యం.

### ప్రత్యేక శిక్షణ - ఆవశ్యకత

అభివృద్ధిలో వెనకబడినవారు అభివృద్ధిని అందుకోవడంలో శిక్షణ, ప్రత్యేక అవకాశాలు గెంతులు ఉపయోగపడ్తాయి. కానీ అభివృద్ధి ఉన్నతదశ నుండి మరింత ఉన్నతదశకు ఎదగడం మాత్రం పరిణామశీలంగా, శాంతియుతంగా సాగుతూ ఉంటుంది. బాల్యం నుండి కౌమారం ఎపుడు వచ్చిందో, కౌమారం నుండి యవ్వనం ఎపుడు వచ్చిందో, యవ్వనం నుండి వృద్ధాప్యం ఎపుడు వచ్చిందో గీతగీసి చెప్పడం సాధ్యం కాదు. సమాజం ఇలా పరిణామశీలంగా సాగుతుంది.

1. వాస్తవిక సత్యాలకు, తార్కిక సత్యాలకు తేడా ఏమిటి?
2. సామాజిక దర్శనాలు, ఏ యే అంశాలను కలిగి వుండాలి?



# ఇజం ఎలా రూపొందుతుంది?

## బుద్ధుని నుండి పూలే అంబేద్కర్‌ల దాకా
## రచన-సిద్ధాంతం-ఆచరణ

### ఇజం ఎలా రూపొందుతుంది?

చాలామంది మహాత్మా జ్యోతిరావు పూలే రచనలే పూలేయిజం అనుకుంటారు. గాంధీ రచనలే గాంధీయిజం అనుకుంటారు. గాంధీ యేమో నా జీవితమే నా సందేశం అన్నాడు. గాంధీజీ రచనలతో పాటు జీవిత ఆచరణ కూడా కలిపి చూసినప్పుడే గాంధీయిజం ఆచరణ తెలుస్తుంది.

అలాగే చాలామంది మార్క్సు రచనలే మార్క్సిజం అనుకుంటారు. మార్క్సు రచనలు వేరు, మార్క్సిజం వేరు. మార్క్సు రచనల్లో కూడా కొంత మార్క్సిజం ఉంటుంది. మార్క్సు, ఎంగెల్సుల రచనలే మొత్తం మార్క్సిజం కాదు. గాంధీ రచనలే మొత్తం గాంధీయిజం కాదు. మార్క్సిజం ఒక ఇజంగా, ఫెమినిజం ఒక ఇజంగా ఎలా రూపొందిందో ప్రపంచాన్ని మార్చిన మార్క్సిజం, ఫెమినిజం అంటే ఏమిటి? అనే అధ్యాయాల్లో వివరంగా చూశాం. ఈ అధ్యాయంలో గాంధీయిజం బుద్ధిజాన్ని తన ఇజంగా మార్చుకున్న క్రమాన్ని, పూలే, అంబేద్కరిజం, ఇతర ఇజాలు రూపొందిన క్రమాన్ని పరిశీలిద్దాం.

### స్వేచ్ఛాసిద్ధాంతాలు

స్వేచ్ఛా భావనకు సామాజిక అస్తిత్వాన్ని కారణాలను కాదని హృదయ అంతసౌందర్యం చైతన్యం గురించి ఆరాటపడే హేతువాదాన్ని, హ్యూమనిజాన్ని, జిడ్డుకృష్ణమూర్తి తత్వాన్ని పరిశీలించడం అవసరం. అవి స్థలకాలాది నిర్దిష్టతలను తనలోకి స్వీకరించ లేకపోవడం వల్ల అట్టడుగు ప్రజల్లోకి చేరే చొరవ కోల్పోయాయి.

అవి కుల, మత, జాతి, లింగ, వర్ణ, వర్గ, ప్రాంత, దేశాది విషయాల్లో అభివృద్ధిని అందిపుచ్చుకున్నవారికీ, అభివృద్ధిని అందుకోవాల్సినవారికీ మధ్య వుండే అంతరాన్ని, వ్యత్యాసాన్ని గుర్తిస్తున్నట్టు చెప్తాయి. కాని అభివృద్ధిని అందుకోవాల్సినవారి పక్షాన గట్టిగా నిలబడకుండా తటస్థత రూపంలో, యిరుపక్షాల్ని సమానం చేసి ఒడ్డున కూర్చుని ప్రేక్షకునిలా పలాయనవాదంతో ప్రవర్తిస్తున్నాయి. ఓషోరజనీష్ ఈ విషయంలో కాస్త

మెరుగు.

చెడ్డ స్నేహాలు చెడిపోడానికి దారితీస్తాయి. అత్తరు సాహెబ్‌తో పోట్లాడితే సువాసన అంటుతుంది. ఆరునెలల్లో వారు వీరవుతారు. వీరు వారవుతారు అనే సామెతలు అందరికీ తెలిసినవే. రాజు కొడుకును పుట్టగానే తీసుకుపోయి గిరిజనుల మధ్య గిరిజనుడిగా పెంచితే గిరిజనులలాగే పెరుగుతాడు. సామాజిక అస్తిత్వం, ప్రాధాన్యత గొప్పది. జెకెయిజం, ఓషోయిజం, హ్యూమనిజం, ఈ సామాజిక అస్తిత్వాన్ని పెద్దగా పట్టించుకోలేదు. ఆంతరిక ప్రేరణకే పరిమితమయ్యారు.

### అంబేద్కర్ దర్శనం

"మరొక్క విషయం - పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యంలో వ్యక్తి స్వాతంత్ర్యానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడింది. సామ్యవాద జీవన విధానంలో సమానత్వానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడింది. కాని ఐహిక ప్రయోజనాలకే పెద్దపీట వెయ్యడంవల్ల ఆ రెండు సామాజిక వ్యవస్థలలోను రుగ్మతలు పుట్టుకొచ్చాయి. స్వాతంత్ర్యం, సమత్వం ఈ రెండింటిలో ఏదో ఒక దాన్ని పట్టుకుని దానికే అతి ప్రాధాన్యం ఇవ్వడంవల్ల తలెత్తే" అనర్థాల గురించి డా॥ అంబేద్కర్ వివరించారు.

### అంబేద్కర్‌కున్న స్పష్టత

"డా॥ అంబేద్కర్ తన 'స్వాతంత్ర్యం, సమత్వం, సహోదరత్వం' అన్న ఆదర్శాలను రాజకీయ పరమైనవిగా భావించలేదు, వాటిని ఫ్రెంచి రాజకీయ విప్లవం నుంచి స్వీకరించనూ లేదు. మన గడ్డపై జన్మించిన బౌద్ధ తత్వ జ్ఞానం నుంచి వాటిని స్వీకరించాడు. ఈ విషయాలను గురించి ప్రస్తావించే సమయంలో డా॥ అంబేద్కర్ ప్రజాస్వామ్యంలో వ్యక్తి స్వాతంత్ర్యానికి ఈయబడిన మితిమీరిన ప్రాముఖ్యం గురించి, సామ్యవాద జీవన విధానంలో కేవలం సమానత్వానికి ఈయబడిన మితిమీరిన ప్రాముఖ్యం గురించి సరైన దృక్కోణంలో పరిశీలన చేసి, ఆ రెండింటికీ సంతులనం సాధించేందుకై సహోదరత్వభావనను ప్రబోధించారు."

### స్వేచ్ఛకు, సమానత్వానికి అంబేద్కరిచ్చే నిర్వచనం

"నా తత్వచింతనలో స్వేచ్ఛకు సమానత్వానికి చోటు ఉంది, కాని మితిమీరిన స్వేచ్ఛ సమానత్వాన్ని హరించివేస్తుంది, సమానత్వ మొక్కటే కావాలనుకుంటే అది స్వేచ్ఛకు చోటు లేకుండా చేస్తుంది. స్వేచ్ఛ గాని సమానత్వం గాని లభించకపోయే పరిస్థితి నుంచి రక్షణకై సహోదరత్వ భావనకు అత్యున్నత స్థానం ఇవ్వాలని నేను భావిస్తాను. మానవ సహోదరత్వం అనేది ధర్మానికి మరోపేరు. సహోదర భావన మాత్రమే స్వేచ్ఛను, సమానత్వాన్ని కాపాడగలదు. ఈ సహోదరత్వాన్ని సామాజిక ఏకత అని కూడా అనవచ్చు. అదే మానవత్వం. అదే ధర్మం" అన్నారు డా॥అంబేద్కర్." (ఆరెసెస్ కార్యకర్త - దత్తోపంత్ ఠేంగ్డీ - పేజీ 32-33)

అయితే ఆరెసెస్ వారికి బాహ్యప్రేరణ గురించి సామాజిక అస్తిత్వం గురించి, దాని ప్రభావం గురించి పెద్దగా సదభిప్రాయం లేదు. అంతర్గత ప్రేరణను నొక్కి చెప్పే క్రమంలో ఆత్మిక వాదాల్ని ఆశ్రయిస్తారు. మనువు, నీషేల సూపర్‌మ్యాన్



సిద్ధాంతాలను చైతన్యం ప్రాథమికం అనే చర్చరూపంలో కొత్తవ్యక్తీకరణలు పొందుతున్నాయి. సమాజాన్ని పట్టించుకున్నప్పటికి సామాజిక ఆచరణ గురించి కాకుండా వ్యక్తిగత ఆచరణను మాత్రమే చెప్పడంవల్ల అవి ఆధ్యాత్మిక వాదాలుగా, తత్వాలుగా కనపడుతున్నాయి. సామాజికదర్శనంతో సామాజిక ఆచరణనుకూడా చెప్పినప్పుడు ఇవన్నీ రాజకీయాలుగా, సామాజిక సిద్ధాంతాలుగా కనపడ్డం మొదలవుతుంది. బహుశా ఇందువల్లే సామాజిక ఆచరణను ఆరెసెస్ వాళ్ళు వదిలేస్తుంటారు.

### యం.ఎన్. రాయ్ తత్వం

యం.యన్. రాయ్ మొత్తం జీవిత ఆచరణ అంతా "పై నుంచి కిందికి" అనే ఆచరణే. విప్లవాన్ని పైనుంచి కిందికి తెచ్చే కృషి చేశాడు. రాడికల్ హ్యూమనిజంతో సహా అంతా "పై నుంచి కిందికి" చేసిన ఆచరణే. ఆసక్తికరమైన విషయం ఏమంటే రాయ్ "కింది నుంచి పైకి" వికేంద్రీకరణ క్రమం వుండాలని కోరుకోవడం ద్వారా తన ఆచరణకు వ్యతిరేకమైన అవగాహనకు చేరుకున్నాడు.

పూలే, పెరియార్ రామస్వామి, నారాయణగురు, అంబేద్కర్ "కింది నించి పైకి" అనేదాన్ని నిరంతరం ఆచరించినవాళ్లు.

అంబేద్కర్ బలమైన కేంద్రప్రభుత్వం, భారీపరిశ్రమలు, కావాలని కోరాడు. కులం గ్రామీణస్థాయి వికేంద్రీకృత వ్యవస్థ వేల ఏళ్ళు సృష్టించిన వినాశం చూసి అంబేద్కర్ యిలా కోరుకున్నాడు. కమ్యూనిజం, ఫాసిజం కేంద్రీకరణల్ని చూసి రాయ్ వికేంద్రీకరణను కోరుకున్నాడు.

### సిద్ధాంతాల మధ్య సమన్వయ సాధన

అందువల్ల భారతీయ భావజాల చరిత్రకు న్యాయం చేసి, దాన్ని పదార్థం స్థాయినించి శక్తిగా మార్చడానికి బుద్ధిజం, వ్యక్తి స్వేచ్ఛ, మార్క్సిజంతోపాటు ప్రజాస్వామిక సిద్ధాంతాలన్నిటిని కలపవల్సి వుంది. ఫెమినిజంను యిందులో చేర్చవలసి వుంది.

అలా యీ నాలుగింటిని కలపడం ద్వారా విడివిడిగా వున్న చాలా విషయాలు సమైక్యతలోకి వస్తాయి. అవి నిజానికి సమైక్యంగానే వున్నాయి. భావజాలాలే వాటిని విడదీసి చూపుతున్నాయి. ఈ లోపాన్ని సరిచేయాల్సి వుంది. బుద్ధుడి నుండి నేటిదాకా, దేశీయతను దీనిలో కలిపితే అది మరింత నిర్దిష్టం అవుతుంది.

అప్పుడు బౌద్ధం యొక్క సాంస్కృతిక కంటిన్యుటీ అంబేద్కర్‌లో, యంయన్.రాయ్‌లో విభిన్నస్థాయిల్లో రూపాల్లో, కొనసాగుతూ వస్తున్న విషయాన్ని స్పష్టం చేయడం సులభం. దీంతోపాటు బౌద్ధం, క్రైస్తవం, ఇస్లాంలతో పాటు యూరోప్, చైనా భావజాలాలపై వేసిన ప్రభావం అది కంటిన్యూ అవుతున్న తీరును కూడా వెలికి తీయవచ్చు.

అయితే క్రమతను (కంటిన్యుటి) గురించి మాట్లాడే భావజాలకర్తలు, సామాజిక శాస్త్రవేత్తలు, చరిత్ర యొక్క భావాల యొక్క కంటిన్యుటీని సింధునాగరికత నుంచి బుద్ధుని నుంచి, భక్తి ఉద్యమాల మీదుగా, గురునానక్, వేమన, జ్యోతిబాఫులే, రామస్వామినాయకర్, నారాయణగురు, అంబేద్కర్, యం.యన్ రాయ్, లోహియా,

మెరుగు.

చెడ్డ స్నేహాలు చెడిపోడానికి దారితీస్తాయి. అత్తరు సాహెబ్‌తో పోట్లాడితే సువాసన అంటుతుంది. ఆరునెలల్లో వారు వీరవుతారు. వీరు వారవుతారు అనే సామెతలు అందరికీ తెలిసినవే. రాజు కొడుకును పుట్టగానే తీసుకుపోయి గిరిజనుల మధ్య గిరిజనుడిగా పెంచితే గిరిజనులలాగే పెరుగుతాడు. సామాజిక అస్తిత్వం, ప్రాధాన్యత గొప్పది. జెకెయిజం, ఓషోయిజం, హ్యూమనిజం, ఈ సామాజిక అస్తిత్వాన్ని పెద్దగా పట్టించుకోలేదు. ఆంతరిక ప్రేరణకే పరిమితమయ్యారు.

**అంబేద్కర్ దర్శనం**

"మరొక్క విషయం - పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యంలో వ్యక్తి స్వాతంత్ర్యానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడింది. సామ్యవాద జీవన విధానంలో సమానత్వానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడింది. కాని ఐహిక ప్రయోజనాలకే పెద్దపీట వెయ్యడంవల్ల ఆ రెండు సామాజిక వ్యవస్థలలోను రుగ్మతలు పుట్టుకొచ్చాయి. స్వాతంత్ర్యం, సమత్వం ఈ రెండింటిలో ఏదో ఒక దాన్ని పట్టుకుని దానికే అతి ప్రాధాన్యం ఇవ్వడంవల్ల తలెత్తే" అనర్థాల గురించి డా॥ అంబేద్కర్ వివరించారు.

**అంబేద్కర్‌కున్న స్పష్టత**

"డా॥ అంబేద్కర్ తన 'స్వాతంత్ర్యం, సమత్వం, సహోదరత్వం' అన్న ఆదర్శాలను రాజకీయ పరమైనవిగా భావించలేదు, వాటిని ఫ్రెంచి రాజకీయ విప్లవం నుంచి స్వీకరించనూ లేదు. మన గడ్డపై జన్మించిన బౌద్ధ తత్వ జ్ఞానం నుంచి వాటిని స్వీకరించాడు. ఈ విషయాలను గురించి ప్రస్తావించే సమయంలో డా॥ అంబేద్కర్ ప్రజాస్వామ్యంలో వ్యక్తి స్వాతంత్ర్యానికి ఈయబడిన మితిమీరిన ప్రాముఖ్యం గురించి, సామ్యవాద జీవన విధానంలో కేవలం సమానత్వానికి ఈయబడిన మితిమీరిన ప్రాముఖ్యం గురించి సరైన దృక్కోణంలో పరిశీలన చేసి, ఆ రెండింటికీ సంతులనం సాధించేందుకై సహోదరత్వభావనను ప్రబోధించారు."

**స్వేచ్ఛకు, సమానత్వానికి అంబేద్కరిచ్చే నిర్వచనం**

"నా తత్వచింతనలో స్వేచ్ఛకు సమానత్వానికి చోటు ఉంది, కాని మితిమీరిన స్వేచ్ఛ సమానత్వాన్ని హరించివేస్తుంది, సమానత్వ మొక్కటే కావాలనుకుంటే అది స్వేచ్ఛకు చోటు లేకుండా చేస్తుంది. స్వేచ్ఛ గాని సమానత్వం గాని లభించకపోయే పరిస్థితి నుంచి రక్షణకై సహోదరత్వ భావనకు అత్యున్నత స్థానం ఇవ్వాలని నేను భావిస్తాను. మానవ సహోదరత్వం అనేది ధర్మానికి మరోపేరు. సహోదర భావన మాత్రమే స్వేచ్ఛను, సమానత్వాన్ని కాపాడగలదు. ఈ సహోదరత్వాన్ని సామాజిక ఏకత అని కూడా అనవచ్చు. అదే మానవత్వం. అదే ధర్మం" అన్నారు డా॥అంబేద్కర్." (ఆరెసెస్ కార్యకర్త - దత్తోపంత్ ఠేంగ్డీ - పేజీ 32-33)

అయితే ఆరెసెస్ వారికి బాహ్యప్రేరణ గురించి సామాజిక అస్తిత్వం గురించి, దాని ప్రభావం గురించి పెద్దగా సదభిప్రాయం లేదు. అంతర్గత ప్రేరణను నొక్కి చెప్పే క్రమంలో ఆత్మిక వాదాల్ని ఆశ్రయిస్తారు. మనువు, నీషేల సూపర్‌మ్యాన్



సిద్ధాంతాలను చైతన్యం ప్రాథమికం అనే చర్చరూపంలో కొత్తవ్యక్తీకరణలు పొందుతున్నాయి. సమాజాన్ని పట్టించుకున్నప్పటికి సామాజిక ఆచరణ గురించి కాకుండా వ్యక్తిగత ఆచరణను మాత్రమే చెప్పడంవల్ల అవి ఆధ్యాత్మిక వాదాలుగా, తత్వాలుగా కనపడుతున్నాయి. సామాజికదర్శనంతో సామాజిక ఆచరణనుకూడా చెప్పినప్పుడు ఇవన్నీ రాజకీయాలుగా, సామాజిక సిద్ధాంతాలుగా కనపడ్డం మొదలవుతుంది. బహుశా ఇందువల్లే సామాజిక ఆచరణను ఆరెసెస్ వాళ్ళు వదిలేస్తుంటారు.

**యం.ఎన్. రాయ్ తత్వం**

యం.యన్. రాయ్ మొత్తం జీవిత ఆచరణ అంతా "పై నుంచి కిందికి" అనే ఆచరణే. విప్లవాన్ని పైనుంచి కిందికి తెచ్చే కృషి చేశాడు. రాడికల్ హ్యూమనిజంతో సహా అంతా "పై నుంచి కిందికి" చేసిన ఆచరణే. ఆసక్తికరమైన విషయం ఏమంటే రాయ్ "కింది నుంచి పైకి" వికేంద్రీకరణ క్రమం వుండాలని కోరుకోవడం ద్వారా తన ఆచరణకు వ్యతిరేకమైన అవగాహనకు చేరుకున్నాడు.

పూలే, పెరియార్ రామస్వామి, నారాయణగురు, అంబేద్కర్ "కింది నించి పైకి" అనేదాన్ని నిరంతరం ఆచరించినవాళ్లు.

అంబేద్కర్ బలమైన కేంద్రప్రభుత్వం, భారీపరిశ్రమలు, కావాలని కోరాడు. కులం గ్రామీణస్థాయి వికేంద్రీకృత వ్యవస్థ వేల ఏళ్ళు సృష్టించిన వినాశం చూసి అంబేద్కర్ యిలా కోరుకున్నాడు. కమ్యూనిజం, ఫాసిజం కేంద్రీకరణల్ని చూసి రాయ్ వికేంద్రీకరణను కోరుకున్నాడు.

**సిద్ధాంతాల మధ్య సమన్వయ సాధన**

అందువల్ల భారతీయ భావజాల చరిత్రకు న్యాయం చేసి, దాన్ని పదార్థం స్థాయినించి శక్తిగా మార్చడానికి బుద్ధిజం, వ్యక్తి స్వేచ్ఛ, మార్క్సిజంతోపాటు ప్రజాస్వామిక సిద్ధాంతాలన్నిటిని కలపవల్సి వుంది. ఫెమినిజంను యిందులో చేర్చవలసి వుంది.

అలా యీ నాలుగింటిని కలపడం ద్వారా విడివిడిగా వున్న చాలా విషయాలు సమైక్యతలోకి వస్తాయి. అవి నిజానికి సమైక్యంగానే వున్నాయి. భావజాలాలే వాటిని విడదీసి చూపుతున్నాయి. ఈ లోపాన్ని సరిచేయాల్సి వుంది. బుద్ధుడి నుండి నేటిదాకా, దేశీయతను దీనిలో కలిపితే అది మరింత నిర్దిష్టం అవుతుంది.

అప్పుడు బౌద్ధం యొక్క సాంస్కృతిక కంటిన్యుటీ అంబేద్కర్‌లో, యంయన్.రాయ్‌లో విభిన్నస్థాయిల్లో రూపాల్లో, కొనసాగుతూ వస్తున్న విషయాన్ని స్పష్టం చేయడం సులభం. దీంతోపాటు బౌద్ధం, క్రైస్తవం, ఇస్లాంలతో పాటు యూరోప్, చైనా భావజాలాలపై వేసిన ప్రభావం అది కంటిన్యూ అవుతున్న తీరును కూడా వెలికి తీయవచ్చు.

అయితే క్రమతను (కంటిన్యుటి) గురించి మాట్లాడే భావజాలకర్తలు, సామాజిక శాస్త్రవేత్తలు, చరిత్ర యొక్క భావాల యొక్క కంటిన్యుటీని సింధునాగరికత నుంచి బుద్ధుని నుంచి, భక్తి ఉద్యమాల మీదుగా, గురునానక్, వేమన, జ్యోతిబాఫులే, రామస్వామినాయకర్, నారాయణగురు, అంబేద్కర్, యం.యన్ రాయ్, లోహియా,

కాన్షీరామ్ దాకా ఒక క్రమతలో ఏకకాలంలో చరిత్ర భావాల చరిత్ర సంస్కృతి, సామాజికత్వం స్పష్టపడే విధంగా చెప్పలేకపోతున్నారు.

**వాస్తవ దృష్టి లోపించిన నిర్వచనాలను సరిచేసుకోవాలి**

"జాతిమత కులవర్గ కట్టుబాట్లకు బద్ధులైన వారెవ్వరూ మానవతను మన్నించలేరు." అని కొందరంటారు. ఇందులో వాస్తవదృష్టి లోపించింది. అసలు విషయం ఏమంటే మానవత జాతిమత కులవర్గ ప్రాంత, దేశ, లింగ నిర్దిష్టల్తో ముడిపడి వుంది. అయితే యీ నిర్దిష్టతలు సార్వజనీన మానవతకు ఆటంకం కలిగించే పరిమితుల్నించి ఎదగాలి, నిర్దిష్టతలనుంచి విముక్తం చేయడం కూడా అవసరం. అవి తనలోతాను, తనకొరకు తాను సోషలిజాన్ని ఆచరిస్తాయి. ఆ పరిధిని విస్తరించాలి. ఇతరులకోసం తాను, పరోపకారం అనే పరిధి విస్తరణద్వారా వాటిని మరింత విశాలం చేయవచ్చు.

**నిర్దిష్టతలోనే సార్వజనీనత వుంటుంది**

చెట్టుత్వం అనేది ఏదోఒక చెట్టు రూపంలోనే వుంటుంది. విడిగా చెట్టుత్వం ఎక్కడా కనపడదు. అలాగే మానవాళికి జాతి, మత, కుల, వర్ణ, లింగ, నిర్దిష్టతలుంటాయనడానికి ఒక ఉదాహరణ చూద్దాం. ఒక తల్లిని తన పాపకు కాకుండా పాలులేని, మరో పాపకు పాలుయివ్వమని కోరలేం. మనదేశంలో గల పేదవారిని ఎండబెట్టి యితరదేశాల పేదలకు దానం చేయడంలో మానవత వుందంటే ఉంది లేదంటే లేదు. స్థలకాల కులాలు దృక్పథంలో పనిచేసేది యిక్కడే. అందువల్ల స్థలకాల, దృక్పథాల మధ్య సమన్వయం సాధించాల్సి వుంటుంది.

**భావాల కన్నా మనుషులు ముఖ్యం**

మనం మనుషుల్ని ప్రేమించాలి. కొందరు భావాల్ని ప్రేమిస్తున్నారు. వారి భావాల్ని ప్రేమించేవారిని ప్రేమిస్తున్నారు. అనగా యితరులను ప్రేమించే రూపంలో తననే ప్రేమించుకొంటున్నారు.

మనం మనిషిని మనిషిగా గౌరవిద్దాం. మనిషిగా ఎదిగే కృషి చేద్దాం. మన భావాల్తో ఏకీభవించకపోయినా మానవ అవసరాలు, సంస్కృతి, సహజీవనంలో, ప్రేమ ఆప్రాయల్తో కలిసి జీవిస్తూ హృదయ పరివర్తన తెచ్చే కృషి చేద్దాం. మనుషుల్ని ప్రేమించడానికి, అందరిలోనూ, అభివృద్ధి అందాల్సిన వర్గాలు, కులాలు, జాతులు, మతాలు, లింగాలు, ప్రాంతాలు, దేశాలు, సమాజాలు ప్రేమించడానికి వారి భావాలు మనకు భిన్నం అనేది ఆటంకం కాకుండా ప్రయత్నించాల్సి వుంది. మరో మాటలో చెప్పాలంటే, భౌతిక జీవన అవసరాలు తీర్చేకృషిలో భాగంగా స్వేచ్ఛ యొక్క ప్రాధాన్యతను, వ్యక్తిత్వ వికాసం యొక్క ప్రాధాన్యతను నొక్కి చెప్పే కర్తవ్యం సాగాలి.

ప్రజలు స్వేచ్ఛను అమ్ముకుంటారనే విషయం చాలామందికి తెలుసు. ఉద్యోగులు, కార్మికులు, తమ స్వేచ్ఛను యజమానికి అమ్ముకోవడం ద్వారా "అవసరాలను" తీర్చుకుంటున్నారు.

"కింది నుంచి పైకి" అంటే అన్నిరంగాల్లో అన్నిస్థాయిల్లో, అట్టడుగు వర్గాలు, కులాలు, జాతులు, లింగాలు, ప్రాంతాల నుంచి ఎదిగే వారు, ఎదుగుతూ పై స్థాయి



నాయకత్వంగా ఎదిగే క్రమం. ఇందుకు కృషి చేయాల్సి వుంది. వారి నాయకత్వ స్థానాలను అనగా రచన, నిర్మాణం జ్ఞానస్థాయి, మొ॥ వదులుకుని అట్టడుగు కులాల, వర్గాల, లింగాల, ప్రాంతాల జాతుల వారు ఎదిగే కృషి చేయడం కనీస కర్తవ్యం. ఇతరుల స్వేచ్ఛను హరిస్తే స్వేచ్ఛా జీవులని చెప్పలేం.

పూలే, పెరియార్ రామస్వామి, నారాయణగురు అంబేద్కర్ ప్రపంచంలోని మహోన్నత మానవతావాదుల్లో ఒకరు. స్వేచ్ఛ గురించి, సమానత్వం గురించి వీళ్ళు ఆచరించారు.

**బుద్ధిజం మొదలుకొని పూలే దాకా...**

బుద్ధిజం కూడా ఇలా ఎన్నో చారిత్రక దశలగుండా పయనిస్తూ ఎన్నో మార్పులకు లోనైంది. ఆధునిక సమాజంలో బుద్ధిజం ఎలా ఉండాలో అంబేద్కర్ విస్తారంగా వివరించాడు.

సమాజంలో వ్యక్తి ప్రాథమికం. సమాజం ప్రాథమికంగా ఎలాగూ ఉంటుంది. సమాజంపై అధికారం చెలాయించే కేంద్రాలు ఎప్పటికీ ఉంటాయి. అవి ప్రభుత్వం కావచ్చు, మరొకటి కావచ్చు. వాటినుంచి తిరిగి కొంత వ్యక్తి స్వేచ్ఛ, హక్కులు అవసరం. అవి లేకపోతే ప్రజలు బానిసలుగా మార్చబడతారు. అందువల్ల, 'సమాజం – వ్యక్తి'లో తిరిగి, 'వ్యక్తి – మనిషి' ప్రాథమికం అయ్యాడు.

మహాత్మా జ్యోతిరావు పూలే ప్రజాస్వామిక వ్యవస్థను అభిలషించాడు. మూఢవిశ్వాసాలను వ్యతిరేకించాడు. వైదిక హిందూ ఆధిక్యతావాదాన్ని విమర్శించాడు. బహుజనవాదాన్ని కులాతీత, మతాతీత మానవతను, ఆదర్శ కుటుంబ వ్యవస్థను, మద్యపాన రహిత సమాజాన్ని అభిలషిస్తూ అందరికీ విద్య, కార్మిక ఉద్యమాన్ని, సత్యశోధక ఉద్యమాన్ని, ముందుండి నడిపాడు. అవి బహుజనవాదం మూలసూత్రాలుగా కొనసాగుతున్నాయి. ఇందులోంచి కొన్ని గాంధీజీ, కొన్ని కమ్యూనిస్టులు, కొన్ని అంబేద్కర్ స్వీకరించారు.

గాంధీజీ శాంతి, అహింస, సత్యాగ్రహం, శాసనోల్లంఘన ఉద్యమం, నిరాహార దీక్ష, ప్రజాస్వామిక ఉద్యమ రూపాలు, ధర్మకర్తృత్వ సిద్ధాంతం, హిందూ మతాభిమానంలో బౌద్ధ దృక్పథాన్ని కొంత కలుపుకోవడం స్వదేశీ వస్తువులు, విదేశీ వస్తు బహిష్కరణ మొదలైనవి గాంధీయిజంలో భాగంగా ఉన్నాయి.

అలాగే అంబేద్కర్ ప్రాపంచిక దృక్పథంను సాధారణ సూత్రాలుగా మలిచినపుడు నూతన పరిస్థితులకనువుగా, కొత్త సత్యాల కనువుగా అంబేద్కరిజాన్ని ముందుకు తీసికెళ్ళడం సాధ్యపడుతుంది. పూలే, అంబేద్కర్ రచనల యొక్క, ఆచరణయొక్క మరింత అభివృద్ధి చెందిన రూపమే అంబేద్కరిజం.

బౌద్ధం స్వీకరించినాక అంతకుముందు అంబేద్కర్ రాసిన రచనలను బౌద్ధ దృక్పథంతో అధ్యయనం చేసినపుడు అంబేద్కర్ పరిణామానికి న్యాయం చేకూరుతుంది. బౌద్ధం పాజిటివ్ దృక్పథంతో మనుషుల్ని ప్రేమపూరితంగా మార్చే కృషి చేస్తుంది.

అంబేద్కరిజం, పూలే, అంబేద్కర్ ఆచరణ, రచనల వెలుగులో రూపొందుతుంది. పూలే, అంబేద్కర్ రచనలు చదివితే వ్యాఖ్యానం లేకుండా కొన్ని విషయాలు యిపుడు

మనకు అర్థం కాకపోవచ్చు. ఉదా॥కు...

పూలే రాసిన 'గులాంగిరి' అప్పుడు ఎలా ఏ సందర్భంలో రాశారో, బాలగంగాధర్ తిలక్, పూలేను ఎందుకు వ్యతిరేకించారో, చరిత్రను చదివితేకాని అర్థం కాదు. అలాగే గాంధి కాంగ్రెస్ అంటరానివాళ్ళకు ఏం చేశారు? అనే అంబేద్కర్ రచనను అర్థం చేసికోవడానికి ఆనాటి చరిత్ర, దృక్పథం, స్థితి తెల్సుకోవాల్సి ఉంటుంది.

ఆనాటి స్థితిగతుల్లో పూలే అంబేద్కర్ చెప్పిన విషయాలను ఇపుడెలా అన్వయించుకోవాలి అని తెలిపేది అంబేద్కరిజం.

బుద్ధుడు, వేమన, పోతులూరి వీరబ్రహ్మం, మార్క్స్, ఎంగెల్స్, పూలే, గాంధీ, నెహ్రూ, అంబేద్కర్, పెరియార్ రామస్వామి మొదలుకొని ఎవరి రచనల నుంచయినా, ఆచరణనుంచైనా, తరువాతి తరంలో ఒక దృక్పథం ఒక ఆచరణ శక్తిగా ఎదుగుతున్నపుడు వాటిని సాధారణ సూత్రాలుగా మార్చవలసివుంటుంది.

**సిద్ధాంతాల సంశ్లేషణ - రాజీ**

అందులో భాగంగా యూరప్ దేశాల సిద్ధాంతాలను, ప్రజాస్వామిక సిద్ధాంతాలను, మార్క్సిజాన్ని, ఫెమినిజాన్ని, కొన్ని సూత్రాలుగా, అవగాహనలుగా క్రోడీకరించడం జరుగుతున్నది. ఇలా క్రోడీకరించడంలో కూడా స్కూల్ ఆఫ్ థాట్స్ వేరుగా ఉంటున్నాయి. పర్యవసానంగా గాంధీయిజం అనుచరులు ఒక్కటిగా కలిసి పనిచేయలేకపోతున్నారు. మార్క్సిజం అనుచరులు ఒక్కటిగా కలిసి పని చేయలేకపోతున్నారు. ఫెమినిజం అనుచరులు ఒక్కటిగా కలిసి పనిచేయలేక పోతున్నారు.

**పూలేయిజం, అంబేద్కరిజం యొక్క మౌలిక లక్ష్యం ఏమిటి?**

పూలేయిజం, అంబేద్కరిజం యొక్క మౌలిక లక్ష్యం ఏమిటి? ప్రాతిపదిక ఏమిటి? ఇలా ప్రశ్నించుకున్నపుడు చాలామంది కుల నిర్మూలన అని అనుకుంటారు. వారు కుల నిర్మూలనకోసం, రిజర్వేషన్లకోసం, మానవ సమాన హక్కులకోసం ఎంతగా పోరాడారో మిగతా రంగాలన్నింటిలో కూడా అంతకు తక్కువేమీ పోరాడలేదు. ఇతర రంగాలలో వాళ్లు చేసిన కృషిని ఎక్కువగా పట్టించుకోలేదు.

పూలేయిజం, అంబేద్కరిజంలో ప్రాథమిక అంశం మానవతావాదమని కొందరు పేర్కొన్నారు. అది వాస్తవమే. పూలే, అంబేద్కర్, పెరియార్‌లు ప్రపంచ పౌరహక్కుల, మానవహక్కుల ఉద్యమ నిర్మాతల్లో, సిద్ధాంత కర్తల్లో ఒకరు. వారి కుల నిర్మూలనా పోరాటం మానవ హక్కుల, పౌరహక్కుల పోరాటాల్లో భాగంగా సాగింది.

ఈ విషయాన్ని ప్రపంచానికి తెలియచెప్పి పూలే, అంబేద్కర్, పెరియార్‌లను ప్రపంచంలోని మహోన్నత పౌరహక్కుల నాయకులుగా, సిద్ధాంతకర్తలుగా ప్రపంచానికి తెలియచెప్పాల్సిన బాధ్యత ఈ దేశ సిద్ధాంత కర్తల మీద ఉంది.

**కొత్త సిద్ధాంతాలు ఎప్పుడూ పుదుతూనే వుంటాయి**

అత్త కూడా ఒకప్పుడు ఆ యింటికి కోడలే. ఎక్కడో పుట్టి ఆ యింట స్థానం సంపాదించుకుని ఆ యింటి ఇల్లాలుగా, ఆ ఇంటి తల్లిగా ఎదిగినదే. అలాగే బుద్ధిజం యిక్కడ పుట్టి ఎక్కడెక్కడో విస్తరించి తల్లిగా మారింది.



మార్క్సిజం జర్మనీ, యింగ్లాండులలో పుట్టి ఎక్కడెక్కడికో విస్తరించింది. గాంధీయిజం ఇండియాలో పుట్టి ఎన్నో దేశాలకు విస్తరించింది.

ఫ్రాయిడిజం, ఫెమినిజం కూడా ఎక్కడో పుట్టి విస్తరించినవే. ఏదైనా కొత్తగా యింటికొచ్చినపుడు కొత్తకోడలులాగే అంతదాకా కోడలుగా ఉండి యిల్లాలుగా, తల్లిగా స్థానం స్థిరపడ్డాక అత్తగా మారి కోడల్ని ఎన్నిక చేయడంలో, అదుపాజ్ఞల్లో పెట్టడంలో సహజ అధికార కంఠస్వరం ఉంటుంది.

**అభివృద్ధిలో ఆగిపోయిన వారిని ముందుకు నడపడం ప్రథమ కర్తవ్యం**

గిరిజన ప్రాంతాలను, ఎస్సీ, బీసీలను యుద్ధ ప్రాతిపదికపై అభివృద్ధి పరచాలి. పట్టణ ప్రాంతాలను ఉద్యమ ప్రాంతాలుగా మార్చాలి. తద్వారా అభివృద్ధి అందరికీ విస్తరిస్తుంది. ఇలా వామపక్ష శక్తులు, బీసీ, ఎస్సీ, ఎస్టీ శక్తులు కలిసి పనిచేయడం అవసరం.

**కొత్త సిద్ధాంతాలు ఎప్పటిప్పుడు పుదుతునే వుంటాయి**

ముందే చెప్పినట్టు ఎప్పటికప్పుడు కొత్త తరాలు తమ సామాజిక అస్తిత్వంలో తమవైన అనుభవాలను, ఆచరణను కొత్తగా సిద్ధాంతీకరిస్తారు. సూత్రీకరిస్తారు. వాళ్లంతా పాతవాటిని చదువవచ్చు. చదువకపోవచ్చు. ఈ కొత్త అనుభవాల కొత్త తరాల సిద్ధాంతాలను, సమాజ పరిణామాలను స్వీకరించని దృక్పథాలు సమాజానికి వెనకబడిపోతాయి. కొత్తవి ముందుకు సాగుతాయి. పాతవాళ్లు కొత్తవారికి ఛాందసులుగా కనపడతారు.

**చరిత్ర పరిణామాల్లో పుట్టే చలనాలను సూత్రీకరించే సిద్ధాంతాలన్నిటిని ఎప్పటికప్పుడు సమన్వయించాలి**

ఇలా సామాజిక పరిణామాలను అనుసరించి బుద్ధిజం, పూలేయిజం, మార్క్సిజం, గాంధీయిజం, అంబేద్కరిజం, ఫెమినిజం, తమను తాము అభివృద్ధి పరచుకోవలసి వుంటుంది. కొంతకాలానికి అత్తాకోడళ్లు సమాధానపడి, రాజీపడి కలిసి - కుటుంబాన్ని నడిపినట్టు అన్ని సిద్ధాంతాలు, సమాజ పరివర్తన కోసం సహజీవనం కోసం సమాధానపడవలసి ఉంటుంది. రాజీపడవలసి వుంటుంది. మారవలసి ఉంటుంది. సమకాలీనం కావలసివుంటుంది.

మానవ సంబంధాల చరిత్రను చరిత్రగా గుర్తిస్తే గాంధీయిజం, అంబేద్కరిజం, ఫెమినిజం, మార్క్సిజం కూడా వీరందర్నీ చర్చించడం స్వీకరించడం సాధ్యపడుతుంది. మార్క్సిజంలో భాగంగా కొనసాగుతున్న చారిత్రక భౌతికవాదానికి ఉత్పత్తి సిద్ధాంతానికి మానవ సంబంధాల సిద్ధాంతాన్ని జతచేస్తే ప్రపంచ చారిత్రక భౌతికవాదానికి కొంత చేర్పు చేసినవారవుతారు.

**పాత వాటితో పాటు కొత్తవి కూడా పుదుతూ కొనసాగుతాయి**

ఎప్పటికప్పుడు కొత్త సంస్థలు పుదుతాయి. విస్తరిస్తాయి. ప్రతి తరంలో ఇది జరగవచ్చు. పారిశ్రామికవేత్తలు, వ్యాపారస్తులు, మేనేజర్లు, పరిపాలనాదక్షులు, రాజకీయ నాయకులు, రాజకీయ పార్టీలు కొత్తగా పుదుతుంటారు, ఎదుగుతుంటారు. పాతవాళ్లు వెనకబడిపోతుంటారు. మైక్రోసాఫ్ట బిల్‌గేట్స్, విప్రో అజీం ప్రేమ్‌జీ, సత్యం, ఇన్ఫోసిస్

సంస్థలు కొత్తగా పుట్టి పాత వాటంత సంపాదన సృష్టించాయి. రాజకీయాల్లోను ఎన్.టి.రామారావు కొత్తగా ప్రవేశించి చరిత్ర సృష్టించారు.

**పాత ఆలోచనలను వదులుకోవాలి, కొత్తను కొత్తగా చూడాలి**

వీళ్ళు ఎందుకు గతంలో బతుకుతారంటే కొత్త ఆలోచనలను స్వీకరించలేక. పాతవాటికి చక్రభ్రమణంలో అలవాటు కావడం వల్ల. అందుకే జిడ్డు కృష్ణమూర్తి ఆలోచనల గురించి, సిద్ధాంతాల గురించి, వాటి చుట్టూతా తిరిగే చక్రభ్రమణం గురించి ఇలా అంటాడు. "చెట్టుని చెట్టులాగే చూడాలి. చెట్టు ఎట్లా వుంటుంది అని మీరనుకుంటుంటారో దానిని కాదు. భార్యవైపో, భర్తవైపో చూస్తున్నప్పుడు అతడు కాని, ఆమె కాని నిజంగా ఎట్లా కన్పిస్తున్నారో దానినే చూడాలి తప్ప, ఆ వ్యక్తి గురించి మీరు తయారుచేసుకున్న కాల్పనిక స్వరూపం ద్వారా కాదు. అప్పుడే వాస్తవాన్ని మాత్రమే, 'వున్నది'ని మాత్రమే మీరు చూడగలుగుతారు.

'యథార్థంగా వున్నది'ని చూడటమే అమాయకమైన స్వచ్ఛత్వం. అప్పుడే మనసు ఒక బ్రహ్మాండమైన మార్పును పొందుతుంది...

చిన్నతనం నుంచీ ఏదో ఒక ఆధిపత్యం మన మీద పెత్తనం చేస్తూ వస్తుంది. కుటుంబం, తల్లీ తండ్రీ, పాఠశాల, అధ్యాపకుడు మొదలైనవారి ఆధిపత్యంలోనే మనం నడిచాం. శాస్త్రవేత్తకు, సాంకేతిక వైజ్ఞానికుడికీ తప్పకుండా ఆ యా రంగాల్లో ఆధిపత్యం వుంటుంది. కానిపాద్యాత్మికమైన ఆధిపత్యం అనబడేది మాత్రం మహా దుర్మార్గమైనది. అదే క్రమరాహిత్యానికి గల ప్రధాన కారణాల్లో ఒకటి. ఎందుకంటే అది ప్రపంచాన్ని రకరకాలైన మతాలుగాను, రకరకాలైన సిద్ధాంతాలుగాను విభజించింది."

కొత్త సిద్ధాంతాలు కూడా కొత్తగా పుడుతూనే ఉంటాయి. ఇలా ఎందుకు జరుగుతుంది. ఎందుకంటే సిద్ధాంతాలంటే సామాజిక పరిణామాల్ని, సామాజిక చలనాలను, సైన్స్ ఆవిష్కరణలను, అవి తెచ్చే నూతన మానవ సంబంధాలను, వ్యవస్థలను, సిద్ధాంతాలను ఎప్పటికప్పుడు సామాజిక, రాజకీయ సిద్ధాంతాలుగా సిద్ధాంతీకరించడమే.

ఇలా ఇజాలు ఎప్పటికప్పుడు కొత్త పువ్వుల్లా వికసిస్తూనే వుంటాయి. ఏ పువ్వు ఎవరికోసమో పూయవు. పాత పువ్వుల కన్నా ఈ కొత్త పువ్వులు గొప్పగా లేవు కదా అని చర్చించే వాళ్ళు గతంలో బతికే వాళ్ళు. పువ్వు పూయడం దాని స్వభావం. సిద్ధాంతాలు, ఇజాలు ఎప్పటికప్పుడు పుట్టడం సామాజిక చలనాల సహజ స్వభావం. పాత వాటికన్నా గొప్పగా లేవు కదా అని చర్చించటం అనవసరం.

1. ఇజం ఎలా రూపొందుతుంది?
2. సిద్ధాంతాలు అలవాటుగా మారితే ఏం జరుగుతుంది?
3. నూతన సిద్ధాంతాలు ఎందుకు నిరంతరం పుట్టుకొస్తాయి? వివరించండి.
4. భావాలకన్నా మనుషులు ఎలా ముఖ్యమో వివరించండి.



# సామాజిక చలనసూత్రాలు అంటే ఏమిటి?

## వస్తుశోధన-చలన క్రమాలు

**చలనసూత్రాలు - కార్యక్రమాలు**

సమాజంలోని చలన శీలతను, స్వభావాన్ని దానికి ఇతర అంశాలతో పరస్పర సంబంధాల వల్ల కలిగే పరిణామాలను, చలనాలను, స్వభావాలను స్థల కాల నిర్దిష్టతల్లో సమగ్రంగా వెలికితీసి కొన్ని సిద్ధాంతాలుగా కూర్చి చెప్పడమే సామాజిక చలనసూత్రాలు. అందువల్ల జీవితాన్ని నిర్దిష్టంగా పరిశీలించాలి.

వేదాలను పైకెత్తి పురాణాలనన్నిటిని పూర్వపక్షం చేశాడు దయానంద సరస్వతి. దాంతో వేదాలను పూర్వపక్షం చేసి నాస్తిక, హేతువాదాలను చర్చించడం సులువైంది. దయానంద సరస్వతి ఆర్యసమాజాన్ని స్థాపించారు.

**హిందూయిజంలో భిన్న సిద్ధాంతాలు**

హిందూయిజంలో తిరిగి ఎన్నో యిజాలున్నాయి. శైవిజం ఉంది. వైష్ణవిజం ఉంది. బ్రాహ్మణిజం ఉంది. బహుజనిజం ఉంది. దయానంద సరస్వతి, వివేకానంద వాదాలున్నాయి. విగ్రహారాధన ఉంది. ఏకేశ్వరోపాసన ఉంది. నిరీశ్వర వాదన ఉంది. బ్రహ్మచర్యం, సన్యాసం ఉంది, సంసారం, కుటుంబం ఉంది. హిందూ వాదం కులాధిపత్యవాదాన్నే హిందూవాదంగా చెప్తుంది. హిందూ మతంలో ఇతరులు చేరే పద్ధతి లేదు. అందువల్ల విస్తరణ లేని, ప్రవాహం లేని వాదంగా మిగిలిపోయింది.

**నదిగా ప్రవహించి ఎడారిలో ఇంకిపోయే సిద్ధాంతాలు**

ఆఫ్రికాలో కొన్ని నదులు పారి పారి ఎడారి ఇసుకలో ఇంకిపోతాయి. కొన్ని వాదాలు ఇలా ఎక్కడికక్కడ ఇంకిపోతాయి. కొన్ని యిజాలు మాత్రమే విస్తరిస్తాయి. జీవనదులుగా ప్రవహిస్తాయి. సమాజాన్ని మార్చడంలో శక్తివంతమైన పాత్ర నిర్వహిస్తాయి.

**ఇజాలు సామాజిక పాత్ర నిర్వహిస్తాయి**

ఇజాలు సామాజిక పాత్ర నిర్వహిస్తాయి. సామాజిక పరిణామాలకు పునాది

అవుతాయి. వ్యక్తిగత జీవితంలోనూ, ఎంతో ప్రభావం వేస్తాయి. ఇలా నిత్య జీవితంలో ఆ యా ఇజాలు ఆచరణను, వాస్తవాలను మార్చుతాయి.

**సామాజిక చలనం అంటే ఏమిటి?**

సామాజిక చలనం అంటే సమాజంలోని భిన్న సిద్ధాంతాలు, ఆచరణలు, వాటి వైవిధ్యం, వైరుధ్యం, ఘర్షణ, ఐక్యత ఒక మొత్తంలో పరిశీలిస్తూ సామాజిక పరిణామాలను అన్నిటిని కలిపి సామాజిక చలనమంటారు.

సామాజిక చలనం అందరి ఆచరణను, అన్ని యిజాలు తెచ్చిన మార్పులను, కొత్త వాస్తవాలను తన విశ్లేషణకు ప్రాతిపదికగా చేసికొంటుంది.

**సమాజాన్ని ఒక సమగ్రతలో చూడాలి**

సమాజం సమగ్రమైనది. ప్రకృతి సమగ్రమైనది.

వీటి చలనాలను, పరిణామాలను నిరంతరం వెలికి తీయవలసివుంటుంది. అవి నిరంతరం పరిణామం చెందుతుంటాయి.

ఆచరణ, అనుభవం తానున్న స్థల కాలాల స్థితి గతుల ననుసరించి ఒకే విషయం అనేక రకాలుగా కనపడుతూ వుంటుంది. వాటిని సూత్రీకరించినపుడు సిద్ధాంతాలుగా చెప్తాము. ఎవరి అంచనాలు వారివి. ఎవరి ప్రాధాన్యతలు వారివి. ఎవరి దృష్టి కోణం వారిది. అందువల్ల సత్యం సాపేక్షికమైంది. అన్ని యిజాలు సాపేక్షిక సత్యాలు.

**సిద్ధాంతాలన్నీ పాక్షిక సత్యాలే**

సిద్ధాంతాలన్నీ పాక్షిక సత్యాలే. మొత్తం సామాజిక చలనాలను లెక్కలోకి తీసుకున్నప్పటికీ సూత్రీకరించే వారి స్థల కాలాలను, స్థితి గతులను అనుసరించి రూపొందుతాయి. వారి ప్రయోజనాలు, వారి దృష్టి కోణం ప్రాధాన్యత వహిస్తుంది. సమాజంలో భిన్న కులాలు, భిన్న భాషలు, భిన్న ఆశలు, ఆశయాలు, భిన్న వర్గాలు, భిన్న సాంఘిక హోదాలు, మనుషుల సామర్థ్యాలు, అభిరుచుల మధ్య వైరుధ్యాలను అనుసరించి సిద్ధాంతాలు, సూత్రాలు రూపొందుతాయి.

ఉదా॥కు అమ్మ తన పిల్లలను ప్రేమిస్తుంది. ఇది చెప్పడానికి కాకిపిల్ల కాకికి ముద్దు అనే సామెత ఒక సిద్ధాంతంగా రూపొందింది. అదే సమయంలో పొరుగింటి పుల్లకూర రుచి అనే సామెత కూడా రూపొందింది. సొంత ఇంటిలోని కూర కన్న పొరుగింటి పుల్లకూర రుచి అనడంలో కాకిపిల్ల కాకికి ముద్దు అనే అర్థానికి పూర్తి భిన్నమైన అర్థాన్ని ఇస్తుంది. అలాగే అందని ద్రాక్షపళ్లు పుల్లన అనే సామెత. అందితే ద్రాక్షపళ్లు పుల్లగున్నా తీయగానే అన్పిస్తాయి. అందకపోతే తీయని ద్రాక్షపళ్లు పుల్లన అని అంటారు.

**పోరాడి గెలుచుకుంటే పుల్లనిది కూడా తియ్యగానే ఉంటుంది**

ఒకసారి ఏమైందంటే శ్రీకాకుళం జిల్లాలో ఒక మారుమూల పల్లెలో ఎండాకాలంలో ఒక జిల్లా మహాసభను నిర్వహించడంకోసం వెళ్లాను. మాకు కొన్ని మామిడిపళ్లు ఇచ్చారు. అవి చాలా పుల్లగున్నాయి. ప్రేమతో ఇచ్చినవాటిని పుల్లగున్నా యంటే బావుండదనుకున్నాను. అక్కడి స్థానిక నాయకుడు ఒక ఉపాయం ఆలోచించాడు.



చిన్నపిల్లలను పిలిచి ఆ చెట్టును ముట్టుకుని ఎవరు తొందరగా వస్తారో వారికి మామిడిపండు ఇస్తాను అని పరుగెత్తమన్నాడు. పిల్లలు పరుగెత్తుకుని వచ్చి పళ్లు గెల్చుకున్నారు. చెమటలు పోస్తూ మామిడిపళ్లు తింటుంటే ఎలా వుందని అడిగాము. చాలా తీయగుందని అన్నారు.

పోటీలో విజయం సాధించి గెలుచుకునేది ఏదైనా ఇలా పుల్లనిది కూడా తియ్యగానే వుంటుంది. కష్టాలు కూడా ఇష్టంగానే ఎదుర్కుంటారు. ప్రేమికులు సమాజాన్ని, తల్లిదండ్రులను ఎదిరించి పెళ్లి చేసుకోవడంలో ఒక గెలుపు వుంది. ఆ గెలుపు వారి కష్టాలను కూడా ఇష్టంగా స్వీకరించి పరిష్కరించుకుంటారు. తల్లిదండ్రులు చూసిన సంబంధం తాను నచ్చకపోతే అది కష్టంగా అన్పిస్తుంది. తల్లిదండ్రులకు ఇష్టమైన సంబంధం పిల్లలకు ఇష్టం కాకపోవడంలో ఉన్నది ఇష్టాయిష్టాల, దృష్టి కోణంలోని వైవిధ్యాలే.

ఇలా సత్యాలు ఎవరికి వారు సత్యమని భావించడం ద్వారా రూపొందుతాయి. తల్లిదండ్రులు ఆ పిల్లకేమైంది, ఆ పిల్లగానికేమైంది అని అడుగుతారు. జవాబు సులభం కాదు. ఇలా సత్యాలు పాక్షిక అనుభవాల వల్ల రూపొందుతాయి. సత్యాలుగా ప్రచారం చేయబడుతాయి. అవన్నీ సాపేక్షిక సత్యాలు. సాపేక్షిక సత్యం అంటే పాక్షిక సత్యం అని అర్థం.

**అన్ని ఇజాలు పాక్షిక సత్యాలే**

అన్ని యిజాలు పాక్షిక సత్యాలే. ఎవరి అనుభవం, అవసరాలను, అభిరుచులను స్థల కాలాలను అనుసరించి వాళ్లు ఇజాలను రూపొందించుకుంటారు. సిద్ధాంతాలు రూపొందడానికి ఆ సమాజంలోని పరిణామాలు ప్రధాన కారణం. ఆ యా సమాజాలను అనుసరించి సిద్ధాంతాలు రూపొందుతాయి. ఆ యా సమాజాల పరిణామాలను పరిశీలించకుండా ఆ సిద్ధాంతాలను స్వీకరిస్తే మరో సమాజంలోని పరిణామాలను వాటికనువుగా మార్చడం అవుతుంది.

ఒక సమాజంలోని పరిణామాలు మరో సమాజంలో రాకుండానే ఆ సిద్ధాంతాలను స్వీకరించడం ద్వారా ఆ సిద్ధాంతాలు రూపొందిన సమాజాల ఆధిక్యతను, వ్యాప్తిని కొనసాగిస్తూ ఇతర సమాజాల పరిణామాల నుండి రూపొందించాల్సిన సూత్రాలను, సిద్ధాంతాలను అణిచివేస్తూ అనుచరులుగా మార్చివేస్తుంది. తెలంగాణ రాష్ట్రం నడుస్తున్న చరిత్ర పుస్తకంలోంచి ఇక్కడ పేర్కొనడం ఉచితంగా ఉంటుంది.

**తెలంగాణ, ఆంధ్ర దృష్టికోణాలు భిన్నమైనవి**

'ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం విషయానికి వస్తే గత పాతికేళ్లుగా బ్రిటిషాంధ్ర ప్రజల సామాజిక పరిణామంలో భాగంగా ఎదిగిన బ్రిటిషాంధ్ర ప్రాంత స్త్రీవాదులు, దళితవాదులు స్త్రీవాద నాయకులుగా, దళిత నాయకులుగా తెలంగాణ ప్రాంతంపై కూడా భావజాల, భౌతిక నాయకత్వాన్ని కొనసాగిస్తున్నారు. తద్వారా వారి అభివృద్ధికి అనువుగా, వారి ఆధిపత్యానికి అనువుగా తెలంగాణ వారిపై భావజాలాన్ని, నాయకత్వాన్ని రుద్దుతున్నారు.

తెలంగాణలో స్త్రీవాదులు స్వంత ప్రాంతీయ స్పృహతో ఎదగడాన్ని అడ్డు

కుంటున్నారు. అలాగే దళిత నాయకులు, దళిత భావజాల నాయకత్వం, దళిత సామాజిక ఉద్యమాలు తెలంగాణ స్వంత ప్రాంతీయ స్పృహతో ఎదగడాన్ని అడ్డుకుంటున్నారు. అది సహజం కూడా. బెంగాలీ పెత్తనాన్ని ఆమోదించినంతకాలం సాగించుకున్నారు. ఇప్పుడు బంగ్లాదేశ్ వేరై పోయింది. అస్సాం, ఒరిస్సా, ఈశాన్య రాష్ట్రాలు స్వతంత్ర రాష్ట్రాలుగా ఎదిగాయి. స్వంత నాయకత్వాన్ని, స్వంత చరిత్రను, స్వంత భాషను అభివృద్ధి పరుచుకున్నాయి.

**బెంగాలీ బాబుల్లా ఆంధ్ర ప్రాంత బాబుల నినాదాలు**

బెంగాలీ బాబులు ఆమ్ర బెంగాల్ అనే నినాదం ఇస్తుంటారు. బంగ్లాదేశ్‌తో సహా కలిసి బీహార్, బెంగాల్, ఒరిస్సా, ఈశాన్య రాష్ట్రాలు అంతా ఒకటే బెంగాల్ అని అంటుంటారు. ఇది ఎంత హాస్యాస్పదంగా మారిపోయిందో చరిత్ర చెప్తున్నది.

ఇప్పుడు బెంగాలీ బాబుల్లాగా బ్రిటిషాంధ్ర ప్రాంత బాబులు తెలంగాణ రాష్ట్రంపై, ప్రపంచంలోని తెలుగు వారందరిపై మనమంతా ఒక్కటే అనే పేరిట ఆధిపత్యవాదాన్ని కొనసాగిస్తున్నారు. ఇతర ప్రాంతాల సంస్కృతిని, భాషను, సామాజిక పరిణామాలను, సామాజిక ఉద్యమాలను అడ్డుకుంటున్నారు. నిరాకరిస్తున్నారు. సార్వజనీన పరిణామాలుగా అంగీకరించడాన్ని వ్యతిరేకిస్తున్నారు. అందువల్లే తెలంగాణ భాషను ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర భాషగా మార్చడాన్ని వ్యతిరేకిస్తున్నారు. అందువల్లే బతుకమ్మ పండుగను వాళ్లు జరుపుకోవడాన్ని నిరాకరిస్తున్నారు.

**తెలంగాణ రాష్ట్ర, ఆంధ్ర రాష్ట్ర సామాజిక పరిణామాలు వేరు వేరు**

తెలంగాణ ప్రజల సమస్యలు, సామాజిక పరిణామాలు ప్రత్యేకమైనవి. తెలంగాణ రాష్ట్ర చరిత్ర విశిష్టమైనది. దానికి బ్రిటిషాంధ్ర ప్రాంత పరిణామాలకు పోలిక లేదు. తెలంగాణలో సాయుధ పోరాటం జరిగింది. తెలంగాణలో గ్రంథాలయ ఉద్యమం జరిగింది. తెలంగాణలో భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు జరిగాయి. ఆంధ్ర ప్రాంతంలో సాయుధ పోరాటాలు జరగలేదు. తెలంగాణలో సహజవనరులు ఎన్నో వున్నాయి. వాటిని ఇతర ప్రాంతాలవాళ్లు కొల్లగొట్టుకుపోతున్నారు. ఆంధ్ర ప్రాంతంలో ఇతరులు ఎవరూ వారి వనరులను కొల్లగొట్టుకుపోవడంలేదు. తెలంగాణ పోరాట ప్రాంతం. కోస్తా ప్రచార ప్రాంతం. రాయలసీమలో ఫ్యాక్షనిజం. తెలంగాణలో సామాజిక ఉద్యమం. ఇలా ఎన్నయినా చెప్పవచ్చు.' (పేజి 14 – 15.)

ఇలా స్థల కాలాల ననుసరించి, సామాజిక పరిణామాల ననుసరించి దృక్పథాలు మారుతుంటాయి. సమైక్య రాష్ట్రవాదులు వలసవాదుల ప్రయోజనాల కోసం మాట్లాడు తుంటారు. తెలంగాణ రాష్ట్రవాదులు తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యం, స్వయం నిర్ణయాధికారం, తమ నీళ్లు, తమ బొగ్గు, తమ ఉద్యోగాలు, తమ వనరులు, తమ పరిపాలన తమకే చెందాలని భావిస్తారు.

అందువల్ల సిద్ధాంత చర్చలతో కాలం గడపడం కన్నా కలిసి పనిచేసే వాటి పట్ల కలిసి పనిచేయడం కోసం నిర్మాణాలు ఏర్పరచుకుంటారు. తెలంగాణ రాష్ట్రం కలిసి పనిచేయడం కన్న చాలా ముఖ్యం అనుకున్నప్పుడు అందుకు కలిసిరాని ఇతర ప్రాంతాల వారిని, వారి సిద్ధాంతాలను, వారి నాయకత్వాన్ని వదిలేసి స్వయంగా నిర్మాణాలు,



సిద్ధాంతాలు రూపొందించుకుంటారు.

ఈ విషయంలో లోతుగా అధ్యయనం సాగితే ఎందుకు కలిసి పనిచేస్తుంటారో, ఎందుకు విడిపోతుంటారో తెలుస్తుంది. అందుకు తత్వశాస్త్రరంగంలో విస్తృతమైన అధ్యయన తరగతులు, శిక్షణ శిబిరాలు, గోష్ఠులు, స్టడీ సర్కిల్స్, పత్రికల్లో చర్చలు, మొదలైనవి ఎంతో ఉపకరిస్తాయి.

**చర్చలు ప్రధానం కాదు, ఆచరణ ప్రధానం**

ఇటీవలి కాలంలో ప్రపంచవ్యాప్తంగా ఆచరణాత్మక సైద్ధాంతిక రంగాల్లో ఎన్నో చర్చలు జరుగుతున్నాయి. తాను చెప్తున్న దానిపై ఆత్మవిశ్వాసం లేనివారు, పట్టు సాధించనివారు చర్చలను వ్యతిరేకిస్తారు. ఆచరణ లేనివారు చర్చలను ప్రధానం చేస్తారు. కలిసి పనిచేసే అవకాశం ఉన్నవాటిని కూడా భిన్నాభిప్రాయాల పేరుతో నిరాకరిస్తారు.

**ఆచరణలో ఉన్నంతమాత్రాన సిద్ధాంతం వారి పేటెంట్ కాదు**

కొందరు తమ ఆచరణతోపాటు తమ సిద్ధాంతానికి కూడా తామే నాయకులం అనుకుంటారు. సిద్ధాంతం అందరిది. ఎవరైనా స్వీకరించవచ్చు. కాని కొన్ని సంస్థలు, వ్యక్తులు తమ వ్యక్తిగత ఆస్తిగా భావించి ఇతరులకు దానిపై పేటెంట్ హక్కు లేదన్నట్టుగా ప్రవర్తిస్తారు. ఇది వాళ్ల ఆచరించే దృక్పథానికి కూడా నిర్దేశకులుగా తమను తాము భావించుకోవడాన్ని తెలుపుతుంది.

ఒక పార్టీలో, సంస్థలో నాయకత్వం వహించేవాళ్లు తమదే కరెక్టు అని అనవచ్చు. ఉదా॥కు తెలంగాణ కమ్యూనిస్టు, మార్క్సిస్టు పార్టీల కార్యకర్తలు, నాయకులు తెలంగాణ రాష్ట్రం అవసరమని అందుకు పీడిత వర్గ దృక్పథంతో మనమే ఉద్యమించాలని అంటారు. కోస్తాంధ్ర నాయకులు దాన్ని వ్యతిరేకిస్తూ తమదే మార్క్సిజం అంటారు. తెలంగాణ రాష్ట్రం కోరే సభ్యులను మీది మార్క్సిజం కాదంటారు. దాంతో రెండు శిబిరాలుగా మారుతారు. అధికారం ఎవరి చేతుల్లో వుందో వాళ్లు చెప్పిందే మార్క్సిజంగా చలామణీ చేస్తారు. పర్యవసానంగా పార్టీ భౌతిక నిర్మాణంతో పాటు భావజాల రంగం కూడా కొందరి చేతుల్లో బ్యూరాక్రటీకరణ చెందుతున్నది.

కొందరు తమ భావాలను వ్యక్తం చేయలేనివారు ముచ్చట్ల ద్వారా వ్యక్తం చేయవచ్చు. అపుడు వారిని పార్టీ నిర్మాణ సూత్రాలకు విరుద్ధంగా అందరితో చర్చలు చేస్తున్నారని క్రమశిక్షణ చర్యలకు గురిచేస్తారు. ఇలా ప్రతి మార్క్సిస్టు పార్టీ కార్యవర్గం ఆచరణలో తాను ప్రపంచ మార్క్సిజానికి కార్యవర్గంను అన్నట్టుగా ప్రవర్తిస్తున్నది.

**నిర్మాణ దక్షత, పరిపాలన దక్షత సిద్ధాంత కర్తగా దక్షతను నిరూపించదు**

కొందరు ఆ యా పదవుల్లో వుండడానికి వారి నిర్మాణ దక్షత, పరిపాలన దక్షత కారణం కావచ్చు. త్యాగం, సాహసం, ఒక రంగంలో విశేష అనుభవం అంతకుమించిన వారు అందులో లేకపోవడం, ఆ పార్టీ మెజారిటీ సభ్యుల ఆమోదం ఇలా ఏదైనా కారణం కావచ్చు. ఆ దక్షత ఉన్నంతమాత్రమే, సిద్ధాంతకర్తలుగా నాయకులకు ఉన్నత స్థాయి ఉన్నట్టు కాదు. సిద్ధాంత వర్గం అది మరొక కార్యక్షేత్రం. సిద్ధాంత ఆచరణ నుండి నాయకత్వం ఏర్పడుతున్నది. అందువల్ల సిద్ధాంతానికి వాళ్లు అనుచరులే తప్ప

నాయకులు కారు. సిద్ధాంతం ద్వారా కొత్త విషయాలను విశ్లేషించినప్పుడు అవి వారి వ్యక్తిగత అభిప్రాయాలే అవుతాయి తప్ప మార్క్సిజంలో భాగం కాదు. అందువల్లే లెనిన్ చెప్పిన సిద్ధాంతాలను, ఆచరణను లెనినిజం అన్నారు. మావో చెప్పిన సిద్ధాంతాలను, ఆచరణను మావోయిజం అన్నారు. ప్లెకనోవ్ చెప్పిన సిద్ధాంతాలను, ఆచరణను ప్లెకనోయిజం అన్నారు. అలాగే అంబేద్కర్ చెప్పిన ఆచరణను, సిద్ధాంతాలను అంబేద్కరిజం అన్నారు. కాన్షీరాం ఆచరణను, సిద్ధాంతాలను కాన్షీరాం మెథడాలజీ అన్నారు. అయితే ఇండియాలో మార్క్సిస్టు పార్టీలు ఇలా వ్యక్తుల పేరుతో, నాయకుల పేరుతో సిద్ధాంతాలు చేయకుండా పార్టీ పేరుతో సిద్ధాంతం చేస్తుంటారు.

ఉదా॥కు విశాలాంధ్రలో ప్రజారాజ్యం అనే సిద్ధాంతం పుచ్చలపల్లి సుందరయ్య వాదం. దాన్ని సుందరయ్యవాదంగా పిలువకుండా కమ్యూనిస్టు పార్టీల సిద్ధాంతంగా ప్రచారం చేశారు. భారతదేశంలో కులవ్యవస్థకు, ప్రాంతీయ, భాష సమస్యలకు మార్క్సిస్టులు చేసే సిద్ధాంతాలు, ఆచరణ ఆ యా నాయకుల పేరు మీద కాకుండా పార్టీల పేరుమీద చలామణీ చేయడంవల్ల వ్యక్తిగత సిద్ధాంతాలు పార్టీ మొత్తం అభిప్రాయాలుగా బలాన్ని సాధించుకుంటూ కొత్త సత్యాలను, ఇతర కోణాలను స్వీకరించడాన్ని పార్టీ సమస్యగా మార్చే స్థితి ఏర్పడింది. దానివల్ల పార్టీలు మారలేక, సిద్ధాంతాలు వదులుకోలేక ప్రజాభిప్రాయానికి ఎదురీదలేక మేం తెలంగాణ రాష్ట్రాన్ని తెచ్చుకోంగ వద్దంటలేం. మేం వ్యతిరేకించినా జార్కండ్ ఏర్పడలేదా అని సిద్ధాంత లేమిని ప్రకటించుకుంటున్నారు.

### నాయకత్వానికి నచ్చకపోతే మార్క్సిజానికి వ్యతిరేకమని ఎలా అంటారు?

ఆ పార్టీ సభ్యులో, కార్యవర్గమో, మొత్తం ప్రపంచం కాదు. వారి అభిప్రాయాలకు భిన్నంగా వుంటే అది మార్క్సిజానికి వ్యతిరేకమవుతుందా? సామాజిక విశ్లేషణ ద్వారా కాకుండా మెజారిటీ ద్వారా పూర్వపక్షం చేస్తే అది సత్యం అయిపోతుందా? విజ్ఞులు ఈ ప్రశ్నలకు ఔనని జవాబిచ్చే సాహసం చేయరు. పార్టీల ఆచరణ మాత్రం అపుననే జవాబిస్తున్నది.

### సిద్ధాంతాలను సిద్ధాంతాల ద్వారా పూర్వపక్షం చేయాలి

సిద్ధాంతాలను చర్చ ద్వారా పూర్వపక్షం చేయాలి. అలా కాకుండా పార్టీలో అందరూ ఒప్పుకున్నారని మీకు జవాబు చెప్పాల్సిన అవసరంలేదని భావిస్తే అది మందబలమే తప్ప సిద్ధాంత బలం కాదు. సిద్ధాంతాల మధ్య చర్చ వచ్చినప్పుడు సిద్ధాంతాలను పూర్వపక్షం చేసి తన వాదాన్ని సహేతుకంగా నిరూపించుకోవాలి. అప్పుడే అది సిద్ధాంతమవుతుంది. మా పార్టీ అభిప్రాయం ఇంతే అంటూ చర్చను నిరాకరించడం, నిర్లక్ష్యం చేయడం, మౌనం వహించడం అనేవి ఆధిపత్యవాదాన్ని తెలుపుతాయి తప్ప సిద్ధాంత బలాన్ని తెలుపవు. ఉదా॥కు హిందూ మత తత్వవాదులు తమ సిద్ధాంతాలను వ్యతిరేకించేవారితో చర్చించి తమ సిద్ధాంతాలను నిలబెట్టుకోవడం పట్ల ఇదే పద్ధతిని అవలంబిస్తారు. చాలా పార్టీలు ఇదే పద్ధతిని అవలంబిస్తారు.

ఇది భావజాలానికి, ఆచరణలో ఉన్నవారికి మధ్య ఏర్పడుతున్న వైరుధ్యం.

మెజారిటీ నిర్ణయం ద్వారా పూర్వ పక్షం చేస్తే వాళ్లు విడిపోయి సొంత పార్టీ



ప్రారంభిస్తున్నారు. చీలికల వెంట చీలికలు. వీటి ఐక్యత కోసం, భావజాల రంగం, చేయవలసిన కృషి ఏదైనా వుందా?

### విడిపోయిన ఆచరణను కలపడం ఎలా?

భావజాలానికి నిర్మాణ సూత్రాలకు మధ్య ఏర్పడే వైరుధ్యాన్ని పరిష్కరించడం ఎలా!

ఈ రోజు గాంధీయిజం ఒకటి కాదు. మార్క్సిజం ఒకటి కాదు. హిందూయిజం ఒకటి కాదు. అంబేద్కరిజం ఒకటి కాదు. ఈ రోజు అన్ని దేశాల్లోని ప్రజాస్వామ్యం ఒకటి కాదు. అన్ని దేశాల్లోని రాజరికం ఒకటి కాదు. అన్ని దేశాల్లోని సోషలిజం ఒకటి కాదు. ఈ రోజు అన్ని మతాలు ఒకటి కాదు. ఈ రోజు అన్ని సామాజిక ఉద్యమాలు ఒకటి కాదు.

### అన్ని సిద్ధాంతాలు పాక్షికమే అని గుర్తిస్తే పరిష్కారం ఎంతో సులభం

ప్రతి దాని వెంట ఎంతో కొంత ఆచరణ, దానినంటి పెట్టుకొన్న ప్రజలు, ఒక ఆలోచనా వ్యవస్థ, ఆచరణ, కార్యక్రమం విడిగా వున్నాయి.

మాది మాత్రమే ప్రజాస్వామ్యం, మాది మాత్రమే సోషలిజం, మాది మాత్రమే స్వేచ్ఛాసమానత్వం, సౌభ్రాతృత్వం అనడానికి లేదు. వీటిమధ్య ఎన్నో వైవిధ్యాలు ఉన్నాయి. వీటిమధ్య భిన్నత్వంలో ఏకత్వం కూడా ఉంది.

మార్క్సిజం అనే వాళ్ళను మిగిలిన మార్క్సిస్టులు అతివాద, మితవాద, ఆ నిర్దిష్టవాద వగైరా పదాల్తో నరకడానికి రెడీగా వున్నారు. వీరిని చంపడానికి శత్రువులకు యిక తమదైన సిద్ధాంత ఆయుధాల్తో ఏం పని?

ఈ అంతస్సంఘర్షణ వల్ల వ్యవస్థను, యథాతథవాద సమతుల్య (బ్యాలన్సింగ్) స్వభావంలోకి మార్చే ఒక కులవ్యవస్థగా మార్క్సిస్టు ఆలోచనా వ్యవస్థ కుదించుకుపోయింది.

### ఈ పరిస్థితిలో సామాజిక దార్శనికుల కర్తవ్యం ఏమిటి?

ప్రతిదాన్లో చలన క్రమం వుంటుంది. కనక పదాడంబరంతో తన ఆధిక్యతను చాటుకోవడం నిలిపివేయాలి. ఆచరణ ద్వారా ప్రజలను గెలుచుకోవాలి. శక్తివంతం కావాలి. నాది కూడా మార్క్సిజమే, నాది కూడా అంబేద్కరిజమే, అని నిర్ధారించుకునే హక్కుంది. అన్ని యిజాలు మానవతా విలువలకు మించినవి కావు.

పువ్వుల నుండి పువ్వులు పుట్టవు. ప్రజల జీవితాల్లోకి వెళ్లాలి. జీవిత వాస్తవాల ప్రాతిపదికను అశ్రద్ధ చేసే యిజాల నుండి యిజాల అభివృద్ధి, కొత్త యిజాల పుట్టుక సాధ్యం కాదు.

భావజాల, భౌతిక రంగాల్లోని ఆధిక్యతను క్రమంగా కోల్పోవడం సహజ క్రమమవుతుంది. మన దృక్పథానికి వ్యతిరేకం అని అనేస్తే అది సత్యం అయిపోయినట్టు కాదు.

### వాస్తవాలకు దృక్పథానికి మధ్య వైరుధ్యం

దృక్పథం గతంలోని అనుభవాల నుండి, సిద్ధాంతాల నుండి, ఆచరణ నుండి

రూపొందించుకున్నది. వాస్తవాలు వర్తమానం. అందువల్ల వాస్తవాలు, వర్తమానం సత్యం. వాస్తవాల కనువుగా దృక్పథాన్ని మార్చుకోవాలి. ఉదా॥కు ఆంధ్ర, తెలంగాణలు తిరిగి ప్రత్యేక రాష్ట్రాలుగా ఏర్పడ్డం చారిత్రక అనివార్యత అని గుర్తించి సుందరయ్యవాదాన్ని, సమైక్యతావాదాన్ని మార్చుకోవడం వాస్తవికత. ప్రజలందరూ విడిపోవాలని కోరుతుంటే, కలిసి ఉండాలని కోస్తా వలసవాద సిద్ధాంతాన్ని ఇంకా కొనసాగించడంలో ఔచిత్యం లేదు.

తెలంగాణ తిరిగి ప్రత్యేక రాష్ట్రం కావాలని 1969లో సాగిన ఉద్యమం ఎంత బలమైనదో దానికి ఎంత ప్రపంచవ్యాప్త ఫినామినా ఉందో 1985లో రష్యా 13 దేశాలుగా విడిపోవడమే సాక్ష్యం. తెలంగాణ ప్రజలు ప్రత్యేక రాష్ట్రం కోసం రష్యా ప్రజలకన్నా 15 ఏళ్ల ముందే చైతన్యవంతంగా ఉద్యమించారని అన్వయించుకోవడం అవసరం. 60 ఏళ్లు కలిసివున్న తర్వాత కూడా సోషలిస్టు రష్యా 13 దేశాలుగా స్వతంత్రం పొందాక కూడా రష్యా విప్లవంతో స్ఫూర్తి పొంది ఏర్పడ్డ కమ్యూనిస్ట్ పార్టీలు తెలంగాణ కనీసం ఒక రాష్ట్రంగా తిరిగి ఏర్పడడాన్ని సిద్ధాంతరీత్యా అంగీకరించలేకపోవడం వారి సిద్ధాంత రాహిత్యాన్ని కోస్తా వలసవాద, ప్రాంతీయ ఆధిపత్యవాద కులాల దృక్పథాన్ని తెలుపుతుంది.

"ప్రజాస్వామిక సోషలిస్టు తెలంగాణ నినాదాన్ని తెలంగాణ రాష్ట్రం వచ్చేదాకా వాయిదావేసి ఇపుడు ఆంధ్ర రాష్ట్రాన్ని ప్రజాస్వామిక సోషలిస్టు రాష్ట్రంగా మార్చే పునర్నిర్మాణం చేయాలి. అలాగే సోషలిస్టు ఆంధ్ర ప్రాంత నిర్మాణానికి వామపక్షాలు పూనుకోవాలి. ఆంధ్ర ప్రాంత పాలకవర్గాల పార్టీలతో ఎట్టిపరిస్థితుల్లోనూ ఐక్యసంఘటన, సీట్ల సర్దుబాటు లేకుండా పోరాట పంథాను ఎన్నుకున్నప్పుడే వారిపట్ల ప్రజలకు విశ్వాసం కలుగుతుంది. ఈ పని చేయకుండా ఐక్య సంఘటన కట్టడం వారి ప్రాంతీయ తత్వాన్ని, కుల తత్వాన్ని తెలుపుతుంది. ఇలా తెలంగాణ రాష్ట్ర ఉద్యమం ఆంధ్ర ప్రాంత పరిపాలకుల, మేధావుల ముందు, వామపక్ష, నక్సలైటు, దళిత బహుజన మేధావుల ముందు, నాయకుల ముందు, సూటిగా పరీక్ష పెట్టింది.

ఈ పరీక్షలో వర్గదృక్పథమే గెలుస్తుందో, ప్రాంతీయ కులతత్వ దృక్పథమే ఆంధ్ర ప్రాంత అన్ని పార్టీల నాయకులు, విద్యావంతులు కొనసాగిస్తారో తేలిపోతుంది. తానున్న ప్రాంతంలో పాలకవర్గాల మీద పోరాటం చేయలేని ఆంధ్ర, రాయలసీమ, బీసీ ఎస్సీ ఎస్టీ వర్గాలు తెలంగాణకు కూడా ఎనలేని నష్టాన్ని చేస్తాయి. వాళ్లు అక్కడ పోరాటం చేస్తే వాళ్లు నాయకులుగా ఎదుగుతారు. కమ్మ, రెడ్డి నాయకత్వం ప్రాధాన్యత కోల్పోతుంది. తెలంగాణ వారిపై దోపిడీ, అణిచివేత ఆధిపత్యం తగ్గుతుంది." (తెలంగాణ రాష్ట్రం - నడుస్తున్న చరిత్ర, పేజి 20 - 21)

**వర్తమానాన్ని సిద్ధాంతీకరించడం ఎలా జరగాలి?**

భావజాల చరిత్ర యొక్క ఈ నేపథ్యంలో వాస్తవాలకు దృక్పథానికి మధ్య గల మౌలిక సంబంధంరీత్యా యిజాలు, సూత్రీకరణలతో కాకుండా వాస్తవాలతో చర్చించాల్సి ఉంటుంది.

నాది మాత్రమే బుద్ధిజం, హిందూయిజం, గతితర్కం, మార్క్సిజం, గాంధీయిజం, అంబేద్కరిజం, బహుజనిజం అని ప్రకటించే హక్కు ఎవరికీ లేదు. అలా ఎవరైనా ప్రవర్తిస్తే అది ఐడెంటిటీ క్రైసిసో, ఫ్యూడల్, ఫాసిస్టు ఆధిపత్యవాద ప్రదర్శనో అవుతుంది.

వాస్తవాలు, ప్రజలు ప్రాథమికం కాకుండా బుద్ధిజం, హిందూవాదం, బ్రాహ్మణవాదం పైనో, గాంధీయిజంపైనో, మార్క్సిజంపైనో, అంబేద్కరిజంపైనో చర్చ ప్రాథమికం చేస్తే వాస్తవాలను, ప్రజలను అశ్రద్ధ చేసే దృక్పథం ఆచరణలోకి రావచ్చు.

వాస్తవాలకు దృక్పథానికి మధ్య వైరుధ్యం కొనసాగుతున్నపుడు వాస్తవాలను అశ్రద్ధ చేసి దృక్పథం ప్రాథమికం అనడం భావవాదం.

దృక్పథం అనేది ఒక చైతన్యం. వాస్తవాలు అనేవి ఒక భౌతిక పదార్థం. దృక్పథం అనేది గతానికి సంబంధించినది. వాస్తవాలు వర్తమానికి సంబంధించినవి. వర్తమానానికి అనువుగా వర్తమానం నుండి గతాన్ని అంచనా వేయడం ద్వారా మార్క్సిజం, అంబేద్కరిజ రూపొందాయి. తిరిగి వర్తమానం ద్వారా వాటిని సరిచేసుకుంటూ సమగ్రం చేసుకుంటూ మార్పులు చేర్పులు చేసుకుంటూ, కొత్త సిద్ధాంతాలు, దృక్పథాలు సృష్టించుకుంటూ ముందుకు సాగాలి. ఎంగెల్స్ చాలాసార్లు నొక్కిచెప్పిన విషయం ఏమిటంటే గతితర్కాన్ని వస్తువుల మీద, వాస్తవాల మీద రుద్దడం కాదు, ఆ యా వస్తువుల నుండి, వాస్తవాల నుండి వాటి చలనసూత్రాలను, పరిణామాలను వెలికితీయడమే గతితర్కం అని!

ఇండియాలో కమ్యూనిస్టులు, మార్క్సిస్టులు కులసమస్య విషయంలో, తెలంగాణ రాష్ట్రం విషయంలో మరెన్నో సమస్యల విషయంలో ఇందుకు భిన్నంగా గతితర్కాన్ని, మార్క్సిజాన్ని వస్తువులమీద, వాస్తవాలమీద రుద్దారు. అంతేగానీ ఆ యా వస్తువుల వాస్తవాల నుండి వాటి చలనసూత్రాలను, పరిణామాలను వెలికితీయలేదు. ఇది ఎంగెల్స్ నొక్కిచెప్పిన దానికి పూర్తి విరుద్ధమైన ఆచరణ.

**దృక్పథం కన్న వాస్తవాలే ప్రాథమికం**

**గతం కన్నా వర్తమానమే ప్రాథమికం**

దృక్పథం కన్నా వాస్తవాలే ప్రాథమికం. గతం కన్నా వర్తమానమే ప్రాథమికం. సిద్ధాంతాలు ఎప్పటికప్పుడు ఎండిపోతుంటాయి. జీవితవృక్షం నిరంతరం పచ్చగా వికసిస్తూనే వుంటుందని లెనిన్ అంటాడు.

వాస్తవాలకు దృక్పథానికి మధ్య వైరుధ్యంలో అంతిమంగా వాస్తవాలు ప్రాథమికం అని నిర్ధారించడంతో సామాజిక భావజాల రంగంలోని సంప్రదాయాల్లో కొన్ని మార్పులు చేసికోవాల్సి వస్తుంది. అధ్యయనంలో, విశ్లేషణలో, అప్రోచ్ మార్చుకోవాల్సి వస్తుంది.

ఎదుటి వారిని ప్రజా వ్యతిరేకి, హిందూవాది, బ్రాహ్మణవాది, మార్క్సిస్టు, గాంధీవాది, దళితవాది, బహుజనవాది, తిరోగమనవాది అని తిట్టి తప్పించుకోవడానికి సందు దొరకదు. వాళ్లు వాస్తవాలను వాస్తవాలుగానే విశ్లేషించి ఎదుటివారి నిర్ధారణను, సూత్రీకరణలను, కార్యక్రమాలను పూర్వపక్షం చేయాల్సి వస్తుంది. ఆ విశ్లేషణ వెనక ఏ దృక్పథమూ లేదు, వాస్తవాన్ని వాస్తవంగానే చెప్పాడు అనేంత అంతర్లీనంగా దృక్పథాన్ని వ్యక్తం చేసే అభ్యాసం చేయాల్సి వస్తుంది.

**వాస్తవం, సత్యం, గతితర్కం సమానార్థకాలు**

వాస్తవం గతితర్కం అనేవి సమానార్థకాలని, పర్యాయ పదాలని గ్రహిస్తే మరింత స్పష్టత కలుగుతుంది.

మనం విషయాల్ని చర్చించేటప్పుడు ప్రేమపూరితమైన అప్రోచ్, శిల్పం, పద్ధతి, దృక్పథం పెద్దగా అలవరచుకోలేదు. మరోతీరుగా చెప్పాలంటే భావజాల రంగంలో మిత్ర వైరుధ్యంగా పరిష్కరించడం కన్నా శత్రువైరుధ్యంగా పరిష్కరించడంపట్ల మనకు ఆసక్తి ఎక్కువ. ఇది మనకు వంశపారంపర్యంగా వస్తున్న అంటువ్యాధి.

ఈ విస్తృతార్థంలో, లక్ష్యంతో తత్వశాస్త్రరంగంలో రాజకీయ పార్టీలు, ప్రజాసంఘాలు కృషి చేయలేకపోతున్నాయి.

తన దృక్పథం, కార్యక్రమం చెప్పి పనికి పురమాయించడానికి పరిమితమవుతున్నాయి. వాళ్ళు వదిలేస్తున్న యీ పని మనం చేయాల్సివుంది. ప్రజల పట్ల సామాజిక ఆచరణ గీటురాయిగా అందరూ కలసి పని చేయడం ఎంతో అవసరం.

**కలిసి పనిచేయడానికి అనువుగా సిద్ధాంతాలను మార్చుకోవాలి**

అందుకు అడ్డంకి అయ్యే ప్రతిదీ శుష్కపండిత చర్చో, ఐడెంటిటీ క్రైసిసో, పడక్కుర్చీ రాజకీయమో, యిగోయిజమో, ఆధిపత్యవాదమో అయివుంటుంది.

అందువల్ల అందరి కలయికకు అడ్డంకి అయ్యే ప్రతిదాన్ని దాని తాత్వికమూలాల్తో సహా పెకలించివేయాల్సివుంది.

ఈ విశాల ప్రపంచాన్ని మనం గెలుచుకోవాల్సివుంది.

అందుకోసం సామాజిక ఆచరణలో మనం నిరంతరం కలుస్తూనే ఉండాలి. కలిసి పని చేస్తూనే వుండాలి. మనకు ప్రజలు ప్రాథమికం కావాలి.

## ప్రశ్నలు

1. సామాజిక చలనసూత్రాలు అంటే ఏమిటి?
2. సిద్ధాంతాలన్నీ పాక్షిక సత్యాలే ఎలా అవుతాయి' వివరించండి.
3. పోరాడి గెలుచుకుంటే పుల్లనిది కూడా తియ్యగానే వుంటుంది. ఎలా?
4. సమకాలీన సామాజిక దార్శనికుల కర్తవ్యమేమిటి?
5. దృక్పథం కన్నా వాస్తవాలే ప్రాథమికం, వర్తమానమే ప్రాథమికం ఎలా అవుతాయి?



# ప్రకృతి గతితర్కం - కొన్ని చలనాలు

భూమి తనచుట్టూ తాను తిరుగుతూ తన కక్ష్యలో సూర్యునిచుట్టూ నిరంతరం పరిభ్రమిస్తున్నది. సౌర కుటుంబం, నక్షత్ర మండలాలు వాటి కక్ష్యల్లో నిరంతరం పరిభ్రమిస్తున్నాయి.

ప్రతి వస్తువులో చలనం వుంటుంది. ప్రతి చలనంలో పరస్పర విరుద్ధ అంశాలుంటాయి.

అవి తమ చలనంతో ఒక ఐక్యతగా ఒక సంబంధంలో కొనసాగుతాయి.

ప్రతి వస్తువు పరస్పర విరుద్ధాంశాల ఐక్యతలో తానొక వస్తువుగా చలనాన్ని, అస్తిత్వాన్ని ఉత్పన్నం చేసికొంటున్నది.

"గతి" "నడక" చలనానికి పర్యాయపదాలు.

చలనతత్వాన్ని తెలుసుకోవడం గతితత్వం.

గతితత్వం పరస్పర విరుద్ధ అంశాల ఐక్యత.

అందువల్ల గతితత్వం వైరుధ్యం అని పిలువబడింది.

**చలనం యొక్క రూపమే వస్తువు, స్థలం, కాలం, శక్తి**

నిజానికి చలనం యొక్క రూపమే వస్తువు, స్థలం, కాలం, శక్తి మొదలైనవి.

భాషలోని పదాలు దాదాపు చలనం యొక్క వర్ణనలూ సంబంధాలే. సంబంధం అంటే రెండు లేదా అంతకన్నా ఎక్కువ వస్తువులమధ్య, వాస్తవాల మధ్య పరస్పర ఆచరణ.

**ప్రతి చలనం ఇతర చలనాలతో సంబంధంలో వుంటుంది**

ప్రతి చలనం ఇతర అనేక వైవిధ్యపూరితమైన, వైరుధ్యపూరితమైన, ఘర్షణా పూరితమైన చలనాలతో పరస్పర సంబంధంలో ఉంటుంది. దాని స్వభావం ఆచరణ ఇతర చలనాల సంబంధంలో భాగంగా సాగుతుంది.

ఉదా॥కు భూమి పరిభ్రమణం సౌరకుటుంబ పరిభ్రమణ సంబంధంలో భాగంగా సాగుతుంది.

**పరస్పర శక్తిమార్పిడిలో కనపడేదే మొత్తం చలనం కాదు**

ఒక చలనానికి మరొక చలనానికి మధ్య వాటి చలనాల పరస్పర శక్తి మార్పిడి

ఉత్పన్నతకు "సంబంధం" ప్రాతిపదిక.

పరస్పర, శక్తి మార్పిడిలో చర్య ప్రతిచర్యలు, ఐక్యతా ఘర్షణలు ఉత్పన్నమవుతాయి.

సూర్యుడి శక్తి మనకు రోజూ అందుతున్నది. ఇవాళ అందింది మాత్రమే సూర్యునిలోని మొత్తం శక్తి కాదు. ఇంకా ఎంతో శక్తి సూర్యుడిలో ఉన్నది. అది రేపు శక్తిగా కనపడవచ్చు. కనపడకుండా లక్షల ఏళ్లు శక్తి నిక్షిప్తంగానే వుండవచ్చు. అందువల్ల ఐక్యతా ఘర్షణల్లో శక్తిమార్పిడిగా కనపడేదే మొత్తం చలనం గాని, శక్తి గాని కాదు. ఇంకా ఎన్నో వందల రెట్లు శక్తి రెండు వేపులా నిక్షిప్తమై కొనసాగుతున్నది.

**ఉనికి శక్తిమార్పిడిలో కనపడవచ్చు**

ప్రతి వస్తువు తన చలనంలోని విరుద్ధాంశాలమధ్య జరిగే శక్తి మార్పిడికి ఐక్యతా ఘర్షణలకు వేదికగా తన అస్తిత్వం ప్రదర్శింపచేస్తుంది.

పరస్పర సంబంధంలో సమస్త వస్తువుల్లో సామాజిక సంబంధాల్లో యిది కొనసాగుతూ వాటి స్వభావాలు పరస్పరం మార్పులు పొందుతాయి.

ఈ మార్పులను పరిమాణాత్మక, గుణాత్మక, అభావ క్రమాలలో కొలుస్తారు. ఈ మార్పులలో ఐక్యత, ఘర్షణ, తటస్థతలు ప్రాథమికాలుగా పనిచేస్తాయి.

**సహజస్థితిలో చలనం శక్తిని ప్రదర్శించదు**

సహజ స్థితిలో చలనం శక్తిని ప్రదర్శించదు. ఉదా॥కు 1969లో ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం కొనసాగింది. 1986 తర్వాత మళ్లీ వేగం పుంజుకుంది. ఈ మధ్య తెలంగాణ ప్రజల్లో రాష్ట్రం ఏర్పాటు కోరిక లేకపోవడం కాదు. నాయకులు ద్రోహం చేసి పదవుల కోసం ప్రాంతానికి నష్టం చేశారు అని బాధపడ్డారు. అలాగే మర్యాదగా సంస్కారయుతంగా ఉన్నంతసేపు ఐక్యత తాలూకు సంస్కారమే కనపడవచ్చు. దాన్ని అలుసుగా తీసుకుంటే 'నీయవ్వ' అంటూ అవ్వోనివా నువ్వు, అయ్యోనివా, తోడబుట్టిన పాలోనివా అంటూ శక్తిమార్పిడి ఘర్షణ రూపం తీసుకుంటుంది. ఘర్షణ అనివార్యం ఎందుకౌతుంది అంటే వినయాన్ని మర్యాదను బలహీనతగా శక్తిహీనతగా భావించడం నుండి! అందువల్ల శక్తిమార్పిడి ఘర్షణ అనివార్యమౌతుంది.

**చలనంలో, గతితర్కంలో 3 అంశాలు ఉంటాయి**

ప్రదర్శించనంత మాత్రాన అందులో చలనం లేకుండా పోదు.

కాని అది మాత్రమే దాని మొత్తం చలనం, శక్తి కాదు.

సామాజిక మానవుల్లో, వారి చలనంలో స్థూలంగా మూడు దశలున్నాయి.

1. చలనం తనలో తాను
2. చలనం తన కొరకు తాను
3. ఇతరులకొరకు తన చలనం

సామాజిక మానవుడు తనలో తానుగా వుంటాడు.

తన కొరకు తానుగా వుంటాడు.



సమాజంకొరకు తానుగా వుంటాడు.

ఈ మూడు దాదాపు ఏక కాలంలో ఉత్పన్నమవుతూ అదే సమయంలో పరిష్కరింపబడడమే మనిషి సామాజిక జీవితం.

పరస్పర సంబంధాల్లో ప్రదర్శించబడే శక్తి మార్పిడి లేదా చలనమే చర్య ప్రతిచర్య లేదా ఐక్యతా ఘర్షణ లేదా సంబంధం లేదా వర్గ పోరాటం.

ఆ చలనంలో, సంబంధంలో ఇంకా చలనం వున్నది. అది యింకా తనలో తాను, తనకొరకు తాను దశలలో అస్తిత్వంలో తన శక్తిని ప్రదర్శించని సహజ స్థితిలో కొనసాగుతున్నది.

పర్యవసానంగా ఐక్యత ఘర్షణలు, వర్గపోరాటాలు, వస్తువులోని మొత్తం చలనాన్ని, సాజంలోని మొత్తం చలనాన్ని తెలుపవు.

మనిషి ప్రకృతిలోనో, పరిశ్రమలోనో ఈరోజు వస్తువుల సరుకుల ఉత్పత్తికి తన శ్రమశక్తిని మార్పిడి చేస్తాడు.

**శ్రమశక్తి మార్పిడే మొత్తం శ్రమశక్తి కాదు**

అదనపు విలువను సృష్టించే శ్రమశక్తి మార్పిడే మొత్తం శ్రమశక్తి కాదు. ఇంకా మనిషిలో ఎంతో శ్రమశక్తి వుంటుంది. ఇంటినుంచి పని స్థలానికి వెళ్లే శ్రమశక్తి కుటుంబాన్ని పెంచి పోషించే శ్రమశక్తి. తల్లిదండ్రులను, సమాజాన్ని ఆదరించే శ్రమశక్తి మొదలైనవి ఎన్నో శ్రమశక్తి రూపాలుంటాయి. కొందరు ఆటలు, పాటలు కళారూపాల్లో నైపుణ్యం అదనంగా సంపాదిస్తారు. ఇదంతా అదనపు విలువ సృష్టించే ఆర్థిక సూత్రాల పరిధిలోని శ్రమశక్తి వెలుపల వ్యక్తమయ్యే శ్రమశక్తి రూపాలు.

అందువల్ల మార్పిడి చేయబడిన శ్రమశక్తే అతని మొత్తం శ్రమశక్తి చలనం కాదు.

అర్థశాస్త్రం, వర్గపోరాటాలు మార్పిడి చేయబడడమే శ్రమశక్తిని, ఐక్యతా ఘర్షణల్ని మాత్రమే ప్రాతిపదిక చేసికొని విశ్లేషణ ఆచరణ సాగిస్తాయి.

**వర్గపోరాటాలే మొత్తం చరిత్ర కాదు. చరిత్రకు పరిణామం వుంటుంది.**

వర్గపోరాటాలే చరిత్ర అనడం ద్వారా చారిత్రక భౌతికవాదం కూడా మార్పిడి చేయబడే శక్తిని మాత్రమే. మొత్తం సమాజ చలనంగా ఆచరణకు ప్రాతిపదికగా పరిగణిస్తుంది.

**ప్రకృతి పరిణామశీలంగా వుంటుంది**

సూర్యుడులోని చలనాలు పరస్పరం శక్తి మార్పిడిలో నిరంతరం ప్రజ్వరిల్లుతున్నాయి. అది మనకు ఎండగా చేరుతున్నది.

ఎండ ప్రకృతి సమాజాల్లోని సమస్త చలనాల్లో ఆచరణల్లో పరస్పర మార్పిడిని ఉత్పన్నం చేస్తున్నది.

సూర్యుడి శక్తి మనకు చేరే లోపల ఎంతో ఖర్చవుతున్నది.

భూమి చుట్టు గల ఓజోన్ పొర కొంత శక్తిని అడ్డుకుంటున్నది.

ఇలా పోగా పోగా మిగిలిన శక్తి మనదాకా చేరుతున్నది.

మన పరస్పర సంబంధంలోకి వచ్చిన సూర్యరశ్మి మాత్రమే సూర్యుడి మొత్తం

శక్తి చలనం కాదు.

**శక్తి ప్రదర్శన ఒక్కటే మొత్తం శక్తి కాదు**

ఈ క్షణం ప్రదర్శితమైంది మాత్రమే దాని మొత్తం శక్తి చలనం కాదు. సూర్యుడిలో ఇంకా ఎన్నో వందలరెట్ల శక్తి వుంది.

అది తనలో తాను, తనకొరకు తాను ప్రజ్వరిల్లే చలనమే కాకుండా ఇంకా ఎన్నో వందల రెట్ల చలనం శక్తి ప్రదర్శన కాకుండా వుండిపోతున్నది.

అలా మిగిలిపోయిన శక్తి చలనాలు లేనట్టయితే మరుక్షణం, మరుసటి రోజు తిరిగి అదేవిధంగా సూర్యుడు, మనిషి శక్తిని ప్రదర్శించడం, ప్రజ్వరిల్లడం, ఆచరించడం సాధ్యం కాదు.

విద్యార్థిలోకి శక్తిమార్పిడి జరిగిన చలనమే ఉపాధ్యాయుడి మొత్తం చలనం కాదు.

ఉపాధ్యాయుడిలో ఇంకా ఎంతో చలనం వుంటుంది.

విద్యార్థిలో ఉపాధ్యాయుడికి కనబడింది మాత్రమే అతడి మొత్తం చలనం కాదు.

ఇలా ఉపాధ్యాయుడిలోను విద్యార్థిలోను తనలో తానుగా, తనకొరకు తానుగా వుండే చలనం యింకా ఎంతో ఉంటుంది.

అందువల్ల చర్య ప్రతిచర్య, వర్గపోరాటం, ఐక్యత ఘర్షణ అనేవి శక్తి మార్పిడిని తెలుపుతాయే గాని, అదే దాని (వస్తువుయొక్క, సమాజంయొక్క) మొత్తం చలనమూ శక్తి ఆచరణా కాదు.

ప్రతి వస్తువులో ప్రతి చలనంలో, ప్రతి సమాజంలో సూర్యుడిలోలాగే మనిషి మనస్సులో లాగే ఇంకా ఎంతో చలనాన్ని ఆలోచనను చైతన్యాన్ని తనలో తానుగా, తనకొరకు తానుగా కొనసాగించే చలనం వుంటుంది.

కృతజ్ఞత, గౌరవంతో పాటు ఇంకా ప్రదర్శితం కాని చలనం, చైతన్యం, ఆచరణ ఎంతో వుండడం వలనే మహనీయుల మరణానికి, ఎన్‌కౌంటర్ మరణాలకు విషాదం అనుభవిస్తాము.

**చలనంలోని చర్య ప్రతిచర్యలే మొత్తం చలనం కాదు**

చలనంలోని చర్య ప్రతిచర్యలు, ఐక్యతా ఘర్షణలు, వర్గపోరాటాలు ఆయా వస్తువుల సమాజాల చలనంలోని కొంత భాగాన్ని తెలుపుతాయి. కాని అది మాత్రమే వాటి మొత్తం చలనం, స్వరూపం కాదు. చర్య ప్రతిచర్యకు అతీతంగా శక్తి, పదార్థం కొనసాగుతూ వుంటుంది. పరస్పర సంబంధంలోకి వచ్చిన తరువాత కూడా కొంత భాగమే చర్య ప్రతిచర్యకు లోనవుతుంది. మిగతాది ప్రతిచర్యాతీతంగా వుంటుంది. కొనసాగుతుంది.

ఒకవేళ అలా ఐక్యతా ఘర్షణలు వర్గపోరాటాలు మాత్రమే ఆయా వస్తువుల సమాజాల మొత్తం చలనం, స్వభావం, స్వరూపం అని అనడం జరిగితే మానవుని ఆలోచన శాస్త్రాభివృద్ధి, చరిత్రను ప్రతితరం తిరగరాయడం, భవిష్యత్ అంచనాలు అనేవి అనవసరమవుతాయి.



**ఇంకా ప్రదర్శితంకాని చలనాన్ని తెలుసుకొనే ప్రయత్నమే భవిష్యత్తు ఊహలు**

ఇంకా ప్రదర్శితంగాని చలనాన్ని తెలుసుకోవడం, చరిత్ర తిప్పి రాయడానికి, భవిష్యత్తు అనే భావానికి పునాది.

అందువల్ల ప్రతి వస్తువులో సమాజంలో ఐక్యత, ఘర్షణ, చర్య ప్రతిచర్య అనే రెండు అంశాలతోపాటుగా మూడవ అంశం కూడా వుంటుంది.

అది తటస్థంగా తనలో తానుగా తనకొరకు తానుగా శక్తి మార్పిడి ప్రదర్శించకుండా అస్తిత్వం కొనసాగిస్తున్న చలనం.

ఈ మూడవ అంశంలో రెండు అంశాలున్నాయి.

ఒకటి: చర్య ప్రతి చర్యలు జరిగే తత్ క్షణంలో చలనం ప్రదర్శితం కాకుండా తటస్థంగా తనలో తానుగా తనకొరకు తానుగా అస్థిత్వం కొనసాగిస్తున్న చలనం.

రెండు: మరుసటి క్షణంలో శక్తిని విడుదల చేసి చర్య ప్రతి చర్యల్ని కొనసాగింపజేసే చలనం, ఆ పని చేసి ఉడిగిపోబోతున్న చలనం.

మరుసటి క్షణం శక్తిని విడుదల చేసే చలనం భవిష్యత్ చలనం, క్షణం క్రితం శక్తిని విడుదల చేసి ఉడిగిపోయే చలనం గత చలనం.

ప్రదర్శితం కాని చలనంలో ఈ రెండు కూడా ఒక భాగం.

కాగా శక్తి మార్పిడి ప్రదర్శింపబడుతున్నప్పుడు అది వర్తమానం అవుతున్నది.

**చలనంలో మూడు అంశాలుంటాయి**

మొదటే చెప్పినట్టు చర్య ప్రతిచర్యలు ఐక్యతా ఘర్షణలు రెండూ చలనం తాలూకు వర్తమాన స్వభావంలోని ఒక అంశాన్ని తెలుపుతాయి గాని అది చలనం తాలూకు గతం వర్తమానం భవిష్యత్తులను ఒక మొత్తంలో తెలుపవు.

పర్యవసానంగా ఐక్యత ఘర్షణలు ప్రాథమికం అనీ, వైరుధ్యం ప్రాథమికం అనీ చేసే చర్చలో వస్తుశోధన సరిగ్గా జరగడం లేదని స్పష్టం అవుతున్నది.

వైరుధ్యంలోని విరుద్ధాంశాలమధ్య ఐక్యత ఘర్షణ అనేవి మొత్తం చలనాన్ని (మొత్తం గతితర్కాన్ని), పరిగణనలోకి తీసుకోకుండా వర్తమాన చలనాన్నే ఆ చలనం తాలూకు భూతవర్తమాన భవిష్యత్ చలనాల మొత్తంగా భావించే దృక్పథం అధ్యయన పద్ధతి, అప్రోచ్, ఆచరణను ఉత్పన్నం చేస్తున్నది.

వైరుధ్యాలలో ఈ పరిమితి వుంది. ఈ లోపం పరిమాణాత్మక గుణాత్మక మార్పుల అభావ క్రమాల చర్చ ద్వారా కొంత పూరించబడుతున్నది.

ఇలా ప్రతి చలనంలో (గతి తర్కంలో వైరుధ్యంలో సంబంధంలో) మూడు అంశాలున్నాయి.

అందువల్ల సామాజిక శక్తులమధ్య ఐక్యత ఘర్షణ (వర్గాల మధ్య ఐక్యత, వర్గాల మధ్య పోరాటం) శక్తి మార్పిడి మాత్రమే ఆ సామాజిక శక్తుల మొత్తం చలనం కాదు.

ఆ సామాజిక శక్తుల మొత్తం చలనం కాదు.

ఆ సామాజిక శక్తుల్లో యింకా అదనంగా పైన పేర్కొన్న చలనాలున్నాయి.

ఈ ప్రాతిపదిక కారణాలచేత వర్గ పోరాటాల చరిత్ర, వర్గాల చరిత్ర ఒక

సమగ్రతలో మొత్తం సామాజిక శక్తుల చలనాన్ని చరిత్రను తెలుపదు.

ఈ అసమగ్రతను అధిగమించే సమగ్ర చలన అధ్యయనానికి మనిషి సమాజం ప్రకృతి తాలూకు మొత్తం చలనం పరస్పర సంబంధాల్లో పరిశీలించడం ప్రాథమికం, శాస్త్రీయం అవుతున్నది.

**సమాజంలో ఐక్యత ఘర్షణలు అనేవే మొత్తం సమాజం కాదు**

అందులో సమాజ శక్తుల ఐక్యత ఘర్షణలనేవి కూడా ఒక భాగమవుతాయి. అంతేగాని అవే సర్వస్వం కాజాలవు.

అలాగే కులాల మధ్య ఐక్యత, కులాల మధ్య పోరాటం అనేవే మొత్తం కుల చలనాన్ని వ్యక్తీకరించవు. కుల చలనంలోని ఐక్యతా ఘర్షణలు మాత్రమే కులం యొక్క మొత్తం చలనం కాదు రివిజనిజంలోని పరస్పర ఐక్యతా ఘర్షణలు మాత్రమే రివిజనిజం యొక్క మొత్తం చలనం కాదు.

ఫ్యూడల్ సంబంధాలలోని పరస్పర ఐక్యతా ఘర్షణలు మాత్రమే ఫ్యూడలిజం యొక్క మొత్తం చలనం కాదు. కుటుంబ సంబంధాలలోని ఐక్యతా ఘర్షణలు మాత్రమే కుటుంబ చలనం యొక్క మొత్తం చలనం కాదు. మత చలనంలోని ఐక్యతా ఘర్షణలు మాత్రమే మతం యొక్క మొత్తం చలనం కాదు.

సమస్త ప్రకృతి సమాజ చలనాల పరస్పర సంబంధంలో కులం అనే చలనం వేల ఏళ్ళుగా సమస్త ఉత్పత్తి సంబంధాల, మానవ సంబంధాల పరస్పర శక్తి మార్పిడిని తనలో తానుగా, తనకొరకు తానుగా అస్తిత్వం కోసం పోరాటంగా మలుచుకోవడం ద్వారానే మనగలుగుతున్నది.

ఆ క్రమంలో మొత్తం సామాజిక శక్తుల శక్తి మార్పిడుల కనువుగా, ప్రదర్శితం కాని చలనాల కనువుగా పరివర్తనా క్రమాల్ని విస్తృతీకరణాన్ని పొందుతూ వస్తున్నది.

అదే సమయంలో మొత్తం సామాజిక శక్తుల స్వరూప స్వభావాలను తన అస్తిత్వానికి అనువుగా మార్చుకుంటున్నది.

**కులం ఎంతకాలం కొనసాగుతుంది?**

పరస్పర మార్పిడి క్రమంలో కులం తన పూర్వ స్వరూప స్వభావాలు కోల్పోయి ఉన్నత మానవ సంబంధాలుగా పరివర్తనా క్రమం తీసుకోవచ్చు. ఆ మేరకు కులం ఆయుష్షు, విస్తృతి పెరగనూ వచ్చు. కుల చలనంలోని పరస్పర విరుద్ధాంశాలను ఈ కోణంలోనూ వెలికితీసి చూపవలసి వున్నది. కులం, మతం, పెట్టుబడిదారీ, సోషలిస్టు, ఫ్యూడల్, పితృస్వామిక, రివిజనిజం, బ్రాహ్మణిజం వ్యవస్థల్లో అంతా చెడే లేక అంతా మంచే వుంటుందనుకోవడం చలన క్రమాలకు భిన్నమైనది.

అంతా చెడ్డే లేక అంతా మంచే వుంటుందనడం పరిమాణాత్మక, గుణాత్మక మార్పులు, అభావ క్రమాలు, విరుద్ధాంశాలు, ఐక్యతా ఘర్షణలు పర్టికులారిటీ, యూనివర్సిటీలు లేని అచలనాలుగా వక్రీకరించడం అవుతుంది.

**తిరుగులేని ఆలోచనలు వుంటాయా?**

ఈ వ్యవస్థ చలన క్రమాలకు సోషలిస్టు, కమ్యూనిజం అనేవి ఏకైక అంతిమ



పరిష్కారాలు అని ఒక "ఆలోచనా వ్యవస్థ"ను రూపొందించడంతో అవి తిరుగులేని అఖండ, అంతిమ సత్యాలుగా ప్రతిపాదించబడ్డాయి.

పూర్తి సత్యం, అఖండ సత్యం, అంతిమ సత్యం అంటూ ఏదీ వుండదు. అందువల్ల మనిషి సమాజం ప్రకృతి ప్రాథమికం గనక కమ్యూనిజం, సోషలిజం పరికల్పనలు ఒకవేళ సాపేక్ష, పాక్షిక సత్యాలుగానైనా ఎదగకపోయినా తీసుకునే, తీసుకోవాల్సిన సమగ్ర సామాజిక (దృక్పథాలుని పిలువబడే వాటన్నిటి కలిపిన సమన్వయ) ఆచరణ ముందుకు సాగవలసి వున్నది.

**కార్మికవర్గ దృక్పథం యుగ ధర్మాన్ని నెరవేర్చింది**

హెగెల్‌లాగే కార్మికవర్గ దృక్పథం అపారమైన విజ్ఞాన సర్వస్వాన్ని సొంతం చేసుకొన్నది. ఆనక అది ప్రతి రంగంలోనూ యుగ కర్తృక పాత్రను నిర్వర్తించింది.

వ్యవస్థ అవసరాల దృష్ట్యా అది తరచూ తప్పనిసరై కొన్ని సూత్రీకరణలు, పరికల్పనలు చేయవలసి వచ్చింది.

ఇవి దాని మహా నిర్మాణంలోని చట్రాలు, ఊత స్థంభాలు మాత్రమే. వీటిని చూస్తూ ఆచరిస్తూ అనవసర కాలహరణం చేయకుండా ఆ మహాసౌధంలోకి ముందుకు సాగితే అపారమైన నిధులు కన్పిస్తాయి.

అయితే తత్వవేత్తలందరి విషయాల్లోనూ జరిగేదేమంటే వారు సృష్టించిన "ఆలోచనా వ్యవస్థ" తప్పనిసరిగా నశించే లక్షణాన్ని కలిగివుంటుంది.

అన్ని వైరుధ్యాలనూ అధిగమించాలనే మానవుని అవినాశమైన మానసిక కాంక్ష నుంచి ఈ ఆలోచనా వ్యవస్థ ఉద్భవిస్తుంది.

**ప్రపంచం ముగింపుకు వస్తుందా?**

అన్ని వైరుధ్యాలూ ఒకేసారి పరిష్కారమయితే మనం శాశ్వత సత్యం అనే స్థితికి చేరుకుంటాం. ప్రపంచ చరిత్ర ముగింపుకు వస్తుంది.

చేయవలసిందేమీ లేకపోయినా ప్రపంచ చరిత్ర, 'ఆలోచన' కొనసాగుతూనే వుండాలి! యిదొక పరిష్కరించ వీలులేని వైరుధ్యం. ఈ విషయాన్ని గ్రహిస్తూ మార్క్సు, ఎంగెల్సులు ఏ ఇతర తత్వవేత్తలకంటె కూడా హెచ్చు కృషి చేశారు. అయితే సోషలిజం, కమ్యూనిజం ఆలోచనా వ్యవస్థల్ని అంతిమ అఖండ సత్యంగా ప్రతిపాదించారు.

తద్వారా నిరంతరం చారిత్రక క్రమాభివృద్ధిలో యావత్తు మానవ జాతి మాత్రమే నిర్ణయించుకోగలిగినదాన్ని, సాధించుకోగలిగినదాన్ని ఒక్క తత్వవేత్తల జంటే సాధించాలని కోరుకున్నవాళ్ళయ్యారు.

**హెగెల్‌కు నిజమైన వారసులు మార్క్స్, ఏంగెల్స్**

హెగెల్ అఖండ సత్యం తాలూకు ఆలోచన పరికల్పనల్ని ప్రతిపాదిస్తే వీళ్లు ఏకంగా సోషలిస్టు కమ్యూనిస్టు వ్యవస్థాక్రమం అనే ఆలోచనా వ్యవస్థ ద్వారా ఒక భౌతిక అఖండ, అంతిమ, పూర్తి సత్యం అంటూ పరికల్పన (హైపోథీసిస్) కావించారు.

ప్రపంచం ఈ ఆలోచనా ఉచ్చులోంచి బయటపడాలి. అవి సృష్టించిన బ్యూరోక్రసీ, ఆలోచన, నిర్మాణ సూత్రాల్ని వదిలి అంతస్సారం కాపాడుకోవాలి.

ఈ విశ్వవ్యాప్త చలన క్రమాలకు సోషలిజం, కమ్యూనిజం అనేవి "ఏకైక అంతిమ పరిష్కారాలు" అని ఒక ఆలోచనా వ్యవస్థను రూపొందించడంతో అవి తిరుగులేని అఖండ సత్యాలుగా ప్రతిపదించబడటంతో అందుకు అనువుగా మిగిలిన వాస్తవాలను, విలువలను మార్చి చూపడం ప్రారంభమైంది.

సోషలిజం, కమ్యూనిజం అనే పరికల్పనలు అంతిమ సత్యాలుగా ప్రతిపదించబడటంతో వాస్తవాలతో ప్రారంభమైన చారిత్రక భౌతికవాదం భౌతిక మార్మికతగా కొనసాగుతున్నది.

అద్వైతంలో, తన మాయావాదంలో బ్రహ్మసత్యం జగత్తు మిథ్య అనే రూపంలో ఇలా అస్తిత్వం పొందింది.

**అఖండ సత్యం, పూర్తి సత్యం అంటూ ఏది వుండదు.**

కమ్యూనిజం అనేది ఒక భౌతిక వాస్తవికత కాదు. అది ఒక ఆలోచన, ఒక ఊహ మాత్రమే. ఆ ఊహను నిజమనుకునేంత ప్రచారం నూట యాభై ఏళ్ళుగా జరుగుతూనే ఉంది. ఆ ఊహలు పొరపాటైనా, సాపేక్షిత సత్యాలుగా భౌతికంగా రూపొందకపోయినా మానవ సమాజం తీసుకునే, తీసుకోవాల్సిన ఆచరణని కూడా చర్చించడం అవసరం. లేకపోతే ఊహలనే వాస్తవాలుగా భ్రమపడి, ప్రజల్ని భ్రమపెట్టే క్రమం కొనసాగుతుంది.

పరస్పర విరుద్ధాంశాల్లో ఎదుటి అంశాలు ప్యారిస్ కమ్యూన్ నించి బూర్జువా తీసుకున్నట్టుగా నిరంతరం గుణపాఠాలు తీసుకుని మార్పుకు లోనయినపుడు సోషలిజం, కమ్యూనిజం అనే పాత భావనలు సాపేక్షక సత్యంగా ఆ రూపంలోని భౌతిక వాస్తవికతగా రూపొందే అవకాశాలు కూడా అంతమేరకు సాపేక్షికంగా అదృశ్యమై కొత్త పరికల్పనల ఆవశ్యకతని ఉత్పన్నం చేస్తాయి. అందుకు కార్మికవర్గం కాకుండా మనిషి మొత్తం సమాజం ప్రకృతి ప్రాథమికం కావాలి.

సామాజిక పరిణామాలు, చలనాలు, అన్వేషణలు, ఆ యా వస్తు, వర్గ, కుల, లింగ, జాతి, ప్రాంత, స్థల కాలాల్లో సంస్కృతికి (మనిషి సమాజం ప్రకృతిలో) గల చలన క్రమాల్ని కొత్తగా నిరంతరం వెలికి తెస్తూనే వుంటాయి. కొత్తవి రూపొందిస్తూనే ఉంటాయి. సోషలిజం, కమ్యూనిజం, ఊహలు చేసినట్టే ఇంకా ఎన్ని రకాల ఊహలైనా చేసి ఊహించుకోవచ్చు. ఆ హక్కు మానవాళికి ఉంది. సోషలిజం, కమ్యూనిజం మానవాళికి అంతిమ సత్యాలు కావు. అవి కొందరి ఊహలు, కొందరి కార్యక్రమాలు మాత్రమే. సామాజిక చలనాలకు సోషలిజం, కమ్యూనిజం వంటి ఊహలు శాశ్వతం కావు. ఏ ఊహ సత్యం కాదు. అఖండమూ పవిత్రమూ అంటూ ఏదీలేదు.

పాత సామాజిక చలనాలను అనుసరించి పాత సోషలిజం, కమ్యూనిజం ఊహలు నశించడం కొత్త ఊహలను ఊహించుకోవడం, కొత్త కార్యక్రమాలను రూపొందించుకోవడం, మానవాళి కర్తవ్యం.

**చలనాలను పట్టుకోవాలే తప్ప సూత్రాలను చలనాల మీద రుద్దకూడదు**

చలనక్రమాల నిరంతర పరిశీలనా ఆచరణే గతితర్కం తప్ప సూత్రీకరించిన చలనసూత్రాలను అనుసరించి సమాజాన్ని ఆ యా మూసల్లోకి కుదించడం కాదు. అందువల్ల సామాజిక చలనసూత్రాలు అంతిమ సత్యాలు కావు. సామాజిక



చలనసూత్రాలను నిరంతరం కనుగొనవలసే వుంటుంది.

మనిషి, సమాజం, ప్రకృతి వాటిల్లో ప్రదర్శితం కాని మిగిలిన చలనాలు ఒక మొత్తంలో ప్రాథమికం చేయాల్సి వుంది.

**దృక్పథం అనేది ఒక రాజ్యంగా, ఆధిపత్యంగా కూడా కొనసాగుతుంది**

ఎందుకంటే దృక్పథం ఏర్పడ్డాక ఆ దృష్టితోనే చూడ్డం జరుగుతుంది. దీన్నే రంగుకళ్ళద్దాలతో చూడ్డమంటారు. వాస్తవాల మీద, సత్యాల మీద దృక్పథం ఆధిపత్యం చెలాయించి అసలైన క్రమాలను అడ్డగించి అపక్రమాలను తనకనుగుణంగా అక్రమాలను సృష్టిస్తుంది.

కార్మికవర్గ దృక్పథం అనేది "ప్రజల్ని" కాకుండా కార్మిక వర్గాన్ని ప్రాథమికం చేయడం అనేది శక్తి మార్పిడిలో ప్రదర్శితమయ్యే ఐక్యత ఘర్షణలే మొత్తం సమాజ చలనంగా పరిగణించడం నుంచి ఉత్పన్నమైంది. అది మాత్రమే మొత్తం చలనం కాదని పైన చూశాం.

ప్రజలు ప్రాథమికం అవుతున్నారు. విరుద్ధాంశాల ఘర్షణ, బహిష్కరణ అనే చర్చ గతితర్కంలా కనపడే తర్కం (లాజిక్)తో వెర్రితలలు వేసింది. అది సమాజాన్ని మార్చుకోవాల్సిన కృషిలో ప్రజలే పాల్గొనాలనే దాన్ని వక్రీకరించింది.

అందుకు మొదట సామాజిక మార్పులు తీసుకురావడంలో పాల్గొనాల్సిన వాళ్ళల్లో ప్రజలు ప్రాథమికం కాదంటూ, కార్మికవర్గం ప్రాథమికం అంటూ ప్రజల్నే బహిష్కరించింది.

తర్వాత భూస్వాముల్ని, పెట్టుబడిదారుల్ని బహిష్కరించింది. తరువాత కార్మికుల్నే బహిష్కరించి కార్మికవర్గ పార్టీయే కార్మికవర్గంగా తన్ను తాను ప్రకటించుకుంది.

కార్మికవర్గం కరవు అయింది అని చెప్పడంతో అంతిమంగా కార్మికవర్గ నియంతృత్వం అనేది కార్మికవర్గంపై, ప్రజలపై కొందరి లేదా పార్టీ నియంతృత్వంగా పరివర్తన చెందింది.

**చీలికలు ఎందుకు? ప్రజాసేవకు చీలిపోవడం అవసరమా?**

పార్టీలోంచి బహిష్కరించుకోవడం, చీలిపోవడం, నాదే అసలు మడి అంటూ పరస్పరం అస్పృశ్యతను పాటించడం చేసింది. ఈనాడు కార్మికవర్గ పార్టీల్లో వున్నంత అస్పృశ్యతా సమస్య నేటి కుల వ్యవస్థలోనూ లేదు.

ఎన్ని అంతరాలున్నా ఒక గ్రామంలో సామాజిక అవసరాలకోసం సమిష్టిగా అన్ని కులాలు కృషి చేస్తాయి. అది వాళ్ళ అనివార్యత. సమాజంకోసం ప్రజలకోసం కార్మికవర్గ పార్టీలు యిట్లానయినా కృషి చేయడం లేదు.

వాళ్ళకది అనివార్యతగా మార్చుకోవాలి

ప్రజలకు సేవ చేయడం ప్రాథమిక లక్ష్యంగా చేసుకోవాలి.

ప్రస్తుత దృక్పథం కార్మికవర్గం పేరిట ప్రజలపై, కార్మికవర్గంపై అధికారంలోకి రావడమే వాళ్ళ ప్రాథమిక లక్ష్యం.

**అమీబా తరహా గతితర్కాలు**

గతితర్కంలో వచ్చిన ఈ పరిణామాల పర్యవసానంగా అమీబా తరహా ఎక్కడికక్కడ ముక్కలు కూడా సొంత గతి తర్కాలుగా మారిపోయాయి. కార్మికవర్గ పార్టీలుగా పిలువబడే వాటి నిర్మాణ సూత్రాలు, అప్రోచ్, ఆచరణ, ప్రాపంచిక దృక్పథం దేనికదే సర్వసమగ్ర అఖండ, అంతిమ సత్యంగా విశ్వసిస్తాయి, ఆచరిస్తాయి. ఇది హెగెల్‌నించి మార్క్స్, ఎంగెల్స్‌లకు తదనంతరం కార్మికవర్గ పార్టీలకు సోకిన వంశపారంపర్య వ్యాధి.

సోషలిజం, కమ్యూనిజం, కార్మికవర్గ దృక్పథం, అనే ఊహలను సర్వసమగ్ర అఖండ అంతిమ సత్యం అని మార్క్సు-ఎంగెల్సులు ప్రతిపాదించడంలోనే ప్రతి ఒక్కరూ నాదే అసలైన పార్టీ అనే తర్కానికి దిగి ఆ తర్కాన్నే గతితర్కంగా నిర్ధారించే మూలాలు ఉత్పన్నమయ్యాయి.

ఇలా ప్రకృతి, సమాజం, సమాజ చలనసూత్రాలు ముక్కలు ముక్కలుగా నరకబడ్డాయి. విడగొట్టబడ్డాయి. ఆచరించబడుతున్నాయి.

**సమాజాన్ని ఒక మొత్తంలో పరిశీలించాలి**

చలనం (వైరుధ్యం)లోని మూడు అంశాలూ ఒకే ఒక సింగిల్ ఎంటిటీలో వుంటాయనే ప్రాథమిక సత్యం వదిలేసి వైరుధ్యంలోని రెండు అంశాలు అంటూ మొత్తం చలనాన్ని ఒక సమగ్రతలో కాకుండా విడిగా "విడగొట్టి పరస్పర సంబంధంలో" పరిశీలిస్తే చలనం అచలవాదంగా కనపడుతుందని జీనోబాణవేగం చర్చలో చూస్తాం.

**గొడ్డలి పురాణంలా సాగిన వైరుధ్యాల చర్చ**

ఈ ఆచరణ ఒకే చలనాన్ని "గొడ్డలి పురాణం"లా ఎటుపడితే అటు విరుద్ధాంశాలు అంటూ విడగొట్టి ఎదుటి అంశాల్ని ఫ్యూడలిజానికో, పెట్టుబడిదారీ విధానానికో బ్రాహ్మణిజానికో బదిలీ చేసి బలి ఇస్తుంది.

తనలో కొంత భాగాన్ని కూడా ఆత్మవిమర్శ పేరిట బలితీసుకుంటుంది. బహిష్కరించుకుంటుంది.

**పార్టీలో వ్యక్తి స్వేచ్ఛ కోల్పోతే వచ్చిన అదనపు స్వేచ్ఛ ఏమైనా వుందా?**

"కార్మికవర్గ పార్టీ" నిర్మాణ సూత్రాలు, ఆచరణ, అంతిమంగా కులంలోని కట్టుబాట్లుగా, కులాలమధ్య కట్టుబాట్లుగా పరివర్తన పొందాయి. ఒకరు పార్టీలో చేరకముందు అందరితో చర్చించగలడు, కలిసి పనిచేయగలడు. అతడు పార్టీలో చేరాక ఈ రెండు ప్రాథమిక హక్కులూ పై కమిటీకి బదిలీ అయిపోతాయి.

**స్వేచ్ఛ కోల్పోడానికి, బందీ కావడానికి పార్టీలో చేరాలా?**

అందులో చేరిన కర్మానికి తనకంతదాకా వున్న స్వేచ్ఛ పోగొట్టుకొని కులవ్యవస్థ బందీలా అట్టడుగు కులహోదాను (పైకమిటీ పై కులం చెప్తే వినే స్థాయి అట్టడగు హోదాను) పొందుతాడు. దాని నిర్మాణ సూత్రాల ద్వారా ప్రపంచవ్యాప్తంగా కులవ్యవస్థ కార్మికవర్గ పార్టీల రూపంలో కొత్త శక్తిని, స్వభావాన్ని సంతరించుకుంది.

హిందూ సమాజం వంటి ఈ స్థితిలో ఒక ప్రజాసంఘంలోనో, పార్టీలోనో సభ్యుడు



కావడంకన్నా ప్రజలుగా వుండడంలోనే ఎక్కువ స్వేచ్ఛనీ, హక్కుల్నీ పొందే అవకాశాలున్నాయని ప్రజలు భావిస్తారు. పర్యవసానంగా ప్రజా సంఘాలు, పార్టీలు విస్తృతి కోల్పోయి గిడసబారిపోతాయి. అవసరాల ప్రాతిపదికతో కొందరు, అవకాశ ప్రాతిపదికతో కొందరు చేరే అవకాశాలు మాత్రం వుంటాయి.

ఒక కార్మికవర్గ పార్టీని మరో కార్మికవర్గ పార్టీ గుర్తించదు. గుర్తించినా కలసి పనిచేయదు. కలసి పనిచేసినా కింది స్థాయి ప్రజలకు స్వేచ్ఛ యివ్వబడదు.

**పార్టీ కుల వ్యవస్థగా చీలిపోయిన తీరు**

ఇలా రెండు పార్టీల మధ్య ఐక్యత, ఐక్య ఆచరణ, సైద్ధాంతిక చర్చలు హక్కులు మొదట ప్రజల్నించి లాగేసుకోబడి పై కమిటీలకు ధారాదత్తం అయిపోయినపుడే కార్మికవర్గ పార్టీల నిర్మాణ సూత్రాలు కులవ్యవస్థగా పరిణమించాయి. బ్రాహ్మణ కులం వంటి పై కమిటీలోని తల తిక్కలకనువుగా మన 6 వేల కులాల్లాగే ప్రపంచమంతటా వందల వేల కార్మికవర్గ పార్టీ ఉత్పన్నం అయ్యాయి.

కుల వ్యవస్థను ఎప్పటికప్పుడు లేదా ఇప్పటికైనా కింది కులాలకనువుగా మార్చుకుంటూ వస్తే ఈ కులవ్యవస్థ స్వరూప స్వభావాల పునాది అదృశ్యమవుతుంది.

కార్మికవర్గవాదం ఎప్పటికప్పుడు కిందిస్థాయి వారి నిర్ణాయక హక్కులకనువుగా మార్చుకుంటూ వస్తే ఈ విభేదాల చరిత్ర యిలా వుండే పునాది అదృశ్యమవుతుంది.

**ప్రజలు, ప్రజల అవసరాలు ప్రాథమికం**

ప్రజలు ప్రాథమికం కావాలి అనే ఒక సర్వసాధారణ విషయాన్ని గతితార్కిక కార్మికవర్గ వాదులచే అంగీకరింపజేయడానికి కూడా వస్తుశోధన చేసి నిర్ధారించవలసి వస్తోందంటే "గతితార్కిక ఆలోచన" ఎంతగా బ్యూరాక్రటీకరించబడిందో చెప్పకనే చెప్పినట్టయింది.

1. ప్రకృతి చలనంలో ఏ యే అంశాలు ఉంటాయి?
2. శక్తిప్రదర్శన ఒక్కటే మొత్తం శక్తి కాదు, వర్గపోరాటాల మొత్తం చరిత్ర కాదు. వివరించండి.
3. హెగెల్‌కు నిజమైన వారసులు మార్క్స్, ఎంగెల్స్‌లు ఎలా అవుతారు?
4. దృక్పథం అనేది ఒక రాజ్యాంగ ఆధిపత్యంగా ఎలా కొనసాగుతుంది?
5. స్వేచ్ఛ కోల్పోవడానికి, బందీ కావడానికి పార్టీలో చేరాలా? పార్టీలో చేరడం వల్ల మీరు పొందుతున్న అదనపు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఏమిటి? వివరించండి.

# జీవితం కన్నా దృక్పథం ప్రధానం కాదు

వాస్తవాలకన్నా, జీవితాలకన్నా వాటిపట్ల ఏర్పరచుకునే దృక్పథం ప్రధానం అని కొందరు అంటుంటారు. ఇది స్పష్టంగా దృక్పథం అనే రాజ్యాంగ వ్యవస్థకు లోబడి వాస్తవాలు నడుచుకోవాలి అని నిర్బంధించడమే.

**దృక్పథం ఒక వ్యాఖ్యానం-ఒక విశ్వాసం**

ఉదాహరణకు వర్గ సమస్యలో భాగంగానే కుల సమస్య, స్త్రీ సమస్య పరిష్కరింపబడుతుంది అనే మాటను తీసుకుందాం. ఇదొక వ్యాఖ్యానం. ఇదొక దృక్పథం. ఇదొక అంచనా. అయితే అది వాస్తవం కాదు. అలా ఒక వాస్తవం మారుతుందనే అంచనా మాత్రమే. అది అలా అదొక విశ్వాసం. దీనిపట్ల అవిశ్వాసం నశిస్తే అది మూఢ విశ్వాసంగా ఆచరించబడుతున్నదని అర్థం. ఏమంటే ఏదైనా సరే అవిశ్వాసం నశించిన దశే మూఢ విశ్వాసం. ఇలా దృక్పథం పట్ల అవిశ్వాసం నశించిన దశ తాలూకు ఆచరణ మూఢ విశ్వాసాల ఆచరణకు సంబంధించినదే.

ఎల్లమ్మ వల్ల చెవుల్లో చీము కారుతుంది అనేది ప్రజలలోని విశ్వాసం. అందువల్ల ఎల్లమ్మ దేవతకు ముడుపు కడ్తారు. ఇది వారి ఆచరణ. ఇపుడు దీన్ని మూఢ విశ్వాసం అంటున్నారు. అది ఎవరికి మూఢ విశ్వాసం? నమ్మినవారికి అది ప్రాపంచిక దృక్పథం, ఆచరణ. దాన్ని నమ్మనివారికి అది ఒక దృక్పథంగా కాకుండా మూఢ విశ్వాసంగా భావించబడింది. ఎవరు దాన్ని పూర్తిగా నమ్ముతున్నారో అది వారికి దృక్పథం. ఎవరు దాన్ని నమ్మరో వారికది మూఢ విశ్వాసం. మనకు నచ్చినదాన్ని ప్రాపంచిక దృక్పథం అంటున్నాం. నచ్చనిదాన్ని మూఢ విశ్వాసం అంటున్నాం. ఈ రెండూ ఒకే స్థాయికి చెందినవి. మార్క్సిజం యిపుడు ఎల్లమ్మదేవతలాగే కొందరికి మూఢ విశ్వాసం, కొందరికి ప్రాపంచిక దృక్పథం.

కొందరు చెవుల్లో చీము కారడానికి ఎల్లమ్మ కారణం అని అనుకుంటే మరికొందరు మార్క్సిజం అందుకు కారణం అనుకుంటారు. విప్లవాలకు మార్క్సిజం కారణం అనుకోవడం అలాంటిదే. సామాజిక వాస్తవాల చలన సూత్రాలు విప్లవానికి దారి తీస్తాయి. అవి మార్క్సిజం లేకపోయినా మరే దృక్పథంతోనైనా విప్లవాన్ని అనివార్యం



చేస్తాయి.

**వాస్తవాల మీద దృక్పథాన్ని ప్రాథమికం చేస్తే ఏం జరుగుతుంది?**

వాస్తవాలకన్నా దృక్పథం ప్రాథమికం అని చెప్తే వ్యాఖ్యానాన్నే వాస్తవం అని భావించాలని కోరుకొనడం. దృక్పథం పరిమితులకు లేక మూఢ విశ్వాసం పరిమితులకు వాస్తవాలను, వాస్తవ జీవితాలను, కుదించి చూడాలని కోరుకోవడం అది. అలా చేసే ఏ దృక్పథమైనా అది మార్క్సిజమైనా, దళిత దృక్పథమైనా, హిందూ దృక్పథమైనా, మానవతా దృక్పథమైనా మరొకటైనా జీవితంలోనూ, సామాజిక శాస్త్రాల్లోనూ, సంస్కృతిలోనూ, ప్లాటో, ఆదిశంకరుల భావవాదంగా, పిడివాదంగా, జడత్వ భ్రామకంగా అస్తిత్వాన్ని పరివర్తన చెందించుకొని కొనసాగుతుంది. రష్యా తదితర దేశాల్లో తిరిగి పెట్టుబడిదారీ విధానం రావడానికి మార్క్సిస్టు దృక్పథం జడత్వ భ్రామకంగా (అనగా మౌలిక దృక్పథంలో ఏ మార్పూ లేకుండా) సాగడమే ప్రాతిపదిక. అంతేగానీ కృశ్చేవో, బ్రెజ్నెవో, గోర్బచేవో మాత్రమే అందుకు కారణం కాదు. వ్యక్తుల్ని కారణంగా భావిస్తే సామాజిక శక్తుల క్రమాన్ని నిరాకరించడమే అవుతుంది. రష్యా చైనాల్లోని సామాజిక ఉత్పత్తి శక్తుల, ఉత్పత్తి సంబంధాల అభివృద్ధి క్రమమే తిరిగి పెట్టుబడిదారీ విధానాన్ని తెచ్చిపెట్టాయి. అందుకు మూలాలు మార్క్సిస్టు మౌలిక సూత్రాల్ని ఏ మార్పూలేని గానుగెద్దువంటి జడత్వ భ్రామకంగా ఆచరించడం లోనూ ఉన్నాయి.

**పాత దృక్పథంతో కొత్త దృక్పథం ఎదగాలి**

దృక్పథం అనేది వాస్తవాలను అర్థం చేసికోవడానికి, వాటిని మార్చడానికి. దృక్పథం ద్వారా వాస్తవాల్ని మార్చినపుడు, ఆ కొత్త వాస్తవాల నుండి మరో కొత్త దృక్పథం ఉత్పన్నం కావలసి వుంటుంది. పాత దృక్పథం అలా కొత్త దృక్పథం ద్వారా పాతబడిపోవలసి వుంటుంది. ఉదాహరణకు రష్యా, చైనాల్లో విప్లవాలు విజయవంతమయ్యాయి. అనగా పాత వాస్తవాలు మారిపోయాయి. కొత్త వాస్తవాలు ఉత్పన్నమయ్యాయి.

విప్లవనేతలని ప్రచారంలో ఉన్నవారి మాటల్లో చెప్పాలంటే ప్రపంచంలో అంతకుముందెన్నడూ లేని కొత్త వ్యవస్థ అనే కొత్త వాస్తవం ఏర్పడిందట. కానైతే అక్కడి కొత్త వాస్తవాలనుండి కొత్త దృక్పథం ఏర్పడలేదు. అవి మౌలికంగా పాత దృక్పథాన్నే కొనసాగించాయి. నిజంగా అవి వాళ్లు చెప్పినట్టుగా ప్రపంచంలో అంతకుముందెన్నడూ లేని కొత్త వాస్తవాలే అయితే ప్రపంచంలో అంతకు ముందెన్నడూ లేని కొత్త దృక్పథాల ఆవిష్కరణ జరుగుతుంది. అలా జరగలేదంటే అవి కొత్త వాస్తవాలు కాకపోయి వుండాలి. అవి కొత్త వాస్తవాలే గనక అయివుంటే కొత్త వాస్తవాల ననుసరించి కొత్త దృక్పథం ఎదగకుండా జడత్వ భ్రామకంగా మారిపోయాయని అర్థం. అనగా పాత దృక్పథం ఒక విశ్వాసంగా రాజ్యాంగ యంత్రాంగంగా మార్చబడి ఆచరించబడిందని అర్థం.

మూఢ విశ్వాసాన్ని మరో పరిభాషలో జడత్వ భ్రామకం అంటారు. మార్క్సిజం జడత్వ భ్రామక మూఢ విశ్వాసం తాలూకు సోషలిజం ఊహాల స్థాయికి కుదించుకుపోవడానికి అది స్వీకరించిన గతితర్కంలోని ఏకైక అద్వైత వాదంతో పాటు అనివార్యతావాదం కూడా ఒక కారణం. అనివార్యం అనే అనివార్యతా అద్వైతవాదం కూడా ఒక కారణం. సరిగ్గా చెప్పాల్సివస్తే ఏకజాతి, ఏకమత, ఏకదేశ అద్వైతం, నేను

మాత్రమే బ్రహ్మంను అనే అనివార్యతా అద్వైత వాదంగా కుదించుకుపోవడం నుండే "సోషలిజం" అనివార్యం అనే అనివార్యతా అద్వైతవాదం ఆవిర్భవించింది. సాపేక్షకవాదాన్ని కొంత అంగీకరించినా మార్క్సిజం యిప్పటికీ అనివార్యతా అద్వైతంనే ఆచరిస్తున్నది. అనివార్యతా అద్వైత వాదాన్ని మన భారతీయ భాషల్లో కర్మ సిద్ధాంత అద్వైతవాదం అంటారు. ఈ రెంటికి తాత్విక స్థాయిలో పెద్దగా తేడా లేదు. అందుకే కర్మ సిద్ధాంతం స్వర్గం నరకాలను ఒక అనివార్యతగా నిర్ధారిస్తే యిది సోషలిజం వగైరా స్వర్గాన్ని ఒక అనివార్యతగా నిర్ధారించడం సాధ్యపడింది.

**ఆసక్తి, అలవాట్లు, అనివార్యత**

ఆసక్తి అనివార్యతను సృష్టిస్తుంది. సిగరెట్, సారా, పాన్, వినోద పర్యటన, జ్ఞానార్జన మొదలైనవెన్నో అనివార్యత నుంచి కాకుండా ఆసక్తినుంచి మొదలై అనివార్యతకు దారితీసేవే. మన దేశంలో 80 శాతం జనాభాకు, పీడిత కులస్థులకు సామాజిక మార్పులు అవసరం. అయినప్పటికీ అందుకు ఆసక్తి కొరవడ్డం మేరకు యిప్పటికీ మార్పులు రాలేకపోయాయి.

**అనివార్యతా సిద్ధాంతంలో వున్న సత్యమెంత?**

మార్క్సిస్టు వ్యూహం, ఎత్తుగడలు, దృక్పథాల్లో అనివార్యతా సిద్ధాంతం ప్రాతిపదికగా వుంటున్నది. జరిగిపోయిన తర్వాత చేసే పోస్టుమార్టం విశ్లేషణలు ఎక్కువ. నిర్బంధం లేనపుడు నిర్బంధం పెరిగే ఆచరణ చేపట్టడం, నిర్బంధం పెరిగాక అది తొలగిపోవాలనే ఆచరణ చేపట్టడం అనే గానుగెద్దు ఆచరణ ఈ అనివార్యతా వ్యూహం, ఎత్తుగడలు, దృక్పథం నుండే ఉత్పన్నమవుతున్నది. అనివార్యత తాలూకు ఆచరణలో ఈస్థటిక్ అంశ, జ్ఞాన క్రమం తక్కువగా వుంటుంది. ఆసక్తి తాలూకు ఆచరణలో అత్యున్నత స్థాయికి ఎదుగుతుంది. ఈ విషయాన్ని మరోసారి వివరంగా చూద్దాం. ప్రస్తుతం ప్రజలయొక్క ఆసక్తి అనివార్యత సిద్ధాంతం స్వీకరించడం వల్ల వ్యూహం ఎత్తుగడలు నిర్బంధాన్ని ఉత్పన్నం చేస్తాయనే మేరకు పరిమితమవుతాను.

**ఆసక్తి, ధ్యేయం, లక్ష్యం ప్రాధాన్యత**

ఇలా ఆసక్తి అనివార్యతల్లో అనివార్యతకు పెద్దపీట వేసి ఆసక్తిని చిన్నచూపు చూడ్డం ద్వారా ఎన్ని నష్టాలు జరుగుతున్నాయో లెక్కలు తీయవలసే వుంది. వాస్తవాలను ప్రాతిపదిక చేసికొన్నపుడు ఆసక్తి-అనివార్యత రెండూ సమపాళ్లల్లో దృక్పథం ఆచరణల్లో సమన్వయం పొందుతుంది.

**ఏ దృక్పథం సరైనదని చర్చ అనుకున్నంత శాస్త్రీయమైనదేమీ కాదు**

ఏ ఒక్క దృక్పథంలోనూ వాస్తవాల యొక్క సర్వ సమగ్ర దర్శనం సాధ్యం కాదు. ఏమంటే ఒక దృక్పథం అస్తిత్వంలోకి వస్తున్నదంటేనే అది ఆయా వాస్తవాలలో తన అస్తిత్వాన్ని మాత్రమే వెతుక్కుంటున్నదని పైన చూశాం. అందువల్ల ఒక వాస్తవాన్ని మార్చాలనుకున్నపుడు దృక్పథాల మధ్య జరిగే సంఘర్షణ ఆ వాస్తవానికి సంబంధించినది కాదు. అది ప్రధానంగా రెండు రాజ్యాలమధ్య, రెండు దృక్పథాల గుర్తింపు సంక్షోభాల మధ్య సంఘర్షణ. ఈ స్థితిలో ఏ దృక్పథం సరైనది అనే చర్చ వాస్తవం అనే స్త్రీని



అప్రధానం చేసి యిద్దరు వీరులు యుద్ధంలో బలాబలాలు తేల్చుకోవడం వంటిది.

అందువల్ల ఏ దృక్పథం సరైనది అనే చర్చ అనుకున్నంత శాస్త్రీయమైనదేమీ కాకపోగా వాస్తవాలను పరాయీకరించి వాటిపై ఏదో ఒక దృక్పథం రాజ్యంగా ఉత్పన్నం కావడానికి సంబంధించిన చర్చగా పరిణమిస్తున్నది.

**దృక్పథాల మధ్య ఘర్షణ ఎందుకు ఏర్పడుతున్నది**

ఒక దృక్పథం తనకు తానే ఆ వాస్తవం యొక్క మొత్తం వాస్తవాన్ని అని ఆపాదించుకోవడం నుండి ఆయా దృక్పథాల మధ్య ఘర్షణ ఏర్పడుతున్నది. ప్రతి దృక్పథం యితర దృక్పథాలతో సమన్వయం పొందే బదులుగా కొడిగట్టుకుపోవడం నుండి యిది పుడ్తున్నది. సమస్త దృక్పథాలు ఒకే వాస్తవం నుండి ఒకే వాస్తవం కొరకు ఒకే వాస్తవం చేత పుడ్తున్నవే. అందువల్ల సమస్త దృక్పథాలు ఒక సమన్వయం పొందడం ద్వారా వాస్తవాన్ని ఒక సమగ్రతలో దర్శించడం సాధ్యపడుతుంది.

రాజకీయవాదులు, వర్గవాదులు, ఫాక్షనలిస్టులు, వాస్తవం యొక్క ఒక్కో పర్టిక్యులర్‌నే యూనివర్సల్‌గా నిరూపించే సిద్ధాంత రాద్ధాంతాలు చేశారు. నాలోనూ బ్రహ్మం వున్నది అనడానికి బదులు నేను మాత్రమే బ్రహ్మంను అనే చర్చలుగా భ్రష్టు పట్టించారు. వాస్తవం యొక్క పర్టిక్యులారిటీ యూనివర్సిటీల చర్చను కొందరు విరుద్ధాంశాల మధ్య ఐక్యతగా భావించడంతో అది మరింత చిక్కు ముడి అయిపోయింది. ఆ చిక్కు ముడి విప్పవలసి వున్నది.

**పదార్థంలో, వైరుధ్యంలో వుండేవి రెండు అంశాలు కాదు మూడు అంశాలు**

ఇపుడు పదార్థంలో ఎలక్ట్రాన్, ప్రోటాన్ అనే రెండు విరుద్ధాంశా లుంటాయనేది పాతబడిపోయింది. న్యూట్రాన్‌తో సహా ఇంకా దాదాపు నూరు రకాలు అందులో వున్నాయని తెల్సింది. దీన్ని పదార్థం అనే యూనివర్సల్ యొక్క వివిధ పర్టిక్యులారిటీలు అని చెప్పవచ్చు. విరుద్ధాంశాలమధ్య ఐక్యత, యూనివర్సిల్, పర్టిక్యులర్ అనే వ్యక్తీకరణలను సూత్రాలను భారతదేశ భాషల్లో భిన్నత్వంలో ఏకత్వం అని ఏకత్వంలో భిన్నత్వం అని ఏకత్వంలో అనేకత్వం అని వ్యవహరిస్తారు. సమగ్ర దృక్పథం వుంటే వీటిని దర్శించడం సాధ్యం.

**సమగ్ర దృక్పథానికి చేరువుగా ఆలోచించే తీరు**

ఉదాహరణకు తల్లి దృక్పథం, కూతురు దృక్పథం, చెల్లెలి దృక్పథం, అక్క దృక్పథం, ప్రేయసి దృక్పథం, భార్య దృక్పథం, కోడలు దృక్పథం, మామ దృక్పథం, మరదలు దృక్పథం, వదిన దృక్పథం, ఆడపడచు దృక్పథం, అమ్మమ్మ దృక్పథం, నానమ్మ దృక్పథం, మనవరాలి దృక్పథం, వాడకట్టు దృక్పథం, కుల దృక్పథం, వర్గ దృక్పథం, ఆ ఊరి దృక్పథం, తన జాతి దృక్పథం, తన ప్రాంత దృక్పథం, స్నేహ దృక్పథం, మానవతా దృక్పథం, పౌరురాలి దృక్పథం, కళాభిమాని దృక్పథం, సాంస్కృతిక దృక్పథం, ప్రాపంచిక దృక్పథం వంటి మరెన్నో దాదాపు ఏక కాలంలో కొనసాగుతుండడంవల్లే ఒకే వ్యక్తి ఆచరణలో ఇవి కనపడ్డం సాధ్యపడుతున్నది.

### సంబంధంలోకి వచ్చే వాటిని ఎలా పరిశీలించాలి?

ఇలా పరస్పర సంబంధంలోకి వచ్చే ప్రతిదాన్ని అనుసరించి (అనువుగా, తటస్థంగా, వ్యతిరేకంగా) ఆ నిర్దిష్ట సంబంధానికి ఆచరణా, దృక్పథమూ అస్తిత్వంలోకి వస్తున్నాయి. ఈ పర్టిక్యులారిటీలు అన్నీ కలిసే ఆమెది ఒక సమగ్ర వ్యక్తిత్వం, సమగ్ర దృక్పథం అవుతుంది. అవన్నీ ఆమె వ్యక్తీకరణలే. అందువల్ల ఒక స్థూల దశను మించి ఏది ప్రాథమికం అని సాగదీసే చర్చ అర్థం లేనిదవుతుంది. అలా సాగదీయాల్సిన అవసరం ఒక పర్టిక్యులర్‌ను దానికదే పూర్తిస్థాయి యూనివర్సల్ అని ప్రాతిపాదించి కుందేటి కొమ్ము సాధించే వారికి వుంటుంది. (సంబంధం అంటే రెండు లేదా అంతకన్నా ఎక్కువ వస్తువులమధ్య వాస్తవాలమధ్య పరస్పర ఆచరణ) ఇన్ని విభిన్న స్వభావాలను విరుద్ధాంశాలమధ్య ఐక్యత అని చెప్పడం వాస్తవాలను కుదించడం అవుతుంది. ఇలా వాస్తవాలను కుదించేదిగా విరుద్ధాంశాల మధ్య ఐక్యతా సూత్రం ప్రయోగింపబడవచ్చు. యూనివర్సల్ ఆమె స్వభావాలన్నీ వివిధ పర్టిక్యులర్‌లు.

### చెల్లెలుగా మంచిదే, భార్యగా బాగుండకపోవచ్చు

చెల్లెలుగా ఆమె ఆచరణ బాగుండవచ్చు. అక్కగా సరిగ్గా లేకపోవచ్చు. అత్తగా తనలోని తల్లికి భిన్నంగా ప్రవర్తించవచ్చు. ఇలా ఎన్నైనా చెప్పవచ్చు. అందువల్ల ఒక విషయంలో, ఒక కోణంలో సరిగ్గా ప్రవర్తించనంత మాత్రాన అన్ని కోణాల్లో ఆమె సరిగ్గా ప్రవర్తించనట్టు కాదు. తల్లిగా మంచిదే అయినా కోడలు మీద అత్తలాగే చెలాయించే స్వభావమే వర్గ దృక్పథానికి మార్క్సిజానికి వుండవచ్చు. ఎంతో కరుడుగట్టిన అత్తలా ప్రవర్తించడంవల్ల రష్యా తూర్పు యూరప్ దేశాల్లో సోషలిజం అని పిలువబడిన క్రమాలను ప్రజలు అత్తపెత్తనంలా కూలదోయాల్సిన స్థితి వచ్చింది.

### చెట్లను చూసే వారికి అడివి కనిపిస్తుందా?

ఒక రాణిగారికి అడవిని చూడాలని చాలా కోరికగా వుండేది. అడగ్గా అడగ్గా రాజుగారు అడవికి తీసికెళ్ళారు. ఆమెకు ఎంత చూసినా చెట్లు, జంతువులే కన్పించాయి. అన్నీ చెట్లే కన్పిస్తున్నాయి. అడవి ఏదీ అని ప్రశ్నించిందట! ప్రతిదాన్ని కేవలం ఒక పర్టిక్యులర్‌గా చూస్తే యూనివర్సల్ భావమైన 'అడవి' అనేది 'కనిపించని' స్థితి ఏర్పడుతుంది. భిన్నత్వంలోని ఏకత్వం, అనేకత్వంలోని ఏకత్వమే అడవి. అందువల్లే అడవి ఒక యూనివర్సల్.

అడవిలోని ప్రతి చెట్టును ఇది అడవి కాదు చెట్టే అంటూ నరికేసుకుంటూ వెళ్తే 'అడవి' అనేది ఎక్కడా మిగలదు. (ఊడిపోయిన వెంట్రుకల్ని స్త్రీలు మళ్ళీ సిగలా ముడేసుకుని సవరంలోని ప్రతి వెంట్రుకను పీకేస్తే సవరం అనే యూనివర్సల్ ఎక్కడా మిగలదు.) సైకిల్‌ను ఏ పార్టుకు ఆ పార్టు విడగొడ్తే సైకిల్ అనేది ఎక్కడా కనపడదు. పర్టిక్యులర్ అవయవాన్ని కలిసే మనిషి అయ్యారు. ఏ ఒక్క అవయవమూ మనిషి కాదు. అడవిలోని ప్రతి చెట్టులోను అడవి యొక్క ఒక అంశ వుంది. సవరంలోని ప్రతి వెంట్రుకలోనూ సవరం యొక్క ఒక అంశ వుంది. ప్రతి అవయవంలోను మనిషి యొక్క ఒక అంశ వుంది. అన్నీ కలిస్తేనే అది అడవి, సవరం, మనిషి అవుతున్నవి.



### వాస్తవాలు అనేక దృక్పథాలుగా చీలిపోయాయి

అందువల్ల వర్గ దృక్పథమే సర్వస్వం. హిందూ దృక్పథమే సర్వస్వం, కులదృక్పథమే సర్వస్వం, స్త్రీ దృక్పథమే సర్వస్వం, జాతి దృక్పథమే సర్వస్వం, మానవతా దృక్పథమే సర్వస్వం అని మొత్తం యూనివర్సాలిటీగా వక్రీకరణ ద్వారా విస్తృతీకరించి రుద్దే ప్రయత్నం చేసే వారవుతున్నారు. అది అడవిలోని ఫలానా చెట్టే మొత్తం అడవి అని చెప్పడం వంటిది. అడవిలో ఫలానా చెట్లు ఎక్కువ వున్నాయి గనక ఆ చెట్లే అడవి అని చెప్పడం వంటిది. ఒకే రకమైన చెట్లు ఎక్కువ వుండడంవల్ల కూడా అడవి కావచ్చు. సవరంలోని అన్ని వెంట్రుకలూ ఒక సమన్వయంలో వుండడం వల్ల అది సవరం అవుతున్నది.

పైనే స్పష్టం చేసినట్టు సమస్త దృక్పథాలు ఒకే ఒక వాస్తవం నుండి ఉత్పన్నమైన వ్యక్తీకరణలే. వాస్తవం యొక్క వివిధ వ్యక్తీకరణలే వివిధ దృక్పథాలుగా పరిణమిస్తున్నవి. అందువల్ల వాస్తవం ఒక సమన్వయంలో వున్నట్టుగానే సమస్త దృక్పథాలూ ఒక సమన్వయంలోనే కొనసాగవలసి వున్నవి.

### మన దేశం ప్రపంచానికి ఒక ఆదర్శ నమూనా

కాగా మన దేశం, మన సమాజం ప్రపంచానికి కూడా ఒక నమూనాయే. అది అడవి వంటిది. అడవి అనే ఏకత్వంలో చెట్లయొక్క భిన్నత్వం వుంది. చెట్లయొక్క భిన్నత్వంలో అడవి అనే ఏకత్వం వుంది. అన్ని విభిన్న అవయవాల సమన్వయంలో మనిషి అనే ఏకత్వం వుంది. అడవి, మనిషి ఆయా పర్టిక్యులారిటీల విభిన్నత్వానికి సవరం, ఆయా పర్టిక్యులారిటీల సమత్వానికి సాక్ష్యాలు. అందువల్ల ఈ రెండు వేర్వేరు ఉదాహరణలు. ఈ రెంటి లక్షణాలూ పర్టిక్యులారిటీ యూనివర్సల్ (భిన్నత్వం-ఏకత్వం)లలో ప్రాతిపదిక స్వభావాలుగా వుంటాయని చెప్పడం కోసమే రెండు వేర్వేరు ఉదాహరణలు తీసుకోవడం జరిగింది. ఇవన్నీ మనిషిలోని అవయవాల్లాగా ఒక సమన్వయంలో కొనసాగుతుండడంవల్ల అది అడవి, సవరం, మనిషి అవుతున్నాయి.

### శరీరం-శరీర భాగాలు

మనిషి అవయవాలమధ్య, సవరంలోని వెంట్రుకలమధ్య, అడవిలోని చెట్ల భిన్నత్వంమధ్య పరస్పర విరుద్ధాంశాల ఐక్యత అనేది ఒకానొక అంశం మాత్రమే. ఒక ఐక్యతలో, ఒక సంబంధంలోనే అవి అవిగా కొనసాగుతున్నాయి. కన్ను, చెవి, కాలు, మెదడు మొదలైన అన్ని అవయవాలకూ విడి వ్యక్తిత్వం వున్నా అవన్ని మనిషి యొక్క విభిన్న వ్యక్తీకరణలే. వాటిమధ్య వైరుధ్యం అనేది ఒకానొక అంశం మాత్రమే. వాటిమధ్య సమన్వయం పొందడానికి అపుడపుడు కొంత ఘర్షణ పడవచ్చు. సవరంలోని వెంట్రుకల మధ్య విరుద్ధాంశాల ఐక్యత అంటూ పెద్దగా ఏమీ లేదు. ఒకవేళ అలాంటిదంటూ ఒకటుంటే వెంట్రుక అనే ప్రతి పర్టిక్యులర్ ఒక ఐక్యతలో సమన్వయం పొందడమే. ఇలా సమన్వయం పొందడంనుంచే వెంట్రుకలన్నీ కలసి సవరం అవుతూ, అదే సమయంలో సవరంలో ప్రతి వెంట్రుకా ఒక అవిభాజ్య భాగం అవుతున్నది.

**ఏకత్వంలో భిన్నత్వం - భిన్నత్వంలో ఏకత్వం**
**అనేది ప్రకృతి సమాజాల మౌలిక చలన సూత్రం**

అందువల్ల భిన్నత్వంలో ఏకత్వం, ఏకత్వంలో భిన్నత్వం, ఏకత్వంలో అనేకత్వం అనేది ప్రపంచ గతితార్కిక ప్రాథమిక సూత్రాల్లో ఒకటి అవుతున్నది. దీన్నే "పర్టిక్యులర్ సమస్త పర్టిక్యులర్స్ యూనివర్సల్‌లో తిరిగి ప్రతి పర్టిక్యులర్ సమస్త పర్టిక్యులర్స్" సూత్రంగానూ చెప్పవచ్చు. ఉదాహరణకు చెట్టు అన్ని చెట్లు, అడవి, అడవిలోని ప్రతి చెట్టు, అడవిలోని అన్ని చెట్లు. వెంట్రుక అన్ని వెంట్రుకలు సవరం సవరంలోని ప్రతి వెంట్రుక సవరం ఇది గతితార్కిక ప్రాథమిక సూత్రాల్లో ఏ సూత్రానికన్నా తక్కువ ప్రాధాన్యత కలది కాదు. నిజానికి ఇది ప్రకృతి సమాజాల చలనాల్లో గల మౌలిక చలన సూత్రం.

**భాష వేరు, భావం ఒకటే**

ప్లేటోనుంచి ప్రాచుర్యంలోకి వచ్చి అర్థాలు, స్వభావాలు మారుతూ కొనసాగుతూ వస్తున్న పర్టిక్యులర్ యూనివర్సల్ సూత్రం భారతీయుల యొక్క భిన్నత్వంలో ఏకత్వం, ఏకత్వంలో అనేకత్వం అనే సూత్రం రెండూ ఒక్కటే. పదాలు వేరు అంతే. అయితే యీ విషయం కొంతమంది మార్క్సిస్టులక్కూడా తెలియకపోవడం ఆశ్చర్యకరం. విరుద్ధాంశాలమధ్య ఐక్యత అనగా వైరుధ్యం సూత్రం అనేది దానికదే ప్రాథమిక సూత్రం కాదు. అది పర్టిక్యులర్ యూనివర్సల్ (ఏకత్వంలో భిన్నత్వం, భిన్నత్వంలో ఏకత్వం అనేకత్వం) అనే అద్వైత సూత్రంలోని ఒకానొక అంశం మాత్రమేనని ఈ చర్చ స్పష్టం చేస్తున్నది కూడా.

అందువల్ల Unity of opposites అనే సూత్రం Unity of Diversities అనే అద్వైతం యొక్క ఒకానొక వ్యక్తీకరణే. సవరంలో విరుద్ధాంశాల మధ్య ఐక్యత సమస్త పర్టిక్యులర్ వెంట్రుకల సమత్వంతో సమ ఐక్యతలోంచి పుట్టింది. సమాజం-సమాజంలో వ్యక్తి అనే అంశాలను సవరం, సవరంలోని వెంట్రుకలు, అడవి, అడవిలోని చెట్లు వంటివి అనుకోవచ్చు. అందువల్ల అందులో వుండే వైరుధ్యం ప్రతి పర్టిక్యులర్‌కూ పర్టిక్యులర్‌కూ మధ్య, అదే సమయంలో ప్రతి పర్టిక్యులర్‌కూ యూనివర్సల్‌కూ మధ్య వుండే వైరుధ్యమే.

దీన్నే సామాజిక స్థాయిలో ప్రతి వ్యక్తి సమాజంలో తానుగా వుంటాడు. సమాజంకొరకు తానుగా వుంటాడు. తనకొరకు తానుగా వుంటాడు. ప్రతి వ్యక్తిలో భాగంగానే సమాజం కొనసాగుతుంది అని వ్యవహరించడం జరుగుతున్నది.

**మనుషులందరూ సమానమే**

ప్రపంచంలోని మనుషులందరూ సహజీవనంలో సవరంలోని వెంట్రుకల్లా అడవిలోని చెట్లలా మనిషిలోని అవయవాల్లా అందరూ సమానం (కావాలి). అందరూ యిలా ఒకానొక సమత్వంలో కలిసివుండడం నుండే అడవి, సవరం, సమాజం అనే అస్తిత్వాలు ఉత్పన్నమవుతున్నాయి.

**సోషలిజం, మార్క్సిజం సిద్ధాంతాల అదృశ్యం**

అందువల్ల తాను ప్రతిపాదించిన సోషలిజం, కమ్యూనిజం దశల్లో వైరుధ్యంలోని



రెండు అంశాలు, విరుద్ధాంశాలమధ్య ఐక్యత అనేవి రాజ్యంతోపాటు మనుషులమధ్య మాయమైపోక తప్పనిస్థితి ఏర్పడింది. తన సిద్ధాంతాన్ని రైటనిపించుకోవడంకోసం దాన్ని మనిషికీ మనిషికీ మధ్య కాకుండా, యిక అప్పటినుండి మనిషికీ ప్రకృతికీ మధ్య వైరుధ్యంగా కొనసాగుతుందని వైరుధ్యం సూత్రంలోని తప్పును స్థిరీకరించి చేతులు దులుపుకున్నారు.

అసలు విషయం ఏమంటే వర్గ దృక్పథం నుండి ఉత్పన్నమైన రాజ్యం, రాజ్యవాదం అదృశ్యం కాకపోవడంతోనే వర్గ దృక్పథం ప్రకృతి, సమాజ సూత్రం అని చెప్పుకుంటూ వచ్చిన వైరుధ్య సూత్రం, విరుద్ధాంశాలమధ్య ఐక్యత అనే సూత్రం కూడా మనుష్యులమధ్య అదృశ్యమౌతుంది. ఇలా రాజ్యం, రాజ్యవాదం, పరాయీకరణ దృక్పథం ఆచరణలనుండే వైరుధ్యం, విరుద్ధాంశాలమధ్య ఐక్యత అనేవి ప్రాథమిక సూత్రాలుగా పుట్టడం సాధ్యపడింది. వర్గ వైరుధ్యాలు అదృశ్యం కావడంతోనే మనుషులమధ్య వైరుధ్య సూత్రం అదృశ్యం కావడమే యిందుకు ప్రత్యక్ష సాక్ష్యం.

**వైరుధ్యం సూత్రంలోని తప్పు ఏమిటి?**

వైరుధ్యం సూత్రంలోని తప్పు ఏమిటి? తానే ఏకైక ప్రాథమిక సూత్రం అనుకోవడమే అందులోని తప్పు. వర్గరహిత దశను అంగీకరించడం అంటే వైరుధ్యరహిత దశను అంగీకరించడం కూడా అని పై చర్చే స్పష్టం చేస్తున్నది. ఈ తప్పును కప్పిపుచ్చుకోవడంకోసం మనుషులమధ్య వైరుధ్యాన్ని ప్రకృతికి, మనిషికి మధ్య వైరుధ్యంగా చూపించారు. మునుపటినుంచీ, నేటికీ ప్రకృతికీ మనిషికీ మధ్య వైరుధ్యం సంబంధం, సమన్వయం ప్రాథమికం కానట్టు కొత్తగా కనుక్కున్న విషయంలా మార్క్సిజం ఒక అభాసను సృష్టించడమే యిందులో గల అసలు కీలకం.

**యూనివర్సల్ - పర్టిక్యులర్**

అడవి, సవరం, సమాజం అనే యూనివర్సల్ గల అన్ని చెట్లు, అన్ని వెంట్రుకలు మనుషులందరు దాదాపు సమానం, సమప్రాధాన్యత వుంది అని అంగీకరించడంతో వైరుధ్యం, వైరుధ్యంలోని విరుద్ధాంశాల మధ్య ఐక్యత అనే సూత్రం తన ప్రాథమికతను, తన ప్రాథమిక సూత్ర ప్రతిపత్తిని కోల్పోతున్నది. దాని స్థానంలో పైన చెప్పిన పర్టిక్యులర్ యూనివర్సల్, ఏకత్వంలో, ఏకత్వంలో భిన్నత్వం, భిన్నత్వంలో ఏకత్వం, ఏకత్వంలో అనేకత్వం అనే అద్వైత సూత్రం తిరిగి విస్తరిస్తున్నది.

**వైరుధ్యం సూత్రం అతివ్యాప్తి దోషం**

ఇలా వైరుధ్యం సూత్రం యొక్క అతివ్యాప్తి దోషం మార్క్సిజంలోని ఏకజాతి, ఏకమత, వాదం తాలూకు కుదించుకుపోయిన అద్వైతం యొక్క అతి వ్యాప్తి దోషం కలిసి మార్క్సిజాన్ని గొడ్రాలుగా మార్చివేస్తున్నాయి. మార్క్సిజంలో చేరి "కేంద్రకం"గా మారిన రాజ్యవాదం రాజ్యాధికారవాదం. ఈ గొడ్రాలితనాన్ని స్థిరీకరిస్తున్నది. అందువల్లే దశాబ్దాల మార్క్సిస్టు సోషలిజాల ఆచరణ అనంతరం కూడా కొత్త సిద్ధాంత శిశువులు ఆవిర్భావం లేకపోగా సోషల్ సామ్రాజ్యవాదంగా ఎదగడం సాధ్యమైంది. ఈ విషయాన్ని గుర్తించడానికి చాలా గుండె ధైర్యం కావాలి.

## యూరప్ సామ్రాజ్యవాద పరిణామాల్లో పుట్టిన సిద్ధాంతాలు

ఏకజాతి ఏకదేశ ఏకమత సిద్ధాంతం పరిమితికి లోనైన మార్క్సిజంలోని అద్వైతవాదం, వైరుధ్యవాదం బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీల్లోంచి పుట్టిన సామ్రాజ్యవాదం యొక్క కొనసాగింపుగానే సోషల్ సామ్రాజ్యవాదం ఆవిర్భవించింది. మార్క్సిజం పుట్టుక కూడా యీ మూడు దేశాల చరిత్ర, భౌతిక ప్రాతిపదికలనుండే జరిగిందని మనకు తెలుసు. ఆ ప్రాతిపదిక నుండి పుట్టడాన తిరిగి కార్మిక వర్గవాద రూపంలో అదే క్రమాన్ని ఉత్పన్నం చేసింది. అందుకు బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ తదితర యూరపు చరిత్ర, భౌతికత వాటి వలసల ఆధారంగా, వలసవాదాల ప్రాతిపదికపై, దాన్నుంచి పొందిన ప్రయోజనాల ప్రాతిపదికనుండే పుట్టింది. ఈ భౌతిక ప్రాతిపదికనుండే పుట్టి తద్భిన్నంగా ప్రవర్తించడం ఎలా సాధ్యం? అది సాధ్యమనుకుంటే అది భౌతిక ప్రాతిపదిక లేని భావవాదమవుతుంది.

గ్రీకు అలెగ్జాండర్ మొదలుకొని, క్రైస్తవం, ఇస్లాం, పెట్టుబడిదారీమతం (మార్క్సిజం అనేది పెట్టుబడిదారీ మతంలో ఒక శాఖ) దాకా భావాల వలసవాదాన్ని భౌతికవాద వలసవాదాన్ని ఆచరిస్తున్నవే. ఈ మూడింటిలో ఏకజాతి ఏకదేశ ఏకమత ఏకైక (అద్వైత) వాదం తాలూకు స్వభావాలే వున్నాయి. అవే అక్కడి వాస్తవికతలో ప్రతిఫలించి మార్క్సిజంగా రూపాంతరం సారాంతరం చెందాయి.

దేనికదే "నేనే బ్రహ్మంను" అనేది ఈ మూడింటిలో గల అద్వైతసూత్రం "నేను కూడా బ్రహ్మంను" అనే అద్వైత సూత్రాన్ని యివి నిరాకరిస్తాయి. అందువల్ల వాటి ఏకేశ్వరోపాసన ఏకైకేశ్వరోపాసనగా పరిణమించింది. ఈ భౌతిక ప్రాతిపదిక నుండే ఇస్లాం వినా మార్గాంతరం లేదు అని ఒకరంటే క్రైస్తవం వినా మార్గాంతరం లేదని మరికొందరంటారు. మార్క్సిజం వచ్చి అదనంగా ఏం చేసిందంటే మార్క్సిజం సోషలిజం (కొందరు స్వర్గం వినా అన్నట్లుగానే) వినా మార్గాంతరం లేదని చెప్పడమే. అదే అది ప్రాతిపాదించిన ఏకైక అద్వైతవాదం.

## నేను కూడా బ్రహ్మంనే

ఏకత్వంలో అనేకత్వాన్ని, ఏకత్వంలో భిన్నత్వాన్ని, భిన్నత్వంలో ఏకత్వాన్ని అనేకత్వంలో ఏకత్వాన్ని చూపించగలిగే శక్తిసామర్థ్యాలు యీ మూడు సిద్ధాంతాలకు ప్రాతిపదిక అయిన దేనికదే నేనే బ్రహ్మంను అనుకునే వాటి అద్వైత సిద్ధాంతంలో లేవు. అలా చూపించగలిగే శక్తి సామర్థ్యాన్ని సాధించుకుంటే అవి భారతదేశంలోని హిందూ జీవన విధానంగా హిందూ మతంలా, ఒక పట్టాన నిర్వచనానికి వీలుకాని "హిందువు" అనే పదంలా విస్తృతి పొంది ఒక పర్టిక్యులరే, యూనివర్సల్ అనే ప్రస్తుత ఆచరణ, దృక్పథం అదృశ్యం అవుతుంది. అప్పుడు "నేనే బ్రహ్మం"ను అనే స్థితినుండి నేను కూడా బ్రహ్మంనే అనే దశకు ఆయా మతాలు, సిద్ధాంతాలు, ఆచరణలు విస్తరిస్తాయి. ఇతరులను ఇతర వాదాలను దృక్పథాలను, ఆచరణలను గౌరవించడం నేర్చుకొంటాయి.

రాణిగారికి అడవిని చూపించగలం. అడవిని వర్ణించి చెప్పగలం, కాని ఆమె యివన్ని చెట్లేగదా అడవి ఎక్కడుంది అని ప్రశ్నిస్తే అది ఎలా అడవో చెప్పడం అంత సులభం ఏమీ కాదు. ఇలాగే నేనే బ్రహ్మంను "నేను" నా దృక్పథం వినా మార్గాంతరం లేదు. అనుకునేవారు మరొక బ్రహ్మంను బ్రహ్మంగా, మరొక దృక్పథాన్ని దృక్పథంగా



అంగీకరించడం అంత సులభం కాదు. అలాంటివారు ప్రతి బ్రహ్మంనూ నీది చెట్టు అనే పర్టిక్యులర్ గానీ అడవి కాదు అని వాదిస్తారు.

## జ్ఞాన సిద్ధాంతం అనుభవవాదం

దీన్ని జ్ఞాన సిద్ధాంతంలో నీది అనుభవవాదమే గానీ జ్ఞానవాదం కాదు అంటారు. దీన్నే వాళ్ళు ఆచరణలో నీది సంస్కరణవాదమే కాని విప్లవవాదం గానీ సమగ్రవాదంగానీ కాదు అని అంటారు. నీది కూడా చెట్టు కాదు నాలా ఒక అడవే, ఇది కూడా నాలాగా ఒక బ్రహ్మమే ఒక దృక్పథమే అని అంగీకరిస్తే "నేనే బ్రహ్మం"ను అనే ఏకజాతి, ఏకదేశ, ఏకమత, ఏకైక అద్వైతవాదం కూడా వాటిలో ఒకానొక వాదంగా పరిగణించబడుతుంది. అందువల్ల అది తన వ్యాప్తికోసం అనగా తన భావజాల సామ్రాజ్యవాద కోసం ఇతరుల్ని, తన వలసలుగా స్థిరీకరించడం కోసం నేను వినా మార్గాంతరం లేదు అని ప్రతిపాదిస్తున్నది తప్ప అదే మొత్తం వాస్తవం కాదు. అది వాస్తవం యొక్క ఒకానొక వ్యక్తీకరణ మాత్రమేనని స్పష్టం అవుతున్నది.

## ఒకే వాస్తవం భిన్న కోణాలను ఎలా పరిశీలించాలి?

ఒక వాస్తవం యొక్క వివిధ కోణాలను వెలికితీయడం నుంచి అవి వివిధ దృక్పథాలుగా పరిణామం చెందుతున్నాయి. విభిన్న దృక్పథాలు కలసి ఒకే వాస్తవం యొక్క విభిన్న ఛాయలను తెలుపుతాయి. విశ్వం, కుల, మత, వర్గ, లింగ, జాతి, ప్రాంత, తెగ, భాష సమస్యలు ఒక వాస్తవం. వీటి గురించి దృక్పథాలు ఒకే వాస్తవం యొక్క వివిధ కోణాలను, ఛాయలను తెలుపుతాయి.

## దృక్పథం ఒక పర్టిక్యులర్ - వాస్తవమే ఒక యూనివర్సల్

అందువల్ల వాస్తవం అనేది ఒక యూనివర్సల్. దృక్పథాలు అనేవి ఆ వాస్తవం యొక్క వివిధ పర్టిక్యులర్‌లు, స్థూలంగా చెప్పాలంటే ఒక వాస్తవంపై ఎన్ని దృక్పథాలు ఏర్పడితే ఆ వాస్తవానికి అన్ని పర్టిక్యులారిటీలు ఉన్నాయని అర్థం. వాస్తవాన్ని గతంగా చేసి "అది"గా మార్చి దృక్పథం "నేను"గా మారి వర్తమానం కావడం ద్వారా దృక్పథానికి పునాది అయిన వాస్తవాలు "అది"గా పాలితులుగా మార్చబడుతూ దృక్పథం పాలకవర్గంగా మారిపోతున్నది. ఇలా ఆచరణలో వాస్తవాలు పాలిత వర్గంగాను, దృక్పథాలు పాలకవర్గంగాను అస్థిత్వం కొనసాగిస్తాయి. పర్యవసానంగా దృక్పథం అనేది అన్ని వ్యవస్థల్లాగే ఒక వ్యవస్థగా, ఒక రాజ్యాంగ యంత్రంగా కొనసాగుతుంది.

## దృక్పథం మూఢ విశ్వాసం కాకూడదు

విశ్వాసాలు, మూఢ విశ్వాసాలు విచక్షణని కాకుండా భక్తి సంస్కృతిని పెంచి పోషిస్తాయి. సోషలిస్టు మూఢ విశ్వాసాలు యిలా సోషలిస్టు మూఢ భక్తి సంస్కృతిని ప్రోత్సహిస్తుంది.

ఒకరు వాస్తవాల ప్రాతిపదికగా అది సరిగ్గా లేదు అని నిర్ధారించకుండా ఎవరివో ఉల్లేఖనల ఆధారంగా సరిగ్గా లేదని చెప్పడం, జ్ఞాన స్థాయిలో ఒక దశను సూచిస్తుంది. దాన్ని అనుకరణ జ్ఞాన స్థాయి అంటారు.

అదే సమయంలో అది ఒక మూఢ విశ్వాసం.

ఒకటి: సొంత బుర్ర ఉపయోగించలేని పరాధీనత.

రెండు: మంది పెద్దరికం ద్వారా తన పెద్దరికం నిలుపుకోవడం.

మూడు: వాస్తవాలను పరిశీలించడం కాకుండా వాటి గురించి ఎవరో చెప్పింది మాత్రమే లెక్కలోకి తీసికోవడం.

నాలుగు: తద్వారా ఆ ఒక్క కోణమే, ఆ ఒక్క వ్యక్తీకరణే ఆ వాస్తవంయొక్క అన్ని పార్శ్వాల వ్యక్తీకరణ అని దబాయించి రుద్దే ప్రయత్నం చేయడం.

ఐదు: గతితార్కిక చలన సూత్రాలను ఆ వాస్తవం నుండి వెలికి తీయడం కాకుండా యిదివరకే ఎవరో దేన్లోనో వెలికితీసిన చలన సూత్రాలను ఆ వాస్తవంమీద రుద్దడం.

ఆరు: అలా రుద్దే పనే లేకపోతే ఆ ఉల్లేఖనం అవసరమే లేదు. అపుడు ఆ వాస్తవాలను వాస్తవాలుగానే చర్చిస్తారు.

ఏడు: ఒక ఉల్లేఖన యిస్తున్నాడంటేనే ఒక వాస్తవంపై మరో వాస్తవం తాలూకు, లేదా అదే వాస్తవం తాలూకు వ్యాఖ్యానాన్ని, దృక్పథాన్ని, రాజ్యాన్ని, తాను కూడా రుద్ది తాననుకున్నట్టుగా నిర్ధారించే ప్రయత్నం చేయడం.

ఇది "వాస్తవం"ను ప్రాథమికం చేయడం కాకుండా "నేను" యొక్క దృక్పథంయొక్క "రాజ్యాన్ని" ప్రాథమికం చేయడం.

అందువల్ల సరిగ్గా చెప్పాలంటే "అది మార్క్సిజానికి వ్యతిరేకమైన ఆచరణ" "అది అంబేద్కరిజానికి వ్యతిరేకమైన ఆచరణ" లేదా అది ఫలానా యిజానికి వ్యతిరేకమైన ఆచరణ. అనో అనుకూలమైన ఆచరణనో చేసే ప్రతి వ్యక్తీకరణ అనుకరణ జ్ఞానస్థాయికి కొంత ఉపయోగమే గానీ ఒక మొత్తంలో జ్ఞానస్థాయిలో అది వాస్తవాలను వాస్తవాలుగా వెలికి తీయాల్సిన కర్తవ్యం నుండి పలాయనం చిత్తగించి అలా చేయకుండా పారిపోయిన పనికి సైతం ఫలితాలను పొందాలనుకోవడం.

ఉదాహరణకు మన దేశంలో మార్క్సిజం చదవని వారిని ఎవరిని అడిగినా అవును "కులం" అనేది కూడా ఒక ప్రధాన వైరుధ్యమే, ప్రధాన సమస్యే అని వెంటనే చెప్పేస్తారు. కాగా మార్క్సిజం చదివామని, ఆచరిస్తున్నామని అనుకునే కొందరు యిప్పటికీ దీన్ని అంగీకరించడం లేదు.

అంటే ఏమిటి? ఒకటి: కొందరు భారతీయ మార్క్సిస్టుల జ్ఞానం, ఆచరణ అనేవి జ్ఞానం స్థాయిలోనే వున్నాయి. రెండు: వీరు అంతర్గత వైరుధ్యాలను సామాజిక వాస్తవాల నుండి వెలికి తీయడం కాకుండా యూరోపియన్ వలసవాదంకు పుట్టిన ఒకానొక మార్క్సిజాన్నో, వలసవాదానంతర, స్వాతంత్ర్యానంతర వాస్తవాలపై రుద్ది తదనుగుణంగా వాస్తవాల్ని గారడీవాడు డబ్బాలోంచి (అంతకుముందే తానే దాచిపెట్టి వుంచిన) కుందేలును తీసినట్టుగా తీసి చూపించడం జరుగుతున్నదని అర్థం.

అగ్రకుల పేదలందరూ నేను కూటికి పేదనే గాని కులానికి పేదనా? అనే దృక్పథం నుండి ఏ మార్క్సిజం సహాయం లేకుండానే పేద మాలమాదిగలతో, డెక్కల చండాలులతో పేద రెడ్డి వెలమ బ్రాహ్మణ, కోమట్లు కూడా సమానమే. వారికన్నా మేం నయాపైసా అదనం కాదు అని అనుకోగలిగి కంచం పొత్తు, మంచం పొత్తు విరివిగా కొనసాగించిననాడు యిక్కడి అంతర్గత వైరుధ్యాల్లోంచి వర్గ దృక్పథం కొత్త స్వరూపంతో,



కొత్త స్వభావంతో ఉద్భవిస్తుంది.

అలానే రిజర్వేషన్లతోనో, ఉద్యమాల ఫలితంగానో ఆర్థికంగా, సాంఘికంగా బాగుపడ్డ వారెందరో తిరిగి వద్దనుకున్న బ్రాహ్మణిజం ఊబిలో దిగబడి పోవడం చూస్తూనే వున్నాం. రిజర్వేషన్ల ద్వారా పైకొచ్చి తన వర్గానికేమీ చేయని తరాలు వచ్చే క్రమం అంబేద్కర్ నాటికే అనగా 1950 కాలం నాటికే కనబడి బాధపడ్డాడు.

### సొంతంగా చలన సూత్రాలను కనుక్కోవాలి

ఇలా వాస్తవాలు మారుతున్నాయి. మారుతున్న వాస్తవాల నుండి ఎప్పటికప్పుడు కొత్త దృక్పథాలను, ఆచరణలను ఏర్పరచుకోవలసి వున్నది. అందుకు సమస్త వాస్తవాలను, ఆచరణలను, దృక్పథాలను, సమస్త రకాల చరిత్రలను ఒక సమన్వయంలో పరిశీలించవలసి వున్నది. ఆయా ఆచరణపట్ల, దృక్పథాలపట్ల పరస్పరం ఆచరించే అస్పృశ్యత వాస్తవాలపట్ల చూపే అస్పృశ్యత అవుతుంది. దీన్ని పైనే చూశాం.

### దృక్పథాల పట్ల అంటరానితనం చలనాల కోణాలను నిరాకరించడమే

ఒక వాస్తవంపట్ల, ఒక దృక్పథంపట్ల యిలా అస్పృశ్యత ఆచరించాక యథాస్థితిలో కొనసాగే అవకాశం యిచ్చినట్టవుతుంది. తద్వారా ఆ వాస్తవాలను మార్చడం సాధ్యం కాదు. ఆ వాస్తవాలను, దృక్పథాలను అవి మనం వ్యతిరేకించేవైనా సరే ఎంతో కొంత స్వీకరించేవైనా సరే వాటన్నిటినీ మన సంబంధంలోకి తెచ్చుకోవాల్సి వుంటుంది. పరస్పర సంబంధంలోకి తెచ్చుకోవడం అంటే పరస్పరం మార్చుకోవడం. ఈ పరస్పర మార్పుకు యిష్టపడనివారే ఆ యా వాస్తవాలపట్ల, ఆచరణలపట్ల, దృక్పథాలపట్ల అస్పృశ్యతను పాటిస్తారు. అనగా వారు వాస్తవాలను చూడ నిరాకరిస్తారు. తమకున్న ఈ అజ్ఞానపు పరిమితుల్నే అందరిమీదా రుద్దడం కోసమే వారు ఆయా వాస్తవాలపట్ల, ఆచరణలపట్ల, దృక్పథాలపట్ల అస్పృశ్యతను పాటిస్తారు.

### సంబంధం ప్రాథమికం

ఏదైనా సరే అది పరస్పర సంబంధంలోకి రావడం ద్వారానే మారుతుంది. పరస్పర సంబంధంలోకి వచ్చేవన్నీ ఏకపక్షంగా మారవు. పరస్పరం అన్నీ మారుతాయి.

ఎన్నో విడి అస్తిత్వంగల వస్తువులు పరస్పర సంబంధంలోకి రావడంతో 'కూర' అనే కొత్త వాస్తవం ఉత్పన్నమవుతున్నది. 'కూర'లో వుండే ప్రతిదీ పాత వాస్తవాలు కొత్త వాస్తవాలుగా పరస్పరం మార్పిడి పొందాయి. మనిషి సంఘజీవి. అందువల్ల మనిషి పరస్పర ప్రభావంలోనే, పరస్పర పరివర్తన క్రమంలోనే వున్నాడు. కానైతే ఇతర దృక్పథాలపట్ల, వాస్తవాలపట్ల, ఆచరణలపట్ల అస్పృశ్యతను పాటించేవారు. పాటించాలనే వారే తద్వారా ఆ మార్పును అడ్డగిస్తున్నారు. తద్వారా సమాజ గతిశీలతకు అభివృద్ధి నిరోధకంగా ఆయా దృక్పథాలు మారిపోయే పరిస్థితిని ఏర్పరుస్తున్నారు. వీటన్నిటిని సరిచేయవలసి వున్నది. అందుకు ప్రపంచవ్యాప్తంగా వివిధ ఆచరణల్లో దృక్పథాల్లో కొనసాగుతున్న అస్పృశ్యతను ముందు తొలగించి ఒక సమన్వయంలోకి తేవలసి వున్నది. మానవ సమాజ కళ్యాణాన్ని ఆశించే వారెవరైనా దీన్ని స్వాగతించవలసి వున్నది.

### మానవీయత ప్రాథమికం

అందుకు మనకు మనిషి మానవత మానవ సంబంధాలు ప్రాథమిక కావాలి. వ్యక్తికీ సమాజానికి మధ్య గల సంబంధంలో, వైరుధ్యంలో ఆవిర్భవించి పోలరైజేషన్‌కు గురి చేస్తూ పరస్పరం మార్పుకు గురి కావలసిన స్థితిని అడ్డగిస్తూ ఘనీభవింపజేసే సమస్త పీడితవర్గ కుల, మత, జాతి, లింగ, ప్రాంత, భాష వర్గీకరణలను, ఆచరణలను, దృక్పథాలను ఒక సమన్వయంలోకి తేవడం అవసరం. తద్వారా వాటి పరిధులూ, పరిమితులూ ప్రజలందరికి స్పష్టం అవుతాయి. అపుడు వాటన్నిటినీ అధిగమిస్తూ ప్రజలు ముందుకు సాగిపోతారు. ఈ చర్చ యిలా నిర్ధారిస్తున్నది. (సమాజం అనే) వాస్తవం యొక్క అన్ని కోణాలు, వాస్తవం గురించిన అన్ని దృక్పథాలు, అన్ని రకాల ఆచరణలు కలగలిసి ఒక సమగ్రతలో అది ఆ (సమాజం అనే) వాస్తవం యొక్క ఒక ఉజ్జాయింపు అవుతున్నది.

### భారతీయ తత్వశాస్త్రాల విశిష్టత

భారతీయ తత్వశాస్త్రాలు, వాస్తవాలు, ఆచరణలు దీన్ని ఏనాడో స్పష్టం చేశాయి. లెనిన్ తన "అనుభవవాద విమర్శ–మార్క్సిజం" దశను అధిగమించి 7,8 ఏళ్ళ తర్వాత ఈ దశకు చేరుకునే ప్రయత్నం చేసినట్టు లెనిన్ ఫిలసాఫికల్ నోటుబుక్సుతో స్పష్టం అవుతున్నది. అయితే ఆయన యీ భావాన్ని వ్యక్తీకరించాడే గానీ దాన్ని విస్తృతీకరించి వ్యాసాలు రాయలేకపోయాడు. మావో చేసిన వైరుధ్యవాదం, రష్యా వాళ్ళు విమర్శించినట్టు జ్ఞాన సిద్ధాంతాన్ని కొంత భ్రష్టు పట్టించిన మాట వాస్తవం. వీటిని మరోసారి చర్చిద్దాం.

ఈ అధ్యాయంలో తత్వశాస్త్రంలో భాగంగా సిద్ధాంతాలను, దృక్పథాలను చర్చించడం జరిగింది. ఇది మరింత విస్తృతంగా చర్చించడం అవసరం. అందుకు సమాజ చలనాన్ని, సామాజిక ఆచరణను ఒక సమగ్రతలో అన్ని రకాల మానవ కృషిని పరిగణనలోకి తీసుకుని పరిశీలించడం అవసరం. అందుకు భావవాదం, భౌతికవాదం, ప్రకృతి చలనసూత్రాలు, ఏమాత్రం సరిపోవు. అవి చాలా పరిమితికి లోనయ్యాయి. సమాజాన్ని ఒక మొత్తంలో ఒక సమగ్రతలో పరిశీలించడం అవసరం. జీవితంలో ఆర్థిక అవసరాలుకూడా జీవితాన్ని మన ఆలోచనావిధానాన్ని, భావజాలాన్ని నిర్దేశించడంలో ప్రధానపాత్ర వహిస్తాయి. పేదవాడు ఆకలిగురించి ఆలోచిస్తాడు. ఆకలి తీరినవాడు ఆదర్శాలగురించి, ఆలోచనల గురించి ఆలోచిస్తాడు. కులం అణచివేతకు గురిఅయినవాళ్లు దాన్ని తొలగించుకోడంగురించి ఆలోచిస్తారు. ఆ అణచివేత లేనివాళ్లు ఆదర్శాలగురించి ఆలోచిస్తారు.

మనం బాగా చదవాలి, అన్నీ చదవాలి. మనం అంగీకరించే దాంతోపాటు వ్యతిరేకించేదాన్ని కూడా బాగా చదవాలి. మనం వ్యతిరేకించేది అనే పేరిట అధ్యయనాన్ని నీరసపరచి దయచేసి అజ్ఞానాన్ని మనం ప్రోత్సహించకూడదు. మనం విశ్వసించేది, మనం విశ్వసించనిదాన్ని చదివాక కూడ మొదటిలాగే అదే విశ్వాసాన్ని యథాతథంగా కలిగివుండవచ్చుననిపిస్తేనే అది నిజమైన అంచనాలమీద, వాస్తవాలమీద ఆధారపడిన విశ్వాసం అవుతుంది. అందువల్ల ఇందులోని విషయాలతో ఏకీభవించేవారూ, ఏకీభవించనివారూ అందరూ వీటిని అధ్యయనం చేయడం అవసరం.



## ప్రశ్నలు

1. దృక్పథం ఎందుకు అదృశ్యం కావాలి? వివరించండి.
2. భిన్నత్వంలో ఏకత్వం, ఏకత్వంలో భిన్నత్వం అనే ప్రకృతి సమాజాల మౌలిక సూత్రం ఎలా అవుతుందో వివరించండి.
3. దృక్పథాల మధ్య ఘర్షణ ఎందుకు ఏర్పడుతుంది? వివరించండి.
4. అనివార్యతా సిద్ధాంతంలో వున్న సత్యమెంత? చర్చించండి.

# అభివృద్ధి కనువుగా చరిత్ర రాయడమంటే ఏమిటి?

## విజేతలకనువుగా చరిత్ర రాయడమే పరాయీకరణను ఆమోదించడమే

మానవ సమాజ పరిణామక్రమం తాలూకు అభివృద్ధిని వివరించే క్రమంలో ఆ "అభివృద్ధిని గెలుచుకున్న" వాళ్ళ తాలూకు ఆధిక్యత రాజ్యం, పరాయీకరణలుంటాయి. అభివృద్ధికనువుగా చరిత్ర రాయడం అంటే పరాయీకరణ క్రమానికనువుగా చరిత్ర రాయడం కూడా. "అభివృద్ధి చరిత్ర" క్రమానికి అనువుగా చరిత్ర రాయడం అంటే దోపిడివర్గాలకు, కులాలకు, లింగాలకు, జాతులకు, ప్రాంతాలకు అనువుగా, హారు చేసే అణచివేత, పరాయీకరణలకనువుగా చరిత్ర రాయడం కూడా.

"ప్రాచీన భారతదేశ చరిత్ర డి.డి. కోశాంబి పరిచయం"లో ఈ "అభివృద్ధి" విస్తరణాధిక్యతతోపాటు ఆ వర్గాల, ఆర్యుల, బ్రాహ్మణ కులాల ఆధిక్యతకు సైద్ధాంతిక సమర్థనను ఇస్తూ అదే సమయంలో తెగల, గణాల, ద్రావిడుల గిరిజనుల, దళితుల, బౌద్ధుల, స్త్రీల, స్థానికుల అణచివేతను, పరాయీకరణను మౌనంగా ఆమోదింపజేసే క్రమాన్ని గమనించవచ్చు.

**ఆర్యుల వలసలకనువుగా చరిత్ర రాయడం ఎలాంటిదంటే...**

ఆర్యుల వలసలకనువుగా చరిత్ర రాయడం అంటే కోస్తా ఆంధ్ర ప్రజల వలసల కనువుగా తెలంగాణ చరిత్ర రాయడమే. కోశాంబి ఆర్యుల వలసల కనువుగా చరిత్ర క్రమాన్ని రాయడంలో స్థానికుల చరిత్రను, వారి అభివృద్ధి, ఆధిక్యతలను పరాయీకరించి అణిచివేసే క్రమం ఉన్నది.

"అభివృద్ధి" వెంటసాగే రాజ్యం పరాయీకరణ క్రమాల్ని అది దృక్పథం అధ్యయన పద్ధతుల్ని మార్చే తీరుల్ని కాస్త నిర్దిష్టంగా చూద్దాం.

ఢిల్లీ, హైదరాబాద్ వంటి నగరాల్లో చేరిన వలసవాసులు స్థానికుల్ని ఓల్డు సిటీ అంటుంటారు. తద్వారా తమది న్యూసిటీ, వర్తమాన సిటీ చేస్తారు.

"అబ్బా, ఈ వూరు ఎంత అభివృద్ధి అయిందో! యిరవై ఏళ్ళ క్రితం కంపలు,



కుంటలు వున్న స్థలాల్లో కూడా బిల్డింగులైపోయాయి" అని ఒక బాటసారి పొగుడుతుంటె స్థానికుల్లో చాలామంది ఆశ్చర్యపోతుంటారు.

తరాల తరబడి వారి జీవితంగాని, ఇల్లుగాని అభివృద్ధి చెందిన క్రమమే లేకపోగా వలసవచ్చి స్థిరపడే వారి అభివృద్ధి ఆ ఊరి అభివృద్ధిగా సాధారణీకరించడం జరుగుతున్నది.

కోశాంబి రాసిన చరిత్రకు యీ పరిమితి వుంది. అది అతడి వ్యక్తిగత లోపం కాదు. చారిత్రక భౌతికవాదంలోని లోపమే అతడిలోను ప్రతిఫలించింది.

**పాత ఉత్పత్తి సంబంధాలు, కొత్త ఉత్పత్తి సంబంధాలు - చరిత్ర రచన**

ఓల్డుసిటీ, న్యూసిటీ పదాల స్థానంలో పాత ప్రపంచం కొత్త సామాజిక ఉత్పత్తి సంబంధాలు అని చేర్చుకుంటే ఈ మాట వెనుకగల విషయం స్పష్టం అవుతుంది.

పెట్టుబడిదారీ దేశాలు, ప్రాంతాలు సంబంధాలు ఆ అభివృద్ధి, అక్కడి కార్మికవర్గం మొదలైనవి కొత్త ప్రపంచంగా కుల, మత, ప్రీ ఫ్యూడల్, ఫ్యూడల్, పితృస్వామిక సంబంధాలను, ప్రజలను పాత ప్రపంచంగా చూస్తుంది, కార్మికవర్గ వాద చారిత్రక భౌతికవాదం.

**పాత ప్రపంచం - కొత్త ప్రపంచం**

కొత్త ప్రపంచం తాలూకు అభివృద్ధిని దాన్ని అనుభవించే వాళ్ళెవరయినా, ఎంత కొద్దిమందైనా దాన్ని సార్వత్రిక అభివృద్ధిగా ప్రచారం చేస్తుంది. ఈ ఆచరణని పాత ప్రపంచం సహజంగానే వ్యతిరేకిస్తుంది. పాత ప్రపంచం నిలదీసిన ప్రతిసారీ కొత్త సూత్రీకరణలుగా అది తనలో చేర్చుకుంది. ఆ సూత్రీకరణల్ని ఒక సాధారణ స్థాయిలో కాకుండా ఒక పర్టిక్యులారిటీ స్థాయిలోకి కుదించి తనలో చేర్చుకుంది.

రైతాంగ సమస్య, జాతుల సమస్య, లెనిన్-సామ్రాజ్యవాద బలహీన లింకు వద్ద విప్లవాలు వస్తాయనడం, మావో చెప్పిన చైనా నూతన ప్రజాస్వామిక విప్లవం అలా కలుపుకోబడినవే. ఇలా కలుపుకునే క్రమం సహజంగా తన దృక్పథానికి "అనువు"గా సాగుతుంది.

**చారిత్రక భౌతిక వాదం వ్యతిరేకాంశాల పట్ల నిర్వహించిన పాత్ర**

చారిత్రక భౌతికవాదాన్ని గురించి వ్యతిరేకాంశాలపట్ల, తాను విలువ మార్చి రాయదల్చుకున్న చరిత్ర పట్లా బ్రాహ్మణకులం భారతదేశంలో నిర్వహించిన పాత్రని అది నిర్వహించింది. అభివృద్ధి రూపంలో ఆమోదింపజేసే రాజ్యం, పరాయీకరణల్ని తొలగిస్తూ, నిరోధిస్తూ రాసే దృక్పథంకోసం మనం ప్రయత్నించవలసి వున్నది.

కార్మికవర్గవాద చారిత్రక భౌతికవాదం దీన్ని వర్తమాన కర్తవ్యంగా గుర్తించకుండా ఈ చర్చను వాయిదా వేసింది.

రాజ్యానికి పరాయీకరణకు అనువుగా చర్చిస్తూ కమ్యూనిజందాకా ఇవి వుంటాయంటూ సైద్ధాంతిక ప్రతిపత్తినిచ్చింది.

రాజ్యం సమస్యను వాస్తవికాంశాలలో పరిష్కరించకుండా కమ్యూనిజం ఊహల్లో పరిష్కారాలు చూపింది.

# అభివృద్ధి కనువుగా చరిత్ర రాయడమంటే ఏమిటి?

## విజేతలకనువుగా చరిత్ర రాయడమే పరాయీకరణను ఆమోదించడమే

మానవ సమాజ పరిణామక్రమం తాలూకు అభివృద్ధిని వివరించే క్రమంలో ఆ "అభివృద్ధిని గెలుచుకున్న" వాళ్ళ తాలూకు ఆధిక్యత రాజ్యం, పరాయీకరణలుంటాయి. అభివృద్ధికనువుగా చరిత్ర రాయడం అంటే పరాయీకరణ క్రమానికనువుగా చరిత్ర రాయడం కూడా. "అభివృద్ధి చరిత్ర" క్రమానికి అనువుగా చరిత్ర రాయడం అంటే దోపిడివర్గాలకు, కులాలకు, లింగాలకు, జాతులకు, ప్రాంతాలకు అనువుగా, వారు చేసే అణచివేత, పరాయీకరణలకనువుగా చరిత్ర రాయడం కూడా.

"ప్రాచీన భారతదేశ చరిత్ర డి.డి. కోశాంబి పరిచయం"లో ఈ "అభివృద్ధి" విస్తరణాధిక్యతతోపాటు ఆ వర్గాల, ఆర్యుల, బ్రాహ్మణ కులాల ఆధిక్యతకు సైద్ధాంతిక సమర్థనను ఇస్తూ అదే సమయంలో తెగల, గణాల, ద్రావిడుల గిరిజనుల, దళితుల, బౌద్ధుల, స్త్రీల, స్థానికుల అణచివేతను, పరాయీకరణను మౌనంగా ఆమోదింపజేసే క్రమాన్ని గమనించవచ్చు.

**ఆర్యుల వలసలకనువుగా చరిత్ర రాయడం ఎలాంటిదంటే...**

ఆర్యుల వలసలకనువుగా చరిత్ర రాయడం అంటే కోస్తా ఆంధ్ర ప్రజల వలసల కనువుగా తెలంగాణ చరిత్ర రాయడమే. కోశాంబి ఆర్యుల వలసల కనువుగా చరిత్ర క్రమాన్ని రాయడంలో స్థానికుల చరిత్రను, వారి అభివృద్ధి, ఆధిక్యతలను పరాయీకరించి అణిచివేసే క్రమం ఉన్నది.

"అభివృద్ధి" వెంటసాగే రాజ్యం పరాయీకరణ క్రమాల్ని అది దృక్పథం అధ్యయన పద్ధతుల్ని మార్చే తీరుల్ని కాస్త నిర్దిష్టంగా చూద్దాం.

ఢిల్లీ, హైదరాబాద్ వంటి నగరాల్లో చేరిన వలసవాసులు స్థానికుల్ని ఓల్డు సిటీ అంటుంటారు. తద్వారా తమది న్యూసిటీ, వర్తమాన సిటీ చేస్తారు.

"అబ్బా, ఈ వూరు ఎంత అభివృద్ధి అయిందో! యిరవై ఏళ్ళ క్రితం కంపలు,



కుంటలు వున్న స్థలాల్లో కూడా బిల్డింగులైపోయాయి" అని ఒక బాటసారి పొగుడుతుంటె స్థానికుల్లో చాలామంది ఆశ్చర్యపోతుంటారు.

తరాల తరబడి వారి జీవితంగాని, ఇల్లుగాని అభివృద్ధి చెందిన క్రమమే లేకపోగా వలసవచ్చి స్థిరపడే వారి అభివృద్ధి ఆ ఊరి అభివృద్ధిగా సాధారణీకరించడం జరుగుతున్నది.

కోశాంబి రాసిన చరిత్రకు యీ పరిమితి వుంది. అది అతడి వ్యక్తిగత లోపం కాదు. చారిత్రక భౌతికవాదంలోని లోపమే అతడిలోను ప్రతిఫలించింది.

**పాత ఉత్పత్తి సంబంధాలు, కొత్త ఉత్పత్తి సంబంధాలు - చరిత్ర రచన**

ఓల్డుసిటీ, న్యూసిటీ పదాల స్థానంలో పాత ప్రపంచం కొత్త సామాజిక ఉత్పత్తి సంబంధాలు అని చేర్చుకుంటే ఈ మాట వెనుకగల విషయం స్పష్టం అవుతుంది.

పెట్టుబడిదారీ దేశాలు, ప్రాంతాలు సంబంధాలు ఆ అభివృద్ధి, అక్కడి కార్మికవర్గం మొదలైనవి కొత్త ప్రపంచంగా కుల, మత, ప్రీ ఫ్యూడల్, ఫ్యూడల్, పితృస్వామిక సంబంధాలను, ప్రజలను పాత ప్రపంచంగా చూస్తుంది, కార్మికవర్గ వాద చారిత్రక భౌతికవాదం.

**పాత ప్రపంచం - కొత్త ప్రపంచం**

కొత్త ప్రపంచం తాలూకు అభివృద్ధిని దాన్ని అనుభవించే వాళ్ళెవరయినా, ఎంత కొద్దిమందైనా దాన్ని సార్వత్రిక అభివృద్ధిగా ప్రచారం చేస్తుంది. ఈ ఆచరణని పాత ప్రపంచం సహజంగానే వ్యతిరేకిస్తుంది. పాత ప్రపంచం నిలదీసిన ప్రతిసారీ కొత్త సూత్రీకరణలుగా అది తనలో చేర్చుకుంది. ఆ సూత్రీకరణల్ని ఒక సాధారణ స్థాయిలో కాకుండా ఒక పర్టిక్యులారిటీ స్థాయిలోకి కుదించి తనలో చేర్చుకుంది.

రైతాంగ సమస్య, జాతుల సమస్య, లెనిన్-సామ్రాజ్యవాద బలహీన లింకు వద్ద విప్లవాలు వస్తాయనడం, మావో చెప్పిన చైనా నూతన ప్రజాస్వామిక విప్లవం అలా కలుపుకోబడినవే. ఇలా కలుపుకునే క్రమం సహజంగా తన దృక్పథానికి "అనువు"గా సాగుతుంది.

**చారిత్రక భౌతిక వాదం వ్యతిరేకాంశాల పట్ల నిర్వహించిన పాత్ర**

చారిత్రక భౌతికవాదాన్ని గురించి వ్యతిరేకాంశాలపట్ల, తాను విలువ మార్చి రాయదల్చుకున్న చరిత్ర పట్లా బ్రాహ్మణకులం భారతదేశంలో నిర్వహించిన పాత్రని అది నిర్వహించింది. అభివృద్ధి రూపంలో ఆమోదింపజేసే రాజ్యం, పరాయీకరణల్ని తొలగిస్తూ, నిరోధిస్తూ రాసే దృక్పథంకోసం మనం ప్రయత్నించవలసి వున్నది.

కార్మికవర్గవాద చారిత్రక భౌతికవాదం దీన్ని వర్తమాన కర్తవ్యంగా గుర్తించకుండా ఈ చర్చను వాయిదా వేసింది.

రాజ్యానికి పరాయీకరణకు అనువుగా చర్చిస్తూ కమ్యూనిజందాకా ఇవి వుంటాయంటూ సైద్ధాంతిక ప్రతిపత్తినిచ్చింది.

రాజ్యం సమస్యను వాస్తవికాంశాలలో పరిష్కరించకుండా కమ్యూనిజం ఊహల్లో పరిష్కారాలు చూపింది.

**చారిత్రక భౌతికవాదం అభివృద్ధి వర్గాల సిద్ధాంతం**

ఈ "అభివృద్ధి చరిత్ర"కు సామ్రాజ్యవాద బలహీన లింకువద్ద విప్లవాలు బద్దలవుతాయని రాజ్యంలోకి రావడానికి అనువుగా అంచనా వేయబడింది. ఈ సూత్రీకరణతో "అభివృద్ధి చరిత్ర" దృక్పథంలోని తప్పు దేశాల స్థాయిలో సవరించబడింది. అధ్యయన పద్ధతిలో "అభివృద్ధి చరిత్ర" దృక్పథమే చారిత్రక భౌతికవాదంగా, పలు విశ్లేషణలలో కొనసాగుతోంది.

**వెనకబడిన ప్రపంచానికి కొత్త సిద్ధాంతం కావాలి-చారిత్రక భౌతికవాదం కాదు**

మానవ సమాజ అభివృద్ధి కోరే వారెవరైనా సరే మానవ సమాజం అంతదాకా సాధించిన అభివృద్ధిమేరకైనా వెనకబడిపోయిన ప్రజలు, ప్రాంతాలు ముందుగా ముందుకు సాగాలి అని కోరుకుంటారు. కార్మికవర్గ చారిత్రక భౌతికవాదం దీన్ని తలకిందులు చేసి ఆచరిస్తుంది.

చారిత్రక భౌతికవాదం, మార్క్సిజం అభివృద్ధి చెందిన ఉత్పత్తి శక్తుల సిద్ధాంతం. అది వెనకబడిన ఉత్పత్తి శక్తులను ఒక శక్తిగా గుర్తించదు. వాటి సమస్యలను ప్రాధాన్యతతో స్వీకరించదు. అభివృద్ధి చెందిన ఉత్పత్తి శక్తుల సిద్ధాంతానికి అనువుగా వాటిని కుదిస్తారు. అనుబంధంగా మారుస్తారు. అనుచరులుగా చేస్తారు. అందువల్ల చారిత్రక భౌతిక వాదం పాత ప్రపంచం, పాత సామాజిక సంబంధాలు మొట్టమొదట మార్చవలసి వున్నది అనే అంశాన్ని గుర్తించ నిరాకరిస్తుంది.

వ్యవసాయిక దేశాల్లో నూతన ప్రజాస్వామిక విప్లవాలు అనే మావో చేర్పుద్వారా కొంత మేరకు చారిత్రక భౌతికవాదం సవరించబడింది. అయినప్పటికీ అధ్యయన పద్ధతిలో రాజ్యాధికారానికి అనువుగా "అభివృద్ధి చరిత్ర"కు అనువుగానే కార్మికవర్గవాద చారిత్రక భౌతికవాద దృక్పథం కొనసాగుతున్నది. అందువల్ల యూరప్ అమెరికాల ఆధిపత్య వాదాన్ని అమోదించే, వ్యతిరేకించే రూపాల్లో తిరిగి అభివృద్ధి చెందిన ఉత్పత్తి శక్తుల సిద్ధాంతాన్నే ప్రధానం చేస్తుంది.

**వెనుకబడిన ప్రజలకు చేయూతనిచ్చే సిద్ధాంతాలు కావాలి**

పాత సామాజిక సంబంధాలు, పాత ప్రపంచం ముందు మారాలని కోరే పితృస్వామిక నిర్మూలన కుల నిర్మూలనా రూపాల్లో సాగే మానవ పరిణామ అభివృద్ధి క్రమంపట్ల అభివృద్ధి నిరోధక ఆచరణను కొనసాగించే స్థితిలో కూరుకుపోయింది.

కొత్త ప్రపంచంలో కొత్త సామాజిక సంబంధాల్లో ముందుకు సాగేవారే మరింత అభివృద్ధి చెందే క్రమాలే సార్వత్రిక సత్యాలుగా ప్రదర్శింపబడతాయి.

**సిద్ధాంతంతో మెజారిటీని మైనారిటీగా, అనుబంధంగా మార్చిన తీరు**

పాత ప్రపంచంలోని పీడిత స్త్రీలు, కులాలు ఓల్డు సిటీలోని స్థానికుల అనగా మెజారిటీ, ప్రజల అభివృద్ధి ఆగిపోయిందనే విషయం, అణచివేతకు పరాయీకరణకు ఈ కొత్త ప్రపంచంలోని ప్రజల వలసవాదుల పోటీకి గురైపోవాల్సిన అనివార్యత



ఏర్పడింది. ఈ విషయాలు ప్రపంచ ప్రధాన చారిత్రక వాస్తవాలుగా కాకుండా పోయాయి.

వీళ్ళు ఒక పద్ధతి ప్రకారం మెజారిటీ స్థాయినుండి మైనారిటీకి, సార్వత్రిక స్థాయి నించి పర్టిక్యులారిటీకి విలువలు మార్చబడతారు. కొద్దిమంది ప్రజలు, వారి అవసరాలు, వారి తాలూకు సామాజిక మార్పులు మెజారిటీ ప్రజల అభివృద్ధిగా ప్రదర్శించబడతాయి.

అభివృద్ధి కాకుండా వుండిపోయిన మెజారిటీ స్థానిక ప్రజలు, మెజారిటీ అయిన పాత ప్రపంచం, పాత సామాజిక సంబంధాల్లోని ప్రజలు అభివృద్ధి అనే యూనివర్సల్‌లో ఒక పర్టికులర్‌గా మార్చబడతారు.

**వలసవాదుల అభివృద్ధే సామాజిక అభివృద్ధా?**

మైనారిటీగా అభివృద్ధి చెందిన వలసవాసులు, అభివృద్ధి భోక్తలు మొత్తం ప్రజలుగా మెజారిటీగా దృక్పథం అధ్యయన పద్ధతి పరివర్తన చెందుతుంది.

ఇది వివిధ రూపాలలో సాగుతుంది. మావో దీన్ని ఉత్పత్తి శక్తుల అభివృద్ధి సిద్ధాంతం రూపంలో, లీషావ్ చీని విమర్శించే రూపంలో వ్యతిరేకిస్తూ ఉత్పత్తి సంబంధాల అభివృద్ధి రూపంలో ప్రజల దృక్పథాన్ని వ్యక్తం చేశాడు. ఇప్పటికీ ఇది పూర్తిస్థాయిలో ఆచరించబడ్డంలేదు.

అభివృద్ధి తాను పాతదానికన్నా యూనివర్సల్‌ని అని ప్రదర్శన చేస్తుంది. ఆ పేరిట ఆ వూరిపై ఆ అభివృద్ధికి వెనకబడిన ప్రజలపై, కులాలపై, లింగాలపై, ప్రాంతాలపై అభివృద్ధి చెందిన ప్రజల, కులాల, లింగాల, ప్రాంతాల తాలూకు రాజ్యం పరాయీకరణ "విస్తరణ రూపం"లో సాగుతుంది.

అదే సమయంలో ఆ అభివృద్ధి మాత్రం న్యూసిటీగా, కొత్త ప్రపంచంలోని, అభివృద్ధి చెందిన ప్రాంతాల్లోని, కులాల్లోని, లింగాల్లోని కొందరికే హక్కు భుక్తంగా వుంటుంది.

**ప్రశ్నించాల్సిన దాన్ని అధికారంలో పెట్టారు**

ఇది ప్రశ్నించబడవలసిన స్థితిలో కాకుండా సహజ క్రమం, నిజమైన అభివృద్ధిగా విలువను సమకూర్చుతుంది. కోశాంబిలోను దీన్ని చూడవచ్చు. సమాజంయొక్క సహజ ఎన్నిక, అస్తిత్వంకోసం పోరాటంలో గెలిచిందే మిగులుతుందనేదిగా గతితర్కాన్ని మార్చేసే డార్విన్ థీరీని తన అధ్యయన పద్ధతిలో సాగిస్తాడు కోశాంబి.

**పరాయీకరణ జరుగుతున్న అనేక రూపాలు**

ఆ యా మతాల, కులాల, వర్గాల, లింగాల, చరిత్రల, తత్వశాఖల అభివృద్ధిని అనుసరించి రాసే చరిత్రలో, తత్వశాస్త్రాల్లో నిజమైన స్థానికుల్ని ఓల్డుసిటీగా మార్చేస్తూ అభివృద్ధిని అందుకోవాల్సిన ప్రజల్ని పాత ప్రపంచంగా వారి అభివృద్ధి గురించిన దృక్పథం అలక్ష్యం చేస్తూ దాన్ని పర్టికులర్‌గా మార్చేస్తూ అనివార్యంగా వలసవాదుల, అభివృద్ధి భోక్తల, సామ్రాజ్యవాదుల ఆధిక్యతా చరిత్రగా ప్రాపంచిక దృక్పథాన్ని ఆచరణలో పెడ్తుంది. మార్పులకనువుగా మారని జీవులు నశిస్తాయి అనే డార్విన్ థీరీని భ్రష్టరూపంలో సమాజానికి అన్వయిస్తూ వెనకబడిన సమాజం క్రమంగా అదే నశిస్తుంది

అనే స్థాయిలో ఆచరిస్తోంది ఈ దృక్పథం.

అభివృద్ధి తాను పాతదానికన్నా యూనివర్సల్‌ను అనే ప్రదర్శన పేరిట "అభివృద్ధి విస్తరణ" రూపంలో పరాయీకరణ అణచివేత సాగిస్తుంది. ప్రస్తుతం ప్రజలందరి అభివృద్ధిపేర 25 శాతం జనాభా నూతన వర్గాలుగా కులాలుగా ఎదిగాయి. వారి అభివృద్ధే సమాజ అభివృద్ధిగా, వారి అవసరాలే సామాజిక అవసరాలుగా ప్రచారం చేయబడుతున్నాయి.

## చారిత్రక అనివార్యత సిద్ధాంతంలోని ప్రధాన లోపాలు

ఒక సంఘటన ఎలా జరిగిందో నిర్ధారించే బాధ్యత కూడా చరిత్ర శాస్త్రంపై వుంటుంది. తద్వారా ఆర్యుల ప్రస్థానాలకు, బ్రాహ్మణ కులాధిక్యతకు, అలెగ్జాండర్, అశోకుల క్రమాలకు, 14వ శతాబ్దం నించి యూరప్ దేశస్థులు సాగించిన వలస క్రమాలకు అనువుగా కారణాలు వెతకాల్సి వస్తుంది.

ఆ క్రమంలో ఆఫ్రికా, ఆసియా, రెడ్ యిండియన్స్ అమెరికా, ఆస్ట్రేలియా ఖండాలకు చేరి స్థానికుల్ని దోచి, చంపి, బానిసల్ని చేసి స్థిరనివాసాలు, సామ్రాజ్యాలు ఏర్పరచుకున్న అమానుష ఆచరణలకు ఆమోదిత విలువను సంతరించిపెడుతుంది. ఈ అమానుష దోపిడీ పీడనలకు వాళ్లు ప్రపంచానికి పరిహారం చెల్లించాల్సి వుంటుంది.

గ్రామీణ ప్రాంతాలలో భూస్వాములు వసూలు చేసిన దండుగలు లాక్కున్న భూములు వాపసు అడిగినట్టుగా ప్రపంచాన్ని దోపిడీ చేసి పెరిగిన యూరప్ భూస్వామ్య పెట్టుబడిదారీ సంపద వెంటనే ప్రపంచ ప్రజల పరం చేయాలని డిమాండ్ చేయలేకపోయింది.

ఈ అంశాన్ని ఊహాత్మక సుదూర కమ్యూనిజం పరికల్పనదాకా వాయిదా వేసింది.

ఈ సంపదను స్థానిక కార్మికవర్గం తీసుకోవాలని చెప్పింది. ఇలా నాల్గు ఖండాల్ని ఓల్డ్ సిటీగా, పాత ప్రపంచంగా, శూద్రులుగా మార్చేస్తూ కొత్తగా వచ్చిన (పెట్టుబడిదారుడు, కార్మికవర్గం)వాడే తన అభివృద్ధే అందరి అభివృద్ధి అని దబాయించే ఆచరణ సాగింది.

## చారిత్రక భౌతిక వాదాన్ని తలకిందులు చేసిన అంబేద్కరిజం, ఫెమినిజం

ఈ సోకాల్డు "అభివృద్ధి" చరిత్ర విస్తరణ రూపంలో పరాయీకరణ అణచివేత అమలు జరగడం వుంటుంది. పరిహారాన్ని కమ్యూనిజం వూహకు వాయిదా వేయడం యధాతథవాదమే తప్ప చరిత్ర పునర్నిర్మించడం కాదు. ఇలాంటి చారిత్రక భౌతిక వాదాన్ని అంబేద్కరిజం, ఫెమినిజం తలక్రిందులు చేసింది.

## భారతీయుల గొప్ప సిద్ధాంతాలు-ఇతరులకు ఆదర్శం

భారతీయులు వేల ఏళ్ళ నష్టానికి రిజర్వేషన్ల రూపంలో పరిహారం సాధించారు. దీన్ని ఆమోదించే సంస్కృతి, భావజాలం సృష్టించబడింది. అంబేద్కర్ నేతృత్వంలో సాగిన భారతీయుల ఆచరణ ఎంతో వాస్తవికమైనది, మనిషిని ప్రాథమికం చేసే దృక్పథం నుంచి యిది సాధ్యపడింది.



## చరిత్రను ఎలా రాయాలి?

మనిషిని ప్రాథమికం చేయడం సాగితే వర్గాల చరిత్ర పేరిట దాని అత్యున్నత అభివృద్ధి జరిగినచోటు నుంచే మరింత అభివృద్ధికి కృషి చేయాలనే దృక్పథం అదృశ్య మవుతుంది.

అభివృద్ధికి వెనకబడి అట్టడుగు స్థాయిలో జీవిస్తున్న ఆటవిక, బానిస, భూస్వామ్య, రాజరిక, పితృస్వామిక కులవ్యవస్థలలోని ప్రజల జీవన ప్రమాణాలు పెరగడం ఎలా అనే దృక్పథంతో మార్క్సు, ఎంగెల్సుల దృక్పథం, వ్యూహం, ఎత్తుగడలు ఆచరణ సాగి వుండేది.

## హెగెల్ నుండి గతితర్కం తీసుకోవడం వల్ల జరిగిన నష్టాలు

హెగెల్‌కు భావజాల ఆధిక్యతపై వుండిన ఆశే ఆయన నుంచే తీసుకున్న గతితర్కం వలెనే మార్క్సు, ఎంగెల్సులలో రాజ్యం, రాజ్యాధికారంపై ఆశగా పరివర్తన చెందిన క్రమంలో చారిత్రక భౌతికవాదంలోని లోపాలు, ఇంగ్లాండు వగైరాల్లో విప్లవాలు వస్తాయనే దృక్పథం ఆచరణలు ఉత్పన్నం అయ్యాయేమో పరిశీలించవలసి వున్నది.

ఏమంటే ఏం చెప్పినా వారికి రాజ్యాధికారంలోకి రావడం వాస్తవాచరణలో ప్రాథమిక అంతిమలక్ష్యం కావడంతో పాత ప్రపంచం, పాత సామాజిక సంబంధాలు ముందు మార్చడంవల్ల సమాజం పరివర్తన చెందుతుందే గాని అధికారం హస్తగతం అయ్యే గ్యారంటీ లేదు. ఈ ఆచరణ సామాజిక మార్పుల్ని వేగవంతం చేస్తుందేగానీ ఫలానా వాళ్లే రాజ్యాధికారంలోకి రావాలనే గ్యారంటీ యివ్వదు. అలా రాజ్యాధికారానికి రావాలనుకునేవారి ఆశల్ని సమాజం ప్రాథమికం అంటూ వాయిదా వేస్తుంది. ఫెమినిజం అభివృద్ధి కనువుగా చరిత్రను రాస్తే జరిగిన లోపాలు ఏమిటో నిర్ధారించిన తీరును ఫెమినిజం అధ్యాయంలో చూశాం.

అధికారం ప్రాథమికం అనుకునేవాళ్ళు ప్రతి సమస్యనూ, ప్రతి పరిష్కారాన్ని వక్రీకరించడం ద్వారానే తమ అధికారాన్ని ఉత్పన్నం చేసికోవాల్సిన స్థితి ఏర్పడుతున్నది. దీన్ని అనివార్య క్రమంగా రాజ్యాధికారం ప్రాథమికం చేస్తూ చారిత్రక భౌతికవాదం నిండా ఈ వ్యక్తీకరణే విశ్లేషణగా అధ్యయన పద్ధతిగా పరివర్తన చెందుతుంది. అదనపు మిగులు, దాన్ని పొందే వర్గాలు వగైరా పరాయీకరణలే చరిత్ర అని చరిత్ర నిర్వచనాన్ని మార్చడం అవసరం అవుతుంది.

## విరుద్ధాంశాల్లో మొదటి అంశాన్నే రెండు అంశాలుగా చెప్పే తీరు

రాజ్యాధికారం, అభివృద్ధి చరిత్ర కనువుగా అధ్యయన పద్ధతి సాగడంలో వైరుధ్యంలోని మొదటి అంశమే రెండు అంశాలుగా నిర్ధారించే ప్రయత్నంవల్ల వలస వచ్చిన స్థానికేతర అభివృద్ధే ఆ ఊరి అభివృద్ధిగానూ కొత్త ప్రపంచం, కొత్త కార్మికవర్గం అభివృద్ధే అందరి అభివృద్ధిగానూ ప్రచారం చేయబడుతుంది. వారు మొదటి అంశం. వారి శత్రువులు రెండో అంశం అంటారు.

## వాడుకోవడం అనే సమస్య

పర్యవసానంగా పాత స్థానికులు, పాత ప్రపంచం పాత సామాజిక సంబంధాల్లోని

ప్రజలు వైరుధ్యంలోని రెండో అంశంగానయినా కాకుండా మొదటి అంశానికి ఉపకరించే ఒక పర్టికులర్‌గా కుదించబడతారు. వారిని తమ అధికార క్రమానికి "వాడుకోవడం"కోసం వ్యూహం, ఎత్తుగడలు తీసుకోబడతాయి.

**ఒక మొత్తంగా తీసుకోవలసిన ప్రజలను పునాదిరాళ్ళను చేశారు**

సమాజం తాలూకు ఒక మొత్తంలో భాగంగా తీసుకోబడవలసిన వాళ్లూ, లక్ష్యాలుగా ఉండాల్సినవాళ్లు రాజ్యాధికార క్రమంకోసం సాధనాలుగా, అడుగున పడేసే పునాదిరాళ్ళలా వాడుకోబడుతున్నారు.

**సిద్ధాంతాల మీద ఆధారపడి వాస్తవాలను అణచివేసిన తీరు**

ఈ క్రమాన్ని వాస్తవాలమీద కాకుండా సోషలిజం, కమ్యూనిజం అనే పరికల్పనలమీద నిలబడి, అభివృద్ధి పేరిట గతంలోని వర్తమానాన్ని విశ్లేషించే చారిత్రక భౌతికవాదమే ఉత్పన్నం చేస్తున్నది.

**వైరుధ్యంలోని ఒక అంశానికి అనువుగా చరిత్ర రాయడంలో ఒక సౌకర్యం వుంది**

గతాన్ని విశ్లేషించడంలో ఎన్ని తప్పులున్నా అది గెలిచినవాళ్ళ అభివృద్ధి పరిణామ క్రమానికి అనువుగా వుంటుంది. శాస్త్రీయంగా వున్నట్టు కనపడుతుంది. చారిత్రక భౌతికవాద రూపంలోని రాజ్యవాద వర్గ విశ్లేషణ శాస్త్రీయంగా కనబడటానికి యిదొక కారణం.

**జర్మనీ, ఫ్రాన్స్, ఇంగ్లాండుల్లో విప్లవాలు వస్తాయనే
అంచనాలు ఎందుకు తప్పయ్యాయంటే**

వర్తమానంలో ఏది గెలిచేదో ఏది అభివృద్ధో ఒక పట్టాన తేలదు. ఒక అంశం అప్పుడే గెలవవచ్చు. మళ్లీ ఓడనూవచ్చు. ఇలా నిరంతరం సాగడమే చరిత్ర. సామాజిక సమస్యలను వైరుధ్యాలను వర్తమానంలో విశ్లేషించడం కష్టం. ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీల్లో విప్లవాలు వస్తాయన మార్క్సు, ఎంగెల్సుల అంచనా అందుకే తప్పయింది.

**దీనికి పరిష్కారమేమిటి?**

దీనికి పరిష్కారమేమంటే సమాజంలోని ఒక అంశాన్ని కాకుండా మొత్తం చలనాన్ని దాని సమగ్రతలో తీసుకుంటే విశ్లేషణ ఎంతో సులువవుతుంది.

అభివృద్ధి తాలూకు చరిత్ర క్రమం అనే దృక్పథంలో వలసతత్వం, అభివృద్ధి తాలూకు చరిత్ర క్రమం అనే దృక్పథంలో వలసతత్వం, అభివృద్ధి విస్తరణ రూపంలో ఇతర ప్రాంతాలని, అనుభవాల్ని, సంస్కృతుల్ని, కులాల్ని, చరిత్రల్ని తత్వశాస్త్రాల్ని పరాయీకరించే కనిష్టీకరించే వలస అభివృద్ధి విస్తరణ రూపంలోని పరాయీకరణ తాలూకు స్వీయ మానసిక ధోరణి వుంటుంది.

**అభివృద్ధిని అభివృద్ధిగా అంగీకరించడంలో
దాని ఆధిక్యతకు లొంగిపోయే క్రమం కూడా ఉంటుంది**

ఒకదాన్ని అభివృద్ధి అని అంగీకరించడంలో కూడా దాని రాజ్యాధిక్యతకు



లొంగిపోయే క్రమం వుంటుంది. ఉదా॥కు ఒక ధనికున్ని, భూస్వామిని, పారిశ్రామికవేత్తను అతని అభివృద్ధిని గొప్ప అభివృద్ధి అని అంగీకరించడంలోనే వారి ఆధిక్యతను గుర్తించి లొంగిపోయే క్రమం కూడా కొనసాగుతుంది. అందువల్ల వారి అభివృద్ధిని అభివృద్ధి కాదని దోపిడీ అని, పరాయీకరణ అని చెప్పడం ద్వారానే వారి ఆధిక్యతను నిరాకరించడం జరుగుతుంది.

భారత కమ్యూనిస్టు ఉద్యమం సోవియట్ రష్యా అభివృద్ధి చెందిందని అంగీకరించడం వల్ల 1967దాకా సోవియట్ ఆధిపత్యానికి లొంగిపోయింది. అలాగే చైనా అభివృద్ధి చెందిందని అంగీకరించడం వల్ల 1967 నుంచి అదనంగా చైనాకు ఈ క్రమంలోనే లొంగిపోయిన ఆచరణ కొనసాగిస్తున్నది. విప్లవాలు ఇలా ఇతర దేశాలు ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని అభివృద్ధిగా అంగీకరించడంలో భూస్వామికి లేదా కలెక్టరుకు లొంగిపోయిన క్రమాలు కూడా సైకాలజీలో కొనసాగుతూనే వచ్చాయి. దీన్నే గిట్టని వాళ్ళు రష్యా, చైనాలకు ఉపగ్రహాలు అని అంటారు. చైనాలో వాన పడితే ఇక్కడ గొడుగు పట్టుకుంటారు అని అనడం ఈ క్రమాల వల్లే సాధ్యపడింది.

ఇపుడా దేశాల్లో సోషలిజం, కమ్యూనిజం పరికల్పనలు అబద్ధాలయ్యాయనే వాళ్ళను విమర్శిస్తూ కొత్త పరికల్పనలు చేయకుండా పాత వాటినే పట్టుకు వేళ్ళాడ్డంలో కూడా భావదాస్యం, భావదారిద్ర్యం వుంది.

**నేటి సైన్సును నిరాకరించలేకపోతే గ్లోబలైజేషన్ పరిణామాలు అనివార్యం**

నేటి సైన్సు టెక్నాలజీలను అభివృద్ధి అని అంగీకరించడంతో అవి విస్తరణ పొందే క్రమంలో దాని రాజ్యం పరాయీకరణల క్రమాలు కూడా అంతర్లీనంగా ఆమోద ముద్ర వేయించుకుంటాయి. సైన్స్ టెక్నాలజీలను వారి నించి స్వీకరించే రూపంలో ఆయా దేశాలు వలస దేశాలుగా స్వభావాన్ని సంతరించుకోవడం చూస్తూనే వున్నాం

**సార్వజనీన అభివృద్ధి కొందరి అభివృద్ధిగా వక్రీకరించే తీరు**

అట్లే మైదాన ప్రాంతాల వారిది అభివృద్ధి అనడంలో అటవీ ప్రాంతాలు ఆ అభివృద్ధి విస్తరణ రూపంలో వలసలుగా స్వభావాన్ని సంతరించుకున్నాయి. ఆ ఊరి అభివృద్ధి అనే మాట అక్కడికి వలసవచ్చి స్థిరపడే ప్రజల అభివృద్ధిగా స్వభావం మారుతుంది. గిరిజనుల అభివృద్ధి ఆ ఊరి అభివృద్ధిగా కాకుండా "గిరిజనుల అభివృద్ధి" అనే పర్టికులర్‌గా పిలువబడుతుంది.

అట్లే 15 శాతం అభివృద్ధి నిరోధక దోపిడీ కులాల అభివృద్ధి హిందూ సమాజం మొత్తం అభివృద్ధిగాను, 70 శాతం ఎస్సీ/బీసీ/ఎస్టీ ప్రజల అభివృద్ధి ఒక పర్టికులర్ అభివృద్ధిగాను పిలువబడుతుంది. అలా మాల మాదిగల అభివృద్ధి ఆ ఊరి అభివృద్ధిగా కాకుండా హరిజనుల అభివృద్ధిగా పిలువబడుతుంది.

ఈ దృక్పథంనించే అశేష ప్రజల అభివృద్ధి పథకాలు బడుగువర్గాల సంక్షేమ పథకాలు అనే పర్టికులర్ అభివృద్ధిగా పిలువబడుతుంది. ఈ దృక్పథంనించే కొందరి అభివృద్ధే సామాజిక అభివృద్ధిగా పేర్కొనబడుతున్నది. చారిత్రక భౌతికవాదం తాలూకు తాత్విక భూమికలోని మౌలికమైన లోపాల్లో యిది ఒకటి.

**తమ అనుభవంలోకి రాని అభివృద్ధి అభివృద్ధే కాదు - ఎందుకంటే...**

ఒక అభివృద్ధిని అభివృద్ధి అని తన అనుభవంలోకి, సంబంధంలోకి రాని ప్రజలు, ప్రాంతాలు, కులాలు, లింగాలు పిలవడం అనవసరమైన విషయం. అలా పిలిస్తే పైసా పెట్టుబడి లేకుండానే అభివృద్ధి తాలూకు రాజ్యానికి లొంగిపోయి, లోకువై యిన్ఫీరియారిటీకి లోనవుతారు. ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం కోల్పోతారు.

"వాడికి ఎన్ని మిద్దెలుంటేంది? ఎంత పెద్ద కులమైతే ఏంది? ఎన్ని కోట్లుంటేంది? ఎంత టెక్నాలజీ వుంటేంది? నాకేం వస్తదీ? నాకేం లాభం? వాడ్ని నేనెందుకు గౌరవించాలే? వాడు నాకేమైనా పంచి ఇచ్చిండు గనుకనా గౌరవించి నమస్తే పెట్టడానికి? వారిలో మానవత్వం వుండాలి. నాలాంటివాళ్ళకు సాయం చెయ్యాలి. అలా సాయం చేయడం ముందు బాగుపడ్డవాళ్ళ కనీస బాధ్యత. అది పొందడం నా హక్కు" అనే సామాన్యుడి దృక్పథమే శాస్త్రీయమైనది.

అభివృద్ధి ఫలితాలు పంచి ఇవ్వబడని ప్రాంతాలు, ప్రజలు, కులాలు, లింగాలు ఆ అభివృద్ధిని అభివృద్ధిగా గౌరవించడంలో తనకు తాను పరాయీకరణ పొందడం వుంది".

**వెనకబడిన ప్రజలు ఆలోచించాల్సిన తీరు ఎలా వుండాలి?**

ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాన్స్, అమెరికా, రష్యా, చైనాల విప్లవాల అభివృద్ధీ మాకేం పెట్టింది? అభివృద్ధికి వెనకబడిన మమ్మల్ని ఆ స్థాయికి తీసుకువచ్చే త్యాగ సంసిద్ధత లేకుండా, ఆ దృక్పథమే లేకుండా ఎవని పీతి బొత్తకు వాడే తినే అభివృద్ధిగా భౌతిక సుఖవాదులుగా అభివృద్ధి చెందితే తోటి మానవుడిపట్ల మానవత్వం మరిచేస్తే వాళ్ళను నేనెందుకు గౌరవించాలి? వాళ్ళకు నేను ఎందుకు సహకరించాలి?" అని ఆస్ట్రేలియా ఇండియాల ఆదివాసి ఆలోచించడం శాస్త్రీయమైంది.

అలా పంచి ఇవ్వబడని ప్రజలు, ప్రాంతాలు, కులాలు, దాన్ని అభివృద్ధిగా అంగీకరిస్తే పరాయీకరణ, భావదాస్యం అవుతాయి.

**టెక్నాలజీ, సేవ, విద్య ఎంతయినా అందించవచ్చు**

రాజకీయ, నైసర్గికాల సరిహద్దులు, అడ్డుగోడలు కాని ఇతర రూపాల్లో ముందు అభివృద్ధి చెందినవాళ్లు మిగిలిన ప్రపంచానికి చేయూతనిస్తూ బౌద్ధం, క్రైస్తవం ఆచరించినట్టుగా విద్య, వైద్య సేవలతోపాటు అదనంగా ఉచితంగా టెక్నాలజీ, ఆహార, సరుకుల సరఫరా మొదలైనవి అందించడం జరిగితే అది అభివృద్ధి చెందిన వారిలోని మానవ సౌభ్రాతృత్వాన్ని తెలుపుతుంది.

ఆ మేరకు వారి అభివృద్ధి ప్రజల అనుభవంలోకి, సంబంధంలోకి వస్తుంది. దాన్ని అభివృద్ధి అని పిలవడంలో "సంబంధం", ఆచరణ ప్రాథమికంగా ఉంటుంది.

"అభివృద్ధి" తాలూకు భౌతిక ప్రయోజనాలు చేరకుండా అభివృద్ధి అనే భావం చేరుతోందంటే అది కేవలం సమాచార భావజాల చైతన్యం ద్వారానే అలా తెలిసే "సంబంధం"లోకి వస్తున్నది.



**భౌతిక ప్రయోజనాలు, క్రమాలు చేరకుండా కేవలం భావాలు చేరితే అందుకు భిన్నమైన క్రమాలు ఉత్పన్నమవుతాయి**

ఒక సినిమా చూసిన అతడు స్నేహితుడితో ఆ సినిమా బాగాలేదు అని చెప్తే సినిమా చూడకుండానే ఆ నిర్ణయాన్ని ఆమోదిస్తుంటాడు. ఆ సినిమాని బాగాలేదని చెప్పడంలో అతని అభిరుచులు అభిమానాలు ఉంటాయి. నీవాసినిమా చూస్తే నీకు చాలా బాగుంది అనిపించవచ్చు. సినిమా చూడకుండా సినిమాకు సంబంధించిన భావం ముందు చేరితే సినిమా అతడు చూశాడు కాని నిన్ను చూడకుండా చేశాడు. ఇలా భావం ముందుకు చేరితే భిన్నమైన క్రమాలు ఉత్పన్నమవుతాయి. ఇలా భౌతిక ఆచరణ, భౌతిక ప్రయోజనాలు ముందు చేరకుండా భావం మాత్రమే చేరితే కొన్ని భిన్న సామాజిక క్రమాలు ఉత్పన్నమవుతాయి.

**అవేమంటే...**

1. ఆ యా పర్టికులర్, యూనివర్సల్, ఐక్యత, ఘర్షణ పరిమాణాత్మక మార్పులేవీ ఇక్కడ సాగకుండానే వాటి తాలూకు తీర్పులు, ఫలితాలు భావజాలం సంశ్లేషణగా జతపడుతుంది.
2. తానేమీ కష్టపడకుండానే వారసత్వంగా జ్ఞానంగా దాన్ని అవలీలగా పొందుతారు.
3. అరవై ఏళ్ల తండ్రికన్నా నలభై ఏళ్ళ కొడుకు వయస్సు రీత్యా, భౌతిక అనుభవాల రీత్యా వెనకబడ్డా జ్ఞానంలో ముందుకు నడవడం దీనివల్లే సాధ్యమవుతున్నది.
4. ఎంతో వ్యయ ప్రయాసలతో ఈ క్రమం చేరడం సాధ్యమైంది అని ఎంతగా వారికి చెప్పినా మొదటి వాడంతటి వ్యయప్రయాసలేమీ లేకుండానే దాదాపు అనాయాసంగా తీర్పుకు చేరే క్రమం ఉత్పన్నమవుతుంది.
5. అది మంచిదో చెడ్డదో సరయినదో కాదో నిర్ణయించుకోడానికి ప్రయోగాత్మకంగా భౌతిక ఆచరణ సరిపోతుంది.
6. విప్లవాలు మునుపటికన్నా తక్కువ ఆచరణతో తేలికగా విజయవంతం అవ్వాలి.
7. అభివృద్ధి తాలూకు భౌతిక ప్రయోజనాలు ముందు చేరకుండా భావం మాత్రమే చేరడం వలన అభివృద్ధి క్రమానికి అనుకూలంగా, అదే సమయంలో దానిలోని రాజ్య క్రమానికి వ్యతిరేక దిశలో తత్వవేత్తలుగా మారతారు.
8. పెట్టుబడిదారీ అభివృద్ధి తాలూకు భౌతిక ప్రయోజనాలు చేరకుండా, భావం మాత్రమే చేరడం వలన ప్రజలు, కార్మికులు, మార్పు తత్వవేత్తలుగా మారుతారు.
9. భౌతిక ఆచరణ అవసరం లేకుండానే అందించబడిన తీర్పు అది మంచిదో చెడ్డదో, సరయినదో కాదో నిర్ణయించుకోవాలంటే తనకు అందిన తీర్పును అందని తీర్పుగా (ప్రయోగాత్మకంగానైనా) భావించవలసి వుంటుంది.

10. ఆ తీర్పును అనుసరించి, ఆ ప్రయోగాత్మక ఆచరణను అనుసరించి కొత్త క్రమాలు సాగవచ్చు.
11. ఆ సిన్మా బాగాలేదు అనే భావం ముందు చేరినపుడు ఆ సినిమాను చూసి సొంతంగా ఆ తీర్పుకు చేరుకోనవసరం లేకుండా పోతుంది.
12. ఆ సిన్మా చూస్తే ఆ తీర్పును అనుసరించి కొత్త క్రమాలు సాగవచ్చు. అరే బాగానే వుందే ఆయనెందుకు బాగాలేదంటున్నాడు అంటూ తీర్పుపై తీర్పును చేరుతాడు.
13. ఇలా అభివృద్ధి తాలూకు భౌతిక ప్రయోజనాలు అందకుండా భావం మాత్రమే అందితే దాన్ని ఆమోదించడంగా వుండవచ్చు.
14. దాన్ని ఆచరించే క్రమంలో ఆ అభివృద్ధి యొక్క తీర్పుపై కొత్త తీర్పుకు చేరుతాడు.
15. అభివృద్ధిలో వెనకబడి ముందుకు సాగుతున్నపుడే నిరంతరం అదనంగా కొత్త ఎరుక క్రమాలు చేరుకుంటాడు.
16. అభివృద్ధి తాలూకు భౌతిక ప్రయోజనాలు పొందే పాలకవర్గాలు, ప్రాంతాలు, కులాలు లింగాలకన్నా వెనకబడిన ప్రజలు, వర్గాలు, ప్రాంతాలు, కులాలు, లింగాలు, జాతులు నిరంతరం కొత్త ఎరుక క్రమాల్ని, జ్ఞానాన్ని ఉత్పన్నం చేస్తాయి.
17. పెట్టుబడిదారులకన్నా కార్మికవర్గంలో, అగ్రకులాలకన్నా పీడితకులాలలో, అభివృద్ధి చెందిన ప్రాంతాలకన్నా వెనకబడిన ప్రాంతాల అదనపు జ్ఞానం ఉత్పన్నమయ్యే క్రమం యిది.
18. అభివృద్ధి పేరిట చేర్చబడ్డ దాని తాలూకు రాజ్యాన్ని కూడా నిరోధించే క్రమం ఉత్పన్నమవుతుంది.
19. ఆ క్రమం నించే అరె ఆ సిన్మా బాగానే వుందే అనుకోవడం ద్వారా అలా చెప్పినవాడి భావాధిక్యతను నిరోధించటం ఉత్పన్నమవుతుంది.
20. ఆ క్రమంలో అయితే ఆ సిన్మా, ఆ అమ్మాయి అతనికి నచ్చలేదంటే అతడి స్వభావం, టేస్టు అలాంటివన్నమాట అనే అదనపు ఎరుక క్రమాన్ని చేరుకుంటాడు.
21. దీనివల్ల మొదట జరిగిన అభివృద్ధి క్రమాలు రెండో చోట యధావిధిగా జరగకపోగా మొదట జరిగిన అభివృద్ధి క్రమాల్లోని కొత్త అంశాలు వెలికి వస్తాయి.
22. భౌతిక ఆచరణ, భౌతిక ప్రయోజనాలు ఒక ప్రాంతం, వర్గం, కులం, లింగం, జాతివైనపుడు దాని భౌతిక భావజాల ఆధిక్యత ప్రదర్శించడం కోసం దాని ప్రాచుర్యం, విస్తృతీకరణ పొందుతుంది. సహజంగా ఆ రెండోచోట కలిగే అదనపు ఎరుక క్రమాన్ని రాజ్య నిరోధక స్వభావాన్ని అది నిరాకరిస్తుంది. విలువ మార్చి ప్రదర్శిస్తుంది.



23. తనదే నిజమైన అభివృద్ధి క్రమం అని స్వీయ మానసికతతో, స్వార్థంతో కొత్తగా అభివృద్ధి చెందే అభివృద్ధి క్రమాల్ని ఎరుక క్రమాల్ని వక్రీకరించి వ్యాఖ్యానిస్తుంది.
24. సహజంగా భౌతిక ఆచరణ, దాని భౌతిక ప్రయోజనాలు తాను మాత్రమే పొందుతూ బలపడుతున్న క్రమంవల్లనే ఈ స్థితి ఉత్పన్నమవడం వలన అలా వక్రీకరించి విలువ మార్చి తిరిగి తన భావజాల భౌతిక ఆధిక్యతను నిలబెట్టుకోవడం చేస్తున్నది.
25. అన్నింటిలాగే కార్మికవర్గం తన అభివృద్ధిని, విప్లవం సాధించిన అభివృద్ధిని పైన చెప్పినట్లు పంచి యివ్వకుండా భావజాలాన్ని మాత్రమే యితర దేశాలకు, ప్రాంతాలకు, వర్గాలకు, కులాలకు, లింగాలకు, తెగలకు, జాతులకు విస్తృతపరిచే క్రమం అనివార్యంగా అభివృద్ధి నిరోధక స్వభావాన్ని సంతరించుకుంటుంది.
26. తనకన్నా వెనకబడిన ప్రాంతాలు, వర్గాలు, కులాలు, లింగాలు, తెగలు, జాతులు, భాషలు ఈ విధంగా తనకన్నా అదనపు అభివృద్ధి చెందిన ఎరుక క్రమానికి ఆచరణకు చేరుకుంటారు.
27. ఈ సత్యాన్ని ప్రజలపట్ల బానిస యజమానులు, భూస్వాములు, పెట్టుబడిదారులు గుర్తించ నిరాకరించినట్టుగానే తానే అగ్రగామిననే కార్మికవర్గం గుర్తించ నిరాకరిస్తుంది.
28. అలా నిరాకరించడంవల్లనే అది అగ్రగామి అవుతున్నది. లేనట్టయితే తాను తనకన్నా వెనకబడిన ప్రాంతాలు, వర్గాలు, కులాలు, లింగాలు, భాషలు, ప్రజలు, ప్రజలకన్నా వెనకబడిన చైతన్యంతో నడుస్తున్నానని ఒప్పుకోవలసి వుంటుంది.
29. తాను అగ్రగామిననే ప్రదర్శనను స్వభావాన్ని ఉత్పన్నమవుతున్న దృక్పథం, వ్యూహం, ఎత్తుగడలు, అప్రోచ్ ఆచరణల్ని సమస్తం వదులుకోవాల్సి వుంటుంది.
30. మౌలిక మార్పులకు గురి చేయాల్సి వుంటుంది.

### మార్క్స్ చారిత్రక భౌతికవాదం పై నుండి కిందికి చూసే తీరు

మార్క్స్ చారిత్రక భౌతికవాదం ఇప్పటికీ పెట్టుబడిదారీ సంబంధాలు, సోషలిస్టు సంబంధాలు అభివృద్ధికరమైనవి అని పైనుండి కిందికి (అగ్రగామిలాగా) చూస్తున్నది.

అది గిరిజన, భూస్వామ్య, వలస, కుల, లింగ, ప్రాంత, జాతి, భాషా సంబంధాలంటూ పరిశీలించడం ద్వారా మన కుల వ్యవస్థలోని అభివృద్ధి చెందిన బ్రాహ్మణ వర్గంగా తయారైంది.

తనలోని అభివృద్ధి, రాజ్యాల కారణంగా విప్లవాలు మునుపటికన్నా అనాయాసంగా తక్కువ ఆచరణతో తేలికగా విజయవంతం అయ్యే క్రమాన్ని అడ్డుకుంటాయి.

అలా ప్రతి మానవతా సమస్యను, సామాజిక సమస్యను రాజకీయ సమస్యగా రూపాంతరం చెందిస్తుంది. ప్రతిదాన్ని రాజకీయం చేసి, రాజకీయ పరిష్కారాల పేరిట

రాజ్యాధికార అస్తిత్వాన్ని ఉత్పన్నం చేస్తుంది.

మానవతా సమస్య శాంతి భద్రతల సమస్యగా మార్చబడుతుంది. మునుపటికన్నా తేలికగా విప్లవం, అభివృద్ధి క్రమాలకు బదులుగా మరింత కష్టభూయిష్ట క్రమాలు ఉత్పన్నమవుతాయి.

**మార్క్సిస్టు సిద్ధాంతాల్లో వున్న జడత్వం**

కార్మికవర్గ రాజ్యవాదులకు యిన్ని కష్టాలు రావడానికి వందలాది విడి ముక్కలుగా అస్తిత్వాలు పొందడానికి ప్రాతిపదిక ఏమిటి?

దానిలో ఉండే జడత్వమే దాని ప్రాతిపదిక. జడత్వం అంటే ఏమిటి?

తన ప్రవర్తనను, స్వభావాన్ని, చలనాన్ని, దిశను మార్చుకోలేకపోవడమే జడత్వం.

అభివృద్ధి మరింత అభివృద్ధి కొరకే అనే దిశ స్పైరల్ చలనం లేదా గతితర్కం తాలూకు జడత్వం భ్రామకంగా జడత్వంగా కార్మికవర్గ వాదరూపం రాజ్యవాదం, చారిత్రక భౌతికవాదం, రాజ్యాధికార కేంద్రకం చుట్టూ పరిభ్రమణం చెందుతూ వస్తున్నది. దీన్ని వివరించవలసి వున్నది.

ఒక స్థితిలో ఉన్న వస్తువు అదే స్థితిలో ఉండాలని ప్రయత్నం చేస్తుంది. అది ఏ మార్పునూ కోరుకోదు. అది ప్రతి వస్తువుకు ఉండే సహజ ధర్మం. స్థానాంతర చలనంలో స్థితిమార్పుకు అశక్తత లేదా స్థబ్దత ఉండే ధర్మాన్ని జడత్వం అంటారు.

"స్థానాంతర చలనంలో మార్పును వస్తువులు కోరనట్లే భ్రమణ గతిలో వున్న వస్తువులు కూడా వాటి స్థితి మార్పును సహించవు. ఆ సందర్భంలో వస్తువులకు జడత్వ భ్రామకం అనే ధర్మం వుంటుంది. భ్రమణ గతిలో ఉన్న వస్తువుల స్థబ్దత లేదా మార్పుకు అశక్తతను తెలియపరిచే ధర్మమే జడత్వ భ్రామకం. ఇది భ్రమణ గతి జడత్వానికి గుణకం అని తెలుసుకోవాలి. (భౌతికశాస్త్రం, ఇంటర్ ప్రథమ పేజి 167, తెలుగు అకాడమీ ప్రచురణ నుంచి స్వీకృతి).

"పెన్సిల్‌ను ఎత్తడానికంటే పుస్తకాన్ని ఎత్తడానికి దానికంటే బల్లను ఎత్తడానికి ఎక్కువ బలం ఉపయోగించాలి. ఈ విధంగా జరగడానికి కారణం ఏమిటి? ఆ వస్తువులోని జడత్వమే కారణం. అయితే జడత్వాన్ని ఎట్లా కొలుస్తాము లేదా నిర్ణయిస్తాము? వస్తువులో ఉన్న పదార్థ పరిమాణమే ఆ వస్తువు యొక్క జడత్వానికి కారణమైన ద్రవ్యరాశి లేదా జడత్వరాశి" (సామాన్యశాస్త్రం, 7వ తరగతి పేజి 114-115, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ నుంచి స్వీకృతి)

కార్మికవర్గ సిద్ధాంతం జడత్వ భ్రామకంలో కూరుకుపోయింది. అది మార్పును అనుకూల మార్పుగానే తప్ప వ్యతిరేక దిశా మార్పును స్వీకరించలేని జడత్వ భ్రామక చలనంలో కూరుకుపోయింది. దానిలోని పదార్థ పరిమాణమే దాని జడత్వానికి కారణమైన ద్రవ్యరాశి.

ఎక్కువ బలాన్ని బయటి నించి వినియోగిస్తే తప్ప మార్క్సిజం తాలూకు జడత్వ భ్రామక చలనంలో మార్పు రాదు. అది మార్క్సిజాన్ని కదిలించే, వ్యతిరేకించే దశలోకి వచ్చి దాని స్థానాన్ని ఆక్రమిస్తున్నపుడు మాత్రం ఆ మేరకు పట్టించుకుని తనను తాను మార్చుకుంటుంది. దాన్ని తనలో విమర్శిస్తూనే కలుపుకుంటుంది.



మార్క్సిజం, కార్మికవాదం తన జడత్వ భ్రామకాన్ని విప్లవ చైతన్యం, విప్లవాకర్షణ, సమాజ అభివృద్ధిగా ప్రదర్శిస్తున్నదని స్పష్టమవుతున్నది.

**మార్క్సిజం సృష్టిస్తున్న కొత్త కులాలు**

అభివృద్ధి మరింత అభివృద్ధికోసం అనేది కళ కళకోసమేనన్నట్టుగా దాని భోక్తల వ్యక్తిగత అభివృద్ధిగా దృక్పథం కుదించుకుపోతుంది.

ఒక లెక్చరర్ కొడుకు తిరిగి లెక్చరర్ కావడానికి యితరులకన్నా ఎక్కువ అవకాశాలుంటాయి. అది ప్రేరణగా గాని పరిసరాలుగా గాని ఉపయోగపడి అదనపు శక్తి సామర్థ్యాల్నిస్తాయి.

ఒక దశలో మొత్తం వ్యవస్థలో ఈ రెండు పూర్తయ్యాక తర్వాతి తరాలలోని కింది స్థాయివారు ట్రాక్టరు డ్రైవర్లుగాను, కార్మికులుగాను, వ్యవసాయదార్లుగాను మిగిలిపోయే పిల్లలు నేటి ఎస్సీ/ఎస్టీ/బీసీ పిల్లల్లా రిజర్వేషన్‌ల ద్వారానో, అదనపు శక్తిసామర్థ్యాలు సాధించుకుంటేనే లెక్చరర్ల పిల్లలతో ఆ ఉద్యోగానికి పోటీపడే స్థితి ఏర్పడుతుంది.

అభివృద్ధి మరింత అభివృద్ధి కొరకే అనే ఆరోహణ క్రమం మొదట బయలుదేరిన వారికే ఎక్కువ అవకాశాలనిస్తూ యథాతథవాదాన్ని అభివృద్ధి రూపంలో కొనసాగిస్తుంది. అందులో రాజ్యం వుంటుంది.

ఒక దశ దాటాక ఒక లెక్చరర్ కొడుకు పాకీ పనివాడుగా వృత్తి హోదాలు పొందినపుడే పాకీ పనివాడి కొడుకు లెక్చరర్‌గా ఆ స్థానంలోకి వెళ్ళడం సాధ్యమవుతుంది. సహజంగా ఇది నిరసించబడే క్రమం. సమాజంలో తోటి మానవులకోసం మనం త్యాగాలు చేయాల్సివుందనే సంస్కారం కలిగించడం ద్వారా దీన్ని పరిష్కరించవచ్చు.

అది లేనందున అకడమిక్, టెక్నోక్రాట్, బ్యూరాక్రాట్, పార్టీ యంత్రాంగాలలో స్థానాలు సాధించుకున్నవారు దీన్ని అడ్డగించి అభివృద్ధి తమ అభివృద్ధికోసమే అనేవాళ్ళుగా ఒక కొత్త శిష్టవర్గంగా తయారు కావడం నించే అది రివిజనిజంగా, కొత్తరకం కులాల వ్యవస్థగా స్థిరీకరణ పొందింది. (రామమనోహర్ లోహియా-కులాల సమస్యనించి స్వీకృతి)

**రష్యాలో కొత్త కులాలు**

ఇలా రష్యాలో కొత్త కులాలు పుట్టాయి. అభివృద్ధి మరింత అభివృద్ధి కోసమేననే చారిత్రక భౌతికవాదమే రివిజనిజాన్ని సోషల్ సామ్రాజ్యవాదాన్ని ఈ కొత్త కులవ్యవస్థను ఉత్పత్తిచేసే ప్రాతిపదిక అయింది.

**చారిత్రక భౌతిక వాదాన్ని భారతీయ చారిత్రక భౌతిక వాదంగా మలచుకోవాలి**

పర్యవసానంగా అభివృద్ధి చెందినవాళ్ళ నుంచి కిందికి చూసే దృక్పథం కాకుండా అట్టడుగు ప్రాంతాలు, వర్గాలు, కులాలు, లింగాలు కిందిస్థాయి నించి పైకి ఆలోచించే కొత్త ఎరుక క్రమాల్ని ఉత్పన్నం చేస్తున్న దృక్పథం.

అధ్యయన పద్ధతి అప్రోచ్ అవసరం అవుతున్నది. ఈ అంశాన్ని గుర్తిస్తే చారిత్రక భౌతికవాదంలోని అభివృద్ధిక్రమానికనువుగా చరిత్ర రాయడంలోని రాజ్యం,

పరాయీకరణ, విస్తరణ క్రమాలు తొలగించి రాయడం యొక్క ఆవశ్యకత మరో కోణంలో అర్థం అవుతుంది.

విభిన్న కులాలుగా, కుల కట్టుబాట్లుగా చీలిపోయిన కార్మికవర్గ పార్టీలు, ప్రజలకు మేలు చేయాలనే పార్టీలు మనిషి ప్రాథమికంగా, మానవీయ విలువలు ప్రాతిపదికగా చారిత్రక భౌతికవాదాన్ని తిరగరాయవలసి వున్నది.

కలసి పనిచేయవలసి వున్నది. రాజ్యాధికారమా, సామాజిక పరివర్తనా? ఏదో ఒకటే ఎన్నుకోవాల్సి వచ్చినప్పుడు సామాజిక పరివర్తన, సమాజ సేవలవైపు మొగ్గు చూపడం అవసరం.

కార్మికవర్గవాద రూపంలోని ఈ వేరు కుంపట్ల కులవ్యవస్థల గురించి భారతదేశానికి వేల ఏళ్ళ అనుభవం వుంది.

విభిన్న కులాలన్నీ కలిసి సామాజిక అవసరాలకోసం ఉత్పత్తిని సాగిస్తూ, ఒక సమాజంగా గ్రామీణ స్వయం పోషక ఆర్థికవ్యవస్థగా వేల ఏళ్ళు పనిచేసిన జ్ఞానం మనకుంది.

మన కులవ్యవస్థ ఐక్యంగా నిర్మించిన అభివృద్ధి నిరోధక అంతస్తుల దొంతరల స్వయంపోషక గ్రామీణ, ఆర్థికవ్యవస్థ తాలూకు చెదుల్ని కొంత పరిష్కరించి పరిణతి చెందించిన రూపాలే సోవియట్లు, కమ్యూన్లూ.

గ్రామాన్ని ప్రాతిపదిక చేసి చెప్పాల్సివస్తే అసలు సోషలిజం అనే అవగామన మన గ్రామీణ స్వయం పోషక ఆర్థికవ్యవస్థ యొక్క చెదులని సాధ్యమైనంత పరిష్కరించిన విస్తృతరూపం అని చెప్పవచ్చు.

ప్రపంచవ్యాప్తంగా గల కార్మిక వర్గాల వివిధ వర్గాల రూపంలోని వ్యవస్థల్ని సమన్వయించి పరిష్కరించే క్రమమేదైనా భారతదేశంలోంచే ప్రారంభం కావలసి వున్నది.

అది కులవ్యవస్థను పరిష్కరించే క్రమంలోంచే ఉత్పన్నం కావలసి వున్నది. అది నాడు బుద్ధునితో నిన్న జ్యోతిబాపులేతో ప్రారంభమై రామస్వామి నాయకర్ అంబేద్కర్ తదితరులతో వేగం పుంజుకుంది.

బౌద్ధాన్ని బ్రాహ్మణిజం, జ్యోతిబా క్రమాన్ని అతని తదనంతర కమ్యూనిజం రూపంలోని డాంగే, ఎం.ఎన్.రాయ్‌ల బ్రాహ్మణిజం, అంబేద్కర్ క్రమాన్ని అతని తదనంతర మార్క్సిజం రూపంలోని డి.డి. కోశాంబి తదితరుల బ్రాహ్మణిజం కొంచెం పక్కదారి పట్టించినా తిరిగి సరైన దిశలోకి యిపుడిపుడే మళ్లుతోంది.

ఇలా పీడిత కులాలవాళ్లు ప్రారంభించడం, తదనంతరం, కార్మిక వర్గవాదం పేర కొందరు దోపిడీకులాలవాళ్లు పక్కదారి పట్టించడం చాలాకాలంగా జరుగుతూనే వుంది.

**మానవకోటిని ఒకటిచేసే సిద్ధాంతాలు ఈనాటి అవసరం**

దీన్నిక సాగనీయకుండా కార్మికవర్గవాద రూపంలోని అసమగ్ర వాదుల్ని కూడా విద్యావంతం చేస్తూ ఒక సమగ్ర దృక్పథంలో వారి స్వీయజ్ఞానాన్ని పెంపొందించుకోవడంలో సహకరించవలసి వున్నది.



మనిషిని పోలిన మనిషి వుండటం అరుదు. మనుషులెన్ని రకాలో ఆలోచనలు అన్ని రకాలు. అయినా మనుషులందరూ ఒక్కటే.

నేడు మానవకోటి వేల కులాలుగా, గ్రూపులుగా, వర్గాలుగా, ప్రాంతాలుగా, జాతులుగా చీల్చబడి వుంది.

వివిధ ఫిలాసఫీల ఆచరణ మానవకోటి హృదయాన్ని వెయ్యి ముక్కలు చేసింది.

వేల ముక్కలయిన ఫిలాసఫీని, ప్రాపంచిక దృక్పథాన్ని ఒక్కటి చేయవలసి వుంది.

మొత్తం మానవ సమాజ ఆలోచన ఆచరణ ఒక్కటిగా ఐక్యం కావలసి వుంది.

అందుకు మనిషి ప్రాథమికం కావాలి. అందులో భాగంగా మార్క్సిజం, ఫెమినిజం, అంబేద్కరిజం, వెనుకబడిన జాతుల, ప్రాంతాల, దేశాల సిద్ధాంతాలను ఒక సమన్వయంలోకి తీసుకురావాలి. కలిసి కార్యక్రమాలు చేసే విధంగా రూపొందించుకోవాలి. దేనికది తానే సత్యమని, సర్వస్వమని అంతిమ సత్యమని వాదించినంతకాలం సిద్ధాంతాల మధ్య యుద్ధాలు కొనసాగుతునే వుంటాయి.

వర్గాలు, కులాలు, లింగాలు, జాతులు, మతాలకు అతీతంగా మనిషిని ప్రాథమికం చేస్తూ వీటిని మొత్తం సమాజ సమగ్ర చలనంలో ఆయా పర్టికులారిటీలుగా అంతర్భాగం చేసి పరిశీలన, ఆచరణ సాగవలసి వున్నది.

ఏ ఒక్క చలనమూ దానికదే సమగ్రమూ, పూర్తి సత్యమూ కాదు. అవన్నీ ఒక సమగ్రతలో సత్యంయొక్క అంశాలే. ఈ సమగ్ర దృక్పథంతో ప్రకృతి సమాజాల వస్తుశోధన, సత్యశోధన చేయవలసి వున్నది.

## ప్రశ్నలు

1. అభివృద్ధికి అనువుగా చరిత్ర రాయడం అంటే ఏమిటి?
2. పాత ఉత్పత్తి సంబంధాలు, కొత్త ఉత్పత్తి సంబంధాలు అంటే ఏమిటి? వివరించండి.
3. లెనిన్ రాజ్యం, విప్లవం పుస్తకంలో చేసిన ప్రమాదకరమైన సూత్రీకరణలేమిటి?
4. నేను చెప్పినట్టు నడుచుకుంటే అంతా స్వేచ్ఛే అనేది బానిసత్వమౌతుందా? స్వేచ్ఛ అవుతుందా? చర్చించండి.
5. చారిత్రక భౌతికవాదం, అభివృద్ధి వర్గాల సిద్ధాంతం. దీన్ని ఖండించండి. లేదా సమర్థించండి.
6. వెనుకబడిన ప్రపంచానికి ఎలాంటి చారిత్రక సిద్ధాంతాలు కావాలి. మీ అనుభవాల నించి రాయండి.
7. హెగెల్ నుండి గతితర్కం తీసుకోవడం వల్ల జరిగిన నష్టాలు ఏమిటి?
8. నేటి సైన్సును నిరాకరించకుండా గ్లోబలైజేషన్ పరిణామాలను నిరాకరించడం సాధ్యమా? చర్చించండి.
9. తమ అనుభవంలోకి రాని అభివృద్ధి అభివృద్ధే కాదు. ఎలానో చర్చించండి.
10. అనుభవం భౌతిక ప్రయోజనాలు, క్రమాలు చేరకుంటా కేవలం భావాలు చేరితే అందుకు భిన్నమైన క్రమాలు ఎలా ఉత్పన్నమౌతాయి? మీ అనుభవాలను కూడా వివరించండి.



# దృక్పథాలు - చలనసూత్రాలు

## దృక్పథాలు చలనసూత్రాల మధ్య వైరుధ్యం

గత అధ్యాయంలో దృక్పథాలను, చలనసూత్రాలను చాలామేరకు పరిశీలించాము. దృక్పథాలకు, చలనసూత్రాలకు మధ్య ఉండే వైరుధ్యాలను, వైవిధ్యాల్ని, భిన్నత్వాన్ని కూడా విశ్లేషించాము. ఇప్పుడు ఈ అధ్యాయంలో మరికొన్ని సత్యాలను, చలనసూత్రాలను పరిశీలిద్దాము. సత్యాలను అవి సత్యాలని ఎలా నిర్ధారిస్తారో అందులో దృక్పథం పాత్ర ఎలా వుంటుందో ఈ అధ్యాయంలో గమనిస్తాము. సత్యానికి బదులుగా దృక్పథమే సత్యంగా ఊరేగడం ఎలా సాగుతుందో మరింత లోతుగా ఇప్పుడు చూద్దాం.

**దృక్పథం పాతభావాల సముచ్ఛయం**

దృక్పథం పాతభావాల సముచ్ఛయం. చలన సూత్రాలు వర్తమానానికి చెందిన చలన క్రమాలను పసికట్టి సూత్రీకరించేవి. చలన క్రమాలకనువుగా దృక్పథం మారాలి. దృక్పథం రోజువారి జీవితంలో పుడుతూ పెరుగుతున్న చలనాలను అనుసరించి మారుతూ వుండాలి. మారని దృక్పథం ఛాందసవాదం. పాత దృక్పథానికి అనువుగా చలన సూత్రాలను వ్యాఖ్యానించడం, విశ్లేషించడం ఛాందసవాదమే.

**గ్లోబలైజేషన్ చలనక్రమాలను కొత్తగా పరిశీలించాలి**

గ్లోబలైజేషన్ చలన క్రమాలను పాత దృక్పథంతో ఏర్పరచుకొన్న చలన సూత్రాలను, సిద్ధాంతాలను అనుసరించి పరిశీలించడం ఛాందసవాదమే. గ్లోబలైజేషన్ చలనాలను కొత్త దృష్టితో పరిశీలించడం అవసరం. చైనా గ్లోబలైజేషన్‌లో తన షరతులతో, లక్ష్యాలతో ప్రవేశించింది. విజయపథంలో దూసుకుపోతున్నది. అమెరికాలో ఇప్పుడు చాలా సరుకులు చైనాలో తయారైనవే.

ఇండియా కూడా గ్లోబలైజేషన్‌లో ప్రపంచ పోటీలో తన వాటాను, ప్రయోజనాలను చైనాలాగా సాధించుకొనే కోణాలను, కార్యక్రమాలను, కర్తవ్యాలను నిర్దేశించుకోవాలి. అచ్చుయంత్రం ప్రపంచంలో ఒక గొప్ప మేథో విప్లవానికి దారితీసింది. అటుతర్వాత వచ్చిన పారిశ్రామిక విప్లవంలో ఇండియా వలస దేశంగా అనుసరిస్తూ వెనుకబడి పోయింది. కంప్యూటర్ విప్లవం నూతన ప్రపంచానికి కొత్త ద్వారాలను తెరిచింది. లక్షలాది ఉద్యోగాలు వేలకోట్ల సంపద భారతీయుల పరమయ్యాయి. సాఫ్ట్‌వేర్ రంగం

కొత్తద్వారాలు తెరిచి ఉండకపోతే భారతీయ ఆర్థిక వ్యవస్థ సంక్షోభంలో కూరుకుపోయి వుండేది. 1965-80 మధ్య కాలంలో లాగే భారతీయ ఆర్థిక వ్యవస్థ కుప్పకూలి వుండేది. సాఫ్ట్‌వేర్ రంగం, అరబ్ దేశాలకు ఇండియా ప్రజల వలస భారతీయ ఆర్థిక వ్యవస్థను సుసంపన్నం చేశాయి.

**నూతన ఆవిష్కరణలంటే నూతన చలన సూత్రాలను వెలికి తీయడమే**

ఇలా ప్రతి నూతన ఆవిష్కరణలను అభివృద్ధికనువుగా తన లక్ష్యాలకు అనువుగా స్వీకరిస్తూ ఎదుగుతూ ఎదిగిస్తూ జీవన ప్రమాణాల పెరుగుదలకు సామాజిక అభివృద్ధికి కృషి చేసే దృక్పథాన్ని నిరంతరం పెంచుకుంటుండాలి. భారతీయ కేంద్ర ప్రణాళికా సంఘం, రాష్ట్ర ప్రణాళికా సంఘాలు ఎలాంటి లక్ష్యాలను పంచవర్ష ప్రణాళికల్లో కలిగి వుండాలో బడ్జెట్ల రూపకల్పనలో ఎలాంటి లక్ష్యాలను ప్రాధాన్యతలను నిర్ణయించుకోవాలో చెప్పగలగాలి. వాటి అవసరాన్ని నిరూపించగలగాలి. వాటి ఫలితాలను ఊహించగలగాలి. అందువల్ల కొత్త బడ్జెట్ కొత్త లక్ష్యాలకనువుగా ఏటా ప్రవేశ పెట్టినట్టుగా దృక్పథం మారుతూ వుండాలి. ఎదుగుతూ వుండాలి. నూతన ఆవిష్కరణలు అంటే నూతన చలన సూత్రాలను వెలికి తీయడమే.

**తార్కికుల ముందు నిరూపించుకోలేని సూత్రాలు**

పుట్టా సురేంద్రబాబు అనే ఒక తార్కికుడు మార్క్సిజం సైన్సు సూత్రాలైతే ఈ సూత్రాల ననుసరించి కనుకొన్న నూతన ఆవిష్కరణలు ఏవి అని ప్రశ్నించాడు. ఏ సైంటిస్ట్ మార్క్సిజంలోని చలన సూత్రాలను తన సైన్సులో భాగంగా సరియైనవే అని నిరూపించాడు అని ప్రశ్నించాడు. మార్క్సిజం సూత్రాలు సైన్సులాగా ఖచ్చితమైన సూత్రాలు అని చెప్పడం వల్ల ఈ ప్రశ్నకు జవాబు చెప్పాల్సిన అవసరం ఏర్పడింది. సిపిఐ, సిపిఎం, మిగతా వామపక్షాల మేధావులు ఎవరూ కూడా ఆయనతో జరిగిన చర్చల్లో ఎన్ని రోజులైనా నిరూపించి చెప్పలేకపోయారు.

ఇలా ఎందుకు జరిగింది? ఇప్పటికైనా, ఎప్పటికైనా మార్క్సిజం సూత్రాలను సైన్సు సూత్రాలుగా నిరూపించడం సాధ్యమా? సామాజిక శాస్త్రంగా అన్ని దృక్పథాల్లాగే మార్క్సిజం కూడా ఒక దృక్పథం. పాతభావాల సముచ్చయం నుండి ఏర్పర్చుకున్న దృక్పథం. దృక్పథం కొత్త చలన క్రమాలను అనుసరించి మార్చుకుంటూ ముందుకు సాగాలి.

**పాత క్లాసు నుండి ఎదుగుతుండాలి**

విద్యార్థి ఆరోతరగతి నుండి ఏడో తరగతికి ఎదుగుతుంటాడు. ఆరోతరగతి వదిలేస్తాడు. కొన్నాళ్ళకు స్కూలును కూడా వదిలేసి కాలేజీలో చేరతాడు. ఆ తర్వాత యూనివర్సిటీలో చేరతాడు. తర్వాత ఉద్యోగంలో చేరతాడు. లేదా పారిశ్రామికవేత్త అవుతాడు. సైంటిస్ట్ అవుతాడు. ఇలాగే మనిషి దృక్పథం ఏటా క్లాస్ మారినట్టుగానే ఎదుగుతూ మారుతూ వుండాలి. పాత క్లాసులను, సిద్ధాంతాలను అవగాహన చేసుకొని వాటిని పట్టుకొని వేలాడకుండా వదిలేస్తుండాలి. పాత క్లాసుల అవగాహన రక్తంలో ఇమిడి పోతుంది. దృక్పథంగా ఎప్పటికప్పుడు దాన్ని మార్చుకుంటుండాలి.



గత అధ్యాయంలో తెలంగాణ రాష్ట్ర చర్చను చూశాం. సమస్య ఒకటే అయినప్పటికీ ఒకరు అనుకూలంగాను, మరొకరు వ్యతిరేకంగాను ఎలా అంచనా వేస్తున్నారో ఆ చర్చలో గమనించాము. ఇలా వాస్తవం, సమస్య ఒకటే అయినపప్పటికీ దృక్పథాలు, పరిష్కారాలు వేరువేరుగా కొనసాగుతుంటాయి.

**వాస్తవం ఒకటే. దృక్పథాలు అనేకం**

ఇలా వాస్తవం ఒకటే. దృక్పథాలు అనేకం. ఈ ప్రపంచం ఒక్కటే. దీని గురించిన దృక్పథాలు అనేకం. దృక్పథానికి వాస్తవాలకు మధ్య పొంతన కుదరనపుడు వాస్తవాల కనువుగా నిరంతరం దృక్పథాన్ని మార్చుకోవలసి వుంటుంది. అలా చేసినపుడు, దృక్పథం అనేది తాత్విక స్థాయిలో వాస్తవాలను గుర్తించ నిరాకరించే మాయావాదంగాను, భౌతిక స్థాయిలో వాస్తవాలపై 'రాజ్యం'గాను, ఆధిపత్యంగాను, అణచివేసేదిగాను కొనసాగుతుంది.

**భౌతిక వాస్తవాల అస్తిత్వమే సత్యం**

భౌతిక వాస్తవాల అస్తిత్వమే సత్యం. వాస్తవాల వెలికితీతనే హేతుజ్ఞానం అని, తర్కశాస్త్రం అని పిలుస్తారు. అందువల్లే కాబోలు "వాస్తవం హేతుబద్ధమైనది" అని అంటాడు లెనిన్. ఈ మాట చాలామేరకు వాస్తవం. అయితే పూర్తి వాస్తవం కాదు. వాస్తవాలన్నీ హేతుబద్ధమైనవైతే ఇక దేన్నీ వ్యతిరేకించనవసరంలేదు. దేన్నీ మార్చనవసరం లేదు. అందువల్ల వాస్తవాలన్నీ హేతుబద్ధమైనవే కాదు. అలాగనక అంటే దాన్ని కర్మ సిద్ధాంతం అనవచ్చు.

**దృక్పథంలో సత్యం పాలు కొంతే వుంటుంది**

దృక్పథంలో సత్యం పాలు ఉండవచ్చు. అది వాస్తవాల మీద పెద్దగా ఆధారపడకుండానూ సాగవచ్చు. ఉదాహరణకు భావవాద దృక్పథం. జీవితాలు, వాస్తవాలు భౌతిక వాస్తవికతకు సంబంధించినవి. దృక్పథం అనేది జీవితంపట్ల, వాస్తవాలపట్ల ఒక అంచనాకు, ఆచరణకు సంబంధించినది. వాస్తవాలపట్ల ఒక ఉజ్జాయింపు అంచనాలో భాగంగా దృక్పథం ఏర్పడుతుంది. ఈ అంచనా ఆచరణల్లో గల తేడాలు దృక్పథాలలో భిన్నత్వాన్ని ఉత్పన్నం చేస్తుంటాయి. ఆలోచించే, ఆచరించే ఆయా వ్యక్తుల స్వీయ స్థలకాల కుల, మత, వర్గ, లింగ, జాతి, ప్రాంత భాష, తెగ, నిర్దిష్టతలు దృక్పథాల్ని ఏర్పరుచుకోవడంలో పనిచేస్తాయి. పరిమితుల్ని విధిస్తాయి. ఒకే జీవితాన్ని, ఒకే వాస్తవాన్ని రచయితలు విభిన్న వాక్యాల్లో, విభిన్న కోణాల్లో రాయడం చూస్తుంటాం. వారి శిల్పంతోపాటు ఆయా నిర్దిష్ట భిన్నత్వాలతో పాటు ఆ వాస్తవం యొక్క విభిన్న కోణాలు కూడా అందుకు కారణం.

**ఏనుగు, ఏడుగురు గుడ్డి వాళ్లు**

ఏనుగు ఒక వాస్తవం. దాన్ని ఏడుగురు గుడ్డివాళ్ళు ఏడు రకాలుగా వర్ణించారు. ఒకరు చెవులు చూసి ఏనుగు చాటలాగా వుందన్నారు. ఒకరు తొండం చూసి పాములా వుందన్నారు. "ఒక సూర్యుండు సమస్త జీవులకున్ తానొక్కక్కడై తోచు విధంబున" ఒకరు కాలును చూసి స్తంభంలా వుందన్నారు. ఒకరు నడుమును చూసి కొండలా

వుందన్నారు. ఒక వాస్తవాన్ని యిలా వివిధ కోణాల్లో అంచనా వేయడం నుంచి అందులో ఏది ముఖ్యం. ఎవరిది ముఖ్యం అని చర్చించడం, ఆచరించడం నుంచి విభిన్న దృక్పథాలు పుడుతున్నాయి.

**వాస్తవం నుంచే దృక్పథం పుడుతుంది**

వాస్తవం నుంచే దృక్పథం పుడుతుంది. అందువల్ల వాస్తవాలు మారినప్పుడల్లా దృక్పథం, ఆచరణ కూడా మారుతుంది. మారవలసి వుంటుంది. కొన్ని వాస్తవాలు కలిసి దృక్పథాన్ని సృష్టిస్తాయి. దృక్పథం వాస్తవాలను మార్చుతుంది. వాస్తవాలను మార్చడం ద్వారా కొత్త వాస్తవాలను సృష్టిస్తుంది దృక్పథం.

**అంచనా వేయడమే దృక్పథం**

మనకు ఒక వ్యక్తి పరిచయమవుతాడు. మనకు అతని ద్వారాను, యితరత్రాను అతని గురించిన విషయాలు క్రమంగా తెలుస్తుంటాయి. వాటన్నిటిని ఒక సమన్వయంలోకి తీసుకొని మనం తాత్వీకరించుకొంటాం. ఆ తాత్వీకరణలో అతనిపట్ల మనకు ఒక అవగాహన ఏర్పడుతుంది. అవగాహన అనేది మరింత ఉన్నతీకరించబడి మలుపు తీసుకున్నపుడు దాన్ని దృక్పథం అని వ్యవహరిస్తాము. అభిప్రాయాలు, అవగాహనలు, దృక్పథాలు స్థాయీ క్రమాల గురించి మరోసారి వివరంగా చర్చిద్దాం. ప్రస్తుతం యీ మేరకు పరిమితమవుతాను.

అతని గురించి వాస్తవాలు, అభిప్రాయాలు పరిశీలించి అతనిపట్ల ఒక అవగాహనను ఏర్పరుచుకుంటాము. అతడు మంచివాడు. నిస్వార్థపరుడు అనేది అతని గురించి మనకు అవగాహన కలిగిందనుకుందాం.

**విరుద్ధ వాస్తవాలు తెలిస్తే అంచనాలు మారతాయి**

అవగాహన కలిగాక యిందుకు విరుద్ధమైన వాస్తవాలు కొన్ని తెలిస్తే మనం మొదట దాన్ని నమ్మలేం. అతడు అలాంటివాడు కాదని సముదాయిస్తాం. వాదిస్తాం. ఎదుటివారిని ఖండిస్తాం. చివరకు అవి వాస్తవాలే అని తేలితే అతనిపట్ల గల అవగాహనను మార్చుకుంటాం. అతడు దొంగ అని, వ్యభిచారి అని, బ్లాక్‌మార్కెటీర్ అని తర్వాత తెలిసిందనుకుందాం. ముందు నమ్మడం కష్టం. పాత దృష్టి నుంచి చూసి అతను అలాంటి వాడు కాదని అన్పిస్తుంది. దానికి సమాధానంగా మరింత ఎక్కువగా అతని చెడ్డ గుణాలను నొక్కి చెప్పవలసి వస్తుంది. అతనిలో డాక్టర్ జాకిల్ అండ్ హైడ్ దాగివున్నాడని తెలిశాక నమ్మక తప్పదు. పాత భావాలను, అంచనాలను మార్చుకోక తప్పదు.

ఇలా మన అవగాహనకు విరుద్ధమైన విషయాలు తెల్సినపుడు మనం మొదట నమ్మలేకపోవడానికి కారణం మనం ముందు ఏర్పరుచుకున్న అవగాహనలే.

**కాంగ్రెస్ పార్టీ గుణపాఠాలు స్వీకరించడానికి చెల్లించిన మూల్యం ఎంత?**

గెలుస్తామని అనుకున్న అంచనాలు తలక్రిందులై కాంగ్రెస్ పార్టీ ఓడిపోయి బిజెపి అధికారంలోకి వచ్చింది. కాంగ్రెస్ పార్టీ తాను ఎందుకు ఓడిపోయిందో విశ్లేషించే క్రమంలో గెలిచిన వాళ్ళు ఎందుకు గెలిచారో వాళ్ళ పని విధానం, ఎన్నికల ప్రణాళిక,



టిక్కెట్ల పంపిణీ ప్రచారం తీరుతెన్నులు మొదలైన వాటన్నిటినీ కూడా పరిశీలిస్తుంది. తాను ప్రజలకు దూరమైన అంశాలను తమలోని లోపాలను పరిశీలిస్తుంది. తెలుసుకొనే ప్రయత్నం చేస్తుంది. మళ్ళీ వచ్చే అవకాశాల్లో గెలవడానికి అనువుగా వాటన్నిటినీ ఉపయోగించుకుంటుంది. అనగా పాత పని విధానాన్ని, దృక్పథాన్ని, పార్టీ టిక్కెట్లిచ్చే తీరును ఎన్నికల ప్రణాళికను మార్చుకుంటుంది.

బిజెపి 23 భిన్నమైన పార్టీలతో కలిసి ఐదేళ్ళు చక్కగా ప్రభుత్వాన్ని నడిపింది. కాంగ్రెస్ ఈపని చేయలేదు. 1967 నుండి దేశంలో సంకీర్ణ ప్రభుత్వాల దశ ప్రారంభమైంది. కాంగ్రెస్ తనకు మెజార్టీ లేనప్పుడు ప్రభుత్వాలు ఏర్పాటు చేసే పార్టీలకు మద్దతు ఇస్తూ ఆ తర్వాత మద్దతు ఉపసంహరించుకొని వాటిని నట్టేట ముంచేసింది. చివరిదాకా ఇదే పని చేసుకుంటూ వచ్చింది. చివరకు దేశంలో వందకు పైగా పార్టీలు పెరిగి పార్లమెంటులో, చట్టసభల్లో స్థానాలు సాధించుకుంటూ భారతీయతలో భిన్నత్వంలో ఏకత్వం, ఏకత్వంలో భిన్నత్వం ఏమిటో స్పష్టమైంది. బిజెపి దీన్ని వెంటనే గుర్తించి అధికారాన్ని కలిసి పంచుకుంది. బిజెపి ఐదేళ్ళు హాయిగా పాలన సాగించాక కాంగ్రెస్ తాను కూడా సంకీర్ణ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయడానికి తీర్మానించుకుంది.

**దేశ విభజనలో కాంగ్రెస్ పాత్ర ఎంత?**

ఇలా 1935 శాసనసభ ఎన్నికలనుండి సంకీర్ణ ప్రభుత్వాల ఏర్పాటును ఏదో ఒక రూపంలో నిరాకరిస్తూ వచ్చిన కాంగ్రెస్ పార్టీ పదేళ్ళ క్రితం సంకీర్ణ ప్రభుత్వాల ఏర్పాటును చిత్తశుద్ధితోనే అంగీకరించడం అవసరమని గుర్తించింది. ఈ గుర్తింపే 1935లో వుండివుంటే ముస్లింలీగ్‌కు రాష్ట్రాల మంత్రివర్గాల్లో కోరుకున్న స్థానం ఇచ్చి వుంటే పాకిస్తాన్ విభజన ఏర్పడి వుండేది కాదు. అలాగే బిజెపి అధికారంలోకి వచ్చి వుండేది కాదు. అలాగే 1969లో తెలంగాణ రాష్ట్రాన్ని తిరిగి ఏర్పాటు చేసి వుంటే తెలుగుదేశం పార్టీ ఏర్పడి కాంగ్రెస్ ఓడిపోయి వుండేది కాదు. అసలు తెలుగుదేశం పార్టీయే పుట్టి వుండేది కాదు. తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేయకపోవడం వల్ల తన ఓటమిని తానే తన చలన క్రమాల ద్వారా అనివార్యం చేసుకుంది. రేపు కూడా ఇదే క్రమం సాగుతుంది. కాంగ్రెస్ తిరిగి అధికారం కోల్పోయి తెలుగుదేశం, కాంగ్రెస్ స్థానంలో టిఆర్ఎస్ నాయకత్వంలోని ఐక్య సంఘటన ప్రభుత్వం అధికారంలోకి రావచ్చు. ఇలా గుణపాఠాలను స్వీకరించడంలో కాంగ్రెస్ పార్టీ చెల్లించిన మూల్యం కన్నా దేశం సమాజాలు చెల్లిస్తున్న మూల్యం ఎన్నో రెట్లు హెచ్చు.

ఇలా ఒకసారి ఏర్పరచుకున్న అవగాహన వాస్తవాలను గుర్తించ నిరాకరించవచ్చు. వక్రీకరించవచ్చు. అందువల్ల వాస్తవాలకనువుగా అవగాహనను నిరంతరం మార్చుకోవడం అవసరం. కాంగ్రెస్ పార్టీలో పాత దృక్పథం ఆధిపత్యం వహించడం వల్ల కొత్త చలనాలను గుర్తించకుండా అణచివేసే ప్రయత్నాలు చేసింది. అలా దృక్పథం వాస్తవాల పట్ల, నూతన చలనాల పట్ల రాజ్యంగా అణచివేత సాధనంగా మారిపోయింది. తాత్విక పరిభాషలో దీన్ని యిలా చెప్తారు.

దృక్పథం అనేది అన్ని వ్యవస్థల్లాగే ఒక వ్యవస్థ. అది ఆలోచనా వ్యవస్థ. అది ఆలోచనల్ని ఆచరణల్ని నియంత్రించే జ్ఞానస్థాయి, అంతచ్చేతన స్థాయి రాజ్యవ్యవస్థ.

### అదిగా ఉండాల్సిన దృక్పథం వాస్తవాలపై నేనుగా మారుతున్నది

దృక్పథం తొలుత వాస్తవాల ప్రాతిపదిక నుండే పుట్టవచ్చు. వాస్తవాల ప్రాతిపదిక నుండి దృక్పథం రూపొందే తొలి దశలో వాస్తవాలు "నేను" (Subject)గా ఉంటాయి. ఆ వాస్తవాలపై దృక్పథం తన ఆచరణ ద్వారా జోక్యం చేసికొన్నపుడు అవి "అది" (Object)గా మార్చబడతాయి. సమస్త వాస్తవాల పరిశీలన నుండి పుట్టిన దృక్పథమైనప్పటికీ అది సమస్త వాస్తవాలపై "నేను"గా "రాజ్యం"గా ఆచరణను ప్రారంభించడం నుంచే దృక్పథంగా ఆవిర్భవిస్తున్నది.

### దృక్పథం వాస్తవాలను సత్యాలను అణచివేస్తుంది పరాయీకరిస్తుంది

ఇలా దృక్పథం అనేది వాస్తవాల నుండే పుట్టినా ఆ వాస్తవాలను పరాయీకరించి, రాజ్యంగా కూడా ఉనికిలోకి రావడం ద్వారా అది ఒక దృక్పథం అవుతున్నది. ఒకే దృక్పథంతో ప్రారంభమైన కమ్యూనిస్టులు వందల వేల పార్టీలుగా గ్రూపులుగా చీలిపోవడానికి "దృక్పథం" "రాజ్యం"గా వాస్తవాలను అణచివేసేదిగా, పరాయీకరించేదిగా కొనసాగడంలో కూడా ప్రాతిపదిక వుంది. తాను నొక్కి చెప్పదల్చుకున్న వాస్తవాలను, ఆచరణను అదే స్థాయిలో స్వీకరించకుండా నిరాకరించడం, నిర్లక్ష్యం చేయడం వల్ల అతడు/ఆమె ఆ పార్టీలోంచి చీలిపోతుండవచ్చు. వాస్తవాలపై దృక్పథం అనేది రాజ్యంగా అణచివేత సాధనంగా కొనసాగడం నుంచి యీ స్థితి ఉత్పన్నమవుతున్నది.

ఈ సందర్భంలో జరిగే రెండు పంథాలమధ్య పోరాటం వాస్తవాల ప్రాతిపదికపై జరగవలసి వుంటుంది. అలా జరిగినపుడు పార్టీ ఏక మొత్తంగా తన దృక్పథాన్ని కొత్త దృక్పథంగా మార్చుకోవచ్చు. అలాకాకుండా రెండు పంథాల మధ్య పోరాటం అనేది వాస్తవాలకు దృక్పథానికి మధ్య పోరాటంగా సాగినపుడు దృక్పథం అనేది రివిజనిజంగా, జడత్వ భ్రామకంగా, వాస్తవాలను అణచివేసే రాజ్యంగా, వాస్తవాలను గుర్తించ నిరాకరించే అహంకారంగా, మాయా వాదంగా కొనసాగుతుంది. మరోమాటలో చెప్పాలంటే వాస్తవాలు పాలితవర్గంగాను, దృక్పథం పాలకవర్గంగాను కొనసాగుతుంది. తద్వారా తన పుట్టుకకు ప్రాతిపదిక అయిన లక్ష్యానికి వ్యతిరేకంగా దృక్పథం యొక్క అస్తిత్వం, ఆచరణ కొనసాగుతుంది.

### దృక్పథం పాలకవర్గంగా మారి కొత్త చలనాలను పాలితులుగా మార్చుతుంది

వాస్తవాల యొక్క ఒక సమీకృత వ్యవస్థ దృక్పథం కనక వాస్తవాలను శ్రమశక్తితోను, సరుకులతోను, దృక్పథాన్ని పెట్టుబడితోను పోల్చవచ్చు. సరుకులో గల శ్రమశక్తి, అదనపు విలువను పెట్టుబడిని సృష్టిస్తాయి. నేడు పెట్టుబడిమీద అధికారం గలవారు శ్రమశక్తిని అదనపు విలువను, సరుకుల ఉత్పత్తి క్రమాన్ని నిర్దేశిస్తున్నారు. అలాగే జ్ఞానంమీద, దృక్పథంమీద అధికారంగల వారు వాస్తవాలను, వాస్తవిక వర్తమాన ఆచరణను వాటి ఫలితాల పంపిణీని నిర్దేశిస్తున్నారు. మన దేశంలో కొన్ని వేల ఏళ్ళుగా జ్ఞానంపై దృక్పథాలపై ఆధిపత్యం కొన్ని కులాలకే వుండేది.

పెట్టుబడి తిరిగి సరుకులను సృష్టించడానికి ఉపయోగపడిన మేరకు పెట్టుబడి



అవుతుంది. అలా ఉపయోగపడని దాన్ని పెట్టుబడి అనలేం. దృక్పథం తిరిగి వాస్తవాలపట్ల ఆచరణకు ఉపయోగపడిన మేరకు దృక్పథం అవుతుంది. అలా ఉపయోగపడనిదాన్ని దృక్పథం అనలేం. అయితే అది తెరవని పుస్తకం వంటిది. కరవగలిగే పాము వంటిది.

### దృక్పథం ఒక గారడి విద్యగా మారే తీరు

వాస్తవాల ఆధారంగా పుట్టిన దృక్పథం వాస్తవాల పట్ల తాను వాస్తవీకరణగానే వున్నాను అని నిర్ధారించుకోవలసి వుంటుంది. తద్వారా ఆ దృక్పథంయొక్క వాస్తవికత నిర్ధారితమవుతుంది. ఈ పని చేయకపోతే ఆ దృక్పథం యొక్క అవసరం అదృశ్యమవుతుంది. క్రమంగా అది దృక్పథంగా తన అస్తిత్వాన్ని కోల్పోతుంది.

అందువల్ల వాస్తవాల ప్రాతిపదికగా ఏర్పడే దశనుండి దృక్పథం తన అస్తిత్వాన్ని ఆయా వాస్తవాలలో ప్రదర్శింపచేయడం అనే దశకు మలుపు తీసుకోవడం ద్వారా తన ఆచరణని ప్రారంభిస్తున్నది. ఇలా ఆయా వాస్తవాలలో వాస్తవం స్థానే దృక్పథం యొక్క అస్తిత్వాన్ని ప్రాథమికం చేయడం ద్వారా అది ఆ దృక్పథంగా అస్తిత్వాన్ని ఉత్పన్నం చేసికొంటున్నది. ఇది దృక్పథానికనువుగా వాస్తవాలను దర్శించే పాక్షికత్వాన్ని, దృష్టిలోపాన్ని ఆచరణలోకి తెస్తుంది. దీనివల్లే ఒక వాస్తవాన్ని యీ దృక్పథం వారు యిలాగను, ఆ దృక్పథం వారు అలాగను, మరో దృక్పథంవారు యింకోలాగను అర్థం చేసికొంటారు, అనే వివరణలు పుడుతున్నాయి. ఇలా వాస్తవం అనేది దృక్పథాల రంగు కళ్ళద్దాల ద్వారా చూడబడ్డంతో ఒకే వాస్తవం, పలురంగుల్లో, పలుకోణాల్లో కనపడుతుంది.

### ప్రశ్నలు

1. దృక్పథాలకు, చలనసూత్రాలకు వైరుధ్యం ఎలా కొనసాగుతుంది?
2. గ్లోబలైజేషన్ చలనక్రమాలను కేవలం ఆర్థిక కోణంలో పరిశీలించడం సరైనదేనా? చర్చించండి.
3. నూతన ఆవిష్కరణలు అంటే నూతన చలనసూత్రాలను వెలికి తీయడమే. దీన్ని వివరించండి.
4. విరుద్ధ వాస్తవాలు తెలుస్తే అంచనాలు ఎలా మారుతుంటాయి? మీ అనుభవాలను రాయండి.
5. దృక్పథం వాస్తవాలను, సత్యాలను ఎలా అణిచివేస్తుంది? ఎలా పరాయీకరిస్తుంది?
6. దృక్పథం ఒక గారడీవిద్యలా ఎలా మారుతుంది?

# జ్ఞాన శాస్త్రం - తర్క శాస్త్రం

సామాజిక భౌతికవాదం ఒక ప్రాపంచిక దృక్పథంగా ఎలా విస్తరిస్తూ వస్తుందో ఇంతదాకా చూశాం. మానవత, ప్రేమ, కరుణకు భిన్నంగా గడచి వచ్చిన దశల్లో, రాజుల కత్తి యుద్ధాలు ఎవరో ఒకరు గెలిచి ఒకరు ఓడిపోవడం సామంతులు కావడం అనే పద్ధతి ఉండేది. తరవాత ప్రజాస్వామ్యంలో శాంతియుత పరివర్తన, అహింస, మానవ జీవన మార్గాలయ్యాయి. దీనికన్నా ముందు పుట్టిన తత్వశాస్త్రాల్లో, తర్కశాస్త్రాల్లో హింస ప్రధాన అంశంగా ఉండేది. అది విభిన్న రూపాల్లో కొనసాగుతూ ఉండేది. ఇతరుల నుండి జ్ఞానాన్ని, ఆస్తిని, రాజ్యాన్ని రకరకాల రూపాల్లో కాజేస్తుండేవారు.

**ఏ పని చేస్తే ఆ ఆలోచనలు వస్తాయి**

చేసే పనికి ఆలోచనకూ మధ్య సంబంధం ఉంది. ఏ పని చేస్తే ఆ పనికి సంబంధించిన అనుభవాలు, ఆలోచనలు విస్తరిస్తాయి. మనదేశంలో సమస్త సంపదలు సృష్టించే పనులన్నీ శూద్ర-అతి శూద్ర కులాలు, గిరిజనులు చేసినవే. వీరు ఎదిగించిన కళలు, శాస్త్రాలే సమాజాన్ని ముందుకు నడిపాయి. సంపద్వంతం చేశాయి. అవే ఈ దేశం లోని సంపద యితర దేశాల వారిని యిక్కడికి రావాలనీ, బతకాలనీ ఉవ్విళ్ళూరించాయి. ఎడారి కోసం పోటీపడి పరిగెత్తరు. సస్యశ్యామలంగా, సమస్త సంపదల్తో తులతూగే దేశంలోకి ఎవరైనా పోటీపడి పరిగెత్తాలనుకుంటారు. అలా భారత ఉపఖండం ప్రపంచంలోని ఎన్నో తెగలను, జాతులను ఆకర్షించింది.

**పని అంతరిస్తుంది కాని దానినుండి పుట్టిన అనుభవం, జ్ఞానం విస్తరిస్తుంది:**

పని అంతరిస్తుంది కాని దానినుండి పుట్టిన అనుభవం, జ్ఞానం విస్తరిస్తుంది. మనిషిలో ఎదిగిన మెదడు, చేతులు, ఆలోచన మనిషిని జంతువుల నుండి వేరుచేశాయి. సంఘ జీవితం జంతువుల్లో కూడా వుంది. ఆలోచన అనేది అస్తిత్వంకన్నా ఉన్నతమైనది. భౌతిక పదార్థంకన్నా ఉన్నతమైనది. ఆలోచన పని నుండే పుట్టినా పనికన్నా ఉన్నతంగా ఎదిగింది. పని అంతరిస్తుంది. కాని దాన్నిండి పుట్టిన జ్ఞానం విస్తరిస్తుంది. వారసత్వంగా కొనసాగుతుంది. అందువల్లనే భావజాల, జ్ఞాన, శాస్త్రరంగాల్లో పనిచేసేవారికి గౌరవం పెరిగింది. మనం చార్వాకులను, బుద్ధుడిని గౌరవించినా, మన ఉపాధ్యాయులను గౌరవించినా అదంతా అందులో భాగమే.

ఆలోచనాశాస్త్రాలను బహుజనులు ఎంతో గొప్పగా అభివృద్ధి పరిచారు. కోటివిద్యలు కూటికొరకే అనే సామెతలో బహుజనుల భౌతికవాద, హేతువాద శాస్త్రీయ



దృక్పథం యిమిడి వుంది. బ్రాహ్మణవాదులు విద్యలు, కళలన్నీ దేవుని కొరకే అని అంటారు. దేవుని పేరిట బ్రాహ్మణవాదులు ప్రజలను దోపిడి చేయడానికి పూనుకున్నారు.

**"సత్యం దేని ద్వారా నిర్ధారించాలి?**

"సత్యం దేని ద్వారా నిర్ధారించాలి? అబద్ధం అంటే సత్యంకానిదంతా అబద్ధమేనా? సత్యం, అబద్ధం కాని తృతీయ అంశం వుండదా? అలా అయితే శాస్త్రవేత్తలు ప్రయోగాల కోసం నిర్మించే ఊహానిజనిత ప్రతిపాదనలు ఎందులోకి వస్తాయి?"

"భారతీయ దార్శనికులు సత్యాన్ని తెలుసుకోవటానికి 1) ప్రత్యక్షం 2)అనుమానం 3)ఆప్తవాక్యం అన్న ప్రమాణాలను తయారు చేశారు. వీటి చుట్టూ తత్వశాస్త్రం, వేదాంతం చాలా కాలం ప్రదర్శనలు చేసింది. తరువాత 8 ప్రమాణాలు వచ్చాయి. అవి మొదటి మూడుతోబాటు 1)చారిత్రక ప్రమాణం 2)అర్థాపత్తి ప్రమాణం 3)సంభవ ప్రమాణం 4)అభావ ప్రమాణం 5)ఉపమాన ప్రమాణం. అయితే యీ ప్రమాణాల రూప కల్పనలో తర్కాన్ని, అనుభవాన్ని వేదికగా చేసుకొని నిర్మించారే తప్ప వాటిని ప్రయోగాత్మకంగా పరిశీలించి సత్యాన్ని నిర్మించటానికి పెద్దగా ప్రయత్నించలేదు. అదే పాశ్చాత్య దేశాల్లో ప్రయోగం ఒక ముఖ్య వేదికగా చేసుకుని సత్యాన్వేషణ ప్రారంభించారు. ఆవిధంగా శాస్త్రవిజ్ఞానం అక్కడ అభివృద్ధి చెందుతూ వచ్చింది. అయితే యీ అన్వేషణలో అన్ని దేశాల జాతుల ఆలోచనలు తాత్విక చింతనల మేళవింపు వున్నది. గాని పశ్చిమ దేశాలు విజ్ఞాన శాస్త్రాన్ని ఒక పద్ధతి ప్రకారం 17వ శతాబ్దం నుండి అభివృద్ధి చేయటానికి కృషి చేశాయి." (ఇండియాలో సామాజిక పరిణామం ఒక పరిశీలన -ప్రొ॥కె.ఎస్. చలం, ముద్రణ-2000, పేజి-3)

**నువ్వు చూసిన ప్రతిదీ నేను చూసిందే**

మా చిన్నప్పుడు మేం ఒక ఆట ఆడుకునేవాళ్ళం.

ఆ ఆట పేరు "నువ్వు చూసిన ప్రతిదీ నేను చూసిందే".

"నువ్వు విన్న ప్రతిదీ నేను విన్నదే".

"నువ్వు చూసిందాన్ని నీకన్నా ముందే ఎప్పుడో చూశాను" అని వాదించడంతో ఆట మొదలవుతుంది.

నేను ఒక అగ్గిపెట్టె తీసుకొనివచ్చి చూపిస్తాను. నువ్వు "నేనది ఇదివరకెప్పుడో చూశాను" అని అనేస్తావు. నేను సిన్మా టాకీసుల వెంట, ఆఫీసులవెంట, రోడ్లవెంట, పెంటకుప్పల వెంట కుప్పలన్నీ వెతికి కొత్త కొత్త సిగరెట్ (ఖాళీ) డబ్బాల్ని, కొత్తరకం (ఖాళీ) అగ్గిపెట్టెల్ని వెతికి తెచ్చేవాన్ని. "ఇవి చూసినవా" అని నేను అడిగితే "ఎప్పుడో చూసిన" అనేవాడు. నేను ప్రతిసారి ఓడిపోతున్నందుకు కోపం, దుఃఖం వచ్చేది.

నా మనసుకు తెల్సు. వాడు యివన్ని అదివరకెపుడు చూడలేదని నేను వెతికి పట్టుకొచ్చాక చూసి దాన్నెప్పుడో చూసానని వాదించడమే వాడి పని అని.

శ్రమ నాది. పేరు, పెద్దరికం, శ్రమ, ఫలితం, గెలుపు వాడిదిగా మారే ఆ తర్కం నన్ను నిరాశకు లోను చేసింది. ఏడ్చేసాను. నా ఏడుపు వాడికి మరింత సంతోషాన్నిచ్చింది.

తర్వాత ఆ తర్కంలోని కిటుకును తెల్సుకుని తిరగబడ్డాను. "నీ యవ! అసలు

నువ్వు ఏ ఒక్కటీ మాకన్నా ముందు తెల్సుకోలేదు. వినలేదు. ఒకవేళ ఉంటే ఏమేం ఉన్నాయో చెప్పు. అని వాడి తర్కాన్ని వాడికి అప్పగించాను.

వాడు రెండు రోజుల్లోనే ఓడిపోయాడు. వాడి దగ్గర కొత్తదేమీ లేక ఓడిపోయాడు. నేనేమో కొత్తవి కనుక్కొన్నా కూడా ఎందుకు ఓడిపోయాను? అయినా ఎందుకు నా ప్రయత్నాన్ని కొనసాగించాను? అదొక ఆసక్తి, పట్టుదల. దానివల్ల నేను ఎన్నో కొత్త విషయాల్ని తెల్సుకున్నాను.

**తార్కిక నిపుణుల ప్రత్యేకత**

భారతీయ తత్వ శాస్త్రాల్లో తర్క నిపుణులు ప్రవేశించి ఈ పిల్లల ఆటను శతాబ్దాలుగా ఆడారు. వారు కనుక్కున్నదంటూ ఏదీ ఉండదు. ఎవరో సంపాదించిన జ్ఞానాన్ని అదేం కొత్తకాదని, అది నీకన్నా ముందే తెలుసని అది అసలు సత్యం కాదని వాదించడం వీరి అలవాటు. రాజకీయవాదులు కూడా ఎదుటి పార్టీవారిని ఇదే తర్కంతో విమర్శిస్తారు. ఈ తర్కాన్ని చలం అని జల్పం అని, వితండం అని కూడా మనం పిలువవచ్చు. మా దృక్పథం, ఆచరణ యిదీ అని చెప్పడానికి వారి వద్ద ఏమీ ఉండకపోవచ్చు. కానీ తర్కంలో ఎదుటివారిని గెలుస్తారు. వీరిని ఓడించడం ఎలానో తెల్సుకోవడానికి పంచతంత్ర కథలు చదవాలి.

మనం చిన్నప్పుడు ఆడుకునే ఆటల్లో తర్కవిద్య అభ్యాసం ఇలా జరిగిపోతుంది. కొందరు తత్వవేత్తల పేరిట, రాజకీయ నాయకుల పేరిట, సాహిత్య విమర్శ పేరిట ఈ ఆట ఆడుతుంటారు. రాజుకంటే మొండివాడు బలవంతుడంటారు. వీళ్ళు అలాంటి మొండివాళ్ళు, బలవంతులు.

**తార్కిక పదబంధాలతో ఫుట్‌బాల్ ఆడుకోవడం**

ఈ ఆట ఆడడానికి వేల ఏళ్ళుగా కొన్ని పదబంధాలు, ప్రశ్నలు, చర్చాపద్ధతి రూపొందుతూ వచ్చాయి. తర్క విద్య రూపంలో ఎంతో శ్రమపడి తమ ఆచరణతో అనుభవంలో సాధించిన జ్ఞానాన్ని పరాయీకరించి తన జ్ఞానంగా ఫోజు కొట్టుకోవచ్చు. దోపిడి వర్గాలు ఈ పద్ధతిని అనుసరిస్తాయి. శ్రామిక కులాలు ఎన్నో కష్టాలకోర్చి పొందిన అనుభవాల్ని బ్రాహ్మణవాదులు, దోపిడీవర్గాలు ఈ పద్ధతి ద్వారా స్వంతం చేసుకొని వారిపైనే పెత్తనం చేశారు. బుద్ధుడికి తర్కంలోని లోపాలు, ఆచరణ శూన్యత తెల్సు. అందుకే శుష్క పండిత చర్చలు అవసరం అని, ఆచరణ ప్రాథమికమని భావించాడు.

చిన్నప్పుడు ఆడుకునే ఆటల్లోలాగా తిరగబడి నువ్వు చూసిన ప్రతిదీ నేనింతకు ముందు చూసిందే అని బుద్ధుడు వాదనకు దిగలేదు. నా వాదనవల్ల గెలిచిన నేను కనుక్కొన్న కొత్త విషయం ఏమీలేదు. కాని నేను ఓడిపోయిన ప్రతిసారీ ఎన్నో కొత్త విషయాలు తెల్సుకోగలిగాను. అందువల్ల ఛల, తర్క వితండవాదులు ఈ తర్క విద్యతో గెలిచినప్పటికీ కొత్తగా కనుక్కునేది ఏమీ ఉండదు. ఇంకొకడు సాధించింది నాదే అని గెలుచుకోవడం లేదా ఖండించడం తప్ప.

కొత్తది కనుక్కునేవారికి గెలుపనే ప్రసక్తి ఉండదు.

నేను కనుక్కున్నాని సంతోషం ఉంటుంది. ఆ సంతోషాన్ని ఇతరులకు పంచుతాడు.



అది ఇదివరకే కనుక్కోబడి ఉంటే దాన్ని విన్నవారు నీవు కనుక్కోవడం గొప్ప విషయమే కాని ఫలానా ఆయన ఇదివరకే కనుక్కున్నాడు. ఫలానా పుస్తకంలో ఉంది చూడు అంటాడు. అతడా పుస్తకాన్ని చూసాడు. ఆ పుస్తకం చదవకుండానే ఆ విషయాన్ని స్వయంగా కనుక్కున్నందుకు ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. ఇలా ఎంతమంది ఎన్ని విషయాలు కనుక్కున్నారో అధ్యయనం చేసి వారికన్నా కొత్త విషయాలు కనుక్కోవలనుకుంటారు. ఈ క్రమంలో గెలుపు ఓటముల ప్రసక్తి ఉండదు. సమాజం అప్పటిదాక సాధించిన జ్ఞానాన్ని సొంతం చేసుకోవడం ఉంటుంది.

**గెలుపు ఓటముల ప్రసక్తి ఫ్యూడలిజానికి చెందిన సూత్రాలే**

తర్కం వాద ప్రతివాదాలు, వాటిలో గెలుపు ఓటముల ప్రసక్తి వర్గ సమాజానికి చెందినవి. సమాజం వర్గాలుగా చీలిపోయి స్వీయ వర్గ ప్రధానమైన క్రమంలో గెలుపు ఓటముల ప్రసక్తి వచ్చింది. అది సామాజిక శాస్త్రాల్లో ఇప్పటికీ కొనసాగుతున్నది. అయితే అది ఒక్కటే జరిగిఉంటే సమాజం వేలేళ్ళ క్రితంలాగే ఉండేది. మనిషి నిరంతరం అన్వేషణతో ఆసక్తిగా మరియు అనివార్యత ననుసరించి ముందుకు సాగాడు. ఎన్నో విషయాలను తెలుసుకున్నాడు, కనుక్కున్నాడు.

అందుకే భౌతిక శాస్త్రాల్లో తెలుసుకోవడం, కనుక్కోవడం, అందరికీ అందుబాటులోకి రావడం అనేవి ఇప్పటికీ కొనసాగుతున్నాయి. వీటివల్ల మానవ సమాజం ఎంతో సౌఖ్య వంతం కాగలిగింది.

కాగా గెలుపు ఓటముల చర్చ తీరు మానవ సమాజాన్ని విజేతలుగా, పరాజితులుగా, పాలక వర్గాలుగా, పీడిత వర్గాలుగా రెండుగా చీల్చింది. శుష్క తర్క విద్య సామాజిక శాస్త్రాల్లో ప్రవేశించి సైన్సు సాధించిన ప్రయోజనాలు అందరికీ అందకుండా కర్మ, పునర్జన్మ, వాదాలు కుల తారతమ్యాలు, ఉచ్చ-నీచాలు, చర్చలు చేసి అందకుండా చేసారు. సమస్త సరుకుల్ని, కళల్ని, శాస్త్రాల్ని సృష్టించిన బహుజనులు ఈ వాదనలో ఓడిపోయి కష్టార్జితం ఇతరుల పాలయింది. దాన్ని సరిదిద్దే భావజాలం ప్రజాస్వామ్యాన్ని ముందుకు తెచ్చింది. అది మనిషి బతుకును ప్రాథమికం చేసే ప్రజాస్వామ్య, సోషలిస్టు దృక్పథంతో ప్రారంభ మయింది. అది బుద్ధుడిలో పరాకాష్టకు చేరుకుంది.

**ఆచరణ కోసమే తత్వం**

బుద్ధుడు కేవల తత్వచర్చలను నిరాకరించాడు. వాస్తవాలను చర్చించాడు. గురూజీ, దత్తోపంత్ ఠేంగ్డీ వంటి ఆరెసెస్ నాయకులు కూడా తత్వశాస్త్రం ఆచరణ కోసం అని భావిస్తారు. కేవలం శుష్క చర్చల కోసం, ఆధిక్యత ప్రదర్శించడం కోసం తత్వజ్ఞానం ప్రదర్శించడం కాదు అని స్పష్టం చేస్తారు.

"తత్వజ్ఞానం ఉన్నది ఆచరణ కోసం తప్ప కేవలం శాస్త్రవాదం చెయ్యడానికి, వాగ్విలాసాన్ని ప్రదర్శించడానికి కాదు. మొదట తత్వం ఆవిష్కృతమవుతుంది. తరువాత దానిని అనుసరించి క్రియా వ్యవహారం జరుగుతుంది. ఆచరణలో పెట్టబడని తత్వజ్ఞానం చిలుక పలుకులవలె నిరర్థకం, అది వట్టి శబ్దాడంబరమే. అటువంటి తత్వజ్ఞానాన్ని గొడ్డుమోతు జ్ఞానం అనాలి. సామాజిక జీవనానికి ఒక రూపాన్ని ఇవ్వలేని తత్వజ్ఞానం

వ్యర్థం." (ఆరెసెస్ కార్యకర్త - దత్తోపంత్ ఠేంగ్డీ - పేజీ 53)

**భిన్నాభిప్రాయాలను కలిగి వుండే స్వేచ్ఛ వుంది**

జల్ప, ఛల, వితండ శుష్క తర్క విద్యల్లో ప్రావీణ్యం పొందిన దోపిడీ వర్గాల, దోపిడీ కులాల సామాజిక శాస్త్రాల పెత్తనం భౌతిక శాస్త్రాలపై ఉండడంవల్ల సైన్సును వారికనువుగా వాడుకోవడం అనే క్రమం సాగుతుంది. అందువల్ల సామాజిక శాస్త్రాల పద్ధతిని చర్చ, గెలుపు, ఓటములు అనే పద్ధతి నుంచి సమూలంగా మార్చాల్సి ఉంది. తెలుసుకోవడం, కనుక్కోవడం, అన్వేషించడం అనే క్రమాలకు మార్చుకోవలసి ఉంది. ఉత్పత్తి శక్తుల సాధనాల సంబంధాల పరిణామాన్ని అనుసరించి చరిత్రను సామాజిక శాస్త్రాలను రాసే భౌతికవాద దృక్పథం దీన్నించే రూపొందింది.

**చెప్పలేకపోయినా హృదయానుభూతులుంటాయి**

ప్రకృతి మానవ సంబంధాలు స్వభావాలనుండి, ఆచరణ నుండి, అనుకరణ నుండి జ్ఞానం పుదుతూ ఎదుగుతూ విస్తరిస్తూ వస్తున్నది. ఈ క్రమాన్ని జ్ఞాన శాస్త్రం చర్చిస్తుంది. దోపిడి వర్గాలకు సమాన పంపిణీ, అందరికీ అందించడం అనే అంశాలపట్ల ఆసక్తి లేదు. వారికి గెలుపు ఓటముల ప్రసక్తి ముఖ్యమైంది. వారు తమకన్నా వెనుకబడిపోయిన వారిని ఎదిగించడంకన్నా వారు ఎందుకు ఎదగలేకపోతున్నారో విమర్శించడమే ముఖ్యమైనదిగా కనపదుతుంది.

అమ్మా అంటే ఏమిటో చెప్పలేకపోయినా అమ్మ అంటే ఏమిటో చాలా మందికి తెల్సు. అమ్మ హృదయాన్ని అర్థం చేసికోవడానికి అనుభూతి, పరస్పర స్పందన, ప్రేమ ప్రాథమికమౌతుంది. తర్కం సాక్ష్యం ప్రాధాన్యత లేకుండా పోతాయి. ప్రేమ, కరుణ, బౌద్ధ దృష్టి ప్రాధాన్యత ఇదే.

**సాక్ష్యాలు తిమ్మిని బమ్మి చేస్తాయి**

తర్క నిర్ధారణ సాక్ష్యాలమీద సాదృశ్యాలమీద తార్కిక సత్యాలమీద ఆధారపడి సాగుతుంది. సాక్ష్యం లేకుండా నమ్మని దశను ఎదుర్కొంటుంది. పూర్వపక్షం పేరిట చెత్తను తన ప్రతిపాదనకు ప్రాతిపదికగా చేసుకోవాల్సి వస్తుంది. మూఢ విశ్వాసాల్ని ఖండించడానికి పరిమితమయ్యే ఉద్యమాలు వాటికోసం ఎదురుచూస్తూ కూర్చుంటాయి. ఈ పని చేయడం మానేస్తే అవి ఉనికిని కోల్పోతాయి.

**తర్కశాస్త్రం అంటే ఏమిటి?**

తర్కశాస్త్ర అంటే ఏమిటో చూద్దాం. ఇంటర్మీడియట్ తర్కశాస్త్రం ప్రథమ భాగంలో ఇలా అంటారు.

"తర్కశాస్త్రాన్ని అధ్యయనం చేసేముందు అది ఏ విషయానికి సంబంధించిందీ, అది ఏ విధంగా రూపొందిందీ, సంగ్రహంగా తెలుసుకొనటం ప్రయోజనకరంగా ఉంటుంది.

తర్కశాస్త్రం తత్వశాస్త్ర ముఖ్య శాఖలలో ఒకటి. పాశ్చాత్య తర్కశాస్త్ర స్థాపకుడుగా అరిస్టాటిల్ పరిగణన పొందుతున్నాడు. శతాబ్దాల తరబడి ఆయన తర్కం అధ్యయన పరిశీలనాల విషయంగా ఉంది. అరిస్టాటిల్ దృష్టిలో శాస్త్రాలు మూడు విధాలు. అవి



సైద్ధాంతికాలు, ఆచరణాత్మకాలు, ఉత్పాదకాలు. సైద్ధాంతికశాస్త్ర లక్ష్యం సిద్ధాంతజ్ఞానాన్ని అందించటం. ఆచరణాత్మక శాస్త్రాల లక్ష్యం సమ్యక్ ప్రవర్తన. ఉత్పాదక శాస్త్రాల లక్ష్యం కళాసృష్టి, వాటి సాధనాలను గురించి జ్ఞానాన్ని అందిస్తాయి. మనం తర్కం అనే దానిని అరిస్టాటిల్ 'విశ్లేషణశాస్త్రం' అని పిలిచాడు. తర్కశాస్త్రాన్ని పై మూడు రకాల శాస్త్రాలతో దేనిలోను భాగంగా ఆయన పరిగణించలేదు. ఆయన దృక్పథంలో తర్కం అన్ని శాస్త్రాలకు అవసరమైన సాధనం.

**తర్కశాస్త్రం ఆలోచనా శాస్త్రమేనా?**

తర్కశాస్త్రాన్ని సాధారణంగా ఆలోచన శాస్త్రంగా భావించటం జరిగింది. ఈ భావన వల్ల ఇది మనస్తత్వ శాస్త్రంలో భాగంగా భ్రమపడి తర్కశాస్త్ర సూత్రాలకు మనస్తత్వశాస్త్ర నియమాలను ఏర్పాటు చేయటంకూడా ఒకప్పుడు జరిగింది. 19వ శతాబ్దంలో తర్కశాస్త్రజ్ఞులు పెక్కుమంది ఆ భ్రమకు లోనైనారు. తర్కశాస్త్రాన్ని మనస్తత్వశాస్త్రంగా మార్చే విషయంలో తీవ్రంగా తన వ్యతిరేకతను తెల్పినవారు జర్మన్‌వేదాంత శాస్త్రజ్ఞుడైన హస్సేరల్, ఆయన అనుయాయులు, తర్కశాస్త్రాన్ని ఆదర్శ, ఆలోచనా నిర్మాణాలకు సంబంధించిన శాస్త్రంగా పరిగణించారు. (తర్కశాస్త్రం ప్రథమభాగం - ఆర్. వెంకటరెడ్డి, అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి)

**సాక్ష్యం లేకపోతే హత్య జరగనట్టేనా?**

ఇన్నయ్య హోమియోపతిని వ్యతిరేకిస్తూ వ్యాసం రాసాడు. ఆ విధానం పని చేస్తున్న తీరుకు సాక్ష్యం కావాలంటాడు. సాక్ష్యంతో నిర్ధారించలేకపోతున్నది కాబట్టి అశాస్త్రీయం అంటాడు. ఇతనికి రోగం నయం కావడం ముఖ్యం కాదు. సాక్ష్యం మాత్రమే ముఖ్యం. తర్కం అతని హేతువాదం ఇంత లోపభూయిష్టమయినది.

**తార్కిక సత్యం ఒక ఆధిపత్య వాదమే**

ఒక తార్కిక సత్యం తన సిద్ధాంత ప్రకటన పూర్తి చేశాక ఆ తరువాత వచ్చే కొత్త అంశాల్ని నిరాకరిస్తాయి. తార్కిక సత్యం జడత్వంగా మూఢ విశ్వాసంగా కొనసాగుతుంది. తర్క విద్యపై నిలబడి దేన్నయినా పూర్వపక్షం చేయడం అనే దశ లేకుండా అది ఎదగడం అసాధ్యమౌతుంది. ఈ మాట మరింత వివరంగా అర్థం కావడానికి న్యాయ వైశేషిక దర్శనాలను లోతుగా చదవడం అవసరం.

నిజానికి సాక్ష్యం అనేది తెలిసిన దాని ద్వారా తెలియని దాన్ని అంచనా వేయడానికి సంబంధించినది. సాక్ష్యాలు లేకుండా చేయగల్గితే కోర్టుల్లాగే ఇలాంటి తర్కవాదులు చేయగలిగేదేమీ లేదు. ప్రమాణ వివేచనా పరిమితి ఇది.

**హేతువాదం ఒక ఆధిపత్య వాదమే**

ఇలాంటి హేతువాదులు, తర్కవాదులు ఉపయోగించే తర్కం హేతు బద్ధత చర్చవల్ల, అనుకరణ, ఆచరణ, అనుభవం, వివేచన ప్రయోగం వెలుపల భావాలకు తర్కానికి స్వతంత్ర ఉనికి ఉందని భావిస్తారు. వారికి ఆచరణ, అంచనాకన్నా అనుమానం, సత్యం కన్నా ప్రమాణం భావజాలం వాస్తవం కన్నా చర్చ ముఖ్యం.

"అరిస్టాటిల్‌చే స్థాపించబడిన తర్కాన్నే మధ్యయుగంలో తర్కపండితులు

కొనసాగించారు. అది ఆకృతిక తర్కం, సాంప్రదాయిక తర్కం. మన ఆలోచనా పద్ధతులకు, ప్రతిజ్ఞా వాక్యాలకు ఒక రూపం లేదా ఆకృతి ఉంటుందని మొట్టమొదటగా గ్రహించినవాడు అరిస్టాటిల్. ఈ విధమైన తర్కంలో మూడు భాగాలు ఉన్నాయి. అవి (1) ప్రత్యయాలతో సంబంధం కలది, (2) నిర్ణయాలతో సంబంధం కలది, (3) వినిగమనాలతో సంబంధం ఉన్నది.

**సాంప్రదాయక తర్కం ఎలా వుంటుంది?**

సాంప్రదాయిక తర్కం నిగమన తర్కం. న్యాయప్రయోగం ద్వారా సత్యాన్ని ఆవిష్కరించుకొనటమే అరిస్టాటిల్ లక్ష్యం. అందులోని గమనం రెండు ప్రయోగాలపై ఆధారపడి ఉంది. ఆ రెండు ప్రయోగాంగాలకు సంబంధం ఏర్పరిచే ప్రత్యయానికి మధ్యవర్తి పదం అని పేరు. ఆ ఆవశ్యక సంబంధం నుంచి రాబట్టే పర్యవసానమే వినిగమన ప్రతిజ్ఞా వాక్యం అవుతుంది. నిగమనాత్మక ప్రయోగాలద్వారా న్యాయప్రయోగాన్ని సాధించవచ్చు. ప్రతిజ్ఞా వాక్యాలన్నింటిలో విషయ పదం, విధేయపదం, సంయోజకం అన్నవి ఉంటాయి.

నిగమన లేదా ఆకృతి తర్కంలో న్యాయప్రయోగ విషయంకంటె ఆకృతి ముఖ్యం. విజ్ఞానశాస్త్ర సముపార్జనకు నిగమన తర్కం వినియోగించదని బీకన్ భావించి ఆగమన తర్కాన్ని అభివృద్ధిపరిచాడు. ఇది అనుభవాత్మకంగా సాగుతుంది. దీనిలో విషయం ప్రాముఖ్యం వహిస్తుంది. నిగమన తర్కం సార్వత్రికాలతో ఆరంభమై విశేష విషయాలను సాధిస్తే, ఆగమన తర్కం విశేష విషయాలతో ఆరంభమై సార్వత్రికాలను సాధిస్తుంది." (తర్కశాస్త్రం - ఆర్. వెంకటరెడ్డి, అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి - పేజీ 4)

**జ్ఞాన క్రమం ఎలా సాగుతుంది?**

మానవ జ్ఞాన క్రమం ఒక ఉత్పత్తి క్రమం. పరోక్ష జ్ఞానం కూడా ఎవరో ఒకరి ప్రత్యక్ష జ్ఞానమే. జ్ఞాన క్రమం ఎకౌంటెన్సీ అయితే తర్కం కొంతమేరకి ఆడిట్‌లాంటిది. అయితే దైవభావన కూడా హేతు, ప్రమాణ వివేచనం నుండే పుట్టింది.

ఒక డాక్టరమ్మకు తెలిసినట్టుగా వివరంగా తెలియకపోయినా ఒక అమాయక స్త్రీ కూడా తల్లి తత్వం కలిగి ఉంటుంది. తర్కం, సాక్ష్యం, ప్రమాణ వివేచనా అనేవి ఆడిటింగ్‌కు సంబంధించినవి. అకౌంటెన్సీ లేకుండా ఆడిటింగ్ ఉండదు. అనుభవం లేకుండా చెక్ చేసుకోవడం అనేది ఉండదు. అందువల్ల తెలుసుకోవడం, కనుక్కోవడం, అన్వేషణ, అనుకరణ, అనుభవం, ప్రయోగం, ఆచరణ, అంచనా, ఊహ, "సృజనాత్మక ఆలోచన" అనే క్రమం జ్ఞానానికి పునాది. తర్కం హేతుతత్వం లేకపోయినా మానవుడు తన వివేచన ద్వారా, ఆచరణ ద్వారా, అనుభవాల ద్వారా అభివృద్ధిలోకి ముందుకు సాగడం సాధ్యమే. అయితే పొరపాట్లు తిరిగి చేయకుండా ఉండే అవకాశం కోసం ఎన్నో కష్టాలకు గురి కావాల్సి రావచ్చు. అయినంత మాత్రాన ఆడిటింగ్ ప్రాథమికం కాదు. అకౌంటెన్సీయే ప్రాథమికం. మానవ సమాజం సాధించిన జ్ఞానం యొక్క అకౌంటెన్సీని ముందు తరాలవారికి అందించడం ప్రాథమికం. దాన్ని ఆడిట్ చేయడం (తర్కించడం వగైరా) సెకండరీ. ఎందుకంటే ప్రతి తరం ఎప్పటికప్పుడు ఆడిట్ చేసికొంటుంది. మనము అకౌంటెన్సీ రూపంలో అందించే దాన్లో కూడా ఆడిటింగ్



ఉంటుంది అది ఎలా సాగుతూ ఉంటుందో ఇ.హెచ్. కార్ రాసిన "చరిత్ర అంటే ఏమిటి" పుస్తకంలో చూడవచ్చు.

**బౌద్ధ గతి తర్కం వేల ఏళ్ళ నుండి కొనసాగుతున్నది**

"గతి తర్కాన్ని మొట్టమొదట ఉపయోగించిన వాళ్లు భారతీయ దార్శినికులు చార్వాకులు, బౌద్ధులు. ధర్మకీర్తి, దిగ్నాగుడు అనే బౌద్ధ తార్కికులు ఆచరణ, ప్రయోగాలను ప్రమాణాలుగా స్వీకరించి అందుకు వేదాలు నిలవవు కాబట్టి వాటిని వ్రాసి రాజన్నారు, వేదాలపై ద్వేషంతో కాదు అని రాహుల్ సాంకృత్యాయన్ అంటారు." (అదే పుస్తకం - కె.యస్.చలం, పేజీ-6)

**శంకరాచార్య ఘనత!**

"క్రీ.శ.6వ శతాబ్దం నాటికి, కొడిగట్టిన దీపంలా, మిణుకు మిణుకు మంటోన్న యీ హేతువాద జ్యోతిని, యీ వైజ్ఞానిక జ్వాలను, నిర్దాక్షిణ్యంగా కొండెక్కించి, నాటి హేతువాదులైన జైన, బౌద్ధ, ఆజీవక, లోకాయత, కాపాలికులకు, దైవద్రోహ ముద్రవేసి, వాళ్ళ చెవుల్లో సీసం కాచి పోసిన ఘనత, అద్వైత సిద్ధాంతకర్త ఆదిశంకరునికే దక్కింది."

"కందిరీగల్లాంటి అంధ మతవిశ్వాసాలు, జలగల్లాంటి పూజారివర్గాలు, గాదెకింది పందికొక్కుల్లాంటి స్వాములోర్లు, గుడ్లగూబలాంటి బాబాలు, యధేచ్ఛగా మన దేశప్రజల మానసిక జీవితాన్ని నేటికీ పాలిస్తూనే వున్నారు." (నరబలి-సి.వి. మొదటి ముద్రణ - 1970, ఎనిమిదవ ముద్రణ - 1993, పేజీ-6)

**తర్కశాస్త్ర నిర్వచనం**

"ఏదైన ఒక విషయానికుండే స్వరూప స్వభావాలను పూర్తిగా అవగాహన చేసుకొన్నప్పుడే దానిని నిర్వచించగలుగుతాం. ఒక విషయాన్ని నిర్వచించటం ద్వారా దాని ప్రధాన లక్షణాలను స్పష్టం చేయడమేగాక అంతకు పూర్వమున్న కొన్ని సంశయాలను గూడా దూరం చేస్తుంది - కనుకనే ఏ విషయాన్ని గురించి అయినా స్పష్టంగా తెలునుకునే ముందు దాని నిర్వచనంతో ప్రారంభించటం ఒక సంప్రదాయమైంది. మనం ప్రస్తుతం అధ్యయనం చేయటానికి ఆరంభించిన తర్కశాస్త్ర నిర్వచనం తీసుకుందాం.

తర్కం అతి పురాతనమైన శాస్త్రం అవటంచేత ఆనాటినుంచి ఈనాటివరకు అనేక తార్కికులు తాము ఈ విషయాన్ని అనేక రకాలుగా నిర్వచించారు. అన్నీ కాకున్నా కొన్ని అతి ముఖ్యమైన నిర్వచనాలను మనం పరిశీలించవలసి ఉన్నది. అయితే వివిధ నిర్వచనాలను పరిశీలించే ముందు ఒక అనుమానాన్ని నివారించవలసిన అవసరం ఉన్నది. అది తర్కం శాస్త్రమేనా అన్న సందేహం. సాధారణంగా రసాయన శాస్త్రం, భౌతిక శాస్త్రం, గణితశాస్త్రం, వృక్షశాస్త్రం, జీవశాస్త్రం వంటివే శాస్త్రముల కోవకు చెందుతాయని అభిప్రాయపడతారు.

అదేవిధంగా తర్కం కూడా శాస్త్రమని విజ్ఞులైన తార్కికులు అభిప్రాయపడ్డారు. ఏదైనా ఒక విషయాన్ని క్రమబద్ధంగా పరిశీలించి క్రమబద్ధమైన జ్ఞానాన్ని అందించినపుడు అది శాస్త్రమవుతుంది. శాస్త్రం ప్రపంచానికి చెందిన ఏదో ఒక జ్ఞాన విభాగాన్ని గురించి విశదీకరిస్తుంది. జ్ఞానమంతటినీ పరిశీలించదు.

ఉదా॥కు, వృక్షశాస్త్రం చెట్ల జీవితానికి, జంతుశాస్త్రం జంతు జీవన విధానానికి, ఖగోళశాస్త్రం గ్రహాలు, నక్షత్రాల సంచారానికి, మనోవిజ్ఞానశాస్త్రం మానసిక ప్రతిక్రియలకు వాటి ప్రభావాలకు సంబంధించి ఉంటాయి. ఏ శాస్త్రమైనా దాని పరిశీలనా విభాగానికి చెందిన అంశాలను సమన్వయపరచి ఒక క్రమపద్ధతిలోకి తెచ్చి, ఒక సంగతమైన పూర్వరూపంలో ఇమిడిపోయే సాధారణ నియమాల కిందకు వాటిని తీసుకొని వస్తుంది. తర్కం కూడా అదే విధంగా అనేక ఆలోచనా రీతులను, వివేచనారీతులను ప్రామాణికంగా పరిశీలించి హేతువాద మూలసూత్రాలను సక్రమమైన పద్ధతిలో అందిస్తుంది. సరిఅయిన విజ్ఞానాన్ని అందించటానికి ఆవిధంగా దోహదం చేస్తుంది. కనక తర్కం కూడా శాస్త్రమే అనటంలో సందేహం లేదు.

**శాస్త్రాలు రెండు రకాలు**

శాస్త్రాలను రెండు రకాలుగా పరిగణిస్తారు. ఒకటి - నిశ్చయాత్మక శాస్త్రాలు, రెండోది - ప్రమాణిక శాస్త్రాలు. నిశ్చయాత్మక శాస్త్రం ఉన్నది ఉన్నట్టుగానే పరిగణించి పరిశీలిస్తుంది. వృక్ష, జంతుశాస్త్రాలు ఈ రకమైనవి. ప్రమాణిక శాస్త్రం కొన్ని ఆదర్శాలు ఏర్పరచుకొని వాటి ప్రకారం ఎట్లా ఉండాలో నిర్ణయించి చెపుతుంది. నీతిశాస్త్రం, సౌందర్యశాస్త్రం ఈ కోవకు చెందిన శాస్త్రాలు. తర్కశాస్త్రం సత్యాన్ని ఆదర్శంగా ప్రమాణంగా పెట్టుకొని మన ఆలోచనా వివేచనలు సరిఅయిన మార్గంలో ఎట్లా ఉండాలో చెపుతుంది. ఆ విధంగా తర్కశాస్త్రం ప్రమాణిక శాస్త్రాల కిందకు వస్తుంది." (తర్కశాస్త్రం - ఆర్. వెంకటరెడ్డి, అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి - పేజీ 7,8)

**తార్కికులుగా పొడిచేసేదంతా ఆడిట్ పార్టీ వ్యవహారమే**

తార్కికులుగా మనమేదో పొడిచేస్తున్నామనుకునేదంతా మన తరం (జనరేషన్)లో మానవ సమాజ జ్ఞాన అకౌంటెన్సీని (ఆక్యుమినిలేషన్)ని ఆడిట్ చేయడమే. ఆ ఆడిట్ సరిగ్గా ఉందో లేదో చెప్పడానికి ఆ ఆడిట్ సూత్రాలు అసలు ఉపయోగపడవు. తిరిగి ఆక్యుమలేషన్ (సంచయం)ను విశేషాలను అంతా పరిశీలించడం ప్రాథమికం అవుతుంది. అనగా తర్కం అనేది ఈ రెండు క్రమాల మధ్య వచ్చిపోయే ఒక చర్య. అదొక గీటురాయి. బంగారం కారణంగా గీటురాయికి విలువ వచ్చింది. బంగారమే లేకపోతే గీటురాయి తల పగులగొట్టుకోవడానికి వేట కోసం పనికి రావచ్చు తప్ప బంగారాన్ని కనుక్కోవడానికి కాదు. అంతకుమించి జ్ఞానంలో, జ్ఞాన సాధనలో, జ్ఞాన శాస్త్రంలో తర్కానికి స్థానం లేదు. తర్కం హేతువాదం అనేది నెమరు వేయడం వంటిది. నెమరు వేయనవసరం లేకుండా అరిగించుకునే మనుషులెందరో ఉన్నారు. సైన్సు ప్రకృతి శాస్త్రాలు అభివృద్ధి చెందడంతో తత్వ శాస్త్రంలోని తర్కం యొక్క ప్రాధాన్యత తగ్గిపోయింది.

**నీవన్నదే నిజం అంటే తర్కం చచ్చివూరుకుంటుంది**

తర్కం, హేతుతత్వంలను ఓడించడం ఒక రకంగా క్షణంలో పని. "నీన్నదే నిజం" అని అంగీకరించడంతో తర్కం, హేతువాదం అనే శాస్త్రాల చర్చ చచ్చి ఊరుకుంటుంది. మనను అంగీకరించిన వారిపట్ల మనతర్కం దేనికి? "ఔను నీవన్నది నిజం" అని ప్రతిదానికి తల ఊపుతూ, మనం ఆచరించేది, ఆచరిస్తూ మనం చెప్పేదే చెప్తూవెళ్తే మన



తర్కం అతనిపట్ల నిరుపయోగంగా మారుతుంది. మనం చెప్పింది విశ్వసించిన తర్వాత మనం వారిని మన తర్కం ద్వారా ఏమీ చేయలేము. మనం చెప్పింది నమ్మిన తర్వాత తర్కంతో అవసరం తీరిపోతుంది. చెప్పింది ఆచరిస్తూ పోతే భావజాలం, నిర్మాణ వ్యవస్థ, ఉద్యమం విస్తరిస్తూపోతుంది.

**వైద్యుడు దేవునితో సమానం ఎప్పుడయ్యాడు?**

"ఆత్మ తత్వం - దేహతత్వం - రెంటినీ గురించిన జ్ఞాన పిపాస భారతీయ ప్రాచీన సాంప్రదాయంలో కనిపిస్తుంది. ఆత్మను గురించి చెప్పిన గురువులను గురించి - గురువు విష్ణువు, గురువు బ్రహ్మ, గురువు దేవుడు - అని చెప్పారు. అట్లాగే వైద్యుని గురించి కూడా "వైద్యో నారాయణ హరిః" అనే నానుడి ఉంది.

శరీర తత్వాన్ని గురించి, దేహధర్మాలను గురించి, దేహ తత్వాన్ని గురించి వైద్యశాస్త్రం, కామశాస్త్రం, శృంగారశాస్త్రం, భరతనాట్య శాస్త్రం, యోగశాస్త్రం, తంత్రశాస్త్రం, ఆయుర్వేదం, అధర్వణవేదం - అతి విపులంగా చెప్పారు. అయితే కొంతమంది ఈ శాస్త్రాలను చెప్పిన గురువులకన్నా ఆధ్యాత్మిక విద్యను బోధించిన గురువులకు ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇచ్చారు. నేడు 'గురు' శబ్దానికి కొంత న్యూనత ఏర్పడింది. లౌకిక విద్యలను బోధించడంలో కొంతమంది అసమర్థులైన అధ్యాపకులు ఎట్లా అయితే ఉన్నారో, ఆధ్యాత్మిక విద్యను బోధించడంలో కూడా కొంతమంది నయవంచకులు లేకపోలేదు. సంసార సాగరాన్ని తరింపచేసేవాడు ఆధ్యాత్మిక గురువైతే, ఈ సంసార సాగరంలో హాయిగా జీవితాన్ని ఈదేవాడు లౌకిక గురువవుతాడు. (భారతీయ తత్వశాస్త్రం - సుందరరామయ్య)

ఆనాటి ఉపాధ్యాయుని లక్షణాలను, విద్యార్థి లక్షణాలను వాళ్లు నిర్వహించవలసిన విధులను గురించి తైత్తిరీయ ఉపనిషత్, ఆయుర్వేదానికి మూలగ్రంథమైన చరక సంహిత చక్కగా చెప్పాయి.

**అంగీకరిస్తే కలిసి పని చేయడమే వుంటుంది**

మన తర్కాన్ని అంగీకరించినవారిని సమీకరించి, మానవీయ సంస్కృతిని, ఆచరణను కొనసాగింపజేసే దృక్పథం ఆచరణ మన పరిధిలోకి తీసుకోవాలి. అలా చేసినప్పుడే ఉద్యమం, వ్యవస్థ, నిర్మాణం వ్యాప్తి చెందుతుంది. అలా చేయకుండా కేవలం చర్చిస్తూ, విమర్శిస్తూ పోతే మనం ఉద్యమాలను నిర్మించలేము. సామాజిక మార్పు తేలేము. ప్రజల చైతన్య స్థాయి ననుసరించివారు అంగీకరించే అంశాల ద్వారా మనం ఒప్పించే విషయాలవైపు మళ్ళించడానికి ప్రజలపట్ల మనకు గల ప్రేమ, మనం చేసే త్యాగం ఎంతో ప్రభావం వేస్తాయి. వారి జీవితాలను ఏమేరకు పట్టించుకుంటామో, ఏమేరకు మన మాటల్లో, చేతల్లో, చిత్త శుద్ధి, త్యాగం ఉంటుందో ఆ మేరకు మన మాటల్ని విశ్వసిస్తారు.

**ఆచరణను నిరాకరించడానికే విమర్శిస్తారు**

అలా కాకుండా కేవలం చర్చకు, విమర్శకు, రాతకు పరిమితమైతే సామాజిక ఉద్యమం ముందుకు సాగదు. పార్లమెంటరీ పార్టీలకు, విప్లవ ఉద్యమాలకు, సామాజిక ఉద్యమాలకు మధ్య ఉండే తేడా కేవలం అవగాహనకు ఆచరణకు సంబంధించినది

కాదు. అది ప్రధానంగా చిత్తశుద్ధి త్యాగానికి, స్వార్థ రాహిత్యానికి సంబంధించిన తేడా. కేవలం విమర్శకు తోటి నోటి మాటలకు పరిమితమైన తర్కవాదులు, ఉద్యమకారులు నిరంతరం కొత్త శతృవులను, కొత్త మూఢ విశ్వాసపరుల్ని వెతుక్కుంటూ వెళ్ళే వేటలో పడిపోతారు. మనం ఈ క్రమంలో ఉన్నప్పుడు మిత్రులు దొరికినప్పటికీ, వారితో నిర్మాణం చేపట్టి ఉద్యమం నిర్మించకుండా ఊరికే విమర్శ ఆత్మ విమర్శలతో వారిని కొత్త శతృవులుగా మార్చుకుంటాము. అలా కొత్త మూఢ విశ్వాసాల్ని, శతృవుల్ని తయారు చేసికొంటే గాని మన తర్కం హేతుతత్వం ఉనికిని కొనసాగించలేని దశ వస్తుంది.

అలా ఉద్యమ నిర్మాణం లేకుండా కేవల భావజాల చర్చకు పరిమితమైతే నిరంతరం కొత్త శతృవులు కొత్త మూఢ విశ్వాసాలు అవసరం. అవి లేకపోతే మన తర్క, విద్య, తెలివితేటలు వ్యర్థమౌతాయి అనిపిస్తుంది కనుక వాటిని మనమే సృష్టిస్తాము. లేదా మనకు తెలియకుండానే ఎదుటివారిలో సృష్టించే ప్రక్రియ ప్రారంభిస్తాము. రాజకీయవాదులు పార్టీలోని తన పోటీదారుల్ని తన అనుచరులుగా కుదించడం కుదరకపోతే తాను ఆధిక్యంలోకి రావడానికి తన వ్యతిరేక పక్షంగా మారేట్టు పార్టీనుండి విడిపోయేట్టు కృషి చేస్తారు.

తద్వారా ఓడించి గెలిచామనే తృప్తి పొందుతాము. నిజానికి వారికన్నా మనమే ఎక్కువ బలహీనపడిపోతాము. కలిసిఉండి కృషి చేసినప్పుడు ఉండే ప్రభావం, వాళ్ళు వెళ్లిపోయాక ప్రజలమీద, వారిమీద ఎంతో తగ్గిపోతుంది. అయితే బాధాకరమైన ప్రాపంచిక సత్యం ఏమంటే గాంధీ, నెహ్రూ, ఇందిర, మార్క్స్, లెనిన్, మావో తదితరుల నుండి మొదలుకొని సర్పంచ్, గ్రామ రాజకీయాలద్వారా, ట్రేడ్ యూనియన్‌లతో సహా, భక్తి, ధ్యాన, దేవాలయ కేంద్రాల్లోను, సాహిత్య సాంస్కృతిక రంగాలల్లోను, ఉద్యమాల్లోను ఇదే ఆచరిస్తున్నారు. సంస్థలో తన ప్రాబల్యం కోసం వ్యక్తిగత స్వార్థానికి ఒడిగట్టడంవల్ల ఇలా జరుగుతుంది. తర్కంలో వాది ప్రతివాది ఇదే పని చేస్తుంటారు.

**తర్కం ఒక బలత్కార చర్య**

కొన్నిసార్లు తర్కం ఒక రేప్ వంటిది. మనల్ని ప్రేమించే వారిపై, మనల్ని అంగీకరించే వారిపై మన తర్కం నిరుపయోగం అని పైన స్పష్టమైంది. అందువల్ల మనల్ని అంగీకరించనివారి మీదే తర్క ప్రతాపం అని అర్థం. రేప్ అర్థం ఏమిటి? ఎదుటివారి అంగీకారం లేకుండా వారిపై చర్య జరపడం. ఎదుటివారు అంగీకరిస్తే తర్కం హేతుత్వం అవసరం తీరిపోతుంది. అప్పుడు ప్రేమ విశ్వాసం పుడుతుంది. ఎదుటివారు అంగీకరించకపోతే చర్చ, తర్కం, హేతుత్వం అనే బల ప్రయోగాల ద్వారా జరిగే క్రమం రేప్‌కు సంబంధించినవే. రేప్‌లో ఎంత క్రూరత్వం ఉంటుందో తెల్సు. అది ప్రతీకారం కోరుతుంది. అది రేప్ చేసినవారిని హత్య చేయడంతో ముగుస్తుంది. అనగా మనం ఎవరిని ఒప్పించడానికి బయలుదేరామో వారినే మన శతృవులుగా మార్చుకొని మనను ఓడించి వారు గెలిచే తీరును అనివార్యం చేస్తాము. చర్చ, శుష్కతర్కం, హేతుత్వం, ఛలం, జల్పంవల్ల జరిగే నష్టం ఇది.

**కలిసి పని చేయాల్సిన వారిని రెండుగా చీల్చే తర్కం**

ఇలా చర్చ అనేది ఒకటిగా కలిసి పనిచేసే మనుషుల్ని రెండు వర్గాలుగా, రెండు



భావాలుగా, రెండు వేర్వేరు సిద్ధాంతాలుగా చీలుస్తుంది. చర్చ అనే పద్ధతి, దృక్పథం స్వయంగా వాటికవే పాలకవర్గాల దృక్పథం, ఆచరణ, వారి చర్చా నిర్మాణం భావాలను రెండుగా చీల్చి ఒకదాన్ని సంహరించడం లేదా జీర్ణం చేసికోవడం వారు అలా పక్కా బ్రాహ్మణవాద, పాలకవర్గ వాద దృక్పథంలో కొట్టుమిట్టాడుతారు.

చర్చ పేరిట చాలామంది ఎదుటివారి భావాలను రేప్ చేస్తుంటారు. ఇది వారి స్వభావం కాకపోవచ్చు. కాచవ్చు. మనకు కూడా తెలియకుండానే జరిగిపోవచ్చు. అనగా చర్చా శాస్త్ర ఆచరణే మనకి రేపిస్టులుగా శాడిస్టులుగా మార్చుతుంది.

బుద్ధుని గొప్పతనం ఏమిటంటే అతను ఎదుటివారు సమ్మతించే పద్ధతిలోనే చర్చ జరిపి తన భావాల్ని వెల్లడిస్తాడు. ఒప్పిస్తాడు. ఇందులో ఎదుటివారిని ప్రేమించడం ఉంది. ప్రేమ పూరితంగా వివరించడం ఉంది. తన పక్షంలోకి చేర్చుకోవడం ఉంది. కాగా తర్కానికి, తర్క శాస్త్రానికి ఎదుటి పక్షం నించి ప్రేమ పూరితంగా తన పక్షంలో చేర్చుకోవడం అనే నిర్మాణం లేదు ఓడించడం తప్ప. అది ఎదుటి పక్షాన్ని పూర్వపక్షం పేరిట ఖండిస్తూ తన ఆధిక్యతను అస్తిత్వాన్ని నిలబెట్టుకుంటుంది. అందువల్ల తర్క పద్ధతి "నేతినేతి" ఇది కాదు అనే పద్ధతిని తీసుకొని పరాకాష్టనందుకుంది. వితండం, జల్పం కలిసి చేసే ఆచరణ లేని సమస్త తర్కాలు ఇందులో భాగమే.

**బలాత్కార తర్కం, తత్వం ఎన్ని రూపాల్లో కొనసాగుతుంది?**

ఈ రేపిజం ప్రాచీన సాహిత్యంలో, భావజాల రంగంలో, తర్కశాస్త్రాల్లో, నేటి రాజకీయాల్లో కోకొల్లలు. "నేతినేతి" ఇది కాదు. ఇది కాదు అంటూ చేసే సత్యాన్వేషణను మీరు ప్రాచీన గ్రంథాల్లో, జిడ్డు కృష్ణమూర్తిలో, కమ్యూనిస్టులో గమనించే ఉంటారు. వాళ్ళు ఇది ఔను, అది ఔను అని చర్చను ప్రారంభిస్తే అన్నిటిలో గల "ఔను"లను సమీకృతం చేసి తానొక గొప్ప "ఔను సంచయనం"గా ఎదిగి సమాజానికి అందించేవాళ్ళు. వాళ్ళు ఇది కాదు, అది కాదు అనుకుంటూ వెళ్ళారంటే వాళ్ళు కలిసిచేసే ఆచరణ లేకుండా కేవలం మాటలు నేర్చి ప్రతీదాన్నీ, రేప్ చేస్తూ, యిది కాదు అనుకుంటూ వెళ్లారని అర్థం. ఇది ఔను అంటే వెంటనే ఆమెతో (ఆ సత్యంతో) సంసారం (కలిసి ఆచరణ) చేయాల్సి వస్తుంది. కలిసిచేసే ఉమ్మడి కృషిలో పుట్టే జ్ఞానం ఒక అదనపు జ్ఞాన సంచయాన్ని కూడా కలిగి ఉంటుంది.

**సమిష్టిలో పుట్టే జ్ఞానం మహోన్నతమైనది**

వందమంది కలిసి వంట చేసుకున్నప్పుడు ఉండే గిన్నెలు, కావాల్సిన పొయ్యి, పొయ్యిల కట్టెల సైజు, వండే నేర్పు వేరు. ఎవరికి వారు పండుకున్నప్పుడు ఉండే గిన్నెలు వేరు. అవి చిన్నవిగా ఉంటాయి. విడిగా, వ్యక్తులుగా, వ్యక్తిగతంగా చిన్న చిన్న గ్రూపులుగా చిన్న చిన్న సంఘాలుగా, చిన్న చిన్న పార్టీలుగా పని చేసినప్పుడు ఒక్కరు వండుకునే గిన్నెలా అవగామన, లక్ష్యాలు చాలా చిన్నవయిపోతాయి. లక్షలాది మందితో కలిసి పనిచేసే సమిష్టి కృషిలో పుట్టే జ్ఞానం, విశాల దృక్పథం ఇంగిత జ్ఞానం, సంస్కారం, సంస్కృతి విడి ఆచరణలో, ఏకాంతంలో కలిగే అవకాశం లేదు. మహా నగరాల్లో, పల్లెల్లో ఉండేవారి నాగరికత, సంస్కృతుల మధ్య ఉండే తేడా ఇందువల్లనే ఏర్పడుతుంది.

వందల మందితో హాస్టల్లో జీవిస్తూ చదివే విద్యార్థులకు కలిగే ఇంగిత జ్ఞానం,

విశాల దృక్పథం, సంస్కారంలో ఇంట్లో గారాబంగా పెరిగే విద్యార్థులకు కలిగే అవగాహనలో చాలా తేడా ఉంటుంది. హాస్టల్లో ఉండేవారికి సమిష్టి తత్వం అలవడుతుంది. హాస్టల్లో ఒక మినీ సమాజం పరిచయమై దాంతో ఎలా పోరాడాలో, ఎలా కలిసి జీవించాలో తెలిసివస్తుంది. సమిష్టి ఆచరణలో ఉండే గొప్పతనం ఇది. ఎంత పెద్ద సంఖ్యలో సమీకరించి ఒక పార్టీగా, సంస్థగా ఉద్యమంగా నిర్మాణాన్ని ఏర్పరుస్తూ పోతామో అదే స్థాయిలో మనలో విశాల దృష్టి, విస్తృతమైన అనుభవాలు, స్పందనలు, జ్ఞానం, సంస్కారం, సంస్కృతి కలుగుతాయి. ఒంటిగా తిన్నమ్మ రెంటికి ఓర్వదు అనే సామెత ఒంటరితనంలో సంస్కారం కుదించబడడాన్ని తెలియజేస్తుంది.

### ఒంటికి తిన్నమ్మ గుణం రెంటికి ఓర్వదు

ప్రతి కులం, ప్రతి ట్రేడ్ యూనియన్ తనకు తాను విడిగా ఉండాలనుకోవడంలో ఈ ఒంటికి తిన్నమ్మ గుణమే వాటి సంస్కారంగా, ప్రాపంచిక దృక్పథంగా కుదించుకు పోతాయి. జాతీయోద్యమ కాలంలో కాంగ్రెస్ కన్నా ఎన్నో రెట్లు ఆయా కులాలు, గిరిజన తెగలు, మైనార్టీలు తమ ప్రయోజనాలకోసం ఉద్యమించారు. వాటికి విశాలమైన ప్రాపంచిక దృక్పథం, అందుకు సంబంధించిన ఆచరణ కొరవడ్డం వల్ల అవి జాతీయోద్యమంలాగా చరిత్రలో తమ స్థానాన్ని సంపాదించుకోలేకపోయాయి. రాజకీయ అధికార రంగంలో, ఆర్థిక రంగంలో తమ వంతు వాటాని పొందలేకపోయాయి.

ఇప్పుడు ఏ కులానికి ఆ కులం కొత్తగా రాజకీయ అధికారం కోసం సంఘటితపడి ఇతర కులాలతో కలిసి పని చేయాల్సిన అవసరాన్ని గుర్తించకుండా కులంలో, కులం ద్వారా తమ నాయకత్వం గుర్తింపుకు రావాలని చేస్తున్న కృషి కూడా జాతీయోద్యమ కాలంలో కులసంఘాలు నష్టపోయినట్టుగానే నష్టపోతాయి. అందరినీ ఏకం చేయడానికి కులం ఒక సాధనంగా ఉపయోగపడాలే గాని ఇతర కులాలతో, ఇతర వర్గాలతో, ఇతర మతాలతో, ఇతర ప్రాంతాలతో విభేదాలు సృష్టించుకున్నమేరకు, కలిసి ఉమ్మడిగా చేపట్టలేని మేరకు ఆయా కులసంఘాల నాయకులు, సంస్థల నాయకులు తమ ఎదుగుదలను తామే అరికట్టుకున్న వారవుతారు. పార్లమెంట్ సభ్యులు కావాలసినవారు మండలస్థాయి కులస్థాయి నాయకులుగా కుదించుకుపోతారు.

### ఇతరులను విమర్శించడం ఈక కన్నా తేలిక అన్న కబీర్

అందువల్ల సమిష్టి కృష్టికి ప్రాధాన్యతనీయకుండా నేతినేతి, ఇది కాదు ఇది కాదు అంటూ రాజకీయ నాయకులు, భావజాల కర్తలు, వారి అనుచరులు విమర్శించడం ఈక కన్నా తేలిక అన్నాడు కబీరు. తనను తాను సంస్కరించుకునేవాడు మహోన్నతుడు. పది శాతం గల దోపిడీ కులాలను, దోపిడీ వర్గాలను విమర్శించడం కన్నా తొంభై శాతం గల పీడిత వర్గాలను, బహుజన కులాలను, స్త్రీలను, పీడితవర్గ, బహుజన పక్షపాత పార్టీలను ఒక దగ్గరికి చేర్చి ఒక సమిష్టి నిర్మాణాన్ని, ఆచరణను, ఉద్యమాలను చేపట్టవలసి ఉన్నది. అందుకు తాము అంగీకరించే అంశాలన్నిటినీ క్రోడీకరించి ఆచరణకోసం ఎజెండాను రూపొందించుకోవలసి ఉన్నది. అది ప్రజలపట్ల వారికి గల నిజమైన ప్రేమను, రాజకీయ అధికారాన్ని అతి తక్కువ కాలంలో హస్తగతం చేసుకొనే చిత్తశుద్ధికి, లక్ష్యానికి గీటురాయి.



### ప్రజల మేలు కోసం పని చేస్తే...

ప్రజల మేలుకన్నా, అందరికీ రాజకీయ అధికారం కన్నా తమ వ్యక్తిగత అధికారం, అహంకారం ప్రధానం కావడంవల్ల సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, చారిత్రక, తాత్విక, తార్కిక రంగాల్లో శుష్క జల్ప, ఛల పండిత చర్చలు పెరిగాయి. ఆచరణ తరిగింది. ఇతరుల శ్రమశక్తితో సుఖపడ్తున్న దోపిడీ వర్గాలు, బ్రాహ్మణవాదులు, తార్కికులు ఇంతకన్నా మరో విధంగా ఎలా ప్రవర్తించగలరు? సమాజం మేలు కోరేవారు "ఔను" ల గొప్ప సంచయంతో పాటు ఆచరణను సమాజానికి పైవిధంగా అందించడం చేస్తారు.

### బుద్ధునిలా పని చేస్తే...

చరిత్రలో బుద్ధునిలా అలా చేయలేనివాళ్ళు నూతన తాత్విక విషయాలను చెప్పలేక తాత్విక వ్యాఖ్యానాలు నేతినేతి (ఇదికాదు-ఇది కాదు)గా వెలయించారు. ఆచార్య నాగార్జునుడు బహుశా ప్రపంచంలో మొదటిసారిగా అత్యున్నత స్థాయిలో అన్ని "ఔను" అను అన్ని "కాదు" లను క్రోడీకరించినట్టు అన్పిస్తుంఇ. అతను చెప్పిన అన్ని ఔనులను తీసికొని బౌద్ధం ముందుకు సాగింది. అతను చెప్పిన అన్ని కాదులను తీసుకొని ఆదిశంకరుడు ముందుకు సాగాడు. శూన్య వాదాన్ని ఆదిశంకరుడు అద్వైతంగా పరిణామం చెందించడం ద్వారా వర్గ దృక్పథం మరింత స్థిరపడింది. అద్వైతం "రెండులేవు" అని అనడంలోనే రెండున్నాయి. దాన్ని ఒకటిగా చెప్పడం వారికి సాధ్యం కాలేదు. కాదు కూడా. ఏమంటే వారు రెండు వర్గాలున్న సమాజంలో జీవించారు. అది ఒకటే సమాజం అని భ్రమింపజేసే ప్రయత్నం చేశారు. అందువల్ల వాళ్ళు రెండు లేవు (అద్వైతం) అని అనగలరే గానీ "ఒక్కటే" అని అనడంలో ఉండే ప్రమాదం ఏమిటో వారికి తెల్సు. "ఒక్కటే" అంటే ఔను అని అంగీకరించడమే. అప్పుడు వర్గంగా, తత్వవేత్తగా, బ్రాహ్మణవాదిగా, పాలకవర్గవాదిగా వారి ఉనికే అదృశ్యమవుతుంది.

### ఔను, కాదుల మధ్య తేడా ఎంత దూరం పోతుంది?

ఉదా॥కు నువ్వు నేను కాదన్నది కాదు అని అనడమూ, నేను "ఔనన్నది ఔను" అనడమూ రెండు ఒకటి కాదు. ఈ తేడా పైన తెల్సుకోవడం జరిగింది. నీవు నేను ఔనన్నవాటిని మనం కలిసి ఆచరిస్తూ నడవడం. కాదన్నది కాదు అనడంలో ఈ ఆచరణ భాగం లేదు. అందువల్ల కల్సి పనిచేసే క్రమం వేగవంతం కాదు. ప్రజల్నించి వేరైన బౌద్ధులు, బ్రాహ్మణవాదులు చేసింది యదే. అందువల్ల కల్సి పని చేయడానికి మనుషులు తరిగిపోయారు. కొత్త మిత్రుల్ని వెతుక్కొని వారిని శత్రువులుగా మార్చుకోవడం ఒక్కటే వారికి మిగిలింది. వేల ఏళ్ళుగా బ్రాహ్మణవాదం ఈ రకం విద్యతో రాజకీయ అధికారం ద్వారా, ఇతరులకు విద్య నిరాకరించడం ద్వారా, వారిని అణిచివేయడం ద్వారా గెలుస్తూ వచ్చింది. పీడితవర్గ పార్టీలు, బహుజన కులాల పార్టీలు, ఫెమినిస్టులు, ఇతర సంస్థలు కూడా ఇదే కోవలో సాగుతున్నాయి. దీనివల్ల వర్గాలకే, దోపిడీ కులాలకే ఎక్కువ ఉపయోగం. ప్రజలకోసం పనిచేసేవారికి ఇప్పుడా తర్కం పనికి రాదు. భిన్నాభిప్రాయాలు కలిగి వున్నప్పటికీ, అందరు కలిసి జీవించే సమాజం రూపుదిద్దుకుంటున్నది. ప్రపంచంలో అన్ని విషయాల్లో ఏకాభిప్రాయం ఏ ఇద్దరి మధ్య కూడా ఉండకపోవచ్చు. అదే

సమయంలో అందరూ ఏకీభవించే అంశాలంటూ ఎన్నో ఉన్నాయి. వ్యవస్థా, సమాజము అందరికీ అన్ని అవకాశాలిచ్చేదిగా పరిణామం చెందుతున్నది.

### తెల్సుకోవడం, కనుక్కోవడం

ఇలా సమిష్టి కృషి క్రమంలో తెల్సుకోవడం, కనుక్కోవడం ఆడిట్ చేసికోవడంలో కూడా తర్కం ఉంటుంది. ఇది తర్కవాదుల తర్కంలా ఉండదు. కొందరు పరస్పర విరుద్ధ ప్రమాణవాదులు నెలల తరబడి సైకిలుకు భాగాలు కారణమా? భాగాలకు సైకిలు కారణమా అనే ప్రశ్న తెలుసుకోవడానికి సంబంధించిన ప్రశ్న కాదు. ఆచరణకు సంబంధించిన ప్రశ్న కాదు. నిజంగానే తెల్సుకోవాలనుకుంటే, ఆచరించాలనకుంటే సైకిల్ ఎలా రూపొందింది? అది ఎందుకు? దాన్ని నడపడం ఎలా? సైకిలు రూపొందిన పరిణామ చరిత్ర ఏమిటి? అందులో గల సైన్సు సూత్రాలేమిటి? వంటి ప్రశ్నలు వేసుకుంటారు. అలా కాకుండా ఫలితాన్ని బట్టి సూర్యుడు ఉదయిస్తాడు అని చెప్పి దీనికి కారణం ఉండాలి అని కోరే తర్కవాదులు సూర్యుడు ఉదయించబడతాడు అనే నిర్ణయానికొచ్చి సూర్యుడు చంద్రునివల్ల లేదా భూమివల్ల ఉదయించబడ్డాడా? ఉదయానికి భూమి కారణమా? సూర్యుడు చంద్రునివల్ల లేదా భూమివల్ల ఉదయించబడ్డాడా? ఉదయానికి భూమి కారణమా? సూర్యుడు కారణమా అని ఏదో ఒక్కటే ఒప్పు అని చెప్పాలంటారు. కాని భూమి, చంద్రుడు, సూర్యుడు, గ్రహాలు, నక్షత్రాలు, పాలపుంత ఒకానొక పరిణామ క్రమంలో రూపుదిద్దుకున్న చలనంలో పరస్పర సంబంధంలో కొనసాగుతున్నాయని మనకు తెలుసు. దీన్ని తెలుసుకోవడాన్నే గతితర్కమంటారు.

### చలనాలను సూత్రాలుగా మార్చాలంటే ఏం చేయాలి?

మనకు తెల్సుకోవడం, కనుక్కోవడం అనే ప్రక్రియలద్వారా జ్ఞానం సంపాదించాలనిపిస్తే, ప్రకృతి సమాజ స్వభావాలను, చలన సూత్రాలను తెలుసుకోవడం ఎలా? అర్థం చేసుకోవడం ఎలా? ఏ ఏ శాస్త్రాలు, అంశాలు అందుకు అధ్యయనానికి అవసరం అవుతాయి అని ప్రశ్నిస్తాము. అదంతా తెలుసుకున్నాక "మానసిక విశ్లేషణలో, మానవ స్వభావ విశ్లేషణలో, మానవ స్వభావ విశ్లేషణలో రసాయన శాస్త్రం" కూడా ఉపయోగపడుతుందని ఎవరో అన్నారు. నిజంగా ఉపయోగపడుతుందా? అని ప్రశ్నిస్తాము. అదంతా తెలుసుకున్నాక "మానసిక విశ్లేషణలో మానవ స్వభావం విశ్లేషణలో అవసరం లేదనిపిస్తుంది అని చెప్పాలి. అవసరం లేదనిపిస్తుంది అని చెప్పాలి తప్ప "అవసరం లేదు" అని మనం తీర్పు యివ్వకూడదు. ఇలా తీర్పు యిస్తే జరిగే నష్టం ఏమంటే మనం ఆ తీర్పుకు (అన్న మాటకు) కట్టుబడిపోవాల్సి వస్తుంది. దాంతో నిజం తెలిసిన తర్వాత కూడా దాన్ని అంగీకరించలేని దశ కొంత ఉత్పన్నమవుతుంది. ఏమంటే అవసరం లేదు అని తీర్పుకు వచ్చాక మనం ఎదుటివారిని ప్రశ్నించడం దేనికి? అంటే మనం అనవసరం అని పైకి చెప్తున్నాం గాని, మనలోపల యింకేదో అనుమానం పీడిస్తున్నదన్నమాట. ఇలా ప్రశ్నించినప్పుడు, మనల్ని అంగీకరిస్తూ మనమే మళ్ళీ వాళ్ళను అవమానపరుస్తాము. ఎందుకంటే మనలో ఆత్మవిశ్వాసం కొరవడ్డంవల్లనే ఎదుటివారిని ప్రశ్నించాము కనక. దాని దొల్ల మనకు తెల్సు కనక అట్టెట్లా అని తిరగి మనవే ప్రశ్నించి వారిని అవమానపరుస్తాము. నిజానికి అది మనల్ని మనం



అవమానించుకోవడమే.

### ప్రకృతి మనిషి స్వభావాన్ని ప్రభావితం చేసే తీరు

మానవ స్వభావాన్ని అర్థం చేసుకోవడంలో ప్రకృతి శాస్త్రాలు అవసరం అని మనం అన్నామనుకో. అయితే ప్రకృతి శాస్త్రాలు లేకుండా మానవ స్వభావం అర్థం చేసుకోలేమా? అని ఎవరైనా ప్రశ్నిస్తే మరీ అలా అని ఏమీలేదు అని మనం జవాబిస్తాము. హైదరాబాదుకు విజయవాడ నుంచి వెళ్ళవచ్చు. నిజామాబాద్ నుంచి వెళ్ళవచ్చు. కరీంనగర్ నుంచి వెళ్ళవచ్చును. వరంగల్ నుంచి వెళ్ళవచ్చు. దారులు వేరు. దారిలో కలిగే అనుభవాలు వేరు. కాని అందరు హైదరాబాద్ చేరుకోవచ్చు. అట్లాగే ప్రతి మనిషి జీవితంలో విభిన్న అనుభవాలుంటాయి. అనేక మార్గాలుంటాయి. అవన్నీ కలిసి జీవిత సత్యాన్ని, ప్రాపంచిక సత్యాన్ని చేరుకుంటాయి. అందువల్ల ఫలాన వ్యూహం ఎత్తుగడలే కరెక్టు, ఫలానా పద్ధతే రైటు అని వాదించడం అంతిమంగా చలన సూత్రాలను జడత్వంలోకి మార్చుతాయి. కరీంనగర్, విజయవాడల నుండి హైదరాబాదు చేరే మార్గాలు, అనుభవాలు వేరుగా ఉండడానికి కారణం వేరు వేరు స్థలాల్లో ఉండడమే. అలాగే వేరు వేరు స్థల కాలాల్లో, కులాల్లో, వర్గాల్లో, ప్రాంతాల్లో వేరు వేరు మార్గాలు, అనుభవాలు, అవగాహనలు, పద్ధతులు, పోరాట ఉద్యమ రూపాలు వేరువేరుగా రూపొందుతాయి. అవన్నీ కలిసే సమాజ సగటు అభివృద్ధి ముందుకు సాగుతుంది.

### స్థల కాలాలు వేరయితే మార్గాలు కూడా వేరవుతాయి

అగో అట్లెట్లా? హైదరాబాదుకు విజయవాడ నుండయినా చేరాలి లేదా నిజామాబాదు నుండైనా చేరాలి. కనీసం కరీంనగర్ నుండయినా చేరవచ్చు. అంటే ఓ అర్థం ఉంది. కాని ఏ వూరునుంచైనా హైదరాబాద్ చేరవచ్చు. ఏ అనుభవాలనుంచైనా, ఏ మార్గలనుంచైనా ఏ పోరాట రూపాలనుంచైనా జ్ఞానాన్ని, లక్ష్యాన్ని, నూతన సమాజాన్ని చేరవచ్చు అని అంటే ఏమయినా అర్థం ఉందా? అని హేళన చేస్తూ వాటిలో ఏదో ఒకటి అవును అను. మిగతావి కాదు అను అంటూ సత్యాన్ని, విభిన్న స్థల కాల కులాలను, అనుభవాలను ఒకే ఒక అనుభవం యొక్క ఔను కాదులకు కుదిస్తూ జ్ఞానాన్ని, అనుభవాలని కుదించి, బంధించి చర్చ ముందుకు సాగకుండా, జ్ఞానం లోతుల్లోకి వెల్లకుండా ఒకసారి ఐనంటివి. ఒకసారి కాదంటివి ఎట్లా? అని వాదిస్తే అది వితండం, జల్పం. వారికి అది ఔను లేదా అది కాదు అనే రెండే జవాబులుండడం తప్ప వేరే తీరు జవాబులుంటాయని తెలియని ఒక స్థిర విశ్వాసం ఉండడంవల్ల అలాంటి చర్చ చేస్తారు. తెల్సుకోవాలని చేసే చర్చగాని, తెలపాలని చేసే చర్చగాని యిలా ఉండదు. అది తన అతి తెలివిని ప్రదర్శించడం కోసం చేసే చర్చవుతుంది తప్ప వారికి సత్యాన్వేషణపై ఆసక్తి లేదని అర్థం. సత్యాన్వేషణపై నిజంగా ఆసక్తి ఉన్నవారు ముందే తీర్పులకు రారు. సైకిలుకు భాగాలు కారణమా, భాగాలకు సైకిలు కారణమా అనే ప్రశ్నలో ఈ రెంటిలో ఏదో ఒక జవాబు కరెక్టు అనే తీర్పు ఇమిడిఉన్నది. లేదా ఈ రెంటిలో ఏదో ఒక జవాబులో యిరికించాలనే తీర్పు ఇమిడి ఉన్నది. ప్రతి భావజాలాన్ని, ప్రతి ఆచరణని పీడితవర్గ, బహుజన కుల, స్త్రీల అనుకూలంగానో వ్యతిరేకంగానో మాత్రమే ఉంటుందని వర్గీకరించడం కూడా ఇలాంటిదే.

**సత్యాన్వేషణ ఎలా చేయాలి?**

సత్యాన్వేషణ చేసేవారు మానవ స్వభావాన్ని, మానవ సమాజాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? ఏఏ శాస్త్రాలు, విషయాలు, పరిశీలనలోకి తీసికోవాలి అని ప్రశ్నిస్తారు. ఇలా ప్రశ్నించడంలో కూడా ఏవో శాస్త్రాలు, విషయాలు పరిశీలనకు తీసుకోవాల్సిన అవసరం ఉంటుంది అనే తీర్పు యిమిడి ఉన్నది. ఈ తీర్పు మరీ అంత చెడ్డది కాదు. ఏమంటే జవాబు చెప్పేవారి వివేచనకు వదలిన పరిధి విశాలమైనది. కాని సైకిలుకు భాగాలు, భాగాలకు సైకిలు అనే జవాబులా దోపిడీ వర్గాలు, పీడిత వర్గాలు, దోపిడీ కులాలు, బహుజన కులాలు, స్త్రీలు, పురుషులు అంటూ ప్రతిదాన్ని రెండు మాత్రమే ఉండాలని రెండుగా వర్గీకరించి ఒక చట్రంలో యిరికించే ప్రయత్నం చేయడం సత్యాన్ని చూడ నిరాకరించడమే.

**జడములను చర్చిస్తే చలనాలు చర్చించినట్లు కాదు**

పూర్వ తర్కవాదుల చర్చా శాస్త్రం 'జడం'లను చర్చిస్తుంది. చలనాల్ని జడంలుగా మార్చడంకోసం చర్చిస్తుంది. తీర్పులన్నీ 'జడం'లే. ఒక దశ దాటాక తార్కిక సత్యాలు కూడా విశ్వాసాలుగానే కొనసాగుతాయి. ఈ విషయాన్ని అర్థం చేసుకున్న క్రమం నుండే ప్రతి మనిషికి ఒకే వలువ, ఒకే ఓటు ఉన్న తత్వం రూపుదిద్దుకున్నది. ఈ స్థాయికి ఎదగని తత్వాలు, చర్చలు సమాజంకన్నా వెనుకబడి పోయాయి. సత్యం వేరు. తార్కిక సత్యం వేరు. సత్యానికి సాక్ష్యాలతో పని లేదు. తార్కిక సత్యం తర్కంమీద ఆధారపడి అది సత్యంగా ఒక భ్రమను, అంచనాను, అవగాహనను సృష్టిస్తుంది. తార్కికత యొక్క పర్యవసానంగా ఆచరణకోసం దృక్పథంగా ఎదుగుతూ ఏర్పడే స్థిరీకృత రూపమే విశ్వాసం. దైవం కూడా ఒక తార్కిక సత్యంగానే రూపుదిద్దుకుంది. నాస్తికత్వం కూడా తార్కిక సత్యంగానే రూపుదిద్దుకుంది. ఈ రెండూ విశ్వాసాలుగానే కొనసాగుతాయి.

**తర్కం కూడా ఒక విశ్వాసంగా మారడానికే, మార్చడానికే**

ప్రతి తర్కమూ, తార్కిక క్రమమూ విశ్వాసంలోకి పర్యవసిస్తాయి. విశ్వాసాన్ని చూరగొనడం కోసమే తర్కం, తార్కిక సత్యాలు సాధనాలుగా పనిచేస్తాయి. ప్రతి తార్కిక క్రమమూ తనదైన విశ్వాసాలమవైపుకు తీసుకెళ్ళే క్రమాలు కావడం వల్లనే ఇన్ని రకాల తర్కాలు, ఇన్ని రకాల తార్కిక సత్యాలు రూపుదొద్దుకోవడం సాధ్యపడింది. తార్కిక సత్యాల్లో ఇన్ని వైవిధ్యాలుండడానికి పునాది అవి సత్యాలుగా కాకుండా అనుమాన ప్రమాణాన్ని ఇతర సత్యాలతో విభిన్న స్థల కాలాల్లో విభిన్న ప్రయోజనాల కోసం నిర్ధారించే ప్రయత్నం చేయడంలో ఉంది. అందుకే ఆమూర్త సత్యము లేదని సాపేక్ష సత్యము మాత్రమే ఉంటుందని అంటారు.

**అందరికీ తెలిసిన విషయాలే అయినా ఎందుకు ఇలా ప్రవర్తిస్తారు?**

ఈ విషయాలు చాలామందికి తెలుసు. తర్కవాదులకు, భావజాల కర్తలకు రాజకీయ నాయకులకు ఇంకా ఎక్కువగా తెలుసు. తెలుసు కనుకనే తిమ్మిని బమ్మి చేసైనా తాను చెప్పింది నమ్మేట్టు చేసి తనను అనుసరించేటట్టు చేస్తారు. అందువల్ల ఎవరి పోరాటమూనా నేను నుండే ప్రారంభమై మీకోసమే, సమాజం కోసమే ఇదంతా అనే క్రమంలోనే ముందుకు వస్తుంటాయి. నోటి బలంను అనుసరించి, అతని చిత్తశుద్ధిని



అనుసరించి, త్యాగాన్ని అనుసరించి ఆయా స్థల కాలాలను అనుసరించి, మనం ఉన్న స్థితి, దశ, ప్రాంతం, కాలంను అనుసరించి మనం వాటిని నమ్ముతాము. స్వీకరిస్తాము. ఆచరిస్తాము. అంతేతప్ప ఇవాళ మనం ఆచరించేది ఒకటే రైటు మిగిలినవాళ్ళు ఆచరించేది తప్పు అనుకోవడం గాని, నిన్నటిదాకా మనం వేరే తీరుగా ఆచరించింది బొత్తిగా తప్పు అని గాని అనుకోవడం కూడా ఇవాళ ఏర్పాటు చేసుకున్న విశ్వాసాలననుసరించే ఉంటాయి. రేపు ఈ విశ్వాసాలు కూడా మారుతాయి. ఆస్తికులెందరో నాస్తికులయ్యారు. నాస్తికులెందరో ఆస్తికులయ్యారు. ఒక భావాజాలన్నుంచి మరో భావజాలానికి ఎప్పటికప్పుడు మారుతూనే ఉంటారు.

**భావాలు కూడా ఆస్తి రూపాలే**

భావాలు కూడా ఆస్తి రూపాలే. ఆస్తి అనేది ఒక భౌతిక పదార్థరూపం. అది చైతన్యరూపంలోనూ వుంటుంది. అనగా జ్ఞానం అతని ఆస్తి అని అంటాం. అంటే ఏమిటి? పదార్థం, పదార్థ విజ్ఞానం, జ్ఞానం రూపంలో అతని ఆస్తిగా వుందని! మరిన్ని వివరాలకు "గతితర్క తత్వ దర్శనభూమిక" చూడవచ్చు. భౌతికరూపంలో వున్నది మాత్రమే ఆస్తి కాదు. అది భావాల రూపంలో సంస్కృతి రూపంలో, అధికారరూపంలో కూడా ఉంటుంది. చైతన్యంయొక్క ఎన్ని రూపాల్లోనైనా ఆస్తి వుండవచ్చు. చైతన్యం, నిర్వహణ సామర్థ్యం. జ్ఞానం, భావజాలం, అధికారం అనేది కూడా ఒక పదార్థమే.

**విరుద్ధాంశాల ఐక్యత ఎన్ని రూపాల్లో వుంటుంది?**

భావవాదంలో భౌతికవాదం వున్నట్టే భౌతికవాదంలో భావవాదం వుంటుంది. స్త్రీలో పురుషుడుంటాడు, పురుషుడిలో స్త్రీ వుంటుంది. అందువల్లే స్త్రీలో పురుషుడు ఉత్పన్న కాగలుగుతున్నాడు. పురుషుడి ద్వారా స్త్రీ ఉత్పన్నం కాగలుగుతున్నది. అది ఎలా జరుగుతున్నదో సైన్సు విద్యార్థులకు, ఎక్స్, వై క్రోమోజోముల చర్చతో వివరంగానే తెలుసు.

కొందరు హిందూమతం కొనసాగినంతకాలం కులం, కులం కొనసాగినంతకాలం, సామాజిక అసమానతలు కొనసాగుతాయని అనడంలో ఒక ధర్మాగ్రహం ఉంది. వాస్తవం వుంది. అయితే అది పూర్తి సత్యం కాదు. రాజకీయ అధికారం సాధించకుండా మతంమారినా పెద్దగా ప్రయోజనంలేదని చరిత్ర నిరూపిస్తున్నది. రాజకీయ అధికారమే బౌద్ధం, ఇస్లాం, వీరశైవ, క్రైస్తవ మతాలవ్యాప్తికి, వాటి గౌరవానికి కూడా కీలకంగా పనిచేసింది. అందువల్ల మతం మార్పిడి గురించి కాకుండా రాజకీయ అధికారం కోసం పోరాడాలి. ఒకాయన అన్నట్లు రాజకీయ అధికారం ముందు అగ్రకులాలే కాదు, 33 కోట్ల దేవతలు కూడా దాసోహం అంటారు.

**కులవివక్షత అంతరిస్తే కులం కొనసాగుతుందా?**

కులవివక్ష అంతరిస్తే కుల అసమానతలు తగ్గుతాయి. తద్వారా కులాతీత దృక్పథం, సంస్కృతి విస్తరిస్తుంది. "కులం, వర్గం , లింగం, సోషలిజం" అనే వ్యాసంలో చెప్పినట్టు ఇవి తనలో తాను, తన కొరకు తాను సోషలిజాన్ని ఆచరిస్తాయి. ఆ సోషలిస్టు ఆచరణ లేకపోతే అవి అవిగా నిర్మాణాలు అదృశ్యమౌతాయి. మార్క్సిజం కూడా "క్లాస్ ఫర్ ఇట్ సెల్ఫ్, క్లాస్ ఇన్ ఇట్ సెల్ఫ్ " మాత్రమే ఉంటుందని అంటుంది. "క్లాస్ ఫర్

అదర్స్" ఉండదని అంటారు. భారతీయ తత్త్వశాస్త్రాల్లో తనలో తాను, తన కొరకు తానుతో పాటు ఇతరుల కొరకు తాను కూడా ఉంటుందని పరోపకారం చేస్తూ జీవించాలని చర్చించారు. కులం ఇలా తనలో తాను, తనకొరకు తాను సోషలిజాన్ని ఆచరిస్తున్నది. మరింత వివరంగా కులవర్గం సోషలిజం వ్యాసంలో చూడవచ్చు.

**చార్వాకులు, బుద్ధుడు మనకు ఏం నేర్పారు?**

చార్వాకులు ఏ వస్తువును ఎలా తయారుచేయాలో నేర్పలేదు. బుద్ధుడు ఏ సంపద ఎలా సృషించాలో నేర్పలేదు. మనం ఎలా ఆలోచించాలి? మనం సమాజాన్ని ఎలా నిర్మించుకోవాలి అని చెప్పారు . మన ఆలోచనలు, జ్ఞానం ఎలా సాగాలో నిర్ణయించేది మన దృక్పథం. బ్రాహ్మణవాదులు ఈ దేశాన్ని సర్వనాశనంలోకి నెట్టిన బ్రాహ్మణవాద దృక్పథాల్ని ప్రచారం చేశారు. చేస్తున్నారు. సంపదలు సృష్టించే పనిలో వున్నారు గనక బహుజనులు ఈ దేశాన్ని నిరంతరం అభివృద్ధిపరిచే ఆలోచనలు చేశారు. బహుజనుల దృక్పథం తాటాకుల్లో కాకుండా వారి యింగిత జ్ఞానంలో, సంస్కృతిలో, ఆచరణలో మిళితమై వుంది. అది సామెతల్లో నుడికారాల్లో కూడా కనపడుతూ వుంటుంది.

**కోట్లాది ప్రజల ఆచరణ ఒక సిద్ధాంతంలోకి పరాయీకరించడం ఎలా జరిగింది?**

వందలాది కోట్ల ప్రజల ఆచరణతో విశ్వవ్యాప్తంగా వేలఏళ్ళుగా సాగిన నిరంతర ఆచరణనుండి పుట్టిన జ్ఞానాన్ని మార్క్సు పేరిట మార్క్సిజం అని పిలువడం అంత అపచారం, పరాయీకకరణ మరొకటి లేదు. కానీ ఒక ప్రతీకగా మార్క్సిజం అని పిలుస్తున్నాం. అలాగే భారత సామాజిక విముక్తి సిద్ధాంతాలనందించిన ఫూలే, అంబేద్కర్‌ల కృషిని అంబేద్కరిజం అని పిలుస్తున్నాం.

**భావజాల చర్చ ఒక యుద్ధం-యుద్ధంలో మొదట చచ్చేది చంపేది సత్యాన్నే**

భావజాల చర్చనేది ఒక యుద్ధం. యుద్ధంలో మొదట చంపబడేది, చచ్చేది సత్యం. గెలుపు ఓటములే నిర్ణాయక అంశంగా పనిచేసే ప్రతి చర్చలో సత్యం గతి ఇదే గతి అయ్యే అవకాశం ఉంటుంది. గెలుపు ఓటముల ప్రసక్తి రెండు విషయాలను మాత్రమే ముందుకు తెస్తుంది. ఆ రెంటిలో ఏదో ఒకటి కరెక్టు అనే భావాన్ని కీలకం చేస్తుంది. ఆ రెంటికీ భిన్నమైన సత్యాన్ని స్వీకరించకుండా ఆ రెండూ కలిసి పనిచేస్తాయి. దాన్నే ప్రధాన సమస్య అని, ప్రధాన వైరుధ్యమని దబాయిస్తారు.

ఉదాహరణకు ఉద్యమ ప్రాంతాల్లో నక్సలైట్లను సమర్థిస్తారా లేక ప్రభుత్వాన్ని సమర్థిస్తారా అని ప్రశ్నించుకుంటారు. నక్సలైట్లని సమర్థించకపోవడం, నక్సలైట్లను వ్యతిరేకించడం ప్రభుత్వాన్ని సమర్థించడమే అని అంటారు. అక్కడికి నక్సలైట్లే మొత్తం ప్రజలైనట్లు మొత్తం సమాజమైనట్లు ఈ చర్చ ఉంటుంది. వాళ్ళు కాని సమాజం తొంభై శాతం ఉంది. వాళ్ళు చేరలేని, వాళ్ళు పట్టించుకోలేని సమాజం ఎంతో ఉంది. కొద్ది వందల మందికి పరిమితమైన పార్టీ మొత్తం ప్రజలకు ప్రతినిధిని అని చెప్పుకోవడంలోనే కుట్ర ఉంది. తార్కిక సత్యం ద్వారా వాస్తవ సత్యంగా భ్రమింపజేసే చర్య ఇది.

**సమగ్ర సామాజిక చలనాలను లెక్కలోకి తీసుకోవాలి**

ఈ రెంటికీ భిన్నంగా అటు ప్రభుత్వానికి, పాలక వర్గాలకు, నక్సలైట్లకు,



కమ్యూనిస్టులకు అతీతంగా తమకు తామే బాగుపడాలని, రాజకీయ అధికారంలోకి రావాలని, తామే మెజారిటీ అని ప్రజలను, సమాజాన్ని నమ్మించే మక్కు ప్రతి పార్టీకి, సంస్థకు, ఉద్యమానికి ఉంది. ఈ హక్కును అంగీకరించడానికి సిద్ధంగా లేనివాళ్ళు తమకు వ్యతిరేకంగా మాట్లాడేదంతా ప్రజా వ్యతిరేకమైనదని, విప్లవ వ్యతిరేకమైనదని అని అనుకుంటారు.

**అంతిమ సత్యమంటూ వుంటుందా?**

**మార్క్సిజం అంతిమ సత్యం ఎలా అవుతుంది?**

అంతిమ సత్యమంటూ ఏదీ లేదు. మన అధ్యయనం, అనుభవం, మనం ఉన్న స్థల కాలాలు, వయస్సుననుసరించి మనకు కలిగిన అవగాహనతో ఇతరులతో కలిసి పని చేస్తూ ముందుకు సాగడమే. ఇప్పుడు అంబేద్కరిజం అధ్యయనం చేసి బాగుందనిపిస్తే చర్చ ఎందుకు? మనకు నచ్చిన మేరకు దాన్ని ఆచరిస్తూ పోవడమే. సామాజిక ఆచరణలో భాగంగా సత్యాన్ని ఆవిష్కరించుకుంటూ సాగడమే. ఆచరణ అనే చెరువు ఒడ్డున తాను నిలబడి అందులో మునిగి తేలేవారిని, ఈత నేర్చేవారిని, సమాజాన్ని మార్చేవారిని, విమర్శిస్తూ కూర్చోవడం పరిష్కారం కాదు. మన జీవితం సత్యం. మన జీవితాచరణ సత్యం. మన జీవితాచరణకు, సామాజిక జీవితానికి మధ్య నిరంతర సమన్వయ, వైరుధ్య సంబంధంలో సమిష్టి కృషిలో సత్యం ఆవిష్కరించబడుతుంది. విడిగా ఎవరికి వారు పని చేయడం పరిష్కారం కాదు. ఇప్పటిదాకా కలిగిన తెలివిడిని అనుసరించి ఆచరణలో ఇతరులతో కలిసి సాగుతూ పోవడమే తప్ప దానికి భిన్నంగా షార్టు కట్స్ లేవు.

అంబేద్కరిజం నీకు అర్థం అయితే ఆచరించు. అర్థం కాకపోతే చర్చ ఎందుకు అతని పుస్తకాలు చదువు. అంబేద్కరిజం నీకు అర్థం అయితే చర్చ ఎందుకు? దాంతో నీ అభిప్రాయాలు నీకేర్పడాలి. ఆచరించాలి. అర్థం అయి కాలేదనే దశలో ఉంటే నీకు నచ్చిన, నీవు విశ్వసించిన వారితో కల్సి ఆచరణలో కలిసి సాగుతూ మరింత అర్థమయ్యే దశకు చేరుకోవాలి.

అంబేద్కరిజాన్ని నీవు అంగీకరిస్తూ చర్చ ఎందుకు? నీకు వీలైన వారితో దాన్ని కలిసి ఆచరించుకుంటూ ముందుకు సాగు. అంబేద్కరిజాన్ని అంగీకరించకపోతే చర్చ ఎందుకు? నీకు నచ్చిందేదో నీవు ఆచరించు. అంబేద్కరిజాన్ని చదవకపోతే నీతో చర్చ ఎందుకు? కమ్యూనిజం చదవకపోతే నీతో చర్చ ఎందుకు. చదివితే నీకు నచ్చిందేదో ఆచరించు. ఫెమినిజం చదివితే చర్చ దేనికి? నీకు నచ్చితే ఆచరించు.

**సామాజిక ఆచరణ ప్రాధాన్యత**

ఈ ప్రశ్నలన్నీ దేన్ని తెలియజేస్తాయి? చర్చ అనేది కలిసి పని చేయడంలో ఉపయోగపడుతుందేమోగానీ, కల్సి పని చేయనపుడు చర్చ అవనవసరం అని స్పష్టం చేస్తున్నది. ఈ కారణంగానే ఆయా సామాజిక ఉద్యమాలు, తమతో కల్సి పనిచేసేవారిని ఎడ్యుకేట్ చేయడానికి క్లాసులు, ముచ్చట్లు సంభాషణలను చర్చా ప్రక్రియలుగా ఉపయోగిస్తుంటారు. కల్సిరాని వారి గురించిన చర్చ కాలాన్ని తినేస్తుంది. ఆచరణ వాయిదా పడుతుంది.

### జ్ఞానం పల్లానికి ప్రవహిస్తుంది

జ్ఞానం నీరు వంటిది. అది పల్లానికి ప్రవహిస్తుంది. ఇద్దరు చర్చిస్తుంటే ఒకందుకు మంచిదే. జ్ఞాని అనుకున్న వాడే అజ్ఞాని అయితే అతని జ్ఞానం పెరుగుతుంది. ఎదుటి వారే అజ్ఞాని అయితే జ్ఞానాన్ని అందిస్తాడు. ఎలాగైనా ఇద్దరికీ లాభమే. అయితే అది స్నేహపూరితంగా జరగాలి. చర్చ శత్రుపూరితంగా సాగితే సత్యాలు రెండుగా విడిపోతాయి. చెరో సత్య ఖండాన్ని పట్టుకొని నాదే కరెక్ట్ అంటారు. దీన్ని గతి తర్క తత్వ దర్శన భూమిక గ్రంథంలో వివరంగా చర్చించాను. అందుకే నేను స్నేహంగా వుండే వారితో చర్చకు అభ్యంతరం చెప్పను. నా నుండి వారికైనా ప్రవహిస్తుంది వారి నుండి నాలోకైనా ప్రవహిస్తుంది. అజ్ఞానులతో, మూర్ఖులతో చర్చ చాలా కష్టం. సమ స్కందులతోనే జ్ఞానం పల్లానికి ప్రవహించడం సాధ్య పడుతుంది. విద్యార్థిగా నేర్చుకొనే స్వభావం వున్నప్పుడే జ్ఞానం పల్లానికి ప్రవహిస్తుంది.

చాతనైనకాడికి మనకున్న జ్ఞానాన్ని ఇతరులకు అందించాలి. చిత్తశుద్ధితో, స్వార్థరహితంగా, త్యాగశీలతతో కృషి చేస్తూ వారి విశ్వాసం పొందాలి. ఎదుటివారి ఆత్మవిశ్వాసం పెంచాలి. చర్చల ద్వారా ఎదుటివారి ఆత్మవిశ్వాసాన్ని, ఆత్మగౌరవాన్నీ నీచపరచడం తర్కపద్ధతిలోని ఒక ప్రధాన లోపనం. తాను చెప్పదల్చుకున్న విషయం కోసం యితరుల వ్యక్తిత్వ హత్యాకాండ చేయడం హంతక లక్షణం. నిండు హృదయంతో ప్రేమించి అతన్ని మనతో కలుపుకొని ముందుకు సాగే చర్చ ప్రేమపూరితంగా ఉంటుంది. బుద్ధుని పద్ధతిలో దాన్ని చూడవచ్చు. జిడ్డు కృష్ణమూర్తిలోను దీన్ని కొంతమేరకు చూడవచ్చు.

### ఎవరో మెచ్చాలని పువ్వు పూయదు - పువ్వుగా పూయడం దాని స్వభావం

వేల ఏళ్ళనాటి తర్కవాదాలు మెచ్చాలని ఏ పూవు, ఏ భావం పూయదు. పువ్వుకు పువ్వుగా పూసే స్వభావం ఉంది. అది చెట్టునుండి సంక్రమించింది. ఆలోచనల పూవులను పూయవద్దు అని అడ్డగించడం కోసం తర్కాన్ని వినియోగించడం అర్థరహితం. అనుభవాల నుండి ఆలోచనలు, కొత్త సిద్ధాంతాలు పుట్టుకొస్తాయి. స్పందన, భావం, అనుభవం, కొత్త, ఎరుక జీవిత వృక్షం నిరంతరం పూసే పూవులు. గతంలో పూసిన పువ్వుకన్నా నువ్వెందులో మిన్న? నీ ప్రత్యేకత ఏమిటి అంటూ పాత భావజాల తర్కవాదుల మూసల్తో, సిద్ధాంతాల్తో కొలిచి ప్చ్! అని అనడం వెనకచూపు. పాత పూవుకన్నా గొప్పగా, కొత్తగా ఉంటే నీవు పూయాలి అని ఆలోచనలను, కొత్త సిద్ధాంతాలను, పాతవాడిలో వేసి దంచడం దోపిడీ వర్గాలు, దోపిడీ కులాలు చేసేపని.

### పాతదాన్ని పట్టుకొని చర్చిస్తే ఆ కంపంతా నీక్కూడా అంటుకుంటుంది

పాతదాన్ని పూర్వపక్షం చేయకుండానే కొత్తది రావచ్చు. చచ్చిపోయి కుళ్ళు కంపువాసన గొట్టే పాతసూత్రాల్ని మనం నూతన పూవులకంటించి దుర్గంధపూరితం చేయకూడదు. అలా చేస్తే రెండువేల ఏళ్ళనాటి తాత నీ ముత్తమ్మతో సెక్సులో అనుభవించిన సుఖంకన్నా కొత్తది, గొప్పది అయితేనే నీవు కొత్త జంటగా, కొత్త సెక్సులో పాల్గొనాలని అడిగి నట్టుంటుంది. తర్కవాదంలో పూర్వపక్షం చేయాలనే చర్చ. ఎవరి ఆచరణ వారికి ఆనందం. మనం కొత్త బట్టలేసుకోవడం మనకానందం. పాతవి చినిగినవా? మంచిగానే ఉన్నవి గదా! అతుకులు వేసి కుట్టుకుని తొడుక్కోవచ్చుగదా



అని కొందరు తర్కవాదులు ముసలి తాతలా అరుస్తారు. మనం కొత్తబట్టలు, నేయలేక పోయినపుడు, కొనుక్కోలేకపోయినపుడు గదా, పాత బట్టల్ని వేసికోవాలనుకునేది? ఈ సమాజం తనకు తాను ఎప్పటికప్పుడు కొత్త తత్వాలను, దృక్పథాలను సృష్టించుకోలేనపుడే పాత వాటిపై ఆధారపడడం అనే ప్రశ్న ఉత్పన్నమవుతుంది.

### ఏ తరానికి ఆ తరం ఆలోచించుకుంటుంది
### ఏ తరానికి ఆ తరం కష్టపడి పని చేస్తుంది

మన కొత్త కొత్త అందమైన పూలు, ఆలోచనలు పాతబట్టలంత బాగాలేవు అని నిర్ధారించుకుంటూ రావడమే పాత తర్కవాదులు చేయగలిగే పని. హిందూత్తవాదులు మార్క్సిస్టులు బహుజన వాదాలపట్ల, ఉద్యమాలపట్ల చేస్తున్న దీవనే మనం నేసిన బట్టలు, మనం పండించిన పంట, మనం కన్నకొడుకు మనకు ముద్దు. మన తోటలోని పూలు మనకు ముద్దు. ఎవరివో వాడిపోయిన పూవులు ఎంతమంచివైతే మనకెందుకు? బహుజనులుగా, మానవులుగా మనం కొత్త సిద్ధాంతాలు, కొత్త పోరాట రూపాలు, కొత్త ఉద్యమాలు నిర్మించుకుందాం. కొత్త సమాజాన్ని ఏర్పరచుకుందాం.

పరోక్ష జ్ఞానాన్ని ఏదో రూపంలో సొంతం చేసుకొని అది వారి సొంతమన్నట్టుగా చూపిస్తూ, ఊరిస్తూ ఇతరులలో, నేటి తరంలో ఇన్ఫీరియారిటీ కలుగజేయడం ఆటవిక ఆనందం పొందే లక్షణం. చర్చ లేనపుడు హాయిగా ఉండేవారిని చర్చ తర్వాత సంశయవాదిగా అనుచరుడుగా మార్చడం చర్చలో ఇమిడి ఉండే ఒక లక్షణం. ఇది సొంత ఆలోచనని అడ్డగిస్తుంది.

### జ్ఞానం అనుకరణ నుంచి పుడ్తుంది

జ్ఞానం అనుకరణ నుంచి పుడ్తుంది. అనుకరణ నుంచి అది సొంత అనుభవ మవుతుంది. ఆదిమానవులు ప్రకృతిని, జంతువుల్ని చూసి అనుకరించారు. దాన్నించి వేటను, వలసను, ఈతను, వ్యవసాయాన్ని నేర్చుకున్నారు. మొట్టమొదటగా జంతువుల్నించి కుక్కను మచ్చిక చేసుకున్నారు. వేటలో భాగంగా జంతువుల లాగా అరిచారు.

### సొంత అనుభవం సొంత ఆలోచనలను పెంచుతుంది

సొంత అనుభవం సొంత అనుభూతులను, సొంత ఆలోచనలను కలుగజేస్తాయి. సొంత ఆలోచనలనుంచి కొత్త ఆలోచనలు పుట్టి అవి జ్ఞానాన్ని అభివృద్ధి పరుస్తాయి. ఇప్పటిదాకా మానవ సమాజం సాధించిన జ్ఞానాన్ని నేర్చుకోవడం అనుకరణ. మాతృభాష తల్లినుండి కుటుంబం, పరిసరాలనుండి అభ్యాసమవుతుంది. కులమత, వర్గప్రాంత భావాలు, సంస్కృతులు అనుకరణ ద్వారానే అబ్బుతాయి. ఇది నాది, నా వాళ్ళది అనే సొంతం చేసికొనే స్పందనలు, జ్ఞానం నుండి కుల, మత, వర్గ, ప్రాంత, భాషా సంస్కృతులు, విద్య, వైద్య, విజ్ఞానం, సైన్సుల్లో ఫలానావి నావి, ఫలానావి నావి కాదు అనుకుంటారు.

### నాది అనే భావన మంచిది, చెడ్డది కూడా

ఈ కులం నాది, ఆ కులం నాది కాదు, ఈ మతం నాది, ఆ మతం నాది కాదు

అనే ఆలోచనవల్లే పొరుగునే సహజీవనం చేస్తున్నప్పటికీ అతని కులం నీ కులం కాదనీ, నీ కులానికి సంబంధించిన సంస్కృతి, సాంఘిక హోదా, వ్యక్తిత్వ నిర్మాణాన్ని సొంతం చేసుకోవడం జరుగుతుంది. నేను స్త్రీని నేను మగవాన్ని కాదు అనుకోవడం నుంచి ఒకే యింట్లో, మగవాళ్ళున్నప్పటికి వాళ్ళ హావభావాల్ని, భాషను అలవాట్లను అనుకరించకుండా స్త్రీలనే కాదు అనుకోవడం నుంచి ఒకే యింట్లో తల్లి, అక్క, చెల్లి వంటి స్త్రీలున్నప్పటికీ వారిని అనుకరించకుండా మగవాళ్లను అనుకరించడం ద్వారా మగవాళ్ళుగా మారుతారు. ఇలా మారడమే సహజం అనుకోవడం సమాజం. యిలాగే కొనసాగాలి అనుకోవడానికి సంబంధించిన చైతన్యమే తప్ప సహజంగా అబ్బేది కాదు. ఏదీ సహజంగా (పుట్టుకతో) అబ్బదు. పెంపకంతో, ఇది నాది, అది నాది కాదు అనే మనస్సును అనుసరించి, ఆలోచనను అనుసరించి "సహజం" లాగా అభ్యాసమౌతుంది.

**మనిషి ప్రాథమిక అవసరాలు**

ఆకలి తీరడం మనిషి ప్రాథమిక అవసరం. ఆకలి తీరిన తర్వాత జీవించే జీవితం అదనపు జీవితం. ఆకలి తీర్చుకోవడం కోసమే జీవించడం జంతువు స్థాయి జీవితం. ఆకలి తీరిన తర్వాత జీవించే అదనపు జీవితాన్ని, సుఖాలు అని, భోగభాగ్యాలు, పరోపకారం అని వర్గీకరిస్తారు.

**నాగరికత పుట్టుక ఎలా మొదలైంది?**

ఆకలి తీర్చుకునే క్రమం నుంచి మానవ నాగరికత పుట్టుక మొదలైంది. ఏది దొరుకుతుందో ఏది అరుగుతుందో, ఏది అరుగక, ఏది విషంగా శరీరానికి నష్టం చేస్తుందో గ్రహించి వాటిని వదిలేస్తూ రావడం ద్వారా ఆహారపు అలవాట్లు రూపొందాయి.

**పంచేంద్రియాలు కాదు - అవి అష్టాంగాలు**

మనిషికి అష్టాంగాల ద్వారా, అష్టేంద్రియాల ద్వారా జ్ఞానం అందుతుంది. అవి కన్ను, చెవి, ముక్కు, నోరు, చర్మం, కాళ్ళు, చేతులు మర్మావయవాలు, తెలియని విషయాలను తెల్సుకోవడం జ్ఞానం. కంటితో చూసి, చెవితో విని, చర్మంతో స్పర్శించి, నాలుకతో రుచి చూసి, ముక్కుతో వాసన చూసి అవయవాలతో, నరాల స్పందనతో గ్రహించి విషయాలను తెల్సుకొంటాయి. నాలుక ముక్కులాగే కాళ్లు, చేతులు, మర్మావయవాలు వాటికి ప్రత్యేకించిన పనులు చేస్తాయి. చేతివృత్తులు, హస్తకళలు, డప్పు, వీణ, టైపు, చిత్రలేఖనం, లిపి మొదలైన వాటితో చేతులు ప్రత్యేకమైన నైపుణ్యంతో పనిచేస్తాయి. ఆనవ సమాజంలో కాళ్లు, చేతులు, మర్మావయవాలు నిర్వహించే పాత్ర అమోఘమైనది. అందువల్ల పంచేంద్రియాలు అని చెప్పడం కన్నా అష్టేంద్రియాలు అని చెప్పడం సముచితం. ఈ ఎనిమిది ఇంద్రియాల ద్వారా మనిషి తన వెలుపలి ప్రపంచాన్ని తెల్సుకుంటాడు.

ఈ ఎనిమిది ఇంద్రియాలద్వారా మనిషి ప్రకృతి, సమాజాలతో సంబంధంలోకి వస్తాడు. వీటి ద్వారా స్వయంగా ప్రత్యక్షంగా తెల్సుకొన్న వాటినుండి రూపొందిన జ్ఞానం. పరోక్ష జ్ఞానం అంటే యితరులు స్వయంగా ప్రత్యఓంగా తెల్సుకొన్న వాటినుండి రూపొందిన జ్ఞానం. మనకు ప్రత్యక్ష అనుభవం లేకపోయినా పొందగలిగేదంతా పరోక్ష



జ్ఞానం స్కూళ్లు, కాలేజీలు, శిక్షణా తరగతులు, శిక్షణ, సాధన, పాఠ్య పుస్తకాలు, గ్రంథాలు, పద్ధతులు, కథలు, కళలు మొదలైనవి మానవ సమాజం యింతదాకా సాధించిన జ్ఞానాన్ని 'పరోక్ష జ్ఞానం'గా పొందటానికి రూపొందించుకున్న వ్యవస్థలు, పద్ధతులు అని పైన చూసాము.

**ఆచరణ నుండి పుట్టిన అనుభూతులు చాలా కాలం వుంటాయి**

ఆచరణ నుంచి పుట్టిన ఆవాలు, జ్ఞానం, అనుభూతులు చాలా కాలం కొనసాగుతాయి. ఒక ఆచరణ నశించినప్పటికీ దాన్నించి పుట్టిన భావాలు, జ్ఞానం, అనుభూతులు నశించకపోవచ్చు. అవి చాలాకాలం కొనసాగవచ్చు. అందువల్ల ఆచరణకన్నా దాన్నించి పుట్టిన భావాలు, జ్ఞానం, అనుభూతుల జీవితకాలం ఎక్కువ. పాత ఆచరణ తాలూకు భావాలు, జ్ఞానం ఆచరణ లేకుండానే తెలుసుకునే అవకాశం ఉంది. ఈ కోణంలో ఆచరణకన్నా దాన్నించి పుట్టిన భావాలు, జ్ఞానం ఉన్నతమైనవి. ఆచరణ లేకుండా భావాలు లేనప్పటికీ ఆచరణ లేకుండా భావాలు, జ్ఞానం కొనసాగడం సాధ్యపడడంవల్ల భావాలకు, జ్ఞానానికి ప్రాధాన్యత ఏర్పడింది. అందువల్ల భావాలపై, జ్ఞానంపై హక్కు సాధించినవారికి సమాజంపై హక్కు, అధికారం, గౌరవం పెరిగాయి. తర్కశాస్త్రం ప్రాధాన్యత అలా రూపుదిద్దుకుంది.

**ఓడిపోతే నీకు శిష్యున్ని అవుతాను**
**గెలిస్తే నాకు శిష్యునివి కావాలి అనడం దేనికి?**

ఆటవిక దశలో రూపొందించుకున్న తార్కిక ప్రమాణాలు, చర్చలు తర్క శాస్త్రంలో శిష్యరికం చేయాలి అని తర్కవాదులు షరతు విధించుకునేవారు. ఇది వర్గ పోరాటాల, ఆటవిక సమాజాల రాజనీతి సూత్రం. దీన్నించి సమాజం ఎదిగిది. అభిప్రాయాలు ఖండించబడినప్పటికీ తన అభిప్రాయాలు తాను కలిగి ఉండే హక్కు ఏర్పడింది. మన అభిప్రాయాలు మారుతాయి. ఉదాహరణకు ఒకసారి ఓడించిన పార్టీనే మనం తిరిగి గెలిపిస్తుంటాము. అందువల్ల ఎదుటివారు భిన్నాభిప్రాయాలు కలిగి ఉండే హక్కును, దాన్ని వ్యక్తీకరించే హక్కును, గౌరవించే ప్రజాస్వామిక సమాజానికి మానవ సమాజం ఎదుగు తోంది. ప్రతి మనిషికి ఒకే విలువ, ఒకే ఓటు అనే భావన మనుషులందరినీ సమాజం చేసి చూడ్డం నుండి ఉత్పన్నమయింది. దీన్ని ప్రాచీన తర్కశాస్త్రాలు, వాటి చర్చా నిర్మాణ పద్ధతులు అంగీకరించవు. తర్కశాస్త్రాలు ఈ విషయంలో గిడసబారిపోయినాయి. ఏమంటే వాటి నిర్మాణ పద్ధతిలో, చర్చా పద్ధతిలో ఇద్దరిలో ఒకరే కరెక్టు అనే వర్గ విభజన, కించపరచడం, నిరాకరించడం ఉంది. అందువల్ల ప్రపంచంలో ఇటీవల దీన్ని అధిగమించి ప్రతిదానికి ఎస్ ఆర్ నో అనే జవాబుకు బదులుగా ఎస్ అండ్ నో అనే జవాబు పుట్టింది.

**తత్వశాస్త్రాలు రాజ్యాంగాల కన్నా ఎంతో వెనుకబడిపోయాయి**

చాలా తత్వశాస్త్రాలు, తర్కశాస్త్రాలు ప్రతి మనిషికి ఒకే విలువ, ఒకే ఓటు అనే తత్వాన్ని అంగీకరించడానికి సిద్ధంగా లేవు.

తత్వశాస్త్రం ఆలోచనను, తర్కశాస్త్ర చర్చను ప్రాథమికం చేస్తుంది. ప్రతి మనిషికి ఒకే విలువ, ఒకే ఓటు అనే సూత్రీకరణ ఆలోచనను కాకుండా మనిషి ఆచరణను,

మనిషిని, మనిషి విలువను, ప్రాథమికం చేస్తుంది.

### రాజ్యాంగాలు భావాల కన్నా మనిషిని ప్రాథమికం చేస్తాయి

భావంతోపాటు మనిషిని ప్రాథమికం చేయడం ప్రతి మనిషికి ఒకే విలువ, ఒకే ఓటు అనే తత్వంలో ఉంది. మనిషి మనిషి కోసమే మనిషి ఆచరణలో భాగంగా పుట్టిన భావాల ద్వారా కొందరు మనిషిపై చేసే పెత్తనానికి ఒక అడ్డూ అదుపు ఉంచి తిరిగి మనిషిని, సమాజాన్ని ఉన్నతంగా నిలబెట్టే ప్రజాస్వామ్య తత్వం ఎదుగుతున్నది.

ఇలా వేల ఏళ్ళ తర్వాత తత్వశాస్త్రంలో, తర్కశాస్త్రంలో భావాలు, చర్చలు, తర్కబోధకులు, ప్రమాణ వివేచనలు వాటి అధిపతులు ఆక్రమించిన స్థానాన్ని తిరిగి మనిషి, సమాజం ఆక్రమించేదిగా సమాజం పరిణతి చెందుతున్నది.

### ఎక్కువ తెలివిగలవాడే ఎక్కువ మోసం చేస్తాడు

జ్ఞానం కొందరి వ్యక్తిగత ఆస్తిగా మారుతూ సమాజం నుండి పొంది సమాజాన్నే శాసించేదిగా ఒక రాజ్యంగా పరాయీకరణగా ఉనికిని ప్రారంభించినప్పటి నుండి ప్రజలు ఈ జ్ఞానులకు బలి అవుతూనే ఉన్నారు. ఏమంటే ఎక్కువ మోసం చేయగలడు. ప్రజలు మానవులుగా జ్ఞానులందరితో సమానంగా జీవించే హక్కుతో బతికే రాజ్యాంగబద్ధ హక్కు ప్రజాస్వామ్య వ్యవస్థలో ఏర్పడింది. ఇది విశ్వమానవాళి వేల ఏళ్ళ కృషి పరిణామంలో సాధించుకున్న ఫలం. తత్వశాస్త్రాలు కొన్ని వర్గాల, గ్రూపుల, మతాల, దృక్పథాల వ్యక్తిగత ఆస్తిగా కొనసాగే మేరకు అవి మొత్తం మానవాళి సాధించిన ఫలాలకు వెనకబడి పోతున్నాయి.

### జ్ఞాన సంపన్నులే ఎక్కువ మోసం చేస్తారు

జ్ఞానం కొందరి వ్యక్తిగత ఆస్తిగా, పెట్టుబడిగా 'రాజ్యం' గా మారడంతోపాటు మానవ సమాజ ఆచరణలో భాగంగా సైన్సు సమాజ శాస్త్రాలు, కళలు అభివృద్ధి చెందుతూ వచ్చాయి. సమాజ శాస్త్రాలు పరిణామం చెందుతూ వచ్చాయి. సమాజ శాస్త్రాలు సైన్సు అభివృద్ధికీ, అడ్డంకికీ రెంటికీ తోడ్పడ్డాయి. తత్వశాస్త్రాల, తర్కశాస్త్రాల కేవల చర్చ సైన్సును, ఆచరణను అప్రధానం చేస్తూ అడ్డగిస్తాయి. ప్రతి వాదాల్లో దేన్నో ఒక దాన్ని సమర్థించాలి అనే అర్థం తర్కశాస్త్రాల్లో ఇమిడిఉన్నది. దీనివల్ల ఇరు పక్షాల్లో ఎవరో ఒకరిని గెలిపించండి అనే భావం కొనసాగుతుంది. సైన్సురీత్యా వాళ్ళిద్దరి వాదాలు పైన చేసిన సూర్యుని చర్చలో లాగా తప్పు కావచ్చు. ఇలాంటి వాద ప్రతివాదాల తర్క శాస్త్ర చర్చా పద్ధతి వల్ల మానవ సమాజం జ్ఞానం ఆచరణ ఆ ఇద్దరిలో ఎవరో ఒకరికి ఓటేసే ఓటర్లుగా మిగిలిపోవాల్సి వస్తుంది. తద్వారా ఈ రెండు పక్షాల్లో దేనికో ఒకదానికి అనుకూలంగా ఉండేది మాత్రమే తర్కబద్ధంగా ప్రకరణ సహితంగా కనబడి కొత్తది లేదా వారిద్దరిని వ్యతిరేకించే వివేచన ప్రకరణ భంగంగా తర్క భంగంగా, టెక్ భంగంగా, నిర్మాణ భంగంగా, ప్రజా ద్రోహంగా వారికి కనపడుతుంది. సత్యం అసత్యంగా నిరూపించబడుతుంది. కొత్తది నిరాకరించ బడుతుంది.

### పాండవులు, కౌరవులు కలిసి గిరిజన తెగలను సామంతులుగా మార్చుకున్నారు

అందువల్ల వీళ్ళిద్దరినీ వ్యతిరేకించే వారిని వాళ్ళిద్దరు ఒకటై కలిసి ఓడించే



ప్రయత్నం చేస్తారు. పాండవులు కౌరవులు రెండు పక్షాలుగా మారి మొత్తం గిరిజన తెగల్ని, రాజ్యాల్ని తమ సామ్రాజ్యంలో కలుపుకున్నారు. భారత యుద్ధంలో పాండవులు గెలిచినా, కౌరవులు గెలిచినా ఆ గిరిజన తెగలు, రాజ్యాలు సామంత ప్రజల్లాగే కొనసాగుతారు. అక్బరు, రాణాప్రతాప్‌ల యుద్ధంలో ఎవరు గెలిచినా మొగతా ప్రజలు వారి వారి పాలితులే అవుతారు. అలాగే మాదే గొప్ప పోరాటం. మాదే గొప్ప భావజాలం, మాదే గొప్ప పార్టీ అనే వాళ్ళు పాండవులో, కౌరవులో గెలవాలి తప్ప మరో శక్తి గాని, మరో పార్టీ గాని, మరో ఉద్యమం గాని, ప్రజలు గాని గెలవకూడదు అనే రాయలసీమ ఫ్యాక్షన్ లాంటి తత్వంలో ఉన్నారని అర్థం.

### లిపి రూపొందిన తరువాత జ్ఞానం అందడం సులువైంది

లిపి రూపొందించిన తర్వాత తర్కవాదాలలో గెలుపు ఓటములతో పని లేకుండా పరోక్ష జ్ఞానం తరతరాలకు అందడం సులభమైంది. సంస్కృతి సంప్రదాయాలు, అలవాట్లు, భాష యిప్పటికీ లిపితో కాకుండా ఇంట్లో, యిరుగు పొరుగుతో అనుకరణ ద్వారా రూపొందుతాయి. లిపి నాగరిక మానవునికి చిహ్నం. ఈరోజు మార్కొని, గ్రహంబెల్, ఐన్‌స్టీన్, న్యూటన్, నోబెల్, మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, మావో, గాంధీ, నెహ్రూ కన్నా ఎక్కువ విషయాలు ఇంటర్ విద్యార్థికి తెలుసు. ఆలోచనా తీరుల్లో మునుపటి మహా మేధావులకన్నా యిప్పటి విద్యార్థులకు ఎక్కువ విషయాలు తెలుసు.

### శాస్త్రాలు ఎలా పెరుగుతూ పోయాయి?

తెల్సుకుంటూ పోయిన జ్ఞానం పెరిగి పెరిగి ఎన్నో శాస్త్రాలుగా రూపొందాయి. ఏ శాస్త్రానికి ఆ శాస్త్రానికి ఆ శాస్త్రం తెలుసుకోవడం, కనుక్కోవడం, కొత్తవి ఊహించడం, అభివృద్ధి పరుచుకోవడం, వివేచించడం అనే క్రమాలు రూపొందించుకున్నాయి. వీటన్నిటి క్రమాలను తెల్సుకోవడాన్ని "గతి తర్కం" అని పిలుస్తారు. ఈ దృష్టిని భౌతికవాద ప్రాపంచిక దృక్పథం అని అంటారు. ప్రతి శాస్త్రానికి తర్కం దేనికదిగా రూపొందాక ఎదిగిన మానవ జ్ఞాన క్రమాలను, వాటిలోని సూత్రాలను ఒక్కచోట చేర్చి వాటన్నిటినీ సమన్వయించి కొన్ని సాధారణ సూత్రాలుగా రూపొందించడం మొదలైంది. సాధారణ సూత్రాలు సైన్సు యొక్క క్రమాలను తెల్సుకోవడానికి తిరిగి పనికి వస్తాయి. అయితే సాధారణ సూత్రాలే సైన్సు కాదు. సైన్సును మరింత తెలుసుకోవడానికి, కనుక్కోవడానికి, అన్వేషించడానికి, ఊహించడానికి, అందుకు సహకరించే వాటిని సాధారణ సూత్రాలుగా రూపొందించు కోవడం జరుగుతూ వస్తున్నది. సైన్సుపై సాధారణ సూత్రాలను రుద్దితే అది తిరిగి వెనకటి తర్కశాస్త్రంలోని తర్కం, వితండం, జల్పం, ఛలంగా మారిపోతాయి. మార్క్సిస్టులు ఈ పని చాలానే చేసారని ఎంగెల్స్ వాపోయాడు.

### కామన్‌సెన్స్ అంటే ఏమిటి?

అందరూ అంగీకరించిన, మానవ సమాజం సాధించిన అత్యున్నతస్థాయి జ్ఞానాన్ని అందుబాటులోకి వచ్చిన మేరకు దాన్ని "కామన్ సెన్సు" (ఇంగిత జ్ఞానం) అని పిలుస్తారు. ఇంగిత జ్ఞానం అనేది ఒక సమాజపు సాధారణ స్థాయిని తెలుపుతుంది. అలా శుష్కతర్కం స్థానంలో ఇంగిత జ్ఞానం ప్రాధాన్యత వహించింది. అలాగే తత్వశాస్త్రం ఆచరణతో ప్రత్యక్ష సంబంధం లేకుండా కూడా కొనసాగే శాస్త్రాలు. కాగా ఇందుకు

విరుద్ధంగా ఇంగిత జ్ఞానం, ప్రాపంచిక దృక్పథం, విశ్వాసం, సంస్కృతి అనేవి ఆచరణతో ప్రత్యక్ష సంబంధమున్న శాస్త్రాలు. అలాగే సామాజిక శాస్త్రాల అభివృద్ధి ఎటు సాగినా సామాజిక న్యాయం, సామాజిక మార్పు అనేవి ప్రాధాన్యతలోకి వచ్చాయి.

**దృక్పథాలన్నీ విశ్వాసాలే తప్ప సత్యాలు కావు**

దృక్పథాలన్నీ విశ్వాసాలే. ఎవరి తర్కాన్ని వారు నిర్మించుకున్న విశ్వాసాలను దృక్పథం అంటున్నాము. విశ్వాసం వ్యక్తి స్థాయినుండి సామాజిక స్థాయిలోకి మారినప్పుడు వ్యవస్థీకృతం అయిందంటారు.

వ్యవస్థీకృతమయ్యేది మతంగా మారుతుందని అంటుంటారు.

ఏ దృక్పథమైనా ఈ అర్థంలోనే విశ్వాసంగా కొనసాగుతుంది.

మతం, సంస్కృతి, ఫ్యాషన్ ఒకే విషయం యొక్క మూడు స్థాయీ దశలు.

హృదయం స్పందించి ఒక విషయాన్ని స్వయంగా ఆచరించడం ఫ్యాషన్.

దాన్ని ఒక సంప్రదాయంగా ఆచరింపచేసే స్థిరీకృత రూపం సంస్కృతి.

దానికి తార్కిక మద్దతు తెలిపేది మతం, దృక్పథం లేదా విశ్వాసం.

ఉదాహరణకు ధోతి ఒకప్పుడు ఫ్యాషన్.

ఇప్పుడు కొందరికది సంప్రదాయం.

మతం సంస్కృతిగా, విశ్వాసంగా మారినపుడు మార్చుకోవడం కష్టం.

మతాన్ని, దృక్పథాన్ని, విశ్వాసాన్ని మార్చుకోవడం ఇంకా కష్టం.

తార్కిక సత్యాన్ని వాస్తవిక సత్యంతో సంబంధం లేకుండా, విడదీసి నమ్మినపుడు ఆ విశ్వాసాన్ని మార్చడం కష్టమౌతుంది.

**వాస్తవం ఒక్కటే, దృక్పథాలు దారులు అనేకం**

వాస్తవం ఒక్కటే. దృక్పథాలు, దారులు అనేకం. గమనం, గమ్యం వేరు కాదు. గమనమే గమ్యం. అది నేనుల పరస్పర సంబంధంలో ఒకే అది (సూర్యుడు) అనేక నేనుల్లో అనేక విధాల దృక్పథాలు, భావనలు, ముద్రలు, అనుభూతులు, ఆచరణలుగా కనపడడానికి, వాటికి భిన్న విలువలు కోణాలు ఏర్పడ్డానికి అది యొక్క విభిన్న పార్శ్వాలతో పాటు నేనుల్లో గల భిన్న స్వభావాలు, స్థల కాలాలు జీవిత క్రమాలు, విశ్వాసాలు ప్రియారిటీలు, విలువలు మొదలైనవి ప్రధాన కారణం. దీన్ని ప్రకృతి సమాజం పరిసరాలు అని పిలువవచ్చు. అందువల్ల చూసే కన్నును బట్టి, విశ్వాసాన్ని బట్టి అది యొక్క స్వభావం అది అయినా కాకపోయినా అది నేనులో అది సంబంధంతో రూపుదిద్దుకున్న కొత్తది కావచ్చు. అది రెంటి సంబంధంలో సృష్టి అయిన అదనపు విలువ అదనపు జ్ఞానం అవుతుంది.

**మాటలకందని భావాలు, ఆచరణ**

మాటలకందని భావాలుంటాయి. ఆచరణకందని భావాలుంటాయి. స్పందించగలిగే ప్రతి హృదయానికి ఈ విషయం తెలుసు. తర్కం వ్యక్తీకరించే భావాలతో చర్చిస్తుంది. చాలామంది తమ భావాల్ని పూర్తిగా వ్యక్తం చేయలేరు. ఒక్కోసారి వ్యక్తంకన్నా అవ్యక్తమే ఎక్కువగా ఉంటుంది. కళ్ళు చెప్పే భావాలు భాషకందకపోవచ్చు.



సన్నిహితులు చనిపోయినప్పుడు ఏడ్చే ఏడ్పు ద్వారా మొత్తం బాధను వ్యక్తం చేయగలమా? ఎంత గొప్ప రచయితనైనా, కళాకారుడికైనా అది సాధ్యమా? అందువల్ల రాసే చేయి, మాట్లాడే నోరు, వ్యక్తీకరించే శక్తి, వ్యక్తీకరించాల్సిన అవసరం లేనంత మాత్రాన భావాలు లేనట్టు కాదు. తర్కం చర్చ అనేవి భావాలను మాటలకు పరిమితం చేసి అవ్యక్తాన్ని, మౌనాన్ని, నిశ్శబ్దాన్ని నిరాకరిస్తుంది. తర్కంలోని మరో ప్రధాన లోపం ఇది.

**సైన్సు ఫలాలు అందరికీ అందాలి**

మానవ సమాజం సాధించిన సైన్సు ఫలాలు అందరికీ అందడం, అసమానతలు కనీస స్థాయికి తగ్గించడం పరస్పర ప్రేమ, సహృదయత, పరోపకారం అనేవి అన్నిటా ఉండే సాధారణ సామాజిక తత్వం ప్రజానుకూలమైనది. అలా లేనిది ప్రజానుకూలమైనది కాకపోవచ్చు. అది ప్రజా వ్యతిరేకమైనది కావచ్చు.

**కేవలం తర్కంమీద ఆధారపడితే నోరున్నవాడిదే ఊరవుతుంది**

జ్ఞానం, జ్ఞాపకశక్తి పరస్పర సంబంధమైనవి. జ్ఞాపకశక్తి పెరగకుండా జ్ఞానం పెరగడం కష్టం. జ్ఞాపకశక్తి పెరగాలంటే ఏం చేయాలి? గత అధ్యాయంలో చెప్పినట్టు ఆ యా విషయాల అధ్యయనాన్ని వ్యక్తిగత అభిరుచి, ఆసక్తి, సంకల్పబలంతో, ఉన్నత లక్ష్యాలతో, చిత్తశుద్ధితో కృషిచేసిన మేరకు మన జ్ఞానం, జ్ఞాపకశక్తి, ఆసక్తి, సామాజిక ఆచరణ విశాలమౌతుంది.

మెదడు అప్పుడప్పుడు లోడు పెరిగిందని మొండికేసి మంచి విషయాన్ని కూడా గుర్తుంచుకోవడం మానివేయవచ్చు. అందువల్ల జ్ఞానం, జ్ఞాపకశక్తి పెరగడానికి ప్రశాంతమైన మనస్సు, నిర్మల హృదయం, సహృదయత ఎంతో అవసరం. అందుకు మెదడులోని అనవసరమైన ఒత్తిడులను ఆవేశకావేశాలను తగ్గించుకోవడం అవసరం.

శరీరానికి, మనసుకు మధ్య సంబంధాన్ని సమన్వయించడం అవసరం. ఆరోగ్యంగా జీవించడం అవసరం. ఆరోగ్యమే మహాభాగ్యం అని సూక్తి. శరీరానికి మనసుకు సమన్వయం సాధించడానికి అనవసరమైన ఒత్తిడులను తగ్గించుకోడానికి యోగ, ధ్యానం, పతంజలి చెప్పిన పంచకోశ శుద్ధి అవసరమని అంటారు.

ఓషో రజనీష్, జిడ్డు కృష్ణమూర్తి, బుద్ధుడు ధ్యానం ప్రాధాన్యతను నొక్కి చెప్పారు.

అయితే జిడ్డు కృష్ణమూర్తి జ్ఞానమనేది సమాచారమేనని అది నిజమైన జ్ఞానం కాదని దాన్ని పట్టుకుని వెళ్ళాడకూడదని అంటాడు.

**ఆలోచనకు హృదయ స్పందనకు మధ్య తేడా ఎందుకు వుంది?**

మనిషి మెదడులో వివేచనకు సంబంధించిన భాగాలు, స్పందనలకు సంబంధించిన భాగాలు వేరువేరుగా ఉన్నాయి. వాటిమధ్య దూరం తగ్గుతూ వస్తున్నది. ఒక 10 వేల ఏళ్ళు గడిచాక ఈ రెంటి మధ్య దూరం తగ్గి రెండూ ఒకటవుతాయి అని అంచనా వేస్తున్నారు.

అంతదాకా కోపం రావడం, ఆవేశం రావడం, ద్వేషం పెరగడం తప్పని తెలిసీ వివేచన ఉన్నప్పటికీ అవి కలుగుతూనే ఉంటాయి. వాటిని అణిచివేయడం కాకుండా గమనించడం ద్వారా అదృశ్యం చేయగలగాలి. అందుకు నిన్ను నువ్వే ప్రేక్షకుడిగా

గమనిస్తూ ఉండు అంటారు. అందుకు ధ్యానం ఉపయోగం అంటారు.

ఏ శాస్త్రానికి ఆ శాస్త్రం వేల ఏళ్ళ ప్రత్యక్ష అనుభవాల పరిణితి క్రమంలో తనదైన ఆడిటింగ్, పునర్ వివేచన, తర్కాన్ని రూపొందించుకోవడం జరిగింది.

అన్ని శాస్త్రాల్లో జరిగిన అభివృద్ధి సూత్రాలను ఒకచోట చేర్చి మానవ సమాజం స్వేచ్ఛ, సమానత్వం, సోదరత్వం, కరుణ, ప్రేమతో అందరూ సమానంగా ఎదగగలిగే ప్రత్యేక కృషితో సమన్వయించడం సామాజిక శాస్త్రాలు చేస్తున్న పని.

**తర్కం తల్లిగారింటిని తిట్టిపోస్తుంది**

తర్కశాస్త్రం తన తల్లిగారి వైపు బంధువులందర్నీ తిట్టిపోసేవిగా మారిపోయి దీనమైపోయింది. ఆ నోటిదురుసుకు భయపడి సొంత చెల్లెలు, సొంత కూతురు అయినప్పటికీ ఆ యింటికి వెళ్ళడానికి భయపడే దశ - తర్కం ఇలాంటి వారి చేతిలో వాఇరనుంచి మోక్షంగాని, విశ్వాసంగానీ లభించేట్టులేదు. మరో శాస్త్రంలోకి దాన్ని మార్చుకొని క్రోడీకరించడం సంశ్లేషించడం అవసరం. ఆ అవసరాన్ని జ్ఞానం శాస్త్రం తీరుస్తున్నది. అందువల్ల తర్కశాస్త్రం మరో పనికి మారిన పాతసామానులా మారిపోతున్నది.

**తర్కంలో జ్ఞానం కూడా వుంటుంది**

అయితే తర్కం అంటే యిది మాత్రమే కాదు. తర్కం తెల్సినదాని ద్వారా తెల్సుకోవలసిన దాన్ని తెల్సుకునే ప్రయత్నం చేస్తుంది. 'తెల్సింది' ముందుగా ఎలా తెల్సింది? నిప్పు కాలుతుంది, అనేది అనుభవంతో తెల్సింది. ఎవరైనా చెప్తే తెలుస్తుంది.

**తర్కం అనుభవ క్రమంలేకుండా తీర్పులను అందిస్తుంది**

"నీరు పల్లానికి ప్రవహిస్తుంది" అనేది ఎలా తెలుస్తుంది? అది ప్రవహిస్తున్నది పల్లమే అని ఎలా తెల్సు? కొండమీద నించి ధారాళంగా కిందికి ప్రవహించడం చూసి నీరు పల్లానికి ప్రవహిస్తుందని గమనించారు. మేఘాలనుండి వర్షం కింద పడడం చూశారు. వాగులు, నదలు, కిందికి ప్రవహించడం చూశారు. తాను చేత్తో పీకి చల్లినా నీరు కిందికే రావడం చూసారు. ఇలా ఎన్నో నిర్దిష్ట విశేషాలను (విశిష్టాలను) పరిశీలంబన అనుభవాలతో ఒక 'నిశ్చయానికి', 'తీర్పుకు' (జడ్జిమెంటుకు వస్తారు).

**నిశ్చయాలు, తీర్పులు పూర్తి సత్యాలు కావు**

అయితే అన్ని 'నిశ్చయాలు' 'తీర్పులు' పూర్తి సత్యాలు కాకపోవచ్చు. "పాలు వేడిగా ఉంటాయి" అని తెనాలి రామలింగని పిల్లి అనుకొంది. తెనాలి రామలింగడు వేడి వేడి ఆపలు తాగుమని పెట్టేసరికి మూతి కాలింది. ఇక అది ఆపలు చూడగానే మూతి కాలుతుందని పారిపోవడం మొదలైంది. పిల్ల ఆపలు ముట్టదనుకునే వాళ్లు ఇంట్లో పిల్లికి కనపడేటట్టు వేడి వేడి పాలు పెడ్తే పిల్లి మూతి కాలుతుంటే - పాలజోలికి వెళ్లదు. వేడి లేని పాలు ఉట్టి మీద పెడ్తూ వేడి పాలు మాత్రమే అందుబాటులో పెడ్తే పిల్లి మూతి కాలుతుంది అనుకుంటుంది. బీసీ, ఎస్సీ, ఎస్టీలకు రాజకీయాలు, రాజ్యాధికారం, ముట్టుకుంటే మూతి కాలుతుంది అనేవిధంగా అనుభవాలు కలిగిస్తారు. ఇలాంటి 'తీర్పులు', 'నిశ్చయాలు' సరైనవి కాకపోవచ్చు. తెనాలి రామలింగడు ఆ పాలు



ఎలా తాగుతున్నాడో పిల్లి గమనిస్తే తెనాలి రామలింగని ఉపాయం పనికిరాదు.

**ప్రజాస్వామ్యం కన్నా తర్క శాస్త్రాలు వెనుకబడిపోయాయి**

ముఖ్యంగా, తత్వశాస్త్రాలు, సామాజిక శాస్త్రాలు అన్ని శాస్త్రాల్లో జరిగిన అభివృద్ధిని వాటి సాధారణ సూత్రాలను ఒక చోట చేర్చి సమన్వయించి సమాజ వ్యవస్థలను రూపొందించే కృషి చేస్తున్నాయి. ముందే చెప్పినట్టు తర్కశాస్త్రాలు ప్రజాస్వామిక రాజ్యాంగాలకన్నా, వాటి స్ఫూర్తి కన్నా ఎంతో వెనుకబడిపోయాయి.

ప్రజాస్వామ్యంలో నిర్ణయ స్వేచ్ఛ, ప్రతి మనిషికి, ఒకే విలువ, ఒకే ఓటు అనేది అత్యున్నత స్థాయికెదిగిన మానవ తత్వచింతన. రాజకీయ రంగంలో ఇది చట్టబద్ధంగా అమలులో ఉంది. మిగతా రంగాల్లో దీన్ని సాధించాల్సి ఉంది. కులం, మతం, ఆడ-మగ విచక్షణ అందరూ సమానం అనే దాన్ని అడ్డగిస్తున్నాయి.

మానవీయ సమాజంగా ఎదగడానికి అడ్డొచ్చే ప్రతిదాన్ని చైతన్యవంతంగా మార్చడం ద్వారా మానవ సమాజం నూతన సమాజంగా రూపొందుతుంది. దీన్ని ఎలా సాధించాలో మానవత, ప్రేమ, కరుణ అధ్యాయంలో వివరంగా పరిశీలించాం. వాటిని మరోసారి గుర్తుచేసుకోవడం అవసరం. మానవతను మించిన సిద్ధాంతాలేవీ లేవు. ప్రజాస్వామ్యం దీన్ని సాధించడానికి స్వేచ్ఛ, సమానత్వం, అందరికీ ఒకే విలువ, నిర్ణయ స్వేచ్ఛ మార్గంగా, గమ్యంగా నిర్ణయించుకుంది. ప్రజాస్వామ్యాన్ని మానవీయం చేస్తూ ప్రేమ, కరుణపూరితంగా సమాజం పరివర్తన చెందడం కోసం మానవాళి ఉన్నత లక్ష్యాలతో నిరంతరం సమిష్టిగా కృషి చేయడం అవసరం.

## ప్రశ్నలు

1. జ్ఞానం అంటే ఏమిటి? తర్కం అంటే ఏమిటి?
2. జ్ఞానం, తర్కం ఎలా రూపొందుతాయి?
3. సత్యాన్ని దేని ద్వారా నిర్ధారించాలి? పూర్వ ప్రమాణాలేమిటి?
4. తార్కిక నిపుణులు, ఆడపిల్లల ఆట ఎలా వుంటుందో వివరించండి.
5. గెలుపు, ఓటముల ప్రసక్తి ఫ్యూడలిజానికి చెందిన సూత్రాలు ఎలా అవుతాయి?
6. చెప్పలేనిస వ్యక్తం చేయలేని హృదయానుభూతులను ఎలా అర్థం చేసుకోవాలి?
7. సాక్ష్యం లేకపోతే హత్య జరగనట్టేనా? వివరించండి.

8. తార్కికులు పొడిచేసేదంతా ఆడిట్ పార్టీ వ్యవహారమే! ఎలా అవుతుందో వివరించండి.

9. తర్కం ఒక బలాత్కార చర్య ఎలా అవుతుంది? వివరించండి.

10. తత్వం, తర్కం ఎన్ని రూపాల్లో కొనసాగుతుంది?

11. తత్వానికి తెలుసుకోవడం, కనుక్కోవడం, ఊహించడం, వివరించడం ఎలా మూలాలుగా కొనసాగుతాయి?

12. చలనాలను సూత్రాలుగా వివరించాలంటే ఏం చేయాలి?

13. స్థలకాలాలు వేరైతే మార్గాలు కూడా ఎందుకు వేరౌతుంటాయి?

14. జడములను చర్చిస్తే చలనాలను చర్చిస్తున్నట్టు అవుతుందా? వివరించండి.

15. తర్కం కూడా ఒక విశ్వాసంగా మారడానికే, మార్చడానికే. ఎలానో వివరించండి.

16. అంతిమ సత్యం అంటూ వుంటుందా? మార్క్సిజం అంతిమ సత్యం ఎలా అవుతుంది?

17. ఏ తరానికి ఆ తరం ఆలోచించుకుంటుంది. ఏ తరానికి ఆ తరం కష్టపడి పనిచేస్తుంది. ఎలానో మీ అనుభవాలను వివరించండి.

18. తత్వశాస్త్రాలు రాజ్యాంగాల కన్నా ఎలా వెనుకబడిపోయాయి?

19. జ్ఞానసంపన్నులే ఎక్కువ మోసం ఎలా చేస్తుంటారో వివరించండి.

20. దృక్పథాలన్నీ విశ్వాసాలే తప్ప సత్యాలు కావు. ఎలానో వివరించండి.

21. నిశ్చయాలు, తీర్పులు పూర్తి సత్యాలు కావు. ఎలానో వివరించండి.

22. ప్రజాస్వామ్యం కన్నా తర్కశాస్త్రాలు ఎలా వెనుకబడిపోయాయో వివరించండి.



# సింహావలోకనం

ఈ పుస్తకంలో అనేక విషయాలు పరిశీలించబడ్డాయి. జీవితం అంటే ఏమిటి? ఎలా జీవించాలి? చర్య ప్రతిచర్యలకు అతీతంగా ఎలా జీవించాలి? ఇప్పుడు జీవిస్తున్న జీవితం ఎలా ఉంది? జీవనశైలి, సంస్కృతి ఎలా రూపొందుతుంది? అనే అంశాలు, పలు కోణాల్లో పేర్కొనబడ్డాయి. వీటిలో అనేక వైవిధ్యాలు చూడవచ్చు. మనిషి దృక్పథాల్లో ఎంత వైవిధ్యం వుందో, ప్రతి విషయంలో అది ఎలా ప్రతిఫలిస్తుందో ప్రతి అధ్యాయంలో విశ్లేషించడం జరిగింది. వీటన్నిటి వైవిధ్యపూరితమైన, వైరుధ్యాలను, విరుద్ధ అంశాల్లోని ఐక్యతను, భిన్నత్వంలో ఏకత్వాన్ని, ఏకత్వంలో భిన్నత్వాన్ని సంశ్లేషించడం జరిగింది.

ఈ పుస్తకం చదివాక జీవితం కన్నా, దృక్పథం ప్రధానం కాదు అని కూడా అంతిమ సారాంశం చెప్పడం జరిగింది. మహాభారతం కురువంశ బాలకుల విద్యాభ్యాసంతో మొదలై పాండవుల మహాప్రస్థానంతో ముగుస్తుంది. ఒక నిర్వేదం మిగులుతుంది. జీవిత పరిణామాలను అంతిమ శాంతిలో, చావులో పర్యవసించిన క్రమం మహాభారతం ముగింపులో చూడవచ్చు. అయితే మహాభారతాన్ని ఎందుకు రాసినట్లు? ఎందుకు వేల సంవత్సరాలుగా మానవ జీవితంలో అది కొనసాగుతున్నట్లు? అంతిమ సారాంశం కాకుండా, జీవిత పరిణామాలే అసలు జీవితం. చావు, పుట్టుకల మధ్యనున్నదే జీవితం. అందుకే మహాభారతం ఒక మహా దర్శన శాస్త్రంగా ఇప్పటికీ కొనసాగుతున్నది. ఈ పుస్తకంలో కూడా అన్నీ చెప్పి దృక్పథాల, సిద్ధాంతాల ప్రాధాన్యతను కూడా చెప్పి ఇవన్నీ జీవితంలోంచే పుడుతున్నాయి కనుక జీవితం పరిణామాలను అనుసరించి దృక్పథాలు, సిద్ధాంతాలు కొత్తవి పుడుతునే వుంటాయి. ఎదుగుతునే వుంటాయి. కనుక జీవితమే ప్రధానం అని చెప్పడం జరిగింది. చాలా మంది తత్వవేత్తలు, అలంకార శాస్త్రవేత్తలు, సాహితీ వేత్తలు జీవితమే అన్నిటికీ ప్రాథమికమని నిర్ధారించారు.

బుద్ధుడు ఒక మాట చెప్పాడు. నేను చెప్పానని విశ్వసించవద్దు. మీ జీవితంలో అది అనుభవం మీద సత్యమని తేలితేనే విశ్వసించండి అని అన్నాడు. ఇందులోని చర్చలు, సిద్ధాంతాలు, కోణాలు నేను చెప్పానని విశ్వసించవద్దు. మీ జీవితంలో మీ అనుభవం మీద సత్యమని తేలితేనే విశ్వసించండి. మిగతా విషయాలను లోకంలో ఇతరులు ఎలా భావిస్తున్నారో తెలుసుకోవడం జరిగిందని భావించండి. అవి ఇతరుల జీవితాల్లో సత్యం కావచ్చు. కనుక వాటిని పనికట్టుకొని వ్యతిరేకించనవసరం లేదు. అవసరం లేని బేరం చేయడం సమయం వృథా. అవసరమైనవి స్వీకరించండి, అవసరం

లేనివి వదిలి వేయండి. అవి ఇతరులకు ఉపయోగమేమో!

ఇందులో ఒక భావజాల, సిద్ధాంతాల నిఘంటువులా ఒకచోట చేర్చిన కృషి కనపడుతుంది. దేని అర్థం దానిదే. దేని అవసరం దానిదే. ఎవరి అవసరం వారిదే. వారి వారి అవసరాలను అనుసరించి, అనుభవాలను అనుసరించి ఇందులోని అంశాలను స్వీకరిస్తుంటారు. నిఘంటువులో అన్ని పదాలు ఎప్పుడూ ఒకేసారిగాని, ఒక్కరికేగాని అవసరం పడకపోవచ్చు. అయినప్పటికీ అన్ని పదాల అర్థాలు రాయడం నిఘంటుకారుల కర్తవ్యం. నేను కూడా ఇందులో సామాజిక సిద్ధాంతాలను అవసరం అనిపించినవి వివరించాను. అవసరం అనిపించినవే చర్చించాను. అన్నీ అందరికీ నచ్చకపోవచ్చు. కొన్ని అంశాలే నచ్చవచ్చు. అవసరం పడవచ్చు.

భారతదేశంలోని ఒక చారిత్రక ఘట్టంలో ఈ గ్రంథం వెలువడుతున్నది. 2006 నవంబర్ నాటి చారిత్రక దశ వకు పరిణామాలను ఇందులో విశ్లేషించడం జరిగింది. మిత్రులు చూసి కఠినంగా వుందన్న భాగాలను ఇందులో సులభం చేశాను. ఉదాహరణలు పెంచాను.

ఇందులోని వ్యాసాలు కొన్ని 1993 - 98 మధ్య పత్రికల్లో వ్యాసాలుగా, పుస్తకాలుగా కూడా వెలువడ్డాయి. ఇప్పుడు వాటిలో పలు మార్పులు, చేర్పులు చేయడం జరిగింది. తద్వారా కొత్తగా రాసినంత పనైంది. కొన్ని కొత్త వాక్యాలు చేర్చడం, అక్కడక్కడా ఇమడడంలేదని తీసేయడం, మళ్లీ రాయడం జరిగింది. ఇది నిజంగా కష్టమైన పని. కొత్తది రాయడమే సులభం. అయితే ఇలా ఎందుకు చేయాల్సి వచ్చింది?

వివిధ చారిత్రక సమయాల్లో రాసిన వ్యాసాలను వాటి నేపథ్యం తెలియకుండా అర్థం చేసుకోవడం కష్టం. వాటిని యథాతథంగా అచ్చు వేయాలనుకుంటే ఆ వ్యాసాలు, పుస్తకాలు వెలువడిన చారిత్రక భావజాల దశలను వాటి పరిణామాలను వివరంగా చెప్పవలసివుంటుంది. అది సామాజిక పరిణామాల చరిత్ర లేఖనమే అవుతుంది. అది ఇంతకన్నా చాలా పెద్ద పని. బాధ్యతాయుతమైన పని. అందువల్ల వీటిని నేటి యువతరం కొత్త పాఠకులకు అనువుగా మార్చడమే సులభమనిపించింది.

ఆ యా ఉద్యమ నాయకులు, ఆ యా పార్టీల మేధావులు, జీవితాన్ని వారి సిద్ధాంతాలకు సామాజిక ఆచరణకు అంకితం చేసినవాళ్లు విమర్శిస్తే భావజాల యుద్ధం సమస్కంధుల మధ్య సాగుతుంది. వ్యక్తిగత కుటుంబ జీవితం జీవిస్తూ మొత్తం సమాజం మారాలని పనిచేసేవాళ్లను విమర్శించేంత అన్యాయం మరొకటిలేదు.

ఇలాంటివాళ్ల మధ్య కూడా 1991లో వెలువడిన 'గతితర్క తత్వదర్శన భూమిక' సామాజిక ఉద్యమాల్లో, భావజాలాల్లో, వాటి కార్యక్రమాల్లో, కర్తవ్యాల్లో, అవగాహనల్లో ఎన్నో మార్పులకు భూమిక అయింది. ఆ పుస్తకం తర్వాత వెనువెంటనే ఇందులోని కొన్ని వ్యాసాలు పత్రికల్లోనూ, పుస్తకాల్లోనూ వెలువడ్డాయి. వారి ఆచరణ, అవగాహన మారింది కనుక పాత అభివ్యక్తి, భాష అప్రోచ్ నేటి పాఠకులకు అనువుగా మార్చడం జరిగింది. తద్వారా మరింత ప్రశాంత వాతావరణంలో భావజాలాన్ని అధ్యయనం చేసే అవకాశం ఏర్పడింది.

ఈ పుస్తకానికి యువతరం ప్రధానమైన పాఠకులు. నేటి యువత వ్యక్తి నుండి



సమిష్టికి, వ్యక్తిగత దృక్పథం నుండి సామాజిక చైతన్యానికి పరిణామం చెందడానికనువుగా ఈ గ్రంథాన్ని రాయడం జరిగింది. మొత్తం సమాజాన్ని దృష్టిలో పెట్టుకుని దీన్ని ఒక పాఠ్యపుస్తకంగా మలిచే ప్రయత్నం చేశాను.

మనిషి తన వ్యక్తిగత జీవితం నుండి వ్యక్తిత్వం వికసింపచేసుకుంటూ సామాజిక మానవులుగా ఎదిగే క్రమాన్ని గురించిన ఆధ్యాయాలను ఒక క్రమ పద్ధతిలో చేర్చాను. 'వ్యక్తిత్వ వికాసం - సామాజిక నాయకత్వం' అనే గ్రంథంలో ఈ విషయంపై చాలా వివరంగా రాశాను. దాన్ని దీంతో పాటు చదివితే ఎంతో ఉపయోగం. "గతి తర్క తత్త్వ దర్శన భూమిక"లో చర్చించిన అంశాలను ఇందులో చేర్చలేదు. మార్క్సిజాన్ని, రాజ్యాన్ని, స్వేచ్ఛను చర్చించిన అధ్యాయాల్లో భాగంగా ఆ పుస్తకాన్ని కూడా చదవడం అవసరం.

భారతదేశంలో కొనసాగుతున్న సామాజిక భావజాలాలు వాటి పరిణామాలు, చరిత్రలో అవి నిర్వహిస్తున్న పాత్ర రీత్యా లెక్కలోకి తీసుకుని పరిచయం చేస్తూ నేను చెప్పదల్చుకున్న విషయాలు కూడా చెప్పాను. కేవలం చదివితే ఇది అర్థం కాకపోవచ్చు. సామాజిక ఆచరణలో ఉత్సాహంగా ముందుకు సాగుతున్నప్పుడు మళ్లీ మళ్లీ చదివితే కొత్త కొత్త అర్థాలు స్ఫురిస్తాయి. విస్తృత అవగాహన పెరుగుతుంది.

సామాజిక ఆచరణలో కాలాన్ని, జీవితాన్ని, లక్ష్యాన్ని పరోపకారం కోసం అంకితం చేస్తూ ఉదాత్తంగా ముందుకు సాగుతున్నప్పుడు ఇందులోని విషయాలు కొత్తకోణాల్లో అర్థమవుతుంటాయి. ఎక్కువ అర్థాలను ఇస్తుంటాయి. పదాలు, భావాలు అనుభవాల నుండి, తమ అనుభూతుల నుండి రూపుదిద్దుకుంటాయి. అవి ఆ అనుభవం లేని వారికి అందకపోవచ్చు. అప్పుడు అవి ఉట్టి పదాలుగా, కేవలం చర్చగా కనపడవచ్చు. అందువల్ల అనుభవం మీదనే అర్థమయ్యే విషయాలు ఇందులో తక్కువేమీ లేవు.

జీవితంలో స్నేహం అంటే ఏమిటి? అని దాని ఆవశ్యకత ఏమిటని ఎప్పటికప్పుడు తెలుసుకోవడం అవసరం. కుటుంబం అంటే ఏమిటి? కుటుంబ వ్యవస్థ ఉండాలంటే ఏం చేయాలి? కుటుంబ వ్యవస్థ మారుతున్న తీరు తెన్నులను విస్తారంగా పరిశీలించడం జరిగింది. ఫెమినిజం అంటే ఏమిటి? ఫెమినిజం సమాజంలో సామాజిక సిద్ధాంతాల్లో, అవగాహనలో, కుటుంబ వ్యవస్థలో తెచ్చిన పరిణామాలేమిటో వివరించడం జరిగింది. సమాజానికి ఫెమినిజం ఎంతో అవసరమని నిర్ధారించడం జరిగింది.

ఈ జీవితం ఎందుకు, ఎలా జీవించాలి అనే ప్రశ్నలు వేసుకున్నప్పుడల్లా మొదట నిరాశ కలగవచ్చు. కాని వెనువెంటనే కర్తవ్యాలు, లక్ష్యాలు ముందుకువస్తాయి. అందువల్ల జీవితం ఎందుకనే ప్రశ్న వేసుకున్నప్పుడల్లా ఎలా జీవించాలో స్పష్టత పెరుగుతుంది. జీవనశైలి, సంస్కృతి పట్ల అవగాహన కలుగుతుంది. జీవితం మరొక అడుగు ముందుకు సాగుతుంది. ఉన్నత ఆశయాలకు ప్రశ్నలు ఎప్పుడూ స్ఫూర్తినిస్తాయి.

బతుకు బతికించు, సమాజం కోసం, కుటుంబం కోసం బతుకుడు అవసరమని రెండు కోణాలను వాటి ప్రాధాన్యతలను పేర్కొనడం జరిగింది. జీవితంలో బాల్యదశ, విద్యార్థి కౌమారదశ, యౌవ్వన వృత్తిఉద్యోగ దశ, రిటైర్మెంట్, వృద్ధాప్య, వానప్రస్థ దశ వయస్సు వారీగా ప్రతి ఒక్కరి జీవితంలో పరిణామాత్మకంగా సాగుతునే వుంటాయి.

ప్రజాస్వామ్య వ్యవస్థ కుటుంబాన్ని స్వేచ్ఛాయుతం చేసింది.

బతుకంతా కుటుంబం కోసమేనా? అని ప్రశ్నించి జీవితమంటే తనలో తాను తన కొరకు తాను ఇతరుల కొరకు తాను జీవించడం అని నిర్వచించింది. పొట్టకూటికోసం తన జీవితాన్ని ఇతరులకు కిరాయికి ఇస్తారని, స్వేచ్ఛను కూలి కోసం, జీతం కోసం అమ్ముకుంటారని అది ఎలా జరుగుతుందో చెప్పడం జరిగింది.

ఎలా జీవించాలి? అనే ప్రశ్నకు సమాధానం వెతికే ప్రయత్నంలో అనేక కోణాల్లో మనుషుల జీవితాల్లో ఉన్నంత వైవిధ్యాన్ని ఒక చోట కూర్చడం జరిగింది. విశ్వాన్ని ప్రేమిస్తూ జీవించాలి. ఆనందమయ ప్రకృతిలో లీనమవుతూ జీవించాలి. మానవాళిని ప్రేమిస్తూ మైత్రీ పూర్వకంగా జీవించాలి.

మీ జీవితం మొత్తం మీ చేతిలో లేదు. మీ జీవితం అప్పుడప్పుడు జైలు జీవితంలా కనిపించడానికి స్వేచ్ఛ లేకపోవడమే కారణం. కన్స్యూమరిజం మీ జీవితాలను ప్రభావితం చేస్తున్నది. తన సరుకులను కొనుక్కునే యంత్రాలుగా మనుషులను మార్చుతున్నది. ఆనందం సరుకుల్లో లేదు. గ్లోబలైజేషన్ పరిణామాల్లో కన్స్యూమరిజం అనేక మాయలు చేస్తున్నది. దాన్నుంచి మీ జీవితాన్ని మీరు కాపాడుకోవాలి. ఎదిగించుకోవాలి. మీరు అలాంటి కుట్రలకు బలికాకుండా చూసుకోవాలి.

ముందుకు పోయిన వాళ్ళు ముందుకు పోవచ్చు. కానీ ఆగిపోయిన వాళ్ళను, వెనుకబడి పోయిన వాళ్ళు అని చెప్పడం, కించపరచడం సరైనది కాదు. ఆధునిక ఆనందానికి, సుఖాలకు మీ జీవితాన్ని మూల్యంగా చెల్లించకండి. జీవితం విలువైనది. అది శాఖోపశాఖలుగా మహావృక్షంగా విస్తరించాలి. స్నేహాలు జీవితమంతా అవసరమే.

ఒక మంచి పుస్తకం ఒక మంచి స్నేహితుడు కూడా. మీకు బాధ, కష్టం కలిగినప్పుడల్లా ఈ పుస్తకం చదవండి. మీకు ఆనందం, సుఖం కలిగినప్పుడల్లా ఈ పుస్తకం చదవండి. మీ కష్టసుఖాల్లో ఈ పుస్తకం మీ కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంది. ఈ పుస్తకం మీ నెచ్చెలి.

సమాజాల మధ్య, సభ్యుల మధ్య స్నేహాలుంటాయి. స్నేహం ఒక మాధుర్యం. బుద్ధుడు ప్రజ్ఞ, కరుణ, స్వేచ్ఛ, సమానత్వంతో పాటు మైత్రిని నాలుగో అంశంగా ప్రధానమని చెప్పాడు. బంధుత్వాల్లో వుండే స్నేహం, బాంధవ్యం, కర్తవ్యాల కోసం ఏర్పడి స్థిరపడింది.

స్నేహాల్లో వైవిధ్యం వుంటుంది. మళ్ళీ కలవకపోయినా స్నేహాలు జ్ఞాపకాలుగా జీవితమంతా స్ఫూర్తినిస్తునే వుంటాయి. స్నేహాన్ని వ్యక్తం చేయాలి. మంచి స్నేహితుణ్ణి ఎంపిక చేసుకోవాలి. వెనుకటి కన్నా ఇప్పుడు స్నేహం చేసే అవకాశాలు పెరిగాయి. స్నేహంలో వుండే సేవ, కర్తవ్యాలు, కార్యక్రమాలు ఆనందాన్ని ఇస్తాయి.

కులాతీతంగా, మతాతీతంగా స్నేహాలు కొనసాగాలి. స్త్రీ, పురుషుల మధ్య స్నేహాలు ఎంతో స్ఫూర్తినిస్తాయి. స్నేహాల్లో ఆస్తులు, అంతస్తులు, హోదా, మతం, కులం స్నేహానికి అడ్డంకి కాకుండా చూసుకోవాలి. అపరిచితులు స్నేహితులు అవుతారు. స్నేహితులు పరిచితులుగా అపరిచితులుగా కూడా మారిపోతుంటారు. పెద్దలు పిల్లలతో కూడా స్నేహం చేయాలి. తల్లిదండ్రులు తమ పిల్లలను స్నేహితులుగా చూడాలి. స్నేహం



స్నేహితుల మంచిని, ఉన్నతిని కోరుతుంది. కష్టాల్లో ఆదుకుంటుంది. కష్టాల్లో ఆదుకునే వారే నిజమైన స్నేహితులు.

భిన్నాభిప్రాయాల్లోను, వ్యత్యాసాల్లోను స్నేహం కొనసాగుతుంది. స్నేహితుల మధ్య ఆర్థిక లావాదేవీలు స్నేహాన్ని తినివేయకుండా చూసుకోవాలి. వృత్తి ఉద్యోగాల్లో, సంస్థల్లో సామాజిక ఉద్యమాల్లో స్నేహితులను గుర్తించడం ఒక నైపుణ్యం. కలిసి పనిచేసే క్రమంలో ఆత్మీయంగా మాట్లాడేవాళ్ళంతా స్నేహితులు కారు. భిన్నాభిప్రాయాలు కలిగినప్పటికీ యథావిధిగా కొనసాగేదే నిజమైన స్నేహం.

స్నేహానికి భావాలు, రాజకీయ కార్యకలాపాలు సవాళ్ళు విసురుతుంటాయి. అరె, తురె, అసె, ఒసే, ఏమే, అవునే అని పిలుచుకొనే చిన్ననాటి స్నేహాలు జీవితాంతం కొనసాగితే ఆ జీవితం మహోన్నతమైనది. ఆ ఆనందం అనిర్వచనీయమైనది.

దేశాల మధ్య, ప్రాంతాల మధ్య మానవాళి మధ్య స్నేహాలు కొనసాగుతుంటాయి. స్నేహానికి ఎప్పుడూ తలుపులు తెరిచి ఉంచాలి. స్నేహం ఒక జీవనది. పదిమంది మంచి స్నేహితులున్న బతుకెంతో ధన్యం. నలుగురైనా ప్రాణ స్నేహితులుంటే ఆ బ్రతుకు మరింత ధన్యం.

కుటుంబం వ్యవస్థతో గ్రామీణ వ్యవస్థకు సంబంధం ఉంది. కులానికి, కుల వృత్తులకు, కుటుంబ వ్యవస్థకు సంబంధం వుంది. కుటుంబం అనేది ఒక సామాజిక వ్యవస్థ. గ్రామీణ ఉత్పత్తి విధానం కుటుంబ వ్యవస్థను నిర్దేశించింది. గ్రామాల్లో కులాలు వేరైనా కుటుంబ వ్యవస్థ ఒకటే తీరుగా సాగింది. గ్రామీణ వృత్తులు, గ్రామీణ కులాలు, గ్రామీణ స్వయంపోషక ఆర్థిక వ్యవస్థను కొనసాగించడానికి కుటుంబంలో భాగంగా వ్యవసాయం, కుటీర పరిశ్రమలు కొనసాగడమే ప్రాతిపదిక.

పెళ్ళి లేకుండా కుటుంబ వ్యవస్థ లేదు. కులాలు ఏర్పడక ముందున్న తెగలు కొన్ని కులాలుగా రూపొందాయి. శూద్రులే సంపద సృష్టికర్తలు. భారతీయ సమాజ నిర్మాతలు శూద్రులే. కులం తనలో తాను తన కొరకు తాను కొనసాగే సామ్యవాద సోషలిస్టు వ్యవస్థగా కొనసాగింది. కుటుంబ వ్యవస్థకు ముందు స్త్రీ, పురుష సంబంధాలు వైవిధ్య పూరితంగా ఉండేవి. బుద్ధుడు ఆదర్శ కుటుంబం ప్రతిపాదించారు. పూర్వం బహుభార్యత్వం, బహుభర్తృత్వం, వేశ్యావ్యవస్థ, కుటుంబ వ్యవస్థ సమాంతరంగా కొనసాగాయి. ఒక పురుషునికి ఒకరే భార్య అనడంతో ప్రపంచంలో మొదటిసారిగా రిజర్వేషన్లు ప్రారంభమయ్యాయి. వ్యక్తి కుటుంబాలు ఏర్పడ్డాక పెరిగిన స్వేచ్ఛవల్ల సారా, మద్యం వంటి వ్యసనాలు పెరిగి వృధా వ్యయం పెరిగింది.

కుటుంబ వ్యవస్థలో కన్నా తక్కువ ఖర్చుతో కుటుంబం తీర్చే అవసరాలన్నిటిని తీర్చగలిగే వ్యవస్థలు ఏర్పడితే కుటుంబం అవసరం తగ్గుతుంది. కాని ఇప్పటికీ ఆ దశ రాలేదు. కుటుంబంలోని ఖర్చు కన్నా వెలుపల ఎన్నో రెట్లు ఖర్చు పెడితేనే ఆ అవసరాలు తీరుతున్నాయి. కుటుంబ వ్యవస్థ గురించి అది రద్దు కావాలని ఆలోచించిన అమెరికా, రష్యా, యూరప్‌ల్లో కుటుంబ వ్యవస్థ అవసరాన్ని తిరిగి కొత్తగా గుర్తిస్తున్నారు.

స్వేచ్ఛ పేరిట ఒంటరి అయిపోయిన జీవితాలు తిరిగి కుటుంబ వ్యవస్థ అవసరాన్ని తెలిపాయి. కుటుంబం నుండి విడివడి సింగిల్ పేరెంట్‌గా, వ్యక్తిగా మారిపోయిన

తరువాత స్వేచ్ఛ పేరిట సమాజం కన్జూమరిజంలో కూరుకుపోతున్నది. కుటుంబ వ్యవస్థ రద్దవుతున్న క్రమంలో క్రైమ్ రేటు పెరుగుతున్నది.

రాజ్యం లేకపోయినా కుటుంబ వ్యవస్థ కొనసాగుతుంది. కులం లేకపోయినా కుటుంబ వ్యవస్థ కొనసాగుతుంది. మతం లేకపోయినా కుటుంబ వ్యవస్థ కొనసాగుతుంది. ఒకే ఇంట్లో కలిసి జీవించకపోయినా కుటుంబం కొనసాగుతుంది. కులాతీత వివాహాలు కుటుంబంలో భాగం కావాలి. భారతీయ సాహిత్యంలో వైవాహికేతర లైంగిక సంబంధాలు విస్తృతంగా వర్ణించబడ్డాయి.

అన్ని సుఖాలు భౌతికమైనవి కావు. సంసారం ఒక సాగరం, నమ్మకురా జీవా, ఈ ఆలుపిల్లలను! అని వైరాగ్యం చాలా కాలం శతాబ్దాలుగా కొనసాగింది. కుల వ్యవస్థ పరిష్కారాన్ని ఫెమినిజం చెప్పే జండర్ స్వేచ్ఛతో సంశ్లేషిస్తే కుల వ్యవస్థ ప్రాధాన్యత కోల్పోతుంది. కుటుంబ వ్యవస్థ రూపు రేఖలు మారతాయి. సారం కొనసాగుతుంది. నేటి కుటుంబ వ్యవస్థ ప్రజాస్వామికంగా మారాలి. కులానికి భౌతిక పునాది జీవితమే. ప్రతి సమస్యకు పరిష్కారం వుంటుంది. సెంటిమెంట్స్ బలమైనవి. సంఘజీవిగా మనిషి అనుబంధాలను కోరుకుంటాడు.

ఫెమినిజం చాలాకాలం క్రితమే పుట్టింది. పారిశ్రామిక విప్లవం తరువాత వేగం పుంజుకుంది. యూరప్, అమెరికాల్లో ఫెమినిజం తొలుత తెల్లజాతి ఫెమినిజంగా ప్రారంభమయింది. స్త్రీలకు అనేక దేశాల్లో ఓటు హక్కుతో పాటు సమాన హక్కులు ఏర్పడ్డాయి. ఫెమినిజం కన్జూమరిజంలో, సామ్రాజ్యవాదంలో భాగమనడం సరైనది కాదు.

ఫెమినిజం ప్రపంచానికి వెలుగునిచ్చింది. మార్క్సిజం పితృస్వామ్య భావజాలమని ఫెమినిజం తేల్చి చెప్పింది. చారిత్రక భౌతిక వాదం మార్క్సిస్టు అర్థశాస్త్రం పురుషాధిపత్య దృక్పథమే అని నిర్ధారించింది. భాషకు ఉత్పత్తి సంబంధాలకు, సంస్కృతికి పురుషాధిపత్య స్వభావం ఎలా ఉంటుందో ఫెమినిజం స్పష్టం చేసింది. ఒకే ఇంట్లో కలిసి జీవించకపోయినా కుటుంబమే అని 1980 నుండి నిర్వచనం మారిపోయింది.

నల్లజాతి స్త్రీల ఫెమినిజం సామాజిక ఉద్యమాల ఫెమినిజంగా ఎదిగింది. తెల్లజాతి ఫెమినిజం అభివృద్ధి చెందిన పట్టణ స్త్రీల వ్యక్తిగత ప్రయోజనాల ఫెమినిజంగా ఆగిపోయింది. భారతదేశంలో ఫెమినిజం నాలుగు దశలలో, నాలుగు రకాలుగా కొనసాగుతున్నది. భారతీయ ఫెమినిజంలో పట్టణ మధ్యతరగతి, అగ్రకులాలదే పెద్ద పీట. అన్ని రంగాల్లో, అన్ని ఉద్యమాల్లో అన్ని స్థాయిల్లో నాయకులుగా స్త్రీలు 50 శాతం ఉండాలి.

స్త్రీలంతా ఒక్కటే కాదు. వర్గాలు, కులాలు, ప్రాంతీయ భేదాలు వున్నాయి. గ్రామీణ ఫెమినిజం, పట్టణ ఫెమినిజం, అగ్రకుల ఫెమినిజం, శ్రామిక కుల ఫెమినిజం స్పష్టంగా వైవిధ్యపూరితంగా కొనసాగుతున్నాయి. వాటి ప్రాధాన్యతలు, కార్యక్రమాలు, లక్ష్యాలు వేరువేరుగా వున్నాయి. 1990ల నుంచి దళిత స్త్రీవాద చైతన్యం పెరిగింది.

పెళ్ళి వల్ల ఇద్దరి స్వేచ్ఛ అరికట్టబడుతున్నట్లు తెలుస్తున్నది. అయితే పెళ్ళి లేకుండా జీవించడం ఎంతో కాలం సాధ్యం కాదు అని అనుభవం మీద తెలుస్తున్నది. పెళ్ళి



లేకుండా జీవిస్తే కోల్పోతున్నవి ఎన్నో. పిల్లలు తల్లిదండ్రుల ప్రేమను కోల్పోతున్నారు. కష్టకాలంలో తోడు లేకపోవడం డిప్రెషన్‌కు గురి చేస్తున్నది. ఫెమినిజాన్ని కొందరు ఫ్రీసెక్స్ కోసం వాడుకుంటున్నారు.

నేటి స్త్రీవాదంలో యూరప్, అమెరికా దేశాల ఆధిపత్యాన్ని కొనసాగించే కోణం కూడా ఉంటుందని గమనించడం అవసరం. ఎందుకంటే ప్రతివిశ్వజనీన భావజాలానికి ప్రాంతయతే పునాది. తద్వారా వాటిలో అవి పుట్టిన ప్రాంతాల సమాజాల భాషల ప్రాంతీయ నాయకత్వం, ప్రాంతీయ ప్రయోజనం ఆధిపత్యం కూడా అంతర్లీనంగా కొనసాగుతుంది. దేశీయ ఫెమినిజాన్ని రూపొందించుకోవడం అవసరం. ఫెమినిస్టుల వల్ల సమాజానికి ఎంతో మేలు జరిగింది. స్త్రీలు చేసే అన్ని పనులను పురుషులు సమానంగా చేయాలి.

జీవితానికి ఒక దృక్పథం అవసరం. దేనికి ఎంత ఖర్చు పెట్టాలి? అనేది మీ దృక్పథం వినరిస్తుంది. ఏ పని చేయాలి? దేనికెంత ప్రాధాన్యత ఇవ్వాలి అనేది దృక్పథం నిర్ణయిస్తుంది. ఒకే కంపెనీ, ఒకే బోనస్ ఇచ్చినప్పటికీ ఉద్యోగుల్లో భిన్న క్రమాలు సృష్టించడానికి దృక్పథమే కారణం. ఒకరు స్థలం కొంటారు. ఒకరు భార్యకు బంగారు గొలుసు కొంటారు. ఒకాయన కథల పుస్తకం వేసుకున్నాడు. ఒకాయన తిరుపతికి వెళ్ళి వచ్చాడు. ఒకాయన పార్టీ చేసుకున్నాడు. ఒకరు బ్యాంక్‌లో వేసుకున్నారు. ఎవరి ప్రాధాన్యతను అనుసరించి, దృక్పథాన్ని అనుసరించి ఖర్చు పెట్టారు.

భావవాదం, భౌతికవాదం రెంటికీ భౌతిక పునాది వుంది. భావవాదం కూడా భౌతికవాదంలో భాగమే. ఆధ్యాత్మిక వాదం కూడా సామాజిక భౌతిక వాదమే. ఒకే ఇంట్లో, ఒకే వర్గంలో ఒకే కులంలో అనేక దృక్పథాలు కొనసాగుతుంటాయి. అన్నిట్లో ప్రాపంచిక దృక్పథం పాత్ర స్పష్టంగా వుంటుంది. తత్వశాస్త్రానికి, సామాజిక దృక్పథానికి మధ్య తేడా వుంటుంది. పరోపకారమే, నిస్వార్థమే సామాజిక ప్రగతియే ఏ వాదానికైనా గీటురాయి.

స్వార్థానికి, చైతన్యానికి మధ్య తేడా ఏమిటంటే అది ఎంత గొప్పదైనా వ్యక్తిగత స్వార్థానికి కుదించుకుపోతే మనం గౌరవించం. దృక్పథం ఒక విశ్వాసమే తప్ప వాస్తవం కాదు. సత్యానికి, నమ్మకానికి మధ్య సమన్వయం ఉండాలి. నేను నా కుటుంబం అనే దృష్టి అన్ని సమస్యలను పరిష్కరించలేదు. జీవితంలో స్థిరపడ్డ తర్వాత సామాజిక కర్తవ్యాలు మరింత పెరగాలి. సామాజికంగానే వ్యక్తిగత సమస్యలు కూడా పరిష్కారమవుతాయి. ఎందుకంటే అందరి వ్యక్తిగత సమస్యే సామాజిక సమస్య అని పిలవబడుతుంది. సమస్యల గురించి విడివిడిగా ఆలోచిస్తే పరిణామాలు ఒకరకంగాను, కలిపి ఆలోచిస్తే మరొక రకంగాను పరిష్కారాలుంటాయి.

ఏ దృక్పథం లేకుండా బతికేయడం యధాతథ వాదమే. గాలికి కొట్టుకుపోతూ దుమ్ము, ధూళిలో కలిసిపోవడమే. వ్యక్తి శక్తిగా, సమాజంగా ఎదుగుతారు. ప్రజలే నిజమైన చరిత్ర నిర్మాతలు. ఏకకాలంలో ఇండియా, యూరప్‌లలో ఎదిగిన దృక్పథాలలో వైవిధ్యం ఉండడానికి వారి వారి సామాజిక పరిణామాలు స్థలకాలాలు ప్రత్యేకంగా, నిర్దిష్టంగా కొనసాగడమే కారణం. ఫ్రాయిడ్ సిద్ధాంతాల తరువాత సమాజం వాటిని

పట్టించుకుంది. సాహిత్యం, కళలు, విద్యాశాస్త్రం ఎంతగానో ప్రభావితం అయ్యాయి. స్కూల్లో వెనకటి నిర్బంధం నుండి స్వేచ్ఛా సమాజానికి విద్యాబోధన పద్ధతులు మారాయి.

పెట్టుబడిదారీ పారిశ్రామిక విప్లవం భారతదేశంలో శూద్రకులాల చేతివృత్తి నిపుణులను పారిశ్రామికవేత్తలుగా, కార్మికులుగా మార్చాల్సి ఉండింది. పాపం, పుణ్యం దృష్టితో పరోపకారం కూడా మంచిదే. భగవద్గీత బుద్ధుని తరువాత ఐదువందల ఏళ్ళకు రాయబడింది. హర్షవర్ధనుని కాలంలో ఇప్పటి రూపం తీసుకుంది.

సంస్కృతి లేకుండా మతం కొనసాగదు. మతం లేకుండా సంస్కృతి మాత్రం కొనసాగుతుంది. చైతన్యపూరితంగా ఏర్పర్చుకుంటే దృక్పథం అంటారు. సమాజ అస్తిత్వ ప్రభావంలో భాగంగా అనుకరణ శీలతతో ఆచరిస్తే సంస్కృతి అంటారు. సంస్కృతి రీత్యా మాతృస్వామ్యం ప్రపంచంలో మొదటిది. కులం సంస్కృతిలో భాగంగా కొనసాగుతున్నది. దృక్పథం సార్వత్రికమైనది, నిర్దిష్టమైనది. సైన్స్ ఆవిష్కరణలు దృక్పథాలను, సామాజిక పరిణామాలను మార్చుతాయి.

ఇష్టాయిష్టాలు, ఐచ్ఛికత ఏ దృక్పథాన్ని ఎన్నుకోవాలో నిర్ణయిస్తుంది. సామాజిక అస్తిత్వం ఒక్కటే వ్యక్తి చైతన్యాన్ని నిర్ణయించదు. ఇంకా అనేక అంశాలు వున్నాయి. ఆసక్తిని అనుసరించి, అవసరాన్ని అనుసరించి దృక్పథాన్ని ఏర్పర్చుకుంటారు. అన్వేషణకు ఆవశ్యకత తల్లి అయితే, ఆసక్తి, పట్టుదల, లక్ష్యం తండ్రి. కళలు, సాహిత్యం అనివార్యతలో భాగం కాదు, ఆసక్తిలో భాగం. దృక్పథం స్వయంగా స్వీకరించేదే. దృక్పథాలు కలిసినా, సంఘర్షించినా ఎంతో అభివృద్ధి జరుగుతుంది.

మానవత, ప్రేమ, కరుణ, ప్రజ్ఞ, మైత్రి ఒక చైతన్య రూపం, ఒక ఆచరణ రూపం. ప్రేమించే వారు ద్వేషించలేరు. ప్రశ్నించడం ద్వేషించడం ఒకటి కాదు. ఎరుక స్థాయి ననుసరించి ప్రశ్న రూపొందుతుంది. మారడానికి సిద్ధంగా లేకపోతే సత్యాలు తెలిసినా కోపం, ద్వేషం పెరుగుతుంది.

నీ నిస్వార్థం ఇతరుల్లో స్వార్థాన్ని బలోపేతం చేస్తే నీవు నీ ఆచరణను తిరిగి సరి చేసుకోవాలి. అవసరం ఇష్టాయిష్టాలను మార్చేస్తుంది. ఆసక్తిని పెంచుతుంది. జ్ఞాపకశక్తికి, ఆసక్తికి, ప్రేమకు మధ్య సమన్వయం ఉంది. ప్రేమించాల్సిన వాటినే ప్రేమించాలి. ద్వేషించాల్సిన వాటిని ద్వేషించే రూపంలో ప్రేమించకూడదు. అందరికి సమాన హక్కు ప్రేమకు చక్కని ప్రాతిపదిక వేసింది. తల్లిదండ్రులు పిల్లల కోసం చేసే త్యాగాలు పిల్లలు మర్చిపోకూడదు. మానవత, కరుణ ఒక సామాజిక అవసరం.

సైన్సు, టెక్నాలజీ డిపెండెన్సీని, ఇతరులపై ఆధారపడే స్థితిని పెంచింది. పదాల ద్వారా ఉద్దేశించిన భావాలు అవి విన్న వారిలో ఉన్నప్పుడే అర్థమవుతాయి. వ్యక్తం కాని ప్రేమ అర్థం కాదు, ప్రతిస్పందన రాదు. లైంగిక ప్రేమ పరిమితి చిన్నది, వ్యక్తిగతమైనది. గర్వం వల్ల శక్తి, సామర్థ్యాలు ఎదుగుదల ఆగిపోతాయి. ఆచరణలో కలిసి పని చేయడాన్ని నిరాకరించడానికే విమర్శ రూపం తీసుకుంటారు.

బుద్ధుని పాజిటివ్ థింకింగ్–జిడ్డు కృష్ణమూర్తి వ్యతిరేకతా సిద్ధాంతం రెండు వేరు. సమాజంలో వెనుకబడిపోయిన వారిని ముందు అభివృద్ధి పరచాలి. నిన్ను నీవు అణచివేసుకొనే కార్యక్రమాలు, విశ్వాసాలు వదిలివేయాలి. మనం ఎలా ఆలోచిస్తామో



అదే జరుగుతుంది. ఎవరి పట్ల గౌరవం, విశ్వాసం లేదో వాళ్లు నిన్ను బాధపెట్టలేరు. బాధను బాధగా వ్యక్తం చేయాలి. కోపంగా వ్యక్తం చేయకూడదు. నీ సూటిదనం ఇతరులను హర్ట్ చేయకూడదు. నీ భావాలే నీవు కాదు. నీ భావాలు మారుతుంటాయి. అయినా నువ్వు నువ్వే. నోరు మంచిదైతే ఊరు మంచిదవుతుంది. సంసారంలో సన్యాసిగా జీవించాలి. భావాలకు అతీతంగా మనిషిని, మానవాళిని ప్రేమించడమే మానవీయ ప్రేమ. స్వార్థానికి అతీతంగా ప్రేమించడమే నిజమైన మానవీయ ప్రేమ.

పరోకారానికి మించిన తత్వం లేదు. రెండు చేతులూ కలిస్తేనే చప్పట్లు. నడిచే ఎద్దునే పొడుస్తరు. ఆదర్శాలు, దూరపుకొండలు. నీ అన్నం నాకు పెట్టు, నీకు ఆకలి కాకుండా మందు ఇస్తాననే వాళ్ళు ఉంటారు. వారి పట్ల జాగ్రత్తగా ఉండాలి. గతం, భవిష్యత్తు కూడా వర్తమానంలోనే ఉంటాయి. దూప అవుతున్నదంటే మంచినీళ్లు ఇచ్చే బదులు, మంచినీళ్ళ జాడ చెప్పే బదులు, బావి తవ్వమనే వాళ్ళు ఉంటారు. వారి పట్ల జాగ్రత్తగా ఉండాలి.

ఒక శాస్త్రంలో సాధించిన అంశాలను ఇతర శాస్త్రాలకు అన్వయించాలి. రాజకీయ విప్లవం సామాజిక ఆచరణలో ఒక అంశం మాత్రమే. రాజ్యం అంటే సార్వభౌమత్వం, ప్రజలు, ప్రభుత్వం, పరిపాలన, మానసిక ఐక్యత అని పౌరశాస్త్రం చెపుతుంది. అన్ని సంస్థల నిర్మాణాలను సైతం రాజ్యంగా పేర్కొంటారు. విప్లవం అంటే రాజ్యం యొక్క సమాజం యొక్క సమస్త అంశాలను, సంస్కృతిని సమూలంగా మార్చడం.

సామాజిక వ్యవస్థను అనుసరించి రాజ్యం రూపొందుతుంది. రాజ్యంలో అధికారంలో ఉండేవాళ్ళు అందులో తమ అస్తిత్వానికి, అధికారానికి అవసరమైన స్వప్రయోజనాన్ని ప్రవేశ పెడతారు. రాజ్యం, సమాజం, రాజ్యాధికార వాదుల మధ్య త్రికోణ సంబంధం ఉంటుంది. సంస్కృతి విస్తరిస్తే రాజ్యం అవసరం తీర్చినట్లవుతుంది. తాళం అవసరం, మనిషికి కుక్కల పెంపకం యొక్క అవసరం ఎప్పుడు తీరుతుందో రాజ్యం అవసరం అప్పుడే అదృశ్యమవుతుంది. నేనుత్వమే రాజ్యం. నేను రాహిత్యమే రాజ్యం అదృశ్యం కావడం. అనగా అహంను వదిలేయడమే రాజ్యం అదృశ్యం కావడం.

రాజ్యం తన అస్తిత్వాన్ని తాను సృష్టించుకుంటుంది. గ్రామం ఒక స్వతంత్ర రాజ్యంగా కొనసాగింది. ప్రజాస్వామ్య వ్యవస్థలో రాజ్యం మౌలికంగా పరిణామం చెందింది. రాజ్యం సమాజానికి ఒక శరీరం. జీవనాడి వ్యవస్థ. రాజ్యాధికార వాదంలో అనేక రకాల వాళ్ళు వున్నారు. అన్ని తాళాలను తెరిచే తాళం చెవి రాజ్యాధికారమని అంబేద్కర్ నిర్వచించాడు. రాజ్యాధికారం కోసం ఏం చేసినా తప్పు లేదని భగవద్గీత చెపుతుంది.

రాజ్యం పోయినా దాని అనుభవం కొనసాగుతుంది. రాజ్యం పోయినా సమాజం పోదు. సమాజం పోయినా అది సాధించిన అనుభవం పోదు. రాజ్యంగా స్థిరపడి వర్ణ, కుల వ్యవస్థలు ఏకులు పోయి, మేకులయ్యాయి. వర్ణ కుల వ్యవస్థలు రాజరిక, సామ్రాజ్యాల అవసరాలను తీర్చడానికి ఏర్పడ్డాయి.

రాజకీయ అధికారం చేపట్టడం అనేది ఒక రంగంలో అధికారం సాధించి ఇతర రంగాలలో దానిని విస్తరింప చేయడానికి సంబంధించింది. కాని జరగవల్సింది ఏమంటే

సమస్త రంగాల్లో ఏకకాలంలో పరిణామాలు, మార్పులు జరగడం. అనగా కేంద్ర ప్రణాళికా సంఘం, రాష్ట్ర ప్రణాళికా సంఘం, జిల్లా పరిషత్తులు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల శాఖలు, మంత్రివర్గాలు ఎన్ని రంగాల్లో ఎంత విస్తృతంగా ప్రణాళికలను, బడ్జెట్లను రూపొందిస్తాయో అంత విస్తృతంగా ప్రతి రచయిత, మేధావి, జర్నలిస్టు సామాజిక ఉద్యమకారులు రూపొందించడం, ఆలోచించడం చేసినప్పుడే అది సమగ్ర, సామాజిక విప్లవం. ఇలా అన్ని రంగాల్లో ఏక కాలంలో సమస్త సామాజిక వర్గాలు ముందుకు సాగడం, వికాసం పొందడమే సమగ్ర సామాజిక విప్లవం.

శాసనాల వల్ల అన్ని సాధ్యం కావని, సంస్కారం, సంస్కృతి ముఖ్యం. చట్టంపై ఆధారపడితే మనిషి స్వయం ప్రేరణ కుంటు పడుతుందని ఆరెసెస్, బిజెపి పరివారం సామ్యవాదాన్ని, ప్రజాస్వామిక వ్యవస్థను వ్యతిరేకించడానికి చూపే కారణాలు, కుల, వర్ణ వ్యవస్థలను ధర్మం, సంస్కృతి, మతం పేరిట కొనసాగించడానికే. హిందువులందరూ ఒక్కటే అయితే ఆరెసెస్ కులాతీత వివాహాలను కర్తవ్యాలుగా, కార్యక్రమాలుగా తీసుకోవాలి. ఆరెసెస్, బిజెపి ప్రజల అవసరాలను, చైతన్యాన్ని పక్కదారి పట్టించే కార్యక్రమాలను తీసుకుంటుంది. రిజర్వేషన్ వ్యతిరేకతే రామజన్మభూమి ఉద్యమం. ఇటీవల బిసిల గురించి, ఎస్సీల గురించి, ఎస్టీ గురించి పట్టించుకున్నట్టు కనపడుతుంది. అది ఒక ఎత్తుగడ కావచ్చు.

తత్వవేత్తలకు వారు పుట్టి పెరిగిన స్థలకాలాల పరిమితి వుంటుంది. వివేచన లేకపోతే ఎంత అనుభవం వున్నా తెడ్డులాగా ఉప్పు ఎక్కువయిందో, తక్కువయిందో చెప్పలేరు. సిద్ధాంతాలన్నీ గతంతో యుద్ధం. ఎదుటి వారిని విమర్శించడం గతంతో యుద్ధం. తనను తాను విమర్శించుకోవడం గతంతో యుద్ధం. వ్యక్తిత్వ వికాసమంటే తన గతంతో, సమాజం తనపై ఆపాదించిన గతంతో యుద్ధం చేయడం. వర్తమానంలో ఎదగడం. వర్తమానంలో నూతన వ్యక్తిత్వ వికాసం నిర్మాణం చేసుకోవడం. వ్యక్తిత్వాన్ని పునర్నిర్మించుకోవడమే వ్యక్తిత్వ వికాసం.

ఆలోచనలు, సిద్ధాంతాలు మారడానికి జీవితమే పునాది. జీవితంలాగే ఆలోచనలు, సిద్ధాంతాలు, ఆచరణ మారతాయి. సిద్ధాంతాల పుట్టుక, భూమిక తెలుసుకోవాలి. తానున్న స్థలకాలాల ననుసరించి ఆలోచనలు పుడతాయి. ప్రతివిశ్వజనీన భావజాలానికి ప్రాంతీయతే పునాది. కొన్ని శతాబ్దాలు ప్రపంచానికి ఇండియా ఒక దిక్సూచిగా ఉండేది. ఇప్పుడు దిక్సూచి మారి పాశ్చాత్య దేశాలను చూపిస్తోంది.

లక్ష్యం సైన్స్, అవసరాలు, అభిరుచులతో ఆలోచన మారుతుంది. ఎట్లుంటే అట్లాంటి ఆలోచనలు కలుగుతాయి. సైన్స్ సమాజాన్ని మార్చి వేస్తుంది. అయినా కాలం తీరిపోయిన వెనుకటి ఆలోచనలు కొనసాగుతుంటాయి. ప్రభుత్వాలు అధికారం కోసం ప్రజలపై ఉచ్చు వేస్తుంటాయి.

మార్క్సిజం ప్రపంచాన్ని మార్చి వేసింది. మార్క్సిజంలో నినాదాలు ముందు పుట్టాయి. సిద్ధాంత భూమిక తరువాత తయారు చేశారు. అనేక ఉద్యమాలు ఇదే పని చేస్తుంటాయి. మార్క్సిజం తన కాలం నాటి అనేక సిద్ధాంతాలను తనలో కలుపుకొని ఎదిగింది. మార్క్సిజం, కార్మిక వర్గ ఉద్యమ సైద్ధాంతిక నాయకులు, మధ్యతరగతి మేధావుల నుండి ఎదిగిన వారే. వర్గపోరాటం అనే సిద్ధాంతంతో అనేక శాస్త్రాలను



అన్వయించి తిరగరాశారు.

మార్క్స్, ఏంగెల్స్‌లు తర్కం ద్వారా సాధించిన దాన్ని "శాస్త్రీయ సోషలిజం" అని ప్రకటించుకున్నారు. అంతకుముందు ఇదే పని చేసిన వారిని ఊహా సోషలిస్టులు అని అన్నారు. తార్కిక సత్యాలు సత్యాన్ని అణచివేస్తాయి. భ్రమలు, ఊహలు అందంగా ఉంటాయి. హెగెల్ నుండి మార్క్సిస్టు గతితర్కం సగమే తీసుకోవడం వల్ల చాలా నష్టాలు జరిగాయి. పాతది పోయి కొత్తది వస్తుంది అనేది ఒకటే తీసుకున్నారు. తల్లి ఉంటుంది పిల్లలు ఉంటారు. తల్లిదండ్రులే పిల్లల్ని పెంచుతుంటారు. అందువల్ల పాతది ఉంటుంది. కొత్తది ఉంటుంది. ఈ ప్రకృతి సమాజ సూత్రాల్ని మార్క్సిజం వదిలేసింది.

మార్క్సిజం పేర్కొన్న చారిత్రక భౌతిక వాదం, శాస్త్రీయ సోషలిజం, మార్క్సిస్టు అర్థశాస్త్రం, అర్థసత్యాలని పురుషాధిపత్య భావజాలంలో భాగమని ఫెమినిస్టులు, అంబేడ్కర్ అనేక కోణాల్లో నిర్ధారించారు. మార్క్సిజంలో రెవల్యూషన్, విప్లవం, వర్గపోరాటం అనే పదాలకు ప్రాధాన్యత ఉంది. ఎవల్యూషన్ - పరిణామం, ఐక్యత అనే అంశాలను వదిలివేశారు. సమాజంలో ఎవల్యూషన్ ఉంటుంది. సమాజం నిరంతరం పరిణామం చెందుతుంది. కొత్త సిద్ధాంతాలు, కొత్త ఆవిష్కరణలు సమాజాన్ని నిరంతరం మార్చుతుంటాయి. నిరంతరం చైతన్యంగా వుంటే ఎవల్యూషన్ అప్పుడప్పుడు నిద్రలేచి జూలు విదిలిస్తే రెవల్యూషన్.

విత్తు మొలకై చెట్టు కావడం పరిణామం తప్ప నెగేషన్ కాదు విప్లవం కాదు. శిశువు, బాల్యం, యవ్వనం, వృద్ధాప్యం దశలను చేరడం పరిణామం తప్ప నెగేషన్ కాదు. రెవెల్యూషన్ కాదు. మార్క్సిజం తాను చెప్పిన ఎవల్యూషన్, ఐక్యతా సూత్రాలనే వదిలేసింది. ఎవల్యూషన్‌లో పాల్గొనకపోతేనే అది రెవల్యూషన్‌లా, గెంతులా కనపడుతుంది. నెగేషన్ ఆఫ్ నెగేషన్ ఒక పరిణామమే. నెగేషన్ ఆఫ్ నెగేషన్ అర్థ సత్యమే.

మార్క్స్ ఎంగెల్స్‌లకు ప్యారిస్ కమ్యూన్ ఓటమి తర్వాత కార్మికవర్గానికి తన సొంత సైన్యం ఉండాలనే ఆలోచన యూరప్‌లోని యుద్ధ ప్రభువులు సైన్యాన్ని పెంచి, కిరాయికిచ్చే వ్యవస్థలను చూసిన తర్వాత కలిగిన ఆలోచన. సొంత సైన్యం ఏర్పాటు రాజరిక విధానం. కార్మికవర్గ చైతన్యం ఇలా రాజరిక విధానంతో కలిసిపోయింది. ఏకపార్టీ నియంతృత్వ వ్యవస్థ వల్ల అనేక అవస్థలు వున్నాయి. అందుకే రష్యాలో దాన్ని వదిలించుకొని ఆలస్యంగానైనా ఇండియాలో లాగే ప్రజాస్వామ్యాన్ని వరించారు.

హిట్లరిజానికి కన్నతల్లి మార్క్సిజమే. పెట్టుబడిదారీ వ్యవస్థ మార్క్సిజాన్ని కన్నది. మార్క్స్ చెప్పిన వర్గవాదాన్ని కార్మికవర్గ నియంతృత్వం అనే వాదాన్ని పార్టీకి సొంత సైనిక విభాగం ఉండాలనే వాదాన్ని జాతీయ వాదంలోకి అన్వయించి ఆచరిస్తే హిట్లరిజం. హిట్లర్ ఆచరణను స్పష్టంగా ఫాసిజం అంటున్నారు. ఆరెసెస్ హిట్లరిజాన్ని ఆదర్శంగా తీసుకుంటుంది.

సొంతసైన్యం వున్న వాళ్ళు ఇతరుల మాట వినడం కష్టం. ఆధునిక సమాజాలు సొంత సైన్యాన్ని అంగీకరించవు. నిర్బంధాలు-వ్యూహం ఎత్తుగడల పర్యవసనాలు. వారి నిర్బంధాలకు ఇలా వారే కారణం. మధ్య యుగాలకు, ఆధునిక సమాజాలకు తేడా

తెలుసుకోవడం అవసరం. బలమున్నవాడిదే రాజ్యం అనేదే సొంత సైనిక వ్యవస్థ అంతిమ సారాంశం.

తత్వశాస్త్రంలో మార్క్సిజం స్థానం బాగా తగ్గిపోయింది. ఫెమినిజం, ప్రజాస్వామిక వ్యవస్థలు, అంబేద్కరిజం, సైన్సు పరిణామాలు, మార్క్సిజం కన్నా ఎంతో ముందుకు సాగిపోయాయి. రష్యా దేశస్థుడైన లెనిన్ తన జాతీయ అవసరాల కనువుగా మార్క్సిస్టు సిద్ధాంతాల్ని మార్చుకొని జాతీయ విప్లవానికి, కార్మికవర్గ విప్లవమని పేరు పెట్టుకున్నారు. చైనాలో మావోకూడా ఇదే పని చేశారు. నోమ్‌చామ్‌స్కీ మార్క్స్ క్యాపిటలిస్ట్ సిద్ధాంత ఆవిష్కర్త అని నొక్కి చెప్పారు. మార్క్స్ సోషలిస్టు తత్వవేత్త కాదని అతని వాదన.

మార్క్సిజం, బుద్ధిజం, ఫూలేయిజం, బహుళ పార్టీ ప్రజాస్వామ్య వ్యవస్థలను, అంబేద్కరిజం, ఫెమినిజంలను సంశ్లేషించి ఒక ఐక్యతలో నూతన కార్యక్రమాలను, సిద్ధాంతాలను, నినాదాలను వ్యూహం, ఎత్తుగడలను రూపొందించుకోవాలి. మార్క్సిస్టులకు, బహుజనులకు, ఫెమినిస్టులకు మధ్య ఉన్నది అగ్రకుల సమస్యే తప్ప మరొకటి కాదు.

సిద్ధాంతాలు వాటికవే శక్తివంతమైనవి కావు. మనిషి స్వీకరించినప్పుడే అవి శక్తివంతమవుతాయి. ఈ దేశంలో మార్క్సిస్టులు, మావోయిస్టులు చెప్పే విప్లవాలు, సాయుధ పోరాటాలు అవసరం లేదు. ప్రజాస్వామ్య వ్యవస్థ సరిగ్గా పనిచేసేట్టు చూడగలిగితే అద్భుతాలు సృష్టించవచ్చు. మార్క్సిజం అనేక అంశాలను వదిలివేసింది. వైరుధ్యంలో, విరుద్ధాంశాల్లో రెండు అంశాలు వుంటాయని అన్నది. కాని మూడు అంశాలు ఉంటాయి. ఎలక్ట్రాన్, ప్రోటాన్, న్యూట్రాన్. పాతది పోయి కొత్తది వస్తుంది అనుకుంది మార్క్సిజం. కాని పాతది ఉంటుంది, కొత్తది ఉంటుంది. తల్లిదండ్రులే పిల్లల్ని పెంచుతుంటారు. అనివార్యతను మార్క్సిజం ప్రధానం చేస్తుంది. కాని ఆసక్తి, అవసరం అనివార్యత యాదృశ్చికత, సమాన ప్రాధాన్యత కలిగి వుంటాయి.

సత్యాలకు తర్కంతో పని లేదు. మనిషికోసమే సిద్ధాంతాలు. దార్శనికులు నాయకత్వ లక్షణాలు పెంచుకోవాలి. గురువులుగా ఎదగాలి. ఇజం అనేది తన కాలం నాటి అనేక అంశాలను రంగాలను, వాటిలో ఎదిగిన భావాలను, సైన్స్ వెలికి తెచ్చిన కొత్త విషయాలను, సామాజిక శాస్త్రాలు, వెలికి తెస్తున్న నూతన పరిణామాలను చర్చించి, సంశ్లేషించి తనదైన రంగంలో లేదా రంగాల్లో కొన్ని సూత్రాలుగా, సిద్ధాంతాలుగా రూపొందించడం ఇజం. ఫెమినిజం, మార్క్సిజం, అంబేద్కరిజం, గాంధీయిజం ఇలాగే రూపుదిద్దుకున్నాయి. వారి రచనలే వారి ఇజం కాదు. అది అసమగ్రం. వారి జీవితాచరణ సమకాలీన మిగతా సమాజం పరిణామాలను కూడా పరిశీలించి సూత్రీకరించినప్పుడే అది ఒక ఇజంగా సమగ్రతను సాధించుకుంటుంది.

ప్రతి సామాజిక సిద్ధాంతం సమగ్రత సాధించుకోడానికి తన కాలం నాటి సిద్ధాంతాలను, సామాజిక ఆచరణను సంశ్లేషించుకొని సమన్వయం సాధించాలి. మహాత్మా జోతిబాఫూలే, డా॥ బి.ఆర్.అంబేద్కర్ ప్రజాస్వామిక వ్యవస్థను అభిలషించారు. గాంధీజీ పేరిట ప్రాచుర్యంలోకి వచ్చిన ధర్మకర్తృత్వ సిద్ధాంతం బుద్ధుని కన్నా ముందునుండి కొనసాగుతున్నది. బుద్ధుడు దాన్ని మరింత విస్తృతంగా వ్యాప్తి చేశాడు.



సామాజిక పరిణామాలను అనుసరించి కొత్త సిద్ధాంతాలు ఎప్పుడూ పుడుతూనే వుంటాయి. పాత వాటితో పాటు కొత్తవి కూడా పుడుతూ కొనసాగుతుంటాయి. కొత్తతరాలు తమ సామాజిక అస్తిత్వంలో తమవైన అనుభవాలను, ఆచరణను కొత్తగా సిద్ధాంతీకరిస్తారు. సూత్రీకరిస్తారు. వాళ్ళంతా పాతవాటిని చదవవచ్చు, చదవకపోవచ్చు. ఈ కొత్త తరాల సిద్ధాంతాలను, అనుభవాలను, సమాజ పరిణామాలను స్వీకరించని దృక్పథాలు, ఇజాలు సమాజానికి వెనుకబడిపోతాయి.

హిందూయిజంలో విభిన్న సిద్ధాంతాలున్నాయి. సమాజంలో నదిగా ప్రవహించి ఎడారిలో ఇంకిపోయే సిద్ధాంతాలున్నాయి. ఇజాలు సామాజిక పాత్రను నిర్వహిస్తాయి. సిద్ధాంతాలన్నీ పాక్షిక సత్యాలే. పోరాడి గెలుచుకుంటే పుల్లనిది కూడా తియ్యగా వుంటుంది. తెలంగాణ, ఆంధ్ర దృష్టికోణాలు భిన్నమైనవి. తెలంగాణ రాష్ట్ర, ఆంధ్ర రాష్ట్ర పరిణామాలు వేరువేరు. చర్చలు ప్రధానం కాదు, ఆచరణ ప్రధానం. బుద్ధుడు ఈ మాటను బాగా నొక్కి చెప్పాడు. వాళ్ళు ఆచరణలో ఉన్నంత మాత్రాన సిద్ధాంతం వారి పేటెంట్ కాదు.

నిర్మాణ దక్షత, పరిపాలన దక్షత, సిద్ధాంత కర్తగా దక్షతను నిరూపించదు. ఏదో ఒక మార్క్సిస్టు పార్టీ కార్యదర్శి అయినంత మాత్రాన మార్క్సిజానికి కార్యదర్శి కారు. నాయకత్వానికి నచ్చకపోతే మార్క్సిజానికి వ్యతిరేకమని చెప్పడం తప్పు. వాళ్ళు సిద్ధాంతాలను సిద్ధాంతాలద్వారా పూర్వపక్షం చేయాలి. వాస్తవాలకు, దృక్పథాలకు మధ్య వైరుధ్యం ఏర్పడినప్పుడు వాస్తవానికి అనువుగా దృక్పథాన్ని మార్చుకోవాలి. గతం కన్నా వర్తమానం ప్రాథమికం. కలిసి పని చేయడానికి అనువుగా సిద్ధాంతాలను మార్చుకోవాలి. తన సిద్ధాంతం పాక్షిక సత్యమే అని గుర్తుంచుకోవాలి.

చలనం యొక్క రూపమే వస్తువు, స్థలం, కాలం, శక్తి. పరస్పర మార్పిడిలో కనపడేదే మొత్తం చలనం కాదు. అనగా వర్గపోరాటాలే మొత్తం సామాజిక చలనం కాదు. సహజస్థితిలో చలనం శక్తిని ప్రదర్శించదు. గోడకు వేలాడేసిన తుపాకి కూడా మౌనంగానే వుంటుంది. అందులో చలనం లేదని కాదు. శ్రమశక్తి మార్పిడే మొత్తం శ్రమశక్తి కాదు. ప్రకృతి పరిణామ శీలంగా ఉంటుంది. చలనంలోని చర్యలు, ప్రతిచర్యలే మొత్తం చలనం కాదు. ఇంకా ప్రదర్శితం కాని చలనాన్ని తెలుసుకొనే ప్రయత్నమే భవిష్యత్ ఊహలు. సమాజంలో ఐక్యత, పోరాటం అనేవి మొత్తం సమాజం కాదు. తిరుగులేని ఆలోచనలు అంటూ ఏవి ఉండవు.

కార్మికవర్గ దృక్పథం యుగ ధర్మం నెరవేర్చింది. హెగెల్‌కు నిజమైన వారసులు మార్క్స్, ఏంగెల్స్‌లు. అఖండ సత్యం, పూర్తి సత్యం అంటూ ఏదీ ఉండదు. చలనాలను వెతికి పట్టుకోవాలే తప్ప సూత్రాలను చలనాల మీద రుద్దకూడదు. దృక్పథం అనేది ఒక రాజ్యంగా, ఆధిపత్యంగా కూడా కొనసాగుతుంది. చీలికలు, గతితర్కాన్ని అమీబా తరహాగా మార్చివేశాయి. సమాజాన్ని ఒక మొత్తంలో పరిశీలించాలి. పార్టీలో చేరాక వ్యకి స్వేచ్ఛ కోల్పోతే వచ్చే అదనపు స్వేచ్ఛ ఏమైనా ఉందా పరిశీలించుకోవాలి. స్వేచ్ఛ కోల్పోవడానికి బందీ కావడానికి పార్టీలో చేరడం అవసరమా అని కూడా ప్రశ్నించుకోవాలి.

అభివృద్ధికనువుగా చరిత్ర రాయడమంటే విజేతలకనువుగా చరిత్ర రాయడమే. పరాయీకరణను ఆమోదించడమే. పితృస్వామిక పురుషాధిపత్యాన్ని కొనసాగించడమే. ఇది కొత్త ఉత్పత్తి సంబంధాలు ఆధిక్యతలోకి వచ్చి పాత ఉత్పత్తి సంబంధాలను వెనుకబడిన వారిని పట్టించుకోకుండా వదిలేస్తుంది. లెనిన్ రాసిన స్టేట్ అండ్ రెవల్యూషన్ పుస్తకంలో నేను చెప్పినట్లు నడుచుకుంటే అంతా స్వేచ్ఛే అని రాజ్యం యొక్క అదృశ్యం గురించి ప్రమాదకరమైన సూత్రీకరణ చేశాడు. కార్మికవర్గ నియంతృత్వం కన్నా బహుళ పార్టీ ప్రజాస్వామిక వ్యవస్థలు ఎంతో ఉన్నతమైనవి. ఆధునికమైనవి.

లెనిన్ రాజ్యం, విప్లవం సిద్ధాంతాలు పాతబడిపోయాయి. కొత్త సిద్ధాంతాలు ముందుకు సాగిపోయాయి. కార్మికవర్గ నియంతృత్వంలో రాజ్యం ఎన్నడూ అదృశ్యం కాదు. రాజ్యాధికారానికనువుగా ఆలోచించడం వల్లే లెనిన్ ఆలోచన రాజ్యంగా మారింది. చారిత్రక భౌతిక వాదం అభివృద్ధి వర్గాల సిద్ధాంతం. అది పురుషాధిపత్య సిద్ధాంతం కూడా. వెనుకబడిన ప్రపంచానికి కొత్త సిద్ధాంతం కావాలి – చారిత్రక భౌతిక వాదం కాదు. వెనుకబడిన ప్రజలకు చేయూతనిచ్చే సిద్ధాంతాలు కావాలి. చారిత్రక భౌతికవాదం వలస వాదుల అభివృద్ధిని, సామాజిక అభివృద్ధిగా చిత్రీకరిస్తుంది.

అంబేద్కరిజం, ఫెమినిజం చారిత్రక భౌతిక వాదాన్ని తలక్రిందులు చేశాయి. హెగెల్ నుండి మార్క్స్, ఏంగెల్స్‌లు సగం గతి తర్కమే తీసుకోవడం వల్ల అనేక నష్టాలు జరిగాయి. అభివృద్ధిని అభివృద్ధిగా అంగీకరించడంలో దాని ఆధిక్యతకు లొంగిపోయే క్రమం కూడా ఉంటుంది. నేటి సైన్స్‌ను నిరాకరించలేకపోతే గ్లోబలైజేషన్ పరిణామాలు అనివార్యం. సైన్స్, టెక్నాలజీ పరిణామాలే గ్లోబలైజేషన్ పరిణామాలకు దారితీసాయి. భౌతిక ప్రయోజనాలు, అనుభవాలు, వాటి క్రమాలు చేరకుండా కేవలం భావాలు చేరితే అందుకు భిన్నమైన క్రమాలు, తీర్పులు ఉత్పన్నమవుతాయి. మార్క్సిస్టు సిద్ధాంతాలు చక్రభ్రమణంలో సాగుతున్నాయి. మార్క్సిజం కొత్త కులాలను సృష్టించింది. చారిత్రక భౌతిక వాదాన్ని భారతీయ ఫెమినిస్ట్ చారిత్రక భౌతిక వాదంగా మలుచుకోవాలి. మానవకోటిని ఒక్కటి చేసే సిద్ధాంతాలు ఈనాటి అవసరం.

గ్లోబలైజేషన్ చలన క్రమాలను కొత్తగా పరిశీలించాలి. పాత దృక్పథాలతో పరిశీలించడం సరైనది కాదు. దృక్పథాలు, చలనసూత్రాల మధ్య వైరుధ్యం ఉంటుంది. నూతన ఆవిష్కరణలంటే, నూతన చలనసూత్రాలను వెలికితీయడమే. ఆరో తరగతి నుండి ఏడో తరగతికి ఎదిగినట్లు పాతక్లాసు నుండి నిరంతరం ఎదుగుతూ ఉండాలి. వాస్తవాలు ఒక్కటే దృక్పథాలు అనేకం. భౌతిక, వాస్తవాల అస్తిత్వమే సత్యం. సిద్ధాంతాలన్నీ వీటి తర్వాతే. దృక్పథంలో సత్యం పాలు కొంతే ఉంటుంది. ఏనుగును ఏడుగురు గుడ్డివాళ్ళు వర్ణించినట్టుగా ఉంటుంది.

అంచనా వేయడమే దృక్పథం. విరుద్ధ వాస్తవాలు తెలిస్తే అంచనాలు మార్చుకోవాలి. అవగాహన మార్చుకోవాలి. దేశ విభజనలో కాంగ్రెస్ పాత్ర కూడా ప్రధానమైనదే. దృక్పథం వాస్తవాలను అణచివేస్తుంది, పరాయీకరిస్తుంది. దృక్పథం పాలకవర్గంగా మారి కొత్త చలనాలను పాలితులుగా మార్చుతుంది. దృక్పథం ఒక గారడి విద్యగా మారుతుంది. అందువల్ల దృక్పథం పట్ల జాగ్రత్తగా ఉండాలి. దృక్పథం



పట్ల మొండిపట్టుదల పనికిరాదు. ప్రతిదాన్నీ చెట్లుగా చూసేవారికి అది అడవిగా అనిపించకపోవచ్చు. చెల్లెలుగా మంచిదే కావచ్చు. భార్యగా బాగుండకపోవచ్చు. దృక్పథాలు కొన్ని విషయాల్లో ఇలా ఉండవచ్చు.

మార్క్సిజం స్వయంగా ఒక యూరోపియన్ సామ్రాజ్యవాదం. అది సామాజికంగా, తాత్వికంగా హెగెలిజం, ఇస్లాంవాదం, క్రైస్తవవాదాలు మార్క్సిజం అనే కొత్త రూపంలో కొనసాగడమే. ప్రపంచ కార్మికులారా ఏకంకండి అని యూరప్ పారిశ్రామిక, కార్మికుల ఆధిపత్యంలో పుట్టిన నినాదం స్వయంగా ఒక కార్మికవర్గ సామ్రాజ్యవాదం.

కార్మికవర్గ సామ్రాజ్య వాదం యూరప్ పెట్టుబడిదారీ స్థానంలో యూరప్ కార్మికులు వారి సిద్ధాంతాలు, వారి మధ్యతరగతి సిద్ధాంతాలు పాలకులు కావడం అనేదాన్ని ఇండియాలో స్త్రీలకు చట్టసభల్లో రిజర్వేషన్ కోసం జరుగుతున్న చర్చతో పోల్చవచ్చు. స్త్రీలు చట్టసభల్లో రిజర్వేషన్లు కావాలంటున్నారు. బిసి స్త్రీలకు రిజర్వేషన్లను వ్యతిరేకిస్తున్నారు. తద్వారా అగ్రకుల పురుషుల స్థానంలో అగ్రకుల స్త్రీలు వారి భార్యలు, చెల్లెలో అధికారంలోకి రావడం కోసమా స్త్రీల రిజర్వేషన్లు అని ప్రశ్నిస్తున్నారు. మార్క్సిజాన్ని స్వీకరించిన ఇండియాలోని వామపక్షాలు కూడా బిసి, ఎస్సీ, ఎస్టీల నాయకత్వం అన్నిట్లో వుండాలి అనే చర్చను వ్యతిరేకిస్తున్నారు. అందువల్ల ఇండియాలోని మార్క్సిజం యూరప్ సామ్రాజ్యవాదమే కాకుండా, పెట్టుబడిలేని అగ్ర కులాల మధ్యతరగతి సామ్రాజ్యవాదం కూడా.

అంతర్గత వైరుధ్యాలే ప్రాథమికమని చెప్పే మార్క్సిజం దాన్ని నిజంగా ఆచరించడానికి సిద్ధంగా లేదు. మన దేశం ప్రపంచానికి ఒక ఆదర్శ నమూనా. ఏకత్వంలో భిన్నత్వం, భిన్నత్వంలో ఏకత్వం అనేది ప్రకృతి సమాజాల మౌలిక సూత్రం. మనుషులందరూ సమానమే. యూరప్ సామ్రాజ్యవాద పరిణామాల్లో పుట్టిన సిద్ధాంతాలకు ఆ పరిమితి కూడా ఉంది. మతాల్లోని మోనిజమే, హెగెల్‌లోని మోనిజమే మార్క్సిజంలో వచ్చి చేరింది. మార్క్సిజాన్ని అభివృద్ధి పరచడం అనవసరం. కొత్త సిద్ధాంతాలను రూపొందించుకోవడమే అసలు కర్తవ్యం. ఈ వ్యవస్థను మార్చుకోవడం ఈ వ్యవస్థ ద్వారానే సాధ్యం.

ఏ పని చేస్తే ఆ ఆలోచనలు వస్తాయి. పని అంతరిస్తుంది. కాని దానినుండి పుట్టిన అనుభవం, జ్ఞానం విస్తరిస్తుంది. తార్కిక పదబంధాలతో, తార్కికులు ఫుట్‌బాల్ ఆడుకుంటారు. చర్చలో గెలుపు ఓటముల ప్రసక్తి ఫ్యూడలిజానికి చెందిన సూత్రాలే. ప్రజాస్వామ్యంలో భిన్నాభిప్రాయాలను కలిగి వుండే స్వేచ్ఛ ఉంది. ఒకసారి ఓడిపోయినా మళ్ళీ ఎన్నికల్లో అవే గెలవవచ్చు.

వ్యక్తం చేయలేకపోయినా హృదయానుభూతులు ఉంటాయి. సాక్ష్యాలు తిమ్మిని బమ్మినిచేస్తాయి. సాక్ష్యం లేకపోతే హత్య జరగనట్టు కాదు. తార్కిక సత్యం ఒక ఆధిపత్య వాదమే. తార్కికులుగా పొడిచేసేదంతా ఆడిట్ పార్టీ వ్యవహారమే. నీవన్నదే నిజం అంటే తర్కం చచ్చి వూరుకుంటుంది. భావాలను అంగీకరిస్తే కలిసి పనిచేయడమే ఉంటుంది. అందుకని ఆచరణ నిరాకరించడానికే విమర్శిస్తారు. తర్కం ఒక బలాత్కార చర్య. సమిష్టిలో పుట్టే జ్ఞానం మహోన్నతమైనది. ఇతరులను విమర్శించడం ఈక కన్నా తేలిక. ఔనన్నది ఔననడం కాదన్నది కాదనడం రెండు ఒకటి కాదు.

జ్ఞానం, సైన్సు తెలుసుకోవడం, కనుక్కోవడం ద్వారా ఆచరించడం ద్వారా అభివృద్ధి చెందుతుంది. స్థలకాలాలు వేరయితే, మార్గాలు కూడా వేరవుతాయి. జడములను చర్చిస్తే చలనాలను చర్చించినట్టు కాదు. తర్క వాదులు జడములను చర్చిస్తారు. తర్కం కూడా ఒక విశ్వాసంగా మారడానికే, మార్చడానికే. భావాలు కూడా ఆస్తి రూపాలే. భావజాల చర్చ ఒక యుద్ధం. యుద్ధంలో మొదట చచ్చేది, చంపేది సత్యాన్నే. అందుకని భావజాల చర్చ తర్కం వాదోపవాదాలు సత్యాన్ని చంపేస్తూ అబద్ధాలను, వక్రీకరణలను సత్యాలుగా నిరూపించే అవకాశం ఎప్పుడూ వుంటుంది. అంతిమ సత్యాలంటూ ఉండవు. మార్క్సిజం, ఫెమినిజం, ఫ్రాయిడిజం అంతిమ సత్యాలు కావు. జ్ఞానం పల్లానికి ప్రవహిస్తుంది.

ఎవరో మెచ్చాలని పూవు పూయదు. పూవుగా పూయడం దాని స్వభావం. కొత్తగా మొగ్గ తొడిగిన పువ్వులే మొగ్గతొడిగిన పువ్వులే కొత్త సిద్ధాంతాలు. పాత వాదాలను పట్టుకొని చర్చిస్తే ఆ కంపంతా నీక్కూడా అంటుకుంటుంది. ఏ తరానికి ఆ తరం ఆలోచించుకుంటుంది. ఏ తరానికి ఆ తరం కష్టపడి పని చేస్తుంది.జ్ఞానం అనుకరణ నుంచి పుడుతుంది. సొంత అనుభవం సొంత ఆలోచనలను పెంచుతుంది. నాది అనే భావన మంచిది, చెడ్డది కూడా. అవి పంచేద్రియాలు కాదు-అష్టాంగాలు. ఆచరణ నుండి పుట్టిన అనుభూతులుచాలా కాలం ఉంటాయి.

తర్క శాస్త్రాలు ప్రజాస్వామిక రాజ్యాంగాల కన్నా ఎంతో వెనుకబడిపోయాయి. రాజ్యాంగాలు భావాల కన్నా మనిషిని ప్రాథమికం చేస్తాయి. ఎక్కువ తెలివిగల వాడే ఎక్కువ మోసం చేస్తాడు. జ్ఞాన సంపన్నులే ఎక్కువ మోసం చేస్తారు. గొప్ప తార్కికులే ఎక్కువ మోసం చేస్తారు. లిపి రూపొందిన తరువాత జ్ఞానం అందడం సులువైంది. దృక్పథాలన్నీ విశ్వాసాలు తప్ప సత్యాలు కావు. సైన్స్ ఫలాలు అందరికీ అందాలి. కేవలం తర్కం మీద ఆధారపడితే నోరున్న వాడిదే ఊరవుతుంది. తర్కంలో జ్ఞానం కూడా ఉంటుంది. తర్కం అనుభవ క్రమం లేకుండా తీర్పులను అందిస్తుంది. నిశ్చయాలు, తీర్పులు పూర్తి సత్యాలు కావు. ప్రజాస్వామ్యాన్ని మానవీయం చేస్తూ ప్రేమ, కరుణ మైత్రీ పూర్వకంగా సమాజం పరివర్తన చెందడం కోసం మానవాళి ఉన్నత లక్ష్యాలతో నిరంతరం సమిష్టిగా కృషి చేయడం అవసరం.

**ఇది ఒక అన్వేషణ**

ఇది ఒక జీవితాన్వేషణ. జీవితం అంటే ఏమిటో తెలుసుకొనే, తెలిపే ప్రయత్నమే జీవితమంటే ఏమిటి అనే ఈ పుస్తకం. ఇది నా జీవితానుభవాల రాశి. నా జీవితంలో లేనిది ఏది ఇందులో చేర్చలేదు, చర్చించలేదు.

నా పేరు ఏదైనా కావచ్చు. నా పేరు ఉద్యమం కావచ్చు. నాపేరు సమాజం కావచ్చు. నా పేరు అభివృద్ధి కావచ్చు. నా పేరు ఇండియా కావచ్చు. నా పేరు సామాజిక ఆచరణ కావచ్చు. నాపేరు సైన్సు, కళలు, సాహిత్యం, సంస్కృతి కావచ్చు. నేను జీవితాన్ని. నేను ఎన్ని అగాధాలు చూసినా, ఎన్ని పర్వతాలు అధిగమించినా, మేఘంలా పరుగెత్తినా వానై కురిసినా నేను నేనే. నా పేరు జీవితం. నేను ఒక ప్రవాహాన్ని. నేను ఒక అడవిని. నేను ఒక ప్రకృతి జీవన వైవిధ్యాన్ని. నేను నదిని. నేను సమాజాన్ని. నేను జీవితాన్ని.





## వ్యక్తిత్వ వికాసం

### సామాజిక నాయకత్వం

### వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దే అపురూపకృషి

వ్యక్తి తన స్వేచ్ఛను సద్వినియోగం చేసుకునేందుకు వ్యక్తిత్వ వికాసం కలిగివుండడం అవసరం. తన దృక్పథాన్ని, ప్రవర్తనను చక్కదిద్దుకునేందుకు అది దోహదపడుతుంది. వ్యక్తి ప్రవర్తనాలోపాన్ని చాలామంది మానసికరుగ్మతగా భావిస్తుంటారు. మనిషి గుణగణాలను చక్కదిద్దే పాఠశాలలేవీ మనకు లేవు. అయితే, గత పదిహేనేళ్లుగా వ్యక్తిత్వ వికాసాన్ని ప్రత్యేక అంశంగా పరిగణిస్తున్నారు. ఈమేరకు రచనల ద్వారా వ్యక్తిని చైతన్యవంతం చేసేందుకు పలువురు కృషిచేస్తున్నారు.

ఇటీవల, వ్యక్తిత్వాన్ని పెంపొందించే పుస్తకాలపై పఠనాసక్తి పెరుగుతోంది. అటువంటివారిని దృష్టిలో పెట్టుకుని 'వ్యక్తిత్వ వికాసం' ప్రధాన అంశంగా ఎన్నో పుస్తకాలు విడుదదలవుతున్నాయి. ఈ నేపథ్యంలో తాజాగా బి.ఎస్.రాములు 'వ్యక్తిత్వ వికాసం – సామాజిక నాయకత్వం' రచించారు. గతంలో ఆయన కొన్ని ప్రభోదాత్మక రచనలనూ వెలువరించారు. 'విద్యార్థుల్లో సామాజిక వ్యక్తిత్వ వికాస గ్రంథాల అవసరమేర్పడిన నేపథ్యంలో వ్యక్తిత్వ వికాసంతోపాటు సమష్టి కృషికి గల ప్రాధాన్యతను చెబుతూ వివిధ భావాలు, సమాజ నిర్మాణ లోతులను పరిచయం చేయడమే తన రచన 'వ్యక్తిత్వ వికాసం' లక్ష్యమని రచయిత ప్రకటించారు. ఇంతకుముందు వెలువడిన రచనలకు భిన్నంగా సాధారణ పాఠకుల్ని ఆకరష్కించేరీతిలో పలు ఉదాహరణలు, వాటికి అవసరమైన ఉల్లేఖనాలను ఈ పుస్తకంలో చేర్చారు. ఇంకా అనేక విషయాలను విపులంగా చర్చిస్తూ, దీనిని సాధారణ పౌరుల రాజకీయచైతన్య కరదీపికగా రూపొందించారు.

సమాజంలోని అన్ని వర్గాలవారు నాయకత్వ లక్షణాలు పుణికిపుచ్చుకోవాలనే ఆకాంక్షను రచయిత వ్యక్తంచేశారు. రాజకీయ పక్షాల తీరుతెన్నులు, ప్రముఖుల విజయగాథలు చదువరులకు ఆసక్తి కలిగిస్తాయి. అందుకు తోడు రచనాశైలి కూడా ఆసాంతం చదివించేవిధంగా ఉండడం విశేషం. తొమ్మిది అధ్యాయాలున్న ఈ పుస్తకం తత్వశాస్త్రం, సోషియాలజీ, సామాజిక శాస్త్రాల దృష్టిని కలిగివుండి, ఒక పాఠ్యగ్రంథాన్ని తలపిస్తుంది. ఇందులో మనిషి ధ్యేయం-సంఘం -నిర్మాణం, ధ్యేయం-దారి-అడవి, ధ్యేయం- భావం- నిర్మాణం, భావం-ధ్యేయం-సంస్థ నిర్మాణం, జిజ్ఞాస శాస్త్రం, ధ్యేయం-సిద్ధాంతం-దృక్పథం, ఉనికి-చైతన్యం, చలనం నిర్మాణరూపాలు, పార్టీలు-పార్టీల నిర్మాణాలు – నాయకత్వం, సంస్థ-వ్యక్తిత్వం-నాయకత్వం, నాయకులుగా ఎవరూ పుట్టరు, అనుభవాలు-సమీక్ష ఓటమి ఒక మైలురాయి, నాయకత్వ ప్రాధాన్యత, నాయకత్వ సామర్థ్యం – వైవిధ్యం – ఆవశ్యకత తదితర అధ్యాయాలలో ఆ యా విషయాలను చర్చించారు.

రచయిత వెనుక పేజీపై జోడించిన హామీ పత్రంలో 'సొంత వ్యక్తిత్వాన్ని వికసింప జేసుకొంటూ ఏ రంగంలోనైనా, ఏ సంస్థలోనైనా, ఏ పార్టీలోనైనా, ఏ ఉద్యమంలోనైనా, ఏ యూనియన్‌లోనైనా, నాయకత్వం అందించడానికి, ఉన్నతంగా నిర్మించడానికి, ఎదగడానికి, సమాజాభివృద్ధికోసం కృషి చే[illegible]ానికి కావలసిన ఆత్మవిశ్వాసాన్ని సామర్థ్యాన్ని ఈ గ్రంథం అందిస్తుందని భరోసా ఇచ్చారు. మంచి నాణ్యతతో ఉన్న ఈ 360 పేజీల పుస్తకం చేతికి బరువే అయినా, మెదడుకు మాత్రం పదును పెడుతుందనడంలో సందేహంలేదు.

ఆదివారం వార్త 24-9-2006